సర్వోదయ గ్రంథమాల, ప్రథమ పుష్పం.

# గాంధి చరిత్రము



రచయిత:

కొమాండూరి శఠకోపాచార్యులు

ఎం. ఏ., బి. యల్.



ప్రకాశకులు

ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘం

విజయవాడ-2

# 4 వ కూర్పుకు తొలిపలుకు

రెండేండ్లలోపల నాల్గవముద్రణము వేసినారంటే యీ గ్రంథమందు ప్రజలకు కలిగిన అభిమానానికి అది తార్కాణము. ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘమువారు దీనిని తమ పాఠ్యగ్రంథములలో చేర్చుటకూడ ఒక శుభసూచకమే. హిందీ ప్రచారజనకుడైన గాంధీజీచరిత్ర, భారతదేశ పితయైన మహాత్ముని చరిత్ర, హిందీ అభిలాషులు, హిందీవిద్యార్థిలోకం తెలుసుకొనుట అవసరము. వాంఛనీయము, సమంజసము అయి యున్నది. సమగ్రంగా ఆజీవితచరిత్ర తెలియడంవల్ల, గాంధీ తత్వముయొక్క అఖండత్వము కూడ హిందీవాదులకు సులభముగా బోధపడును.

గాంధీజీ నూతనయుగ శాసనకర్త, లోకశాంతి ప్రతిష్ఠాపనకు అప్రతిహత మార్గదర్శి. సజీవమైన శరీరములోని అవయవములకు ఏవిధమైన అవినాభావసంబంధముకలదో అట్లే గాంధిమహాత్ముని నిర్మాణకార్యక్రమములోని వివిధాంశములును పరస్పర సంబద్ధితములై యున్నవి, ఒకదానిని విడచి యొకదానిని మాత్రమే పెంపొందింపచేయుట వెర్రితనము. గాంధిచరిత్ర ఆమూలాగ్రముగ చదివినవారి హృదయములయందు యీసత్యము ముద్రితమగును. దీని మూడవ ముద్రణమునకు యీ సంఘానికి అధ్యక్షులును, కీర్తిశేషులును అయిన శ్రీ వెంకటప్పయ్యపంతులుగారు విజ్ఞప్తిని రచించిరి. ఇప్పుడు యీ ముద్రణమునకు ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు

వారెంచిరి. బ్రిటిషువారి ప్రోత్సాహంతో ఎందరో పాకిస్తానీ ముస్లిములు వెర్రినినాదాలతో చెలరేగిరి ♦ అందుచే ప్రక్కనున్న హిందుస్తాన్ రాష్ట్రిలలో నుండు (పాకిస్తాను స్థాపనకు తోడ్పడిన) ముస్లిములు 'విభీషణాయీ'లు కాగలరు, కనుక వెంటనే వారి కుద్వాసన చెప్పవలెనని 'కట్టర్' హిందూసభ, అకాలీపక్షీయులు ప్రతినినాదాలతో విజృంభించిరి. ఈ పిశాచకల్లోలము వచ్చునని ముందే గాంధిగారు మాత్ర మనుమానించి తదేకదీక్షతో కష్టించి, ప్రమాదరంగమగు కలకత్తా మొహల్లాలో ప్రాణమొడ్డి, బెంగాలును మహాపదనుండి రక్షించి, బీహారులోను ముస్లిములకు శాంతిభద్రతలు స్థిరంచేయించెను. పిమ్మట పశ్చిమప్రాంతపు కీలకమైన ఢిల్లీలోనుండి అక్కడి సాంఘిక దౌర్జన్యాలను, విరోధస్థితిని, ఎట్లో నిరంతరకృషియుతమగు ఆత్మశక్తితో అణచగలెను. ఈ దుస్సాధ్య పరిణామపు ప్రభావము పాకిస్తానుకును ప్రాకినది. తా మనుకొన్న జిన్నాఘనత యెండమావులవంటిదని అప్పటికి భారతీయ ముస్లిములు గ్రహించి, లీగువారు బోధించగా అంతవరకు తమ శత్రువనుకొన్న గాంధిమహాత్ముడే తమ రక్షకుడని నిశ్చయించినారు. అన్ని పక్షాలముస్లిములు ఆయనను వెంటనే పశ్చిమ పాకిస్తానుకు రమ్మని గోరిరి. అట్లు వెళ్ళియుంటే అక్కడను అద్భుత పరిణామముకల్గి, కాశ్మీరపు సరిహద్దులలోను శాంతి మరల కలిగేది. అట్టి ప్రవేశమునకు జిన్నాగారి అనుమతికోరి ఆయన ఢిల్లీలో నిరీక్షించుచుండెను.

---

♦ 'హాఁస్ కే లియా పాకిస్తాన్, లడ్ కేలేంగే హిందుస్తాన్'

ఈలోగా హిందూ సాంఘికతత్వము గూఢంగా విజృంభించి నది. దానితో ఒంటిగ సాధించిన ప్రచండయుద్ధంలో ఈ అస హాయశూరుడు అభిమన్యునివలె ఆత్మాహుతి యయ్యెను. ఇక దీర్ఘ ప్రచారంవల్ల కాక, ఈ బలిదానపు చరమాస్త్రంవల్లనే సాంఘికతత్వపు పిశాచి అణుగుట ఈశ్వరసంకల్పం కావచ్చు. లేనంటే అత్యుత్తముడగు హిందూభక్తుని హిందూధర్మరక్షణ పేరిట ఒక హిందూమహాసభ ప్రముఖుడే మరొక రామభక్తు డగు త్యాగరాజువర్ధంతిరోజునే సాయంకాలపు ప్రార్థనా రంగంలో కసితో కాల్చి చంపుట నేమనవలె? గాంధి మహాత్ముని జీవితచర్యలో మన దేశపు ఇటీవలి జాతీయోద్యమ మంతయు ఇమిడియున్నది. ఆయన మన జాతీయ జనకుడు, స్వాతంత్ర్య నిర్మాత, మన నాయకుల నాయకుడును, కనుక ఈ జీవితచరిత్రలో భారత రాజకీయముల కెక్కువ ప్రాముఖ్య మిచ్చితిని. అది సహజమైనను గాంధిమహాత్ముని జీవితము సర్వతోముఖమైనది. అది అంతరంగికంగా పరిశీలిస్తే వట్టి రాజకీయ ప్రధానంకాదని తోచును. శతాబ్దాలు గడచి, ఇప్పటి రాజకీయాలు మరపుకువచ్చి వేయేండ్లయిన తరువాత గూడ గాంధిమహాత్ముడు ఈ కాలపు యుగపురుషుడని అప్పటి లోకమందరు స్మరించెదరు, కాని అప్పుడు రాజ కీయనేతగగాక, ఆధ్యాత్మిక నాయకుడు, నైతిక శాంతికరుడు గనే ఆయన ప్రశంసింపబడవచ్చు.

కొన్ని రాజకీయాది సమస్యలు నెహ్రూ ఆజాదుల చరిత్రలలోను, నిర్మాణ కార్యక్రమపు వివరములను వేరు

పుస్తకంలోను వ్రాసి ఇటీవలనే ప్రచురించియున్నందున, వాటి నిందులో చాలవరకు తగ్గించినాను. గాంధిమహాత్ముని జీవితంతో గాఢసంబంధంకలవాటిని వదలలేదు. కాని సర్వతో ముఖంగా పూర్ణవికాసమొందిన మహాత్ముని జీవితమునుగూర్చి వ్రాయుటలో ఇందులో చాల లోపములు గలవనుట అసంశయము. అట్టి లోపములను మన్నించి పాఠకులు వాటిని సవరించుకొని, నాకు దయతో తెల్పుదురని కోరుచున్నాను.

అసంభావితమగు మహాశనిపాతంవల్ల మహాత్ముని భౌతిక జీవితము హఠాత్తుగా సమాప్తమయినది. ఈ విషాదఘట్టము నశ్రుతర్పణంగా ఈకూర్పులో చేర్చినాను. ఇందలి కథావస్తువు ప్రాముఖ్యమునుబట్టి హిందుస్తానీ ప్రచారసభవారీసాలు 'ప్రవేశిక' పరీక్షకు దీనిని పాఠ్యగ్రంథముగా నుంచినారు.

ఆంధ్రరాష్ట్రహిందీప్రచారసంఘంవారు ఈ ముద్రణ ప్రచురణభారం తామే వహించి తమ 'సర్వోదయ'మాలలో మొదటికుసుమంగా తీసుకొని ఆదరించినందు కెంతయు కృతజ్ఞుడను.

కాకినాడ
2-6-1950

కో. శఠకోపం

# 1. భూమిక

ఇప్పటి ప్రపంచపు మహాపురుషులందరిలో గాంధిమహాత్ముడే అత్యు త్తముడు. మనదేశపు జాతీయత ఈ 30 ఏండ్లలో వృద్ధియగుట కాయనయే ముఖ్యకారకుడు. ప్రజల దుస్థితిపోగొట్టి స్వరాజ్యం సంపాదించుటకు శ్రీ దాదాభాయి నౌరోజీనుండి తిలకువరకు నాయకులు యత్నించుచునే యుండిరి. విదేశపాలనను పోగొట్టుట కాంగ్రెసుల నెట్లయిన తరుమవలె నని, అతివాదు లావేశపడుచుండిరి. (జాతీయమోక్షమున కదే మార్గమని వారిభావన.) మితవాదు లట్లుగాక బ్రిటిషు అజమాయిషీ అవసరమని యెంచి మన సంఘంలో దురాచారముల దొలగించుట ప్రధానమని యెంచిరి. ఈ రెండు కక్షలమధ్య సంఘర్షణము హెచ్చినది.

ఈ స్థితిలో గాంధిగారు వచ్చి, ఈ రెండుపక్షములలో గుణదోష ముల గనిపెట్టిరి. అప్పటికి జాతీయవాదుల కాంగ్లద్వేషము ప్రధానము. ద్వేష తత్వముచే మనలో విభేదములు హెచ్చెను. గాంధిగారు తన యుద్యమము ప్రేమప్రధానముగ జేసెను. మనలోని లోపముల గుర్తించి, వాటిని పోగొట్టి జాతికంతకు సంఘటనగల్గించు ప్రక్రియ నేర్పరచెను, హింసారక్తపాతముల మాన్పించి, శుద్ధము బలీయము నగు సత్యాగ్రహయుద్ధము నమలుకు తెచ్చెను. మితవాదులకు జాతీయవాదులకు సంఘర్షణము తగ్గించెను. మరియు, ఆయన గ్రామాలలో జాతీయోద్యమమం దుత్సాహము గల్గించినారు. ఆయన దాసు, నెహ్రూ, అన్సారి, పటేలు, రాజేంద్రప్రసాదు, రాజాజీ, పట్టాభి, ప్రకాశం మున్నగు మహనీయులను ప్రజాసేవ కాకర్షించి, నాయకుల నాయకుడయి నారు; ఇంకను చాలమందిని వీరులుగ జేసినారు. అప్పటినుండి కాంగ్రెసు నిజమైన ప్రజోద్యమమయినది. వెనుకటివలెగాక కాంగ్రెసుఉద్యమ మిప్పుడు నిర్మాణకరమైనది. ఒక సారియే ఆయన కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. తరు వాత ఆయన కాంగ్రెసులో ప్రాథమికసభ్యుడును కాడు. కాని, ఆ యుద్యమ మంతకు ఆయనయే సూత్రధారుడని, సమన్వయకర్తయని స్పష్టము.ఇప్పుడు అన్నిపక్షములందును, పాశ్చాత్యులలోగూడ ఆయనయందు గురుభావ మున్నది అందు కాయన యున్నతాదర్శము, ఔదార్యము, స్వార్థహీనత, పరమార్థచింత, ప్రేమతత్వము, లోకసంగ్రహపరతయు, సమన్వయబుద్ధియు

కారణములు. ఆయన అద్భుతవ్యక్తి. ఆయన సర్వపక్షసముడు; బీదలు శ్రీమంతులు, సనాతనులు, సంస్కర్తలు, హిందూ సిక్కు ముస్లిములు వగైరాలు, అతివాదులు మితవాదులు, రాజులు, ప్రజలు, ఇట్టి భేదములేకుండ అందరును (పైకెన్ని చెప్పినను) ఆయన మహత్త్వమును గుర్తింతురు; ఆయన జీవన్ముక్తుడు, లోకపు వివిధబాధలనుండి మోక్షమునకు ఆయనయే మార్గ దర్శకుడు అనియు గ్రహించినారు. ఆయన సర్వసమన్వయకర్త. ఆయన వ్యక్తిజీవనము సాంఘికజీవనముగూడ ఆదర్శరూపములు.

ఆయనకు హిందూమతమందు విశేషాభిమానము; కాని మరి ఏమతము పైనను ద్వేషములేదు. అన్నిమతసిద్ధాంతములును మంచివే. అన్ని దేశాలలో రమారమి అన్నిజాతులవారును గాంధీగారు మన రాజకీయనాయకుడేగాక, మనదేశీయులందరిలో మహనీయుడు ఉత్తమపురుషుడు అని ఒప్పుకొను చున్నారు. ఆయన పురుషోత్తముని యవతారమనియు కొందరందురు; తాను సామాన్యమనుష్యుడనని గాంధీగారు స్పష్టపరిచినారు. భగవదవతార ములు ప్రత్యేకముగ నుండవని, ప్రతివానిలోను ఈశ్వరాంశ లీనమైయుండు నని, దాని నాయా జీవులు వృద్ధిచేసుకొనుటను జీవితపరిశుద్ధినిబట్టి, కొందరిలో అంశ తక్కువగను కొందరిలో చాల హెచ్చుగను తోచవచ్చునను భావము గాంధీగారి గీతాభూమికలో కలదు. ఈ పావనమూర్తి జాతీయజీవితపు ప్రతిరంగంలోను స్వతంత్రకృషి చేసి, లోకోపకారకమైన సూచనలు చేసియున్నారు. ఆయన జీవితవృత్తాంతము లందరికీ జ్ఞానదాయకములు.



# ౨. జననం

మనదేశపు బొంబాయిరాష్ట్రపు ఉత్తరభాగమును 'కాతియవాడ' అందురు. దాని పశ్చిమదిశను అరేబియాసముద్ర మున్నది. ఆ తీరంలో 'పోరుబందరు'అను చిన్న సంస్థానపురాజధాని కలదు. అదే గాంధీమహాత్ముని జన్మస్థలము. దాని పూర్వపుపేరు సుదామపురి. అది శ్రీకృష్ణుని వాసస్థలమగు ద్వారకాక్షేత్రము కేబదిమైళ్ళలో నున్నది. ఆయన జననదినము శుక్ల సం॥ర భాద్రపద బహుళ ద్వాదశీ (2-10-1869) ది

ఆ ప్రాంతపువారు మొదట యాదవులని, తరువాత సౌరాష్ట్రులని, ఘూర్జరులని, పిలువబడిరి. వారి నిప్పుడు 'గుజరాతీ' లందుము. వారు శాంతులు, ఉత్సాహులు, కార్యపరులు, వారిలో చాలమంది యితరప్రాంతాలలోను, కొద్దిమంది విదేశాలలోను వ్యాపారము చేయుచుందురు. అక్కడి భాష హిందూస్తానీకి సంబంధించిన గుజరాతీ.

మహాత్ముని పూర్తిపేరు 'మోహనదాస్ కరంచంద్‌గాంధి' ఇందు 'మోహనదాస్' ఈయన స్వంతపేరు, 'కరంచంద్' తండ్రిపేరు; 'గాంధి' వీరి వంశనామము. గుజరాతిలో 'గాంధి' అనగా పచారీదినుసుల వర్తకుడు. ఈ గాంధీలు వైశ్యులు. అందులో కొందరు సంస్థానపు ఉద్యోగులయిరి. కరంచందు తండ్రి 'ఉత్తమచందు' 'పోరుబందరు'కు దివానుగ నుండెను. ఆరాజు కొంతకాలమునకు తన యాశ్రితుల చాడీలు విని, అతనిని తొలగించెను. అంత నాతనిని దగ్గరనున్న 'రాజకోట' సంస్థానపు ప్రభువు తన దివానుగ జేసెను. ఉత్తమచందు రాగనే సభలో నారాజుకు నమస్కరించెను; కాని, నిండుదర్బారులో జోహారు నత డెడమచేతితోనే చేసెనని అచటి సభ్యులు కనిపెట్టి, వెంటనే రాజుతో చెప్పిరి. అదేమని రా జడిగెను. 'నా కుడిచేతిని పోరుబందరు కిచ్చితిగదా' అని దివాను జవా బిచ్చెనట. అతని స్వామిభక్తి స్థిరమైనదని రాజకోటరాజు గ్రహించి అతని నాదరించెనట. తరువాత పోరుబందరురాజు తనదే తప్పని గ్రహించి అతనిని మరల రప్పించి తనమంత్రిగ జేసికొనెను.

ఉత్తమచందు మొదటిభార్యకు నలుగురుకొడుకులు. రెండవభార్య కొడుకు లిద్దరిలో జ్యేష్ఠుడే 'కరంచందుగాంధి' ఈయనయును ముందు పోర్బ

బందరుకు, తరువాత రాజకోటకు, మంత్రిగ నుండెను. అంతట పోరుబందరు దివాన్గిరీ యీయన తమ్మునికి వచ్చినది.

భార్యలు చనిపోవుచుండ, కరంచందుకు వరుసగ నాల్గు వివాహము లైనవి. మొదటిముగ్గురకు మగపిల్లలు లేరు. నాల్గవదగు 'పుత్లీబాయి'కాడు పిల్లయు ముగ్గురుకొడుకులును గల్గిరి. వారిలో తుదివాడే మన 'మోహనదాసు' కరంచందు గొప్పవిద్వాంసుడు గాడు; కాని ధీరుడు, ప్రాజ్ఞుడు, న్యాయ శీలుడు, దాత, గీతాభ్యాసపరుడు, విష్ణుభక్తుడు. రాజుకు ప్రజలకు తృప్తి కరముగా అతడు చాలయేండ్లు దివానుగ నుండెను.

గాంధిమహాత్ముని తల్లియు మహాగుణవతి, ఆమెనిదానము, దైవభక్తి, ఉపవాసప్రీతి, వ్యవహారదక్షత, సౌజన్యమును, మోహనదాసుకు సంక్రమించినవి. ఆమె తరచు చాతుర్మాస్యము, చాంద్రయణముగూడ చేయుచుండెవట.

# 3. బాల్యము, వివాహము

పోరుబందలో పెద్ద 'స్కూళ్ళు' లేవు. మోహనదాసు బాల్యంలో 'వీధిబడు'లందే చదివెను. ఇంతలో తండ్రి 'రాజకోట'లో నుద్యోగి యాయెను. కనుక,అత డాశేండ్ల వయస్సున రాజకోటలో 'ప్రైమరీస్కూలు' లోచేరి, తరువాత అచటి 'హైస్కూలు'లో చదివెను. అప్పు డతనిబుద్ధి సామాన్యముగనే తోచెనట, కాని శీల ముత్తమమని అప్పటికే తెలిసెను.

ఒకనాడు స్కూళ్ళలో ఇనస్పెక్టరు ఆక్లాసుపిల్లలను పరీక్షచేసెను. అప్పు డత డిచ్చిన లెక్కలను విద్యార్థులందరును సరిగాచేసియుంటే, ఆ 'మాస్టరు'కును మంచిపేరు వచ్చును, గాంధి లెక్క తప్పుగ చేయుచుండెను, ప్రక్కబాలుడు సరిగ జేసెను. అప్పుడాపలక గాంధికి కనబడుచుండెను; కాని గాంధి చూడలేదు మాష్టరు గాంధినప్పుడు కాలితోగోకి,సంజ్ఞజేసెను ఆ సంగతి గ్రహించియు, గాంధి తనలెక్క దిద్దనేలేదు తనలెక్క 'రైటు' అగుపేరుకన్న, మనస్సులోగూడ సత్యపరతయే ముఖ్యమని గాంధికి

తోచెను. మోహనదాసుకు మంచివినయము తల్లిదండ్రులందు భక్తిప్రేమలు నుండెను. అతడు తోడిబాలురతో నల్లరిగ తిరుగక, బడి విడువగనే తన యింటికి పరుగెత్తి వచ్చుచుండెను నీతికథ లతనికిష్టములు. ఒకసారి 'హరిశ్చంద్ర'నాటకము నతడు చూచెను; అంతట సత్యాసక్తి యింకను హెచ్చెను. 'సుదాముడు' వృద్ధులగు తల్లిదండ్రుల కపారసేవజేసినట్లు కథ నొక పుస్తకములో నతడు చదివెను, అంతట పితృభక్తి హెచ్చెను

అతనికి 12 ఏండ్లు రాగానే పెండ్లి జరిగినది. అతిబాల్యవివాహము వల్ల తనకు హానికల్గెనని ఆత్మకథలో ఆయన తెల్పినారు. బాల్యవివాహ పద్ధతి మనదేశంలో మధ్యకాలమం దేర్పడి, పిమ్మట ముఖ్యంగా బ్రాహ్మణ వైశ్యులలో నాచారమయినది. గుజరాతీలు (అందు ముఖ్యముగ గాంధీలు) వైష్ణవసంప్రదాయులు, పూర్వాచారపరులు. మనవారు వివాహములందు చాల వ్యయప్రయాసముల పాలగుచుందురు; ప్రతిసారియు బాధలేకుండు సౌకర్యమునకో, కుటుంబములో వృద్ధులుకోరుటనో, ఒక వివాహముతో బాటు (వయస్సురాకున్నను) మరికొందరికిని కార్యములు కొందరు చేయు దురు. ఇట్లు 'పనిలోపని'గ అన్న పెండ్లితోబాటు మోహనదాసుకుగూడ పెండ్లిఅయినది. పెండ్లికుమార్తెయగు కస్తూరిబాయి సమవయస్క, ధీరు రాలు, కొంచెముగ చదువుకొన్నది, కాని పెండ్లికాగనే చదువు నిల్చిపోయి నది.

ఆ పెండ్లిని దివానుదర్జాకు తగినట్లు చేయ రెండునెలలు సన్నాహము జరిగినది; కాని పెండ్లికై రాజకోటనుండి పోరుబందరుకు తరలిపోవుటలో వారిబండి తిరుగబడి, కరంచందుకు గట్టిదెబ్బ తగిలినది. అప్పుడాయన లక్ష్యము చేయలేదు; కాని అది దీర్ఘవ్యాధిగ పరిణమించినది.

ఆపెండ్లితో అన్న చదు వాగిపోయినది. మోహనదాసును ఆ సాలు విద్య చెడి, మరల ఆ క్లాసులోనే చేరెను. ఆలోపము తీర్చుట కుపా ధ్యాయు లాతనిని సాలుమధ్యను 3 వ 'ఫారము'నుండి 4వ పారముకెక్కిం చిరి. ఆకొత్తక్లాసులో అన్నిపాఠములు నింగ్లీషులో జెప్పుచుండిరి. గాంధి చాల శ్రద్ధతో చదువుచు సాలీనాపరీక్షలలో నెగ్గెను; కొన్ని బహుమతు లును దొరికెను; కాని పుస్తకజ్ఞానముకన్న తన నీతివర్తనమం దాతడెక్కువ శ్రద్ధ వహించెను

ఆతని కాటపాటలిష్టముకాలేదు. వేసవిలో ఉదయపుబడి రోజు లైనను, బాలుర సాయంకాలం 'డ్రిల్లు' (=కవాతు) కై బడికిపోవలె. కాని ఆవేళలందు మోహనదాసు వ్యాధిగ్రస్తుడైన తనతండ్రికి ఉపచారము చేయుచుండెను. అతడు ప్రతిరోజును దూరమునడుచుచు, ఆరోగ్యవంతు డాయెను. ఈస్థితిలో కరంచందు రాజకోటలో 1885 లో చనిపోయెను. అంతవరకు కాయనకు ప్రేమతో సేవచేసి, మోహనదాసు తండ్రి ఋణమును తీర్చికొని, 1887 సం॥ లో మెట్రిక్యులేషను పరీక్ష నిచ్చెను. కుటుంబమువా రాతని నంతట పైకి చదివింపదలచి దగ్గరనున్న 'భావనగర'పు కాలేజిలో చేర్చిరి అందు పాఠములన్నిటి నింగ్లీషులోనే చెప్పుదురు. ఆ క్లిష్ట పద్ధతి గాంధికి సరిపడలేదు. ఇంకనందేయుంటే ఆత్మవికాసము చెడి జీవితము వ్యర్థమగుననితోచి, అతడు కొన్ని నెలలకు కాలేజిని వదలి స్వగ్రామం చేరెను.

ఇక ముందేమిచేయవలె? 'బి. ఏ. బి. యల్.' పరీక్షల కారేండ్లయిన పట్టును. ఇంగ్లండుకు వెళ్ళిన 3 ఏండ్లలో సులభంగా బారిష్టరైవచ్చి తండ్రి చేసిన దివాన్గిరినిగూడ పొందవచ్చు అని కుటుంబమిత్రుడగు నొక బ్రాహ్మ ణుడు సూచించెను. కాని సీమప్రయాణమునకు సొమ్మో? అన్నగారి సలహాపైన మోహనదాసు పోరుబందరు పాలకుడైన 'లెలీ' దొరను దర్శించెను. కాని అది ఫలించలేదు. అన్న కొంత సాయముచేసెను. భార్య నగలమ్మగా కొంతసొక్కమందినది. ఇక తల్లియాజ్ఞ కావలె. ఆమె నిష్ఠాపర; వారియింట కల్లుమాంసముల స్మరింపరాదు సముద్రయానము కూడదని అప్పుడు పెద్దచర్చ జరుగుచుండెను. విదేశములం దనాచారము తప్పదని తల్లి సందేహించెను; ఆ యాత్రలో మద్యము, మాంసము, మహిళలు ఈమూటిని ముట్టనని కొడుకుచే నామె ప్రమాణం చేయించుకొని, తుద కమజ్ఞనిచ్చెను. తన ప్రియపుత్రుడు మాట తప్పడని ఆమె యెరుగును. ఆతని కప్పటికొక కొడుకు. ఆ శిశువుతో భార్యను పుట్టింట విడచి గాంధి బొంబాయిచేరెను. అప్పుడు వారి కులపెద్దయగు శేఠు సీమప్రయాణం చేసిన, ఆ కుటుంబమున కాంక్ష నిత్తుననెను. కాని వారు జంకలేదు. ఆ చదువుకే అప్పు డింగ్లండు కొక వకీలు పోవుచుండెను' అతనితో మోహన దాసును స్టీమరునెక్కెను.

# 4. ఇంగ్లండులో చదువు

ఆ స్టీమరుప్రయాణము రెండువారములది. అందలి యుద్యోగులు, చాలవరకు యాత్రికులును యూరపియనులు. గాంధికి బిడియము హెచ్చు. స్టీమరులో జనులు మద్యమాంసాదులను సహపంక్తిని భుజించుచుండిరి. ఆహారము నాతడు తన గదికే తెప్పించుకొనెను. కాని అవి మాంసమిళితము లని అనుమానము; అడుగుటకు జంకు; కనుక వాటిని ముట్టక తా నింటినుండి తెచ్చుకొన్న రొట్టె మిఠాయిలనే తినుచుండెను. యూరపులో ఇక్కడి కన్న చలి హెచ్చు, అక్కడ మద్యమాంసముల భుజించుట ఆరోగ్యమున కవసరమని చాలమంది భావన. కనుక మన దేశీయులు నింగ్లండులో తరచు అట్లుచేయుదురు. కొందరు మిత్రులు గాంధికి నట్లు బోధించిరి. మరి తల్లికి చేసిన వాగ్దానమో? పరిస్థితులు తెలియనప్పు డిచ్చిన మాటకు విలువ లేదనిరి. కాని గాంధిమాత్రము, చలించలేదు, ఎన్నికష్టములుబడినను తన మాట నిలుపుకొనెను. కొత్తమిఠాయిని స్వదేశమునుండి తెప్పించుకొనెను; అక్కడికొందరు శాకాహారులతో ఆలోచించెను. మద్యమాంసముల వదలుట అన్నిదేశములలోను ఆరోగ్యకరము, మరియు అహింసాతత్త్వము గల్గించి ఆత్మవికాసమునకును సహకారియగునని గ్రహించెను.

ఆయన స్త్రీలవిషయమున నిగ్రహ మలవర్చుకొనెను. యూరపులో బాల్యవివాహములు లేవు. కనుక 20 ఏండ్లవారును కన్యలుగ నుందురు; వారు బ్రహ్మచారులతో చనువుగనుండి వారిలో మనస్సు కుదిరినవారిని వరించి పెండ్లిజేసికొందురు; కాని గృహస్థులతో నట్లుండరు. అచటనుండు భారతీయ విద్యార్థులు తరచు వివాహితులైనను బ్రహ్మచారులుగ నటించుచు, స్వతంత్రులగు ఆకన్యలతో సల్లాపమాడుచు, ఒకప్పుడు మితిమీరి చిక్కులబడుటయు కలదు. గాంధిమాత్రము చనువీయక తాను గృహస్థుడనని ఆకన్యలతో ముందే చెప్పి, తప్పుకొనెను. ఇట్లు సత్యవ్రత మాయన శీలారోగ్యముల రక్షించెను. కాని, ఆంగ్లసంస్కృతిని గ్రహించుటకా వేషభాషల ననుసరింపదలచి 'సూటు, హ్యాటు, బూటు' ల ధరించి, దొరపద్ధతుల నాతడు నేర్చుకొనెను.

ఇక్కడే, ఆంగ్లయువకులవలె డాన్సింగు (నృత్యము) ను, వాగ్ధాటినీ, ఫ్రెంచిభాషను గాంధి కొన్ని నెలలు నేర్చుకొనెను. అందుకు తనకు చాల సొమ్ము ఖర్చగుచుండెను. కొద్దికాలమున కింగ్లండునుండి మరలివచ్చు భారతీయుల కివి యనవసరములని ఆయన తరువాత గ్రహించి, పాటినిమాని దుస్తులు, ఆడంబరము వదలెను; భోజనం చౌకవస్తువులతోనే చేసెను. ఖర్చు తగ్గుటకు రొట్టెను కూరను స్వయముగనే ఆయన స్టవు (మరపొయ్యి) పైన చేసుకొనెను, ఇట్లు మితవ్యయపరు డాయెను.

గాంధి 'బారిస్టరు' విద్యతోబాటు జ్ఞానవృద్ధికై లండనులో 'మెట్రిక్యులేషను' పరీక్షనుగూడ చదివెను. అందుకై యూరపువారి ప్రాచీనభాషయగు 'లాటిను'ను నేర్చుకొనెను, అందలి న్యాయశాస్త్రపు అసలుగ్రంథములుగూడ జదివెను. ఇదిగాక అన్ని జాతుల మతపుస్తకముల నభ్యసించెను. 1891 జూనులో బారిస్టరు' పట్టా తీసికొని, వెంటనే గాంధి మనదేశమునకు తిరుగవచ్చెను.

బొంబాయిలో దిగగానే, అప్పటికే తన యనుగుతల్లి గతించెనని మోహనదాసుకు తెలిసెను. విదేశమున దుఃఖపడకుండుటకై బంధువు లతని కావార్త నింగ్లండుకు తెలుపలేదు. ఆ దుఃఖభారము కొన్ని నెలలకు తగ్గెను.

అంతట కొందరు 'సనాతనులు' మరల ఆంక్షతెచ్చిరి, కాని ఆయన వారితో తగవుపెంచుకోక, నిదానించి ఊరకొనెను. ఈ అహింసాపద్ధతివల్ల వారుద్దేశించిన 'బహిష్కారము' తనంతనే తగ్గిపోయినది.

# 5. 'ప్లీడరీ'

ఇక 'ప్రాక్టీసు' చేయుటెక్కడ ? తమప్రాంతమునకు హైకోర్టు బొంబాయిలో నున్నది; కనుక అక్కడ నతడు బసపెట్టెను. కాని కేసులు రాలేదు. ఇంగ్లండులోని 'బారిస్టరీ' జ్ఞానములు మనదేశపు 'సివిలు కేసు'ల కుపయోగించలేదు. మనదేశపు 'లా' పుస్తకముల నప్పుడు కొని, ఆయన శ్రద్ధతో చదివి కృషి చేసెను. కాని లోకానుభవం, పలుకుబడి, వాగ్ధాటి

కలవారికే కేసులు వచ్చును. మరియు, ఆయనధోరణి ఆధ్యాత్మికము: ద్రవ్యసంపాదనయం దుత్సాహము, కోర్టుపనియం దేకాగ్రతయు లేవు. నీతిబాహ్యమని ఏజంట్లకు సొమ్మునీయలేదు. (సిన్హావంటి గొప్పలాయర్లును ఆరంభమున కేసులు లేక చిక్కులబడిరి.) మోహనదాసుకు విసుగుగల్గెను. ఇంక అన్ననుండి సొమ్ము తెప్పించుకొనుట నచ్చలేదు. తోటి చిన్నబారిష్టర్లు హైకోర్టులో పంకాలక్రింద కునికిపాట్లు పడుచుండిరి. అట్టి జీవితముపైన విసుగుగల్గి, ఆయన కొన్నినెలలలో బొంబాయిమకాము నెత్తివేసెను.

అన్నగారు రాజకోటలో * సొలిసిటరుకంపెనీలో సభ్యుడు. కేసులు వారిద్వారానే వకీళ్ళకు రావలె. కనుక మోహనదాసు రాజకోటలోనే 'ప్లీడరీ' నారంభించెను. అక్కడ ఖర్చు తక్కువయే. కొన్ని చిల్లర కేసులు దొరుకుచు కొంత రాబడియుండెను. దస్తావేజులమతలబులు, పిటీషనులు, దావాలు వ్రాయుటలో ఆయన చాల సమర్థుడని వెంటనే పేరువచ్చినది. కాని అక్కడ అనుభవజ్ఞులతో పోటీగల్గెను. మరియు అక్కడ ముఖ్యాధికారి (ఆంగ్లేయుడు) అహంకారి. అతడు వకీళ్ళ నమర్యాద చేసినను, తక్కినవారు తుడుచుకొని విధేయులైయుండిరి. గాంధిగా రందుకొప్పుకోలేదు. ఉభయులకును తగువువచ్చెను. ఆ స్థితిలో నాదొరగారి కోర్టులో పనిచేయ వీలులేదనితోచెను. ఇంకేమిచేయవలె? ఈస్థితిలో నొక కాకతాళీయ మేర్పడెను.

గుజరాతులోని కొందరువ్యాపారులు సముద్రముదాటి దక్షిణాఫ్రికాలోగూడ వర్తకముచేయుచుండిరి. వారిలో గాంధి జన్మస్థలమైన పోరుబందరువాడే అగు 'సేటుఅబ్దుల్లా' అను మెమనుశాఖ మహమ్మదీయు డుండెను. ఈతనికి మరొక ముస్లింకంపెనీతో దక్షిణాఫ్రికాలో పెద్ద వ్యాపారపులెక్కల దావా జరుగుచుండెను. అందులో తన ఇంగ్లీషులాయరుతోడ్పడుట కొకయేడాది దక్షిణాఫ్రికాలో నుండుమని గాంధిగారిని అబ్దుల్లాకంపెనీవారు కోరిరి, అన్నిఖర్చులు వారే భరించి, ఆసాలుకు 105

---

* 'సొలిసిటరు'లును న్యాయశాస్త్రజ్ఞులే. కాని వీరు బారిస్టరు వకీళ్ళవలె కోర్టులో వాదనచేయరు. రికార్డుచూచి పార్టీలకు సలహాలిచ్చి దస్తావేజులు ప్లయింటు వగైరాలు వ్రాయుదురు; వాదింప బారిష్టరు నేర్పాటు చేయుదురు.

సవరను (కాసు) లిత్తుమనిరి. ఆ 'ఫీజు' తక్కువయే కాని లోకానుభవము గల్గునని ఉత్సాహంతో గాంధి యొప్పుకొనెను. ఇట్లు 1893 ఏప్రిలులో అనగా ఇంగ్లండునుండివచ్చిన రెండేండ్లలోపుననే గాంధి దక్షిణాఫ్రికాకు వెళ్ళెను. క్రొత్తదేశముకు పోవుట గనుక, భార్యను ఇద్దరికొడుకుల నింట విడచి, ఒంటిగనే వెళ్లెను.

# 6. దక్షిణాఫ్రికా స్థితి

దక్షిణాఫ్రికాలో నుండినప్పుడే గాంధిలో మహత్త్వ మేర్పడెను. కనుక అక్కడి అప్పటి పరిస్థితిని మనము తెలుసుకోవలెను.

అచటి స్వదేశీయులు నీగ్రోజాతి నల్లవారు, అనాగరికులు. ఆ ప్రాంతమును యూరపునుండివచ్చిన తెల్లవారు సుమారు నూరేండ్ల క్రిందట నాక్రమించి, అక్కడ వలసగనున్నారు; అం దధికారము వీరిదే. అందు తూర్పుభాగము నేటాలు, దాని పడమట ట్రాన్సువాలు, ఇంకను ఉత్తర మున ఆరంజిఫ్రీస్టేటు అను విడిరాజ్యము నుండెను. దక్షిణమున కేపుకాలనీ ట్రాన్సువాలులో ప్రాబల్యము డచ్చిజాతీయులది. తక్కినచోట్ల ఆంగ్లేయు లదే పెత్తనము. ట్రాన్సువాలులో బంగారుగనులు, తక్కినచోట్ల చెరకు తోట వగైరాలు ఫలించు చక్కనిభూములు నున్నవి. కాని అందు వ్యాపా రము సాగించి లాభమొందుటకు కష్టముసహించి విధేయులుగ పనిచేయు సమర్థులగు పనివాండ్రు ఆ దేశంలో లేరు. కనుక మనదేశపు బ్రిటిషు ప్రభుత్వంద్వారా వారు వేలకొలది మనదేశీయుల నక్కడకు 1860 సం॥ నుండి ఆశపెట్టి రప్పించిరి. * అక్కడ ఆ కూలీలు అయిదేండ్లుమాత్ర 'ఇండెంచెరు' (కంట్రాక్టు) షరతుపైన తెల్లయజమానులక్రింద పనిచేయవలె. ఆ పిమ్మట వసతి, హెచ్చుజీతములు ఉండును, కంట్రాక్టు షరతాఖరున వారు స్వతంత్రులై, తెల్లవారివలె ధనికులై, హాయిగ నండే యుండవచ్చునని

*తూర్పు ఆఫ్రికాలో మాత్రం తెల్లవారికన్నను ముందె భారతీయులు వసించుచు కృషిని వరకమును చేయుచు వృద్ధిలో నుండిరి.

అధికారులు బ్రిటిషువారు ప్రోత్సహించిరి. ఆ షరతుల కాకృష్టులై, మన దేశమునుండి 'నేటాలు'కువచ్చిన కూలీలచే గనులలో తోటలలో పని చేయించి అక్కడి తెల్లవారు అర్బుదములకొలది ద్రవ్యం సంపాదించిరి. ఆ షరతుకాలం దాటగా, ఈ భారతీయులలో కొందరా దేశమందు పొదుపుతో ఆస్తి సంపాదించి, తమంతట వర్తకము, వ్యవసాయము ప్రారంభించిరి. అంతట పోటీకలిగినది. మన దేశీయులు మితవ్యయులై, శ్రమకోర్చి పనిచేయుదురు. ఈ లాగా వలసవచ్చు ఆంగ్లేయులను హెచ్చిరి. మనవారితో పోటీకి నిలువలేమని యెంచి ఆ తెల్లవారు భారతీయుల నవమానించుచు, అణచదొడగిరి. మనదేశపు మాలమాదిగలకు మనసంఘమం దెట్టిబాధలుండునో, అక్కడ మనవారందరి కట్టిబాధ లేర్పరచిరి. వారి నక్కడి తెల్లవారు 'కూలీ' లని పిల్తురు; వారిని తమగృహ ములకును ఏ సమావేశములకును రానీయరు.

ఇట్టిస్థితిలో గాంధిగారు నేటాలులో రేవుపట్టణమగు 'దర్బను'లో దిగిరి. ఆయనను రప్పించిన అబ్దుల్లాసేటుగా రాయన నాదరించి తన ఇంగ్లీషు లాయర్లతో పరిచయము గల్గించెను. ఆకేసు విచారణ కింకను కొన్నినెలల వ్యవధియుండెను.

అక్కడి భారతీయుల దుస్థితి గాంధికి వెంటనే తెలిసెను. ఆయనను గూడ తెల్లవారు కొంతహీనముగనే చూచిరి. విద్యావంతులైనను మనవారు కోర్టులలో తలపాగతో కూర్చొన వీలులేదు. బండ్లలోను, రైళ్ళలోను, పై తరగతులలో పో వీలులేదు. యూరపియనులుండు స్థానములందు ఉండ కూడదు. ఆ దొరల హోటలులలో మనకు బసనీయరు. ఇక అక్కడ కూలీలబాధలకు లెక్కలేదు. గాంధి వారి మానవత్వమును ఆత్మ గౌరవమును నిలువబెట్ట నిశ్చయించెను. అందుకై తా నెన్నియో బాధల కోర్చెను. మన దేశమునుండి వెళ్ళి పార్సీలు తాముపర్షియా వారమని, మహమ్మదీయులు అరబ్బులమని చెప్పుకొంటే వారిస్థితి కొంచెము నయముగనుండెను. భారతీయులన్న వారిపై నెట్టి దాక్షిణ్యమునులేదు. భారతీయులను దక్షిణా ఫ్రికా ఆంగ్లేయులు నొకే బ్రిటిషు సామ్రాజ్యపు పౌరులు, అయినను మనవారిని కేవలం విదేశీయులగు అరబ్బులు, పారశీకులు, చీనులు మొదలగువారికన్నను హీనులుగ జూతురేల? మనవారు స్వదేశమందు పరాధీనులు; కనుకనే విదే

శములందును ఇతరులకు లోకువయే అగుదురు. "స్వతంత్రమే స్వర్గలోకము". మరియు అక్కడ మన దేశీయులు భిన్నభాషీకులై తమలో తగువులుపడుచు, ఎవరిలాభము వారిదిగ నుండిరి సంఘక్షేమమునకై యత్నించు ధోరణిలేదు. వారిస్థితినిజూచి, గాంధిగారి హృదయము ద్రవించెను. ఆయన వారిలో నేకీభావము గల్గింపదొడగెను.

గాంధిగారు పనిచేయుటకువెళ్ళినకేసు ట్రాన్సువాలుకు ముఖ్యపురి యగు 'ప్రిటోరియా'లోని కోర్టులో నుండెను. ఆయన ఆ నగరముచేరి, అబ్దుల్లాగారి కక్కడ 'అట్టార్ని'యగు 'బేకరు'తో ఆకేసునుగూర్చిచర్చించెను. తాను బారిష్టరుగానున్నను? అచట తనకు తగువసతి దొరకుటే కష్టమాయెను.

# 7. అబ్దుల్లా కేసు

ఆ కేసులో పార్టీలగు 'అబ్దుల్లాసేటు, త్యాబ్జిసేటు' దగ్గరబంధువులు. వీరిద్దరు స్వతంత్రంగా కంపెనీలుపెట్టి, దక్షిణాఫ్రికాలో వ్యాపారము చేయుచుండిరి. ఈ రెండుకంపెనీలమధ్యను, సరుకులు, సొమ్ము ఇచ్చిపుచ్చు కొనుట, చాలయేండ్లు జరిగింది. ఆ లావాదేవీల సందర్భమున ఎన్నియో ఖరార్లు, జమాఖర్చులు, హుండీమార్పులు వగైరాలును ఏర్పడినవి. కొన్ని యేండ్లకు వారిమధ్య లెక్కలు తేలక తగవువచ్చినది. అబ్దుల్లా కంపెనీవారు తమకాబాపతు ఆరులక్షల రూపాయలసొమ్ము రావలెనని త్యాబ్జికంపెనీపైన దావా తెచ్చిరి. తామేమియు నీయనక్కరలేదనియు, అబ్దుల్లాగారి లెక్కలు తప్పనియు, అందు కొన్నినోట్లు, హుండీలు సృష్టియనియు, తమకే సొమ్ము రావలెననియు, త్యాబ్జిగారి వాదము. ఈ కేసులో ఎన్నియో రికార్డులు దాఖలయినవి. చిక్కయిన లా పాయింటు సమస్యలును గల్గినవి. ఉభయులూ గుజరాతీలోనే లెక్కలుంచిరి. గాంధిగారా లెక్కలు రికార్డునంతను జాగ్రత్తతో చదివి అటార్నీతో చర్చించిరి. కాని ఆ దేశమున లెక్కలు వ్రాయుపద్ధతులు వేరు. వాటిని బాగుగ గ్రహించినగాని ఆకేసు పూర్తిగ బోధపడదు. కనుక ఆయన 'బుక్కీపింగు'

(—వ్యాపారలేఖన పద్ధతి) పుస్తకములను తెప్పించి చదివెను. అంతట వాది రికార్డు నేగాక ప్రతివాదితాలూకు లెక్కలన్నిటినిగూడ పరిశీలించి అబ్దుల్లా గారి కేసే న్యాయమని గాంధీ గ్రహించెను. కాని యీ కేసులో నెంతయో సాక్ష్యమును లెక్కల తణిఖీయు కావలెను, అది జరిగి, కోర్టువిచారణ ద్వారానే పరిష్కారమగుటకు ఇంకను చాలయేండ్లు పట్టును; అందుపై నప్పీళ్ళుజరుగును; పార్టీలఖర్చులు విపరీతముగ హెచ్చును. ఓడువారు తుదకు దివాలా యగుదురు. ఉభయులును చెడుదురు. కనుక రాజీచేయుట క్షేమకరమని గాంధికి తోచెను. ఇంకొకసంగతి, ఈ వాదిప్రతివాదులు ఆ దేశపు మనవారిలో ప్రముఖులు ఈ కేసు కోర్టులో నున్నంతకాలము, వారి సహచరులలో రెండు పెద్దకక్ష లుండును; అచటి భారతీయులలో కలతలు, చీలికలు హెచ్చును. అచటి రాజకీయస్థితినిబట్టి వెంటనే భారతీయులేకమై తమ హక్కులు రక్షించుకోవలెనని, లేకుంటే ఆ సంఘమంతయు చెడు ననియు గ్రహించి ఆయన దానిరాజీకై విశ్వప్రయత్నంచేసెను; ఈ కేసు రాజీయైనగాని, భారతీయులలో ఐక్యమేర్పడదు.

ఆయన తరచు వారిలో సభలు జరిపించెను. అప్పుడు గాంధికి త్యాబ్జి సేటుగారితో పరిచయము కలిగెను. గాంధి ధీశాలి, న్యాయశీలుడు, సత్యవ్రతుడు, స్వార్థరహితుడు; ఆయనయందు ఉభయపక్షములకును నమ్మిక గౌరవము కుదిరెను. కనుక ఆయన ఉభయుల అంగీకారంతో ఒక పంచాయితీ నేర్పరిచెను. ఆ మధ్యవర్తి పూర్తిగ పరిశీలించి, సాక్ష్యము విని సేటు అబ్దుల్లా కనుకూలంగా 6 లక్షలకు తీర్పునిచ్చెను. కాని ఒక్కసారి 6 లక్షల రూపాయలిచ్చుట కష్టము, త్యాబ్జిగారి కోరికప్రకారము కొన్నియేండ్ల వాయిదా లీయబడెను. ఇట్లు కేసు త్వరలో రాజీయై కక్షలు అణగెను. ఆ కేసుపని యిటు ఉభయులకు తృప్తికరముగా పూర్తి అయినది.

# 8 సంఘ సేవారంభము

దక్షిణాఫ్రికాలోని భారతీయు లప్పటికి లక్షమంది*. కాని ఆ సంఘ మప్పుడు క్షీణదశలో నుండెను. గాంధిగారు వారమువారము సభల నేర్పర్చి అందు ఆరోగ్యము, విద్య న్యాయశీలత మొదలగు విషయముల బోధించెను. కొందరికి తానే విద్య నేర్పెను; ఇండ్లను, చుట్టుపట్లను పరిశుభ్రముగా ఉంచు పద్ధతులను వారి కలవర్చెను అంతట వారిలో చాల సంస్కారణ జరిగెను. వారిలో అన్ని మతములవారు నుండిరి గాంధిగారు 'అన్ని మతముల మూలసూత్రము లొకరీతివే; ఒక మతమువా రింకొక మతమువారిని ద్వేషించుట చాలతప్పు' అని చెప్పి, వారి నొప్పించగా, వారిమధ్య సఖ్యము హెచ్చెను. అన్ని సంఘములవారు నాయన సభిమానించిరి. ఆయన ఆధ్యాత్మికతను నిష్పక్షపాతతను గ్రహించి, కొందరు యూరపియనులుగూడ మిత్రులై తరచు ఆయనతో ప్రసంగించుచుండిరి. ఈస్నేహము ధర్మశీలతయు, ఆయన రాజకీయనాయకత్వమునకు ఉపయోగించెను. వివిధభాషలవారిమధ్య సంభాషణ సౌకర్యమునకై హిందూస్తాని నేర్పించెను.

ఇంతలో గాంధిగారు దక్షిణాఫ్రికాచేరి యేడాది పూర్తియైనది. ఇక స్వదేశమునకు పోవుట కాయన 'డర్బను'పురిచేరెను. తమ్మందరిని బాగుపర్చి మార్గదర్శకుడై ప్రేమపాత్రుడైన గాంధి కందరును వీడ్కోలిచ్చిరి. కాని ఆప్రయాణము సాగలేదు.

అక్కడి ప్రభుత్వాధికారమంతయు తెల్లవారిది. అక్కడి భారతీయులపై నసూయ వహించు యూరపియనుల ఒత్తిడివల్ల నేటాలుప్రభుత్వము వారు 1894 సం॥లో రెండుకొత్తబిల్లులు తెచ్చిరి. అం దొకటి హైందవులెవరికిని ఎన్నికలలో 'ఓటింగు' హక్కు ఉండకూడదని; రెండవది భారతీయుడు (స్త్రీలు పేదలుకూడ) సాలుకు 25 పౌనుల చొ॥ తలపన్ను నీయవలెనని. ఆ బిల్లులవల్ల కలుగు అనర్థము నచటి భారతీయులు మొదట గమనింపనేలేదు. కాని ఆ'వీడ్కోలు' రోజున గాంధిగారా బిల్లులసంగతిని పత్రికలలో జదివిరి; 'పొమ్మనలేక పొగబెట్టి'నట్లు భారతీయుల నెట్లయిన

---

* ఇప్పుడు వారిసంఖ్య మూడు లక్షలు.

పీడించుటకే ఈచట్టముల జేయుచున్నారని ఆయన గ్రహించి, వాటిని నిరో ధించి మనహక్కులగూర్చి ఆందోళనచేయవలెనని ఆసభలోనే బోధించెను. అందరిహితమును గ్రహించి, ఆయుద్యమమును గాంధిగారే నడుపవలెనని, కనుక ఆప్రయాణముమానిఅక్కడనేయుండిపొమ్మని,వారందరుప్రార్థించి, ఆప్రయాణ మాపుజేసిరి. ఇట్లాయన ఇంకను కొన్నియేండ్లు నిల్చిపోయిరి. తమకై నిల్చిన ఆయన స్వంతఖర్చుకు వలయుసొమ్మును అబ్దుల్లాసేటు వగైరా లీయ దలచిరి; కాని అందుకాయన ఒప్పుకొనలేదు. తనకు అబ్దుల్లాకంపెనీవారా కేసుకిచ్చిన 105 కాసులను ఆయన అన్నగారికంపెను. తనవృత్తికై ఆయన నేటాలులో లాయరుగ జేరదలచెను. 'బారిష్టరు' బ్రిటిషుసామ్రాజ్యములో నెక్కడనైనను 'ప్లీడరుగ'నుండవచ్చును కాని అక్కడి యూరపియనులకు జాతిద్వేషము మెండు. వారు తమ కేసులను మన కీయరు. ఐనను, భారతీ యులు కొందరు తమ కేసు లాయన కిత్తుమనిరి. కనుక అచ్చటి లాయర్లతో బాటు తన పేరును జేర్పించుమని గాంధీగారు నేటాలులో సుప్రీముకోర్టు వారికి దరఖాస్తుపెట్టిరి. తెల్లలాయర్ల సంఘ మాక్షేపించినను, కోర్టువారా యనకు రూలుప్రకారము పట్టానిచ్చిరి.

అక్కడ ప్లీడరీలో ఆయన శ్రద్ధతో కృషిచేసెను. ఆయన నిదానము, న్యాయబుద్ధి, దీక్ష, నీతివర్తనము, బుద్ధిసూక్ష్మతయు, కొద్దికాలములోనే కొందరాంగ్లేయులుగూడా ఆకర్షించెను. గాంధిగారు న్యాయమగు కేసులనే పట్టునని, మంచిసలహాలనే చెప్పునని, ప్రఖ్యాతిగాంచెను. ఆయన వీలైనంతవరకు కేసులు రాజీచేసి, పార్టీలను సఖ్యపరిచెను. వకీలువృత్తిలోను, వ్యాపారాల లోను, సత్యశీలత న్యాయవర్తనము మొదట కిష్టకరముగతోచినను, తుద కందుచే క్షేమమేకలుగునని ఆయన ఆచరణవల్ల తేలినది. ఆయన జనులలో కలహతత్వము తగ్గించెను. కొద్దిరాబడితో తృప్తిపడి, మితవ్యయ పరుడై, ఖర్చుపోగా మిలిగినసొమ్మును కాలమునుగూడా అక్కడిభారతీయుల క్షేమమునకే వినియోగించుచుండెను. ఇట్లు సాంఘికరాజకీయములం దక్కడ మనవారికాయన నాయకుడాయెను.

# 9. ఆందోళన

సంఘీభావము బలము. కనుక అక్కడి హైందవుల నొక సంఘముగ నేర్పర్చి, గాంధిగారప్పుడు దానికి 'నేటాలు ఇండియన్ కాంగ్రెసు' అని పేరిడిరి. వారమున కొకసారి సభచేసిరి. అందు వారికి స్వజాత్యభిమానమును, సంఘసేవాదీక్షను బోధించిరి. దాని కాయనయే కార్యదర్శి. సొమ్ములేక యేపనియు జరుగదు; కనుక ఆయన వారినుండి చందాలు వసూలుచేయుచు, ఆసొమ్మును పొదుపుగ కాంగ్రెసుపనులకు ఖర్చుపర్చుచు, సరియైన జమా ఖర్చు లుంచుచుండెను. కొందరి నీపనులందును ప్రచారమందును ఆయన తరిఫీయతు చేసెను.

ఆ క్రొత్తబిల్లుల సహేతుకముగా ఖండించుచు వేలకొలది భారతీయుల సంతకముతో పెద్ద మహాజరు అర్జీలను ఆయన తయారుచేయించి పంపెను. తమ అసమ్మతిని, సభలు, ఊరేగింపులు పత్రికలలో ఆందోళనవ్యాసాలద్వారా ఆయన వెల్లడించి భారతీయులం దుత్సాహమును పట్టుదలను వృద్ధిచేసెను.

మనవారికక్కడ ఎన్నికహక్కు లేకుండ జేయు బిల్లు అప్పటికే కౌన్సిలులో రెండవసారి యంగీకారమొందెను. ఈ ఆందోళనవలన, ప్రభుత్వమువారు దానిని కొంతకాలమాపిరి. కాని తెల్లవారిపట్టుదలవలన ఆబిల్లు తుదకు చట్టమైనది. అంతట గాంధిగారు ఈసమస్యల చరిత్రనంతను, భారతీయులకు కలుగు అనర్థములను విశదపర్చుచు, ఒక గొప్ప కరపత్రమును తయారుచేసి, దానిని మనదేశమున ప్రచురింపచేసెను. జనులలో నాందోళన కల్గినది మనదేశపు సర్కారువా రిందెంచరు మరతులకంగీకరించి, నేటాలు ప్రభుత్వపు గోరికప్రకారం ఇదివరలో భారతీయుల నాదేశమునకు వలసపోవ ప్రోత్సహించిరి. కనుక ఈదారుణపుబిల్లు నడ్డుపెట్టుబాధ్యత మనప్రభుత్వముపై నున్నదని ఆయన వివరించెను, ఆధాటి కీప్రభుత్వమువారు కన్ను తెరచి, ఆ తలపన్ను సాలీనా 25 పౌనులనుండి 3 పౌనులకు తగ్గింపుడని తుదకు నేటాలు ప్రభుత్వమును కోరిరి. కాని ఆ సూచనయు అన్యాయమే. (ఇక్కడి ప్రభుత్వమును బ్రిటిషు వశమేగదా.) అక్కడి భారతీయులలో చాలమంది కడుబీదలు. వారు సాలీనా మూడుకాసుల సన్ను ను చెల్లించుట

కష్టము. అసలు తెలపన్ను పద్ధతియు అనాగరికము; అన్యాయము; దాని నసలే రద్దుచేయవలెనని గాంధిగా రాందోళనను విడువక సాగించి, భారతీయులలో ఐకమత్యమును దీక్షను బలపర్చిరి. ఆతలపన్నును భారతీయు లెవరును చెల్లించవద్దని బోధించిరి. కాని ఆ ఉద్యమము బలముగ జరుగుటకు మన దేశీయుల సహాయ మవశ్యకమని కనిపెట్టి అందుకై గాంధిగారు 1896 సం॥ ఆరంభమున మనదేశమునకు ప్రచారముచేయ మరలివచ్చిరి.

ఇక్కడి బొంబాయి, ప్రయాగ, కలకత్తా, మద్రాసు వగైరాలలో మహాసభల జరిగించి, నాయకులతోను పత్రికాసంపాదకులతోను మాట్లాడి గాంధిగా రప్పుడు మనదేశమందు చాల ప్రబోధముచేసిరి. దక్షిణాఫ్రికాలో భారతీయులు దుస్థితిలోనున్నారని విద్యావంతుల కప్పుడు బోధపడినది; చాలమంది ద్రవ్యమిచ్చిరి. మన ప్రభుత్వమువారికిని కొంచె మొత్తిడికల్గినది. మరియు గాంధిగారికి గొప్ప కార్యదీక్ష, దేశభక్తి, నిర్మాణశక్తి, నేతృత్వ మును కలవని అప్పుడు గోఖలే, తిలకు, మెహతా మొదలగు మన నాయకు లకు తెలిసినది. వారితో (ముఖ్యముగ గోఖలేతో) గాంధికి గట్టి స్నేహ మేర్పడినది. గాంధిగారి యుక్తిని, వాదమును ఆంగ్లేయుల పత్రికలును మెచ్చుకొన్నవి. ఇట్లు కొన్ని నెలలు గట్టి యాందోళన సాగించి, పిమ్మట గాంధిగారు తన గుజరాతులోనే కొంతకాల ముండదలచెను. కాని ఇంతలో దక్షిణాఫ్రికాలో పరిస్థితులు విషమించినవి. వెంటనే అక్కడకు రావలె నని తంతిరాగా, ఆయన కుటుంబముతో 1896 సం॥ ఆఖరున దక్షిణాఫ్రికాకు మగల బయలుదేరిరి.

గాంధిగారిని మొదట రప్పించిన అబ్దుల్లాకంపెనీవారే అప్పుడు రెండు పెద్దయోడలను గుజరాతినుండి దక్షిణాఫ్రికాకు నడుపుచుండిరి; ప్రజాసేవకై పోవు గాంధిగారినీ, వారి కుటుంబమునూ కేవు పుచ్చుకొనకయే వారు తీసికొనిపోయిరి. వాటిలో సుమారు 800 ప్రయాణీకులు చేరిరి; అందు సగం మంది ట్రాన్సువాలుకు పోవువారు. దారిలో పెద్ద తుపానుపట్టెను; కాని గాంధిగారి జాగ్రత్త, ధైర్యము సమయస్ఫూర్తివల్ల అందరును నిదానంతో సంచరించి సుఖంగా దక్షిణాఫ్రికా చేరిరి.

# 10. జాతిద్వేషము

గాంధిగారు దక్షిణాఫ్రికాలోని స్థితినిగూర్చి చేసిన ప్రచారంలో యూరపియను లక్కడ పెట్టుబాధలనుగూర్చి అబద్ధములుచెప్పి దొరలను దూషించిరని దక్షిణాఫ్రికాపత్రిక లపవాదమును మోపినవి. ఆవార్తను నమ్మి అచ్చటి తెల్లజనులాగ్రహించిరి. ఆస్థితిలో గాంధిగారు 800 మందితో మరల వచ్చుచున్నారని కబురు రాగనే, వారు ఉద్రేకము చెందిరి. ఆ ఓడలనుండి గాంధి వగైరాలు దిగకుండ జేయుటకు డర్బనుఅధికారులు కొన్ని సాకు లేర్పర్చిరి. అట్లు పదిరోజులుగతించి గాంధియెట్లో పరివారంతోదిగెను. ఆయన డర్బనువీధిలోకిరాగనే, కొందరాంగ్లేయులు రౌడీజట్టుగజేరి ఆయ నను చుట్టువేసి,అసహాయుడగు గాంధిని తన్ని, గుద్ది,పొడిచి,చిత్రహింసచేసిరి. అప్పుడు గాంధి మరణించునట్లుండెను. కాని అచటి పోలీసు సూపరిండెంటు భార్య అభిమానించి, భర్తతోజెప్పి, ఉద్రేకితులగు ప్రజలమధ్యనుండి గాంధి సెట్లో రక్షింపజేసెను. ఈఆంగ్లయువతి ప్రవర్తన విచిత్రము. గాంధి గారు తనయుపన్యాసపు సరియైన రిపోర్టుగల బ్రిటిషుపత్రికలను అక్కడి పత్రికల వారికి చూపెను. అందువల్లగాంధిగారీ దేశములో తెల్లవారిని దూషిం చలేదన్నీ, యథార్థసంగతులే సవ్యముగ తెలిపిరని స్పష్టమాయెను. అంతట పత్రికాధిపతులు తమపేతప్పని ఒప్పుకొనిరి. ప్రజల కోప మణగిపోయెను. గాంధిని కొట్టినందు కారౌడీలపైన సజ్జనుడగు పబ్లికు ప్రాసిక్యూటరు కేసు పెట్టదలచెను; కాని గాంధి గారట్టి యత్నమును మాన్పించిరి. కేసుపెట్టగనే కావేషీలు హెచ్చును. హింసకులపైన కేసుపెట్టుట కాయన నిరాకరించిరని తెలియగనే, తెల్లవారును ఆయన సౌజన్యమునకు మెచ్చుకొనిరి.

ఆయన అహింసాతత్వమును, ధార్మికవిషయములలో సమభావమును, ఆత్మగౌరవమును జూచి, కొంద రాంగ్లేయులును మిత్రులై, ఆయన ఉద్యమ ములకు సాయముచేసిరి.

గాంధిగారీదేశమునకు వచ్చిన సమయమున దక్షిణాఫ్రికాసర్కారు వారు మరిరెండుబిల్లులు పెట్టినారు. ఇక భారతీయుల నక్కడకు రాకుండ జేయుట, ఉన్నవారు వ్యాపారాదులు జరిగించకుండ అడ్డుట, ఈ బిల్లుల

ఉద్దేశము. అందుమీదనే, వెంటనే రమ్మని ఆ భారతీయులనుండి గాంధి గారికి లోగడతంతి వచ్చినది.

అప్పుడు గాంధిగారు మరల తీవ్రప్రచారము చేసి భారతీయులలో నింకను నిగ్రహమును, సంఘీభావమును, త్యాగమును, కార్యపరతను కల్గించిరి. ఆ కాంగ్రెసుద్వారా యూరేగింపు సభలను, ఆందోళన సభలను మరల జరిపిరి, వారికి శుచిత్వమును నేర్పిరి. వారికి సామాన్యముగ మొదట ఇంగ్లీషును తరువాత హిందీని నేర్పిరి. అందువలన వారిలో ఐకమత్యము హెచ్చినది. ఆయన తన యింటను సాత్వికాహారపద్ధతిని, సంఘసేవను నేర్పిరి. ఇంద్రియనిగ్రహము నేర్చుకొని, సాత్విక తేజమును వృద్ధిచేసికొనిరి.

# 11. బోయరు యుద్ధము

ట్రాన్సువాలురాష్ట్రములోని 'బోయర్లు' కప్పుడు బ్రిటిషుప్రభుత్వంతో యుద్ధము జరిగినది. ఈ 'బోయర్లు' తెల్లవారే. డచ్చిజాతీయులు. అందు బ్రిటిషుపాలకులకు తోడ్పడు భారతీయుల నాయన ప్రోత్సహించి, వైద్య సహాయాదులకు పటాలమును తాను తయారుచేసెను. చికిత్సాపద్ధతులను నేర్చుకొని తక్కినవారికిని నేర్పెను. రణరంగమందు గాయపడిన ఆంగ్ల యోధుల కీ భారతీయులపటాలము సేవజేసి చాల ఉపకరించెను. దానిని మొదట బ్రిటిషువా రహంభావమున తృణీకరించిరి, కాని తరువాత బోయర్లచే బ్రిటిషువారు కొన్నిచోట్ల నోడి, కష్టములో బడిరి. అప్పుడు భారతీయులు జీవరక్షచేసి వారికి తోడ్పడిరి. కొన్నియేండ్లు దీర్ఘయుద్ధము జరిగెను ఈలోగా ఇంగ్లండునుండి కొత్తసేనలు దిగెను. తుదకెట్లో బోయర్లు లొంగిరి. ఆ యుద్ధరంగములో జోరబడి, భారతీయులు సాహసముతో అద్భుతముగ సహాయ మిచ్చిరి. ప్రథమచికిత్స, సామానుల జేర్చుట, బాధితుల నీవలకు తీయుట మొదలగుపనుల జేసిరి. ఆంగ్లసేనాని వారి నేర్పును, కార్యశూరతను మెచ్చుకొనెను. భారతీయుల ధైర్యము, పరోపకారిత్వము, జీవకారుణ్యము, అందరికిని స్పష్టమాయెను, ఆ పటాల్ల మెవ్వరినీ బాధించ

లేదు. చికిత్సామూలచే ప్రాణరక్షణ నేచేసెను. తరువాత బోయర్లకు ఆంగ్లులకు రాజీ జరిగినది.

అప్పుడు (1897-98) మనదేశమందు వర్షములు లేక, గొప్పకరవు కల్గినది. కోట్లకొలది బీదలు తిండిలేక, గింజలుకొనుటకు డబ్బులేక అల్లాడిరి. గాంధిగారప్పు డక్కడ భారతీయులనుండి చందాలువసూలుచేసి మాతృభూమియగు మనదేశపు ప్రజలకు యథాశక్తిగ సాయముచేయించిరి. ఆయన సౌజన్యమువలన ఆక్షామనిధి కచ్చటి తెల్లవారును కొందరు చందా సొమ్ముల నిచ్చిరి. అప్పటినుండి అక్కడి భారతీయులు మాతృదేశముపైన ప్రేమగల్గి, అవసరమైనప్పుడు మనకు సాయమును నేటికిని చేయుచున్నారు. మనకు వలసప్రాంతములతో పరస్పర సాహుభూతి కల్గుటకు గాంధీగారే ముఖ్యకారకులు.

# 12. స్వదేశయాత్ర

గాంధిగారివంటి దేశాభిమాని సంఘసేవాపరుడు ప్రజ్ఞావంతుడు నే డేదోమూల వలసలో నుండుటకన్న, ఇక్కడకు వచ్చివేయుటే మన దేశమున కెక్కువ లాభకరమనియెంచి చాలమంది మన నాయకులు ఆయనను రమ్మనిరి. లక్షమందియే హైందవులుండు అక్కడికన్న, కోట్లకొలది జనులున్న మాతృదేశమందు జనుల కెక్కువసేవ జేయవచ్చు! మరియు భారతీయులు వలసబోయి చిక్కులుపడుచున్న ఫిజీ, జాంజిబారు, తూర్పుఆఫ్రికా, మారిషసు మున్నగు దక్షిణాఫ్రికావంటి దేశము లింకను చాలగలవు. వీరందరి క్షేమమునకు మాతృదేశదాస్యవిముక్తి ముఖ్యాధారము. ఇక్కడనుండియే వారికిని కొంతసేవ జేయవచ్చును.

అప్పటి కాయనపద్ధతుల నక్కడ కొందరు నేర్చుకొనిరి. ఆ పనులను వారు స్వయముగా చేయగలరు. కనుక స్వదేశమునకుపోదునని, మననాయకు లట్లు కోరిరని, ఆయన తన సహచరులతో చెప్పెను. అవసరమైనప్పుడు గాంధిగా రక్కడకు రావలెనని కోరి, పంపుటకు వా రంగీకరించిరి. ఇట్లు వారి సమ్మతినొంది గాంధిగారు 1901 లో మరల మనదేశమునకు వచ్చిరి.

1901 సాలాఖరున మన నేషనల్ కాంగ్రెసు (= జాతీయమహాసభ) కలకత్తాలో జరిగినది. గాంధిగారందు పాల్గొనిరి. ఆయనకు మనకాంగ్రెసుతో మొదటిసంపర్కమదే. "దక్షిణాఫ్రికాలో కష్టపడుచున్న భారతీయుల కీసభవారు సానుభూతి తెల్పుచున్నారు." అని కాంగ్రెసు విషయనిర్ణయ సభలోను, మహాసభలోను గాంధిగారే తీర్మానమును పెట్టి, చక్కగ ఉపన్యసించిరి. దాని నందరు నామోదించిరి. కాంగ్రెసువారి పద్ధతులతో గాంధిగారి కప్పుడు పరిచయము కల్గెను అప్పటి కాంగ్రెసు సాలీనా పనియంతయు మూడునాళ్ళ ముచ్చటగనుండెను. చర్చ అంతయు ఇంగ్లీషులోనే, ఆ తీర్మానముతోనే తృప్తిచెందక, ఆయన 1902 జనవరిలో కలకత్తాలోనే గోఖలే గారిఇంట బసచేసెను. ఉభయులకు స్నేహము హెచ్చెను. దక్షిణాఫ్రికా సమస్యనుగూర్చి ప్రచారంచేసి ప్రముఖుల సానుభూతిని సంపాదించెను; ప్రఫుల్లచంద్రరాయులతోను ఆయన కప్పుడు మైత్రికల్గెను; ఉభయులును వినమ్రులు, మితవ్యయులు, దేశభక్తులు, పరోపకారులు, మేధావులు, నిగ్రహవంతులు. అంతట గాంధిగారు మనదేశమంతటను సామాన్యులతో కలియుచు తిరిగి ప్రచారముచేసి మనదేశ సాంఘికమతరాజకీయ సమస్యలను స్వయముగా గ్రహించెను. ఆయన ఆరోగ్యపద్ధతులగూర్చియు, సత్ప్రవర్తన గూర్చియు జనులకు బోధించిరి.

అంతట ప్రాక్టీసుకై ఆయన రాజకోటలో బసపెట్టి, మిత్రు లప్పగించిన దావాలను చక్కగ నడిపెను. కొన్ని నెలలకు హైకోర్టులో ప్రాక్టీసు చేయుట కాయన బసను బొంబాయికి మార్చెను. మిత్రులగు దక్షిణాఫ్రికా వర్తకులకప్పుడు బొంబాయికోర్టులలో కొన్ని కేసు లుండెను. వా రా కేసులను సహజముగ గాంధిగారి కిచ్చిరి. ఆయనకిట్లు రాబడియు హెచ్చెను. కేసులనుండి తీరికయైనప్పు డాయన గోఖలేతో కలియుచుండెను, గోఖలే గొప్పదేశభక్తుడు, భారతసేవకసంఘ స్థాపకుడు. ఆయన సంఘసేవాపద్ధతులను గాంధి యాలవర్చుకొనెను. ఇక జీవితము కుదుటబడినదనుకొనిరి; కాని ఇంతలో నేటాలునుండి ఒక తంతివచ్చెను. అవసరమైనచో, మరల యేడాదికి దక్షిణాఫ్రికాకు వత్తునని ఒప్పుకొన్నప్రకారం అవసర మిప్పుడు కలిగినది, తప్పక దయచేయ మని దక్షిణాఫ్రికా మిత్రు లాయనను కోరిరి. తానువచ్చి యేడాదియైనది. దయాళువగుగాంధి స్తిమితపుజీవితమును ఆప్లీడరీని కట్టిపెట్టి బొంబాయికాపుర మెత్తివేసి మరల దక్షిణాఫ్రికాకు వెళ్ళెను.

# 13. చేంబర్లేను యాత్ర

ఇక్కడి కొలది వృత్తులకే పోటీచేయుచు తమలో తగవుపడుచు కూపకూర్మమువలె నుండక దేశాంతరములందు సాహసించి, లోకజ్ఞానమును వ్యాపారాది వృత్తులను సంపాదింప రండని, కొందరు గుజరాతీయువకుల నప్పుడు గాంధిగారు ప్రోత్సహించి వారిని తనతో దక్షిణాఫ్రికాకు తీసికొని పోయెను.

అప్పటి దక్షిణాఫ్రికాలో ట్రాన్సువాలువంటివి స్వతంత్ర రాష్ట్రిలు. నేటాలువంటివి 'కాలనీలు' (వలసలు); బోయరులయుద్ధముతరువాత రాజీ ప్రకార మివియన్నియు బ్రిటిషుసామ్రాజ్యములో జేరినవి. వాటిపైన అంత్యాధికారము బ్రిటిషుపార్లమెంటువారిది. దాని నాప్రభుత్వముతరపున ఒక బ్రిటిషుమంత్రి చలాయించును. అప్పుడామంత్రి 'జోసెఫ్ చేంబర్లేను.' ఆయన లండనునుండి దక్షిణాఫ్రికాకు తణిఖీచేయ వచ్చెను.

బ్రిటిషుసామ్రాజ్యపు పౌరులే యగు నక్కడిభారతీయుల బాధల దొలగించుట కాయన సర్వవిధముల నర్హుడు, తమ కష్టముల నాయనకు సరిగ నివేదించవలె. అందుకు గాంధియే తగినవాడు. కనుకనే మనవా రప్పుడు గాంధిని రప్పించిరి. అక్కడి ప్రభుత్వముచేయు ప్రతిశాసనమును ఇంగ్లండులో ప్రభుత్వము సమ్మతినిచ్చినగాని, అది రాజ్యాంగప్రకారము అమలుకురాదు, సామ్రాజ్యపు పౌరత్వమునకు నష్టముచేయు యేబిల్లునైనను బ్రిటిషు ప్రభుత్వమువారు త్రోసివేయుట న్యాయమే. దక్షిణాఫ్రికా ప్రభుత్వము తెచ్చిపెట్టిన క్రొత్తబిల్లులు భారతీయుల పౌరస్వాతంత్ర్యమున కన్నివిధములను భంగకరములు

నేటాలులో దిగగనే గాంధిగారు అక్కడ భారతీయులకున్నవి, రానున్నవి యగు నిర్బంధము లెట్లు అన్యాయములో బాధాకరములో వివరించుచు నివేదికను తయారుచేసి చేంబర్లేనుగారికిచ్చి, ముఖ్యమగు బాధలన్నిటిని సహేతుకముగ స్వయముగ తెల్పిరి. ఆవాదము సబబేనని, భారతీయుల కన్యాయము జరుగుచున్నదని ఆ చర్చలో చేంబర్లెనుగా రొప్పుకొనిరి. ట్రాన్సువాలులో అధికారులు గాంధికి చేంబర్లేనుదర్శనము కానీయలేదు.

అయినను ఆయన లిఖితముగ అక్కడి సంగతులుగూడ దెల్పిరి. కాని, ఏమిలాభము ? 'అంత్యాధికారము మాదైనను దక్షిణాఫ్రికావారికి రాష్ట్రీయ స్వాతంత్ర్య మిచ్చియున్నాము. ఇది వారి అంతరంగిక విషయం, మేము కల్పించుకోలేము' అని సాకుచెప్పి అక్కడి అధికారులకే నచ్చజెప్పుడని బ్రిటిషుమంత్రిగారు తప్పించుకొనిరి. ఇది నిజముగా సామ్రాజ్యసమస్యయే కాని మేల్కొనియే నిద్ర నటించువానిని లేపు టెట్లు ? భారతీయులపై నసూయతోనున్న దక్షిణాఫ్రికా ప్రభుత్వం వారు మనవారి అర్జీలు బుట్టదాఖలుచేయుదురని చేంబర్లేనుకు తెలియును, కాని ఆ యధికారులవి, బ్రిటిషువారవి జాతి, మతము, భాష, ఆచారము, సాంప్రదాయము నొకేరీతివి; కనుక అభిమాన మటు మొగ్గును; మనవైపు తిరగదు. మరియు, బ్రిటిషుసర్కారు కప్పుడు సొమ్మొకవసరము కల్గెను వారికి చేంబర్లేనుద్వారా ధనాఢ్యులగు దక్షిణాఫ్రికా సర్కారువా రప్పుడు కొన్ని లక్షల సవరనులను బహుమతిగ నిచ్చిరట ! ఈ స్వర్ణాస్త్రము అమోఘముగ పనిచేసినది. ఆ బ్రిటిషుమంత్రి నోరెత్తక కాసులమూటతో చల్లగ లండనుకు జారిపోయెను.

అంతట దక్షిణాఫ్రికా యూరపియనులకు లోకువచిక్కినది. బోయరుయుద్ధపు కాలమందు కొందరాంగ్లసైనికులు దక్షిణాఫ్రికాకు వచ్చేసిరి. వారిలో కొందరక్కడనే నిల్చిపోయిరి మన ఆసియా జనుల రక్షణకని వారి నాప్రభుత్వమువా రేర్పరచిరి. వారు మన దేశమందు జులుము చేయుటలో నారితేరినవారు. మనవా రప్పటినుండి ప్రతిస్వల్పకార్యమునకును ఈ క్రొత్త ఉద్యోగుల అనుమతి పొందవలెనని హుకుము జారీయాయెను. వా రా భారతీయులను పెట్టు తిప్పలకు మితిలేదు. అందు కొందరు లంచ గొండులు. వారికి దళారులు హెచ్చిరి ఈఆసియాశాఖలోని తెల్లఉద్యోగులు శల్యసారథ్యముచేసిరి. ఆ 'రక్షకు'లే భక్షకులైనందున, మనవారిబాధ లింకను హెచ్చినవి.

# 14. ట్రాన్సువాలు సత్యాగ్రహము

ఈ క్రొత్తపరిస్థితులవలన ఆ భారతీయు లప్పుడు గాంధిగారి నక్కడ నుంచివేసిరి. నేటాలుకన్న ట్రాన్సువాలులోనే వీరి బాధలు హెచ్చెను. కనుక, గాంధిగారు తమబస ట్రాన్సువాలుకు మార్చిరి. అందలి రెండు ముఖ్యనగరాలలో 'జోహాన్సుబర్గు' పెద్దది; దాని ప్రక్కలోనే లోకప్రసిద్ధమైన బంగారుగను లున్నవి. ఆ పురమందు గాంధి తన బసపెట్టి స్వదేశము నుండి కుటుంబమును తెచ్చికొనెను. ట్రాన్సువాలు కోర్టులో న్యాయవాదిగ చేరి అట్టార్నీగ ఉండెను; హైందవులకు చాల సహకారియై, ఆదర్శప్రవృత్తి గల్గియుండెను. కనుక ఆయనకు చాల మంచిపేరు వచ్చెను. ఆయన అందరికి నిష్టుడై, అన్నిమతముల బోధకులతో ధార్మికసమస్యలు చర్చించుచుండెను. తన కుటుంబమందు అపక్వమగు శాకాహారమును వాడుచు, అప్పుడప్పుడు ఉపవసించుచు ప్రకృతిపద్ధతిని, ప్రకృతిచికిత్సను అలవాటుచేసి స్త్రీ సంగమ మసలేలేని, ఇంద్రియనిగ్రహమును వృద్ధిజేసికొనెను. ఇవి యన్నియు మనశ్శరీరములకు పరిశుద్ధిగలిగించి, ఆయన హృదయవికాసమునకును అంతరాత్మసాక్షాత్కారమునకును సహకారులాయెను. ఇట్లాయనలో క్రమంగా మహాత్వ మంకురిచెను.

నేటాలులో 'జూలు' లను నల్ల ఆదిమజాతిజను లున్నారు; వారిని తెల్లవా రనేకరీతులుగా బాధింతురు. వారప్పు డాపాలకులపైన తిరుగబడిరి అచటి ప్రభుత్వమునకు చిక్కుస్థితిలో సాయముచేయదలచి గాంధిగారు 40 మంది భారతీయులతో నొక ఉపచారకసంఘ మేర్పర్చిరి. ప్రభుత్వము వారావర్గమును గాయపడిన జూలులకు చికిత్సజేయ నియమించిరి. పాశ్చాత్యులు నల్లవారిని ముట్టుట కేవగించుకొనిరి. గాంధివర్గమును మాత్రము రణరంగమందు దిక్కులేక బాధపడు ఆ జూలులకు మనస్ఫూర్తిగ చికిత్సచేసి, జూలులప్రేమ చూరగొని దీనరక్షణ జరిగించిరి.

అప్పుడు ట్రాన్సువాలులో ప్లేగువ్యాధి పొడచూపెను. అచటి భారతీయుల వలసస్థలము లిరుకై, అనారోగ్యముగ నుండి అక్కడ ప్లేగు చెల రేగెను. గాంధిగారు వారి కారోగ్య మలవర్చుటేగాక, చాలామంది ప్లేగు

రోగులకు స్వయముగ చికిత్సను ఉపచారమును చేసిరి; ఆంగ్లవైద్యపద్ధతినే గాక లూయీకూనెగారి ప్రకృతి సిద్ధాంతముప్రకారము ఆ రోగులకు జబ్బుపడిన తన పిల్లలకుగూడ జలవైద్యమును మట్టిపూతవైద్యమును చేసి, సాత్వికాహారమే పెట్టి, ప్లేగువ్యాధి నద్భుతముగ కుదిర్చెను; ఆయన గ్రంథ రూపమునగూడ తనసిద్ధాంతమును బ్రచారము చేసిరి.

అప్పుడాయన తన భావములను వ్యాపింపజేయుటకు 'ఇండియన్ ఒపినియన్' అనుపేర ఒక వారపత్రికను ఆంగ్లమున, హిందీ, గుజరాతీ, అరవములలోను నడపనారంభించెను. 'ఫినిక్సు' అనుచోట ఆశ్రమమును స్థాపించి అచటినుండి యీ పత్రికను నడుపుచు ఆ యాశ్రమమును ప్రజా సేవకులకు కేంద్రస్థానముగ జేసెను. భారతీయు లాపద్ధతులందు పూర్ణ విశ్వాసము గల్గి, తమ బాధలు తొలగుటకాయన చెప్పినట్లు చేయనారంభించిరి.

ఫినిక్సు ఆశ్రమమందు 'పోలకు, వెస్టు' మున్నగు కొందరు యూరపి యనులుగూడ తమ కుటుంబములతో వసించిరి; ఆ చుట్టుపట్లనున్న చేరి మూడెకరములభూమి సాగుచేయుచు, శాకాదుల బండించియు, 'ఇండియన్ ఒపినియను' పత్రికను స్వయముగ అచ్చువేయించి నడిపియు, వారందరును నిరపేక్షులై, గాంధిగారితోబాటు లోకక్షేమమునకే తమ జీవిత మర్పింప దొడగిరి. అచటి బాలురకు గాంధిగారు స్వయముగ విద్య నేర్పుచుండిరి.

బోయరుయుద్ధము తరువాత దక్షిణాఫ్రికాలోని రాజ్యములన్నిటిని జేర్చి, క్రొత్తరాజ్యాంగమును బ్రిటిషుప్రభుత్వమువారు 1907 లో తయారుచేసి 'యూనియన్ ఆఫ్ సౌతాఫ్రికా' (= దక్షిణాఫ్రికాసమితి)అను పేరుపెట్టి, దానిని బ్రిటిషుసామ్రాజ్యములోనే స్వపరిపాలన రాష్ట్రముగ జేసిరి. కాని యీ స్వపరిపాలన అక్కడి తెల్లవారికే. మనవారికి ఆదిమవాసులకు పాలన హక్కులేదు. లోగడ యుద్ధములో శత్రువులైన బోయర్లకును ఆంగ్లేయు లతోబాటు హక్కు నిచ్చిరి. ఆంగ్లేయులకు తోడ్పడినను మనవారికిమాత్ర మున్నగోడుగూడ చెడినది.

అంతట గాంధిగారు కొందరితో నింగ్లండుజేరి, ఈ అన్యాయమును విశదపర్చిరి. కాని క్రొత్తరాజ్యాంగ మేర్పడువరకు బ్రిటిషువా రనుమ

మినుము తేల్చక కాలయాపనచేసిరి. చివరకు 'ఈ సమస్య ఆ దేశపు అంతరంగిక సమస్య, వారితోనే మాట్లాడుకొనుడు' అని జవాబిచ్చిరి. ట్రాన్సువాలు ప్రభుత్వమువారు తమకు 'డొమినియను' హక్కు రాగానే, 'ఆసియా వారి వలస సవరణచట్టు' (Aseatic Immigration Amendment Act) మను పేర నొక ఆక్టును చేసిరి. దాని ప్రకారం ప్రతి ఆసియావారును, సాలీనా మూడేసి కాసుల తలపన్నును చెల్లించవలెను, మరియు, ప్రభుత్వోద్యోగుల రిజిష్టరులో వేలుముద్రవేసి తమ పేరును రిజిష్టరుచేసుకొనవలెను. విద్యావంతులగు భారతీయు లక్కడ కాపురముండకుండ, వారెట్టివృత్తియు జేయకుండ, ఇంకొకచట్టమును చేసిరి. వాటిని బ్రిటిషు సామ్రాజ్యమువా రంగీకరించిరి. దీనిని ఖండించుచు గాంధిగారు ఎన్నియో తీర్మానములు చేయించిరి. మహజరు లిప్పించిరి, పత్రికలయం దాందోళన చేయించిరి. మనదేశము నుండియు సానుభూతితీర్మానములు బ్రిటిషుప్రభుత్వమున కందునట్లు చేసిరి. కాని అన్నియు బుట్టదాఖలైనవి. ఇక పోరే శరణ్యమని తేలెను; కాని ఆయన హింసకు దౌర్జన్యమునకు రక్తపాతమునకు నిష్టపడడు. అచటి భారతీయులు నిరాయుధులు. ఆంగ్లేయులు సర్వశస్త్రయుతులు, కనుక రక్తపాతము జేసినను నిష్ప్రయోజనమగును. గాంధిగారంతట క్రొత్తరకపు యుద్ధమారంభించిరి. ఇదే సాత్విక నిరోధము. ఉద్యోగులెంత ఒత్తిడిచేసినను తలపన్ను నీయకూడదు; వేలుముద్ర వేయకూడదు; ఆస్తి జప్తుచేసి వేలమువేసినను సరే, ఎట్టి హింసనూ చేయకూడదు. అరెస్టుచేసి, జైలుకంపితే అందుకు సిద్ధము కావలెను. అని గాంధిగారు నేర్పి, జనుల నందుకు తయారుచేసిరి. ఏమిచేసినను ప్రభుత్వమువారు నూటకయిదుగురి నుండియైన పన్ను రాబట్టలేక పోయిరి, వేలుముద్ర వేయించలేక పోయిరి. సత్యాగ్రహుల ఆస్తులు జప్తుఅయి వేలములుజరిగినవి. భారతీయులెవరు నందులో పాడలేరు. గాంధిసిద్ధాంత మనుసరించి అచటి చీనులును భారతీయులతో నేకమైరి. ప్రభుత్వమువారు కోపించి 1907 జూలైలో గాంధిగారి నరెస్టుజేసి జైలులోనుంచిరి. ఇట్లాయనకు జైలుయాత్ర ఆరంభమయినది. అంతట వేలకొలది భారతీయులు జైలుకు సిద్ధమైరి. హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, క్రిస్టియనులు, బీదలు, ధనికులు, స్త్రీలు అను భేదమేలేదు. జరిమానాపడి ఆస్తిపోయినను లక్ష్యములేదు. కూలీలు, వర్తకులు, డాక్టర్లు, వ్యవసాయకులు వగైరా

అందరు నేకమైరి. వారికా యుద్ధము క్రొత్తయేకాని, ఆయనయందు గురిగల్గి, అందరు నైకమత్యముతో తమ నాయకు ననుసరించిరి.

ఇట్టియుద్ధము లోకాతీతము. సర్కారువారు శిక్షించుకొలది, భారతీయులయం దైకమత్యమును, ఆవేశమును హెచ్చెను. జైళ్ళు నిండెను. అంతట ప్రభుత్వమువారొక యుక్తిచేసిరి. 'తలపన్ను ఒకసారి చెల్లించిన చాలును. ఇదివరలో ఇచ్చినవారింక నీయనక్కరలేదు. అట్లు చెల్లించిన భారతీయులకు పౌరత్వ మేర్పడును. వేలుముద్రద్వారా (శాసనరీత్యాగాక) భారతీయులు తమ పేర్లు రిజష్టరు చేయించుకొన్న చాలును; అప్పుడు మేమా అన్యాయపు శాసనముల రద్దు చేయుదుము' అనిరి. న్యాయమైన రాజీకి సత్యాగ్రహు లంగీకరింతురు, కనుక ఆ సూచన కొప్పుకొని గాంధీగా రందరిచేత తమంతట రిజష్టరు చేయించిరి. ఇదివర కీయనివారిచే పన్ను నిప్పించిరి, కొందరు భారతీయులకా రాజీ తృప్తినీయలేదు, కాని, గాంధీజీ ననుసరించి వారు నట్లుచేసిరి. ఇట్లంతయు పూర్తియైనది. కాని ప్రభుత్వము వారాచట్టముల రద్దు చేయలేదు. పైగా క్రొత్త నిర్బంధముల బెట్టబోయిరి. ఇట్లు ద్రోహము జరిగినందున అప్పుడు గాంధిగారు వేరుమార్గములేక 1908లో మరల తీవ్రసత్యాగ్రహ మారంభించిరి. ఇదివరలో ప్రభుత్వమువా రిచ్చిన రిజష్టరీసర్టిఫికెట్లనన్నిటిని గాంధిగారు వారి సహచరులును, బహిరంగముగ తగుల బెట్టిరి ఆస్తిజప్తులేగాక చిత్రవిచిత్రములగు క్రొత్త నిర్బంధములను ప్రభుత్వము వారు కల్పించిరి. కొందరిని చీలదీసి, అట్టివారికిమాత్రము సదుపాయములిచ్చి, భేదోపాయము నుపయోగించిరి, గాని సత్యాగ్రహులు చెదరలేదు. వారిసంఖ్య హెచ్చినది. మనదేశములోను వారికి చాలా సానుభూతి జూపిరి కొందరు మద్రాసు, బొంబాయి, కలకత్తా మున్నగుచోట్ల వేలకొలది రూపాయలు పోగుచేసి,సత్యాగ్రహుల సహాయమునకై దక్షిణాఫ్రికా కంపిరి. కొన్నియేండ్లకు అక్కడను ఇంగ్లండు అమెరికా ప్రాంతాలవారునుగూడ విభ్రాంతులై ఆయుద్యమమునకు తోడ్పడి, దక్షిణాఫ్రికా ప్రభుత్వపుచర్య అన్యాయమని ఖండించిరి.

కనుక, తుదకు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు గాంధిగారితో రాజీ చేసుకొని, ఆ రెండు చట్టములను తగ్గించుకొనిరి. ఇట్లా సత్యాగ్రహయుద్ధము 1918లో ముగిసినది. గాంధిగారు నీతినిధి, కర్మవీరుడు, మహానాయకుడు నని లోకమంతటను తెలిసినది. అప్పుడు మన దేశమందే అట్టినాయకుని అవసరము కలిగినది.*

---

* ఇట్లది అప్పటికి జయమందినది కాని, దరిమిలాను అక్కడి తెల్లప్రభుత్వమువారు మరల భారతీయులను బాధింపజొచ్చిరి. ఇప్పుడు దక్షిణాఫ్రికాలో సుమారు 2 1/2 లక్షల భారతీయు లున్నారు. వీరిలో కొందరు విద్యావంతులు, వర్తకులు ఇత్యాదులు. వారు విశేషంగా ఆస్తులు సంపాదించి తెల్లవారితో పోటీచేయకుండ, సాంఘికంగా తెల్లవారితో సమత్వంలేకుండ, సాంఘికంగానేగాక రాజకీయంగాను వారిని ఆ శ్వేతప్రభుత్వము బాధించుచు నేయున్నది. మన భారతప్రభుత్వ మాక్షేపించినను లెక్కచేయలేదు. అంతట, మనప్రభుత్వమువారు వారిపైన కొద్దిగ ప్రతిక్రియ నారంభించినారు. అక్కడ మన ప్రభుత్వప్రతినిధిని హైకమీషనరును వెనుకకురప్పించి, ఆ దేశీయులతో వ్యాపారసంబంధమును తగ్గించినారు. మరియు ఇటీవల శ్రీమతి విజయలక్ష్మీపండిత్ నాయకత్వమున భారతీయ ప్రతినిధులు ఈ సమస్యను న్యూయార్కులోని సంయుక్తజాతిసమితిలో బెట్టిరి. దానిని చర్చించి, ఈ విషయమును దక్షిణాఫ్రికా ప్రభుత్వంవారు న్యాయమైనపద్ధతిని పరిష్కరించవలెనని (మన వాద మంగీకరించి) ఆ సమితివారు తీర్మానించినారు. (ఈ 1946లో దక్షిణాఫ్రికాలో మరల రెండు అక్రమశాసనముల బెట్టియున్నారు. తెల్లవారు వసించు ప్రదేశాలలో భారతీయులు వసించకుండాను, భారతీయులకు స్వేచ్ఛావ్యాపారం లేకుండాను నిరోధములు పెట్టుచున్నారు. శ్వేతజాతీయుల ప్రాబల్యంగల సమితివారు మందలించినను, ఇక్కడి శ్వేతప్రభుత్వపు ధోరణి వక్రముగనే యున్నది.

# 15. మన దేశస్థితి

మనదేశపు ముఖ్యరాజకీయసంస్థ 'కాంగ్రెసు'. అది 1885 లో ఆరంభించి మితవాదములతో నడచినది. 1905 లో వంగవిభాగమును, తూర్పున రష్యాపైన జపాను విజయమును నవజీవమును కల్గించెను. 1906 ఆఖరున కలకత్తా కాంగ్రెసులో అధ్యక్షుడుగ మన జాతీయపితామహుడైన దాదాభాయి నౌరోజిగారు స్వదేశీ, స్వరాజ్య, విదేశవస్తు బహిష్కారము, జాతీయవిద్య నాల్గింటిని బోధించిరి కాని మితవాదులకును అతివాదు లనబడు జాతీయవాదులకును 1907 ఆఖరున చీలిక కలిగినది. జాతీయవాదులను ప్రభుత్వమువా రణచిరి, వారి నాయకుడగు తిలకుగారికి 1908 లో ఆరేండ్ల శిక్ష విధించిరి; వంగరాష్ట్రనాయకులను, లజపతిరాయిగారిని విచారణ లేకుండ జైలులోనుంచిరి క్రిమినల్ లా సవరణచట్టము, అచ్చుకూటముల చట్టము వగైరా క్రొత్తనిర్బంధములు వచ్చెను. మితవాదులు బెదరి వెనుదీసిరి. ప్రజలు నిరుత్సాహులైరి. గోఖలే కార్యశూర్యుడు కాదు, కాని దేశభక్తుడు. ప్రభుత్వము బుద్ధిపూర్వకముగ జనుల కెట్టి స్వరాజ్యము నీయదని గ్రహించి, ఆయనయు, తక్కినవారును 'గాంధిగారు దక్షిణాఫ్రికావదలి' మనదేశమందే రాజకీయరంగమున పనిచేయవలెనని కోరిరి. దక్షిణాఫ్రికాలో ఇక అనుచరులు ఆయనవేసిన ఫక్కీనే పనుల జరిగింతురు. మరియు మాతృదేశములోని జనులు స్వరాజ్యము సంపాదించినప్పుడే, వలసభారతీయుల హక్కులు, గౌరవము నిల్చియుండును. ఇక్కడ మనజాతీయప్రభుత్వముంటే అది వలస ప్రజలకు తగు రక్షణనిచ్చి కాపాడగలదు. కనుక వారిసమస్య భారతసమస్య కనుబంధమే అని గాంధిగా రప్పుడు కనిపెట్టిరి.

మరియు, అక్కడ ఒకలక్షయే భారతీయులు. ఇక్కడ 30 కోట్ల పైగానున్న దేశీయులకై, తన సేవాశక్తుల నుపయోగించి మాతృదేశము నారాధించుటే ఎక్కువ ముఖ్యము, గనుక ఆయన దక్షిణాఫ్రికాకార్యము నక్కడి సహచరుల కొప్పగించి, యూరపులోనున్న మిత్రుడగు గోఖలేతో మాట్లాడుటకు 1914 లో లండను చేరెను. కాని, ఈలోగా జర్మనీ మహా

యుద్ధమారంభించెను. గోఖలేగారు ఫ్రాంసులో నుండిపోయిరి. ఆంగ్లేయులు రణయత్నంలో మగ్నులైరి. ఆ ప్రాంతపు భారతీయులను గాంధిగారు లండనులో సమకూర్చి వారా యుద్ధములో ఆంగ్లేయులకు తోడ్పడవలెనని కోరి, సేవాదళము తయారుచేసిరి. కాని, దానికి స్వేచ్ఛనీయక, ఆంగ్లాధికారులు తిప్పలుపెట్టిరి. కనుక ఆ దళమువారు సత్యాగ్రహము చేసి పని మానిరి. ఆయన లోగడ 14 రోజులు ఉపవాసముచేసిరి. మరల శక్తి చేకూరకుండగనే ఆయన దీర్ఘప్రయాణాదుల జేసెను, పండ్లుమాత్రము తినుచుండెను. కనుక జబ్బుపడి మంచముమీదనేయుండిన గాంధిగారా యుద్ధమున పనిచేయలేదు. 1914 లోనే గోఖలేయును, తరువాత కొన్ని రోజులకు గాంధియును, స్వదేశంవచ్చి బొంబాయి చేరిరి.

అక్కడ గాంధిగారికి నిండుసభలో పౌరులతరపున జిన్నాగారు గొప్పసన్మాన మిచ్చిరి. పౌరుల ఆంగ్లోపన్యాసముల కాయన గుజరాతీలోనే తగు జవాబునిచ్చెను. దక్షిణాఫ్రికాలోని ఆశ్రమసభ్యులును ఆయనతో బాటు ఈ దేశమున సేవచేయుట కాయనకన్న ముందే చేరిరి. శ్రీ ఆండ్రూసు గారి నాయకత్వమున వార శ్రీ రవీంద్రనాధుని శాంతినికేతనమందు తత్కాలమునకు బసచేసిరి.

ఇక ముందు కార్యము:—గోఖలేగారు పూనాలో స్థాపించిన భారత సేవకసంఘమున గాంధియు సభ్యుడగు ప్రశంస వచ్చెను. కాని, ఈ యుభయుల ఆదర్శములలో కొంతభేద మేర్పడెను. గోఖలేసంఘీయులు మితవాదులు, ప్రభుత్వముతో సంఘర్షణమున కెన్నడు నొప్పుకోరు. ఈ కాలమున సాంఘికార్థిక సమస్యలకును రాజకీయములతో సంబంధ ముండును. భారతప్రభుత్వము విదేశప్రభుత్వమునకొక శాఖగనుండెను. ముఖ్యవిషయాలలో మనకును విదేశీయులకును సంఘర్షణ ముండును. మన జాతీయకార్యముల కప్పుడు ఆటంకము వచ్చును. అప్పుడు మనము ప్రభుత్వంతో పోరుటకు సిద్ధపడితేనే కార్యసాధనమగును. కనుక స్వతంత్రముగనే, దక్షిణాఫ్రికా పద్ధతిని ఒక స్వతంత్రాశ్రమము పెట్టుకొన నిశ్చయమాయెను.

# 16. సబర్మతీ ఆశ్రమము

ఉన్న తాదర్శముప్రకారము దేశసేవకుల తయారుచేసి వారిద్వారా తగు ప్రణాళిక నడుపవలెనని తలచి, (పూనా) భారత సేవకసంఘము, (కాంగ్రి) గురుకులాశ్రమము. (బోల్పుర్) శాంతినికేతనములను ముందుగ చూచి, వారి మంచిపద్ధతుల గాంధిగారు గ్రహించిరి. గాంధిగారి సహచరు లక్కడనున్న రోజులలో చేసిన కొన్ని 'స్వయంసహాయక' పద్ధతులను టాగూరుగారు మెచ్చి, తమ ఆశ్రమములోను వానిని ప్రవేశపెట్టిరి.

ఈ స్థితిలో గోఖలే మరణించెను. ఇక భారతసేవక సంఘమును గాంధియే నడుపవలెనని కొందరనిరి. కాని, గాంధిగారా మితవాది సంఘముతో సంబంధమును మానిరి.

ఈ దేశపు పరిస్థితులను పూర్తిగ గ్రహించుటకై, 1915 సం॥రం అంతయు గాంధిగారు మౌనంగా మనదేశపు గ్రామప్రాంతములందు తిరిగి రైలులోను, స్టీమర్లలోను, 3 వ తరగతిలోనే సంచరించిరి, స్టేషనులలో టిక్కెట్లకై కిటికీలవద్దను, గేట్లవద్దను, రైలువద్దను జరుగు తోపిడుల కష్టములు 3 వ తరగతి పెట్టెలు కిక్కిరిసి మలినమైయుండుట, తగు నీటివసతి వగైరాలు లేకుండుట ఇట్టి చిక్కులనివృత్తికై వీలైనంతవరకు రైల్వే యజమానులతో చర్చ జరిగించిరి ఈ కష్టములకు కొంతవరకు ప్రయాణీకులు బాధ్యులే 'శుభ్రతలేక చుట్టలుకాల్చుట,ఉమ్మిట, కేకలువేయుట, పరస్పర కలహములు, అనవసరముగ బండిలోనే చెత్త వగైరాలుపోయుట వదలి ఓర్పుతో నుండవలెను' అని ఆయన తోడిజనులకు బోధించెను. ఆయన ఉత్తరదేశము, రంగూనుగూడ తిరిగి అన్నిచోట్లను సత్యాగ్రహసిద్ధాంతముల బోధించెను. ఆ సాలున హరిద్వారమున కుంభమేళ ఉత్సవము జరిగెను. అందుకు కొన్ని లక్షలజనము వచ్చిరి. గాంధిగారనుచరులతో వెళ్ళి సంఘసేవ చేసిరి; యాత్రికుల అశుభ్రతను, అజ్ఞానమును పోద్రోలి మతవిశ్వాసమును సరిచేయింప యత్నించిరి. ఆయన హిమాలయములలోని హృషీకేశాదుల ప్రకృతిశోభను గ్రోలి, గొప్ప సాధువులతో భాషించి, వారి జీవితపద్ధతుల దెలుసుకొనెను. చాలమంది సాధువులు ఆధ్యాత్మికకృషిలేక సోమరులై యుందురని కనిపెట్టెను. త్యాగతత్వము బాల్యమునుండి అలవడవలెను.

సన్యాసాశ్రమమున జేరినంతనే కల్గదు. సిద్ధిని జీవన్ముక్తిని పొందుటకు ఆశ్రమమును మార్చుకొననక్కరలేదని ఆయన భావము.

సంచారము చేయుచునే, ఆయన తన ఆశ్రమస్థాపనకై తగు స్థలమును వెదకెను. గుజరాతీలకు సహజముగ తనతో హెచ్చు స్నేహము, తన ధోరణియం దభిమానము నుండెను. కనుక గుజరాతులో ముఖ్యనగరమగు అహమ్మదాబాదుకు ప్రక్కనే సబర్మతినదియొడ్డున 1915 లో గాంధిగారాశ్రమము స్థాపించిరి. సుమారు 20 కుటుంబము లందులో కాపుర మారంభించిరి అందు కొందరు దక్షిణాఫ్రికాలో తనతో నున్నవారే. అచట జాతి కులాచార వైషమ్యములు లేవు. పంచముల కస్పృశ్యత లేదు. స్వయం సహాయము ముఖ్యము. ఆశ్రమవాసులు వండుకొనుట, స్వయముగ నూలు వడుకుట మున్నగు చేతిపనులు చేయవలెను. మద్యమాంసములు ముట్టకూడదు. ప్రతివారును సౌమ్యులై సంఘసేవాపరులై అహింసావ్రతులు కావలెను. సత్యాగ్రహము వారి ముఖ్యసిద్ధాంతము, కనుక ఆ ఆశ్రమమును 'సత్యాగ్రహాశ్రమ' మనిరి. మిత్రులగు కొందరు 'సేటు'లు, వకీళ్ళు ఆ ఆశ్రమపు సంచాలనమునకై ద్రవ్య మిచ్చిరి. అందొక పంచమకుటుంబమును ప్రవేశించెను. మొదట కొంతమందికి కష్టముగనున్నను, తరువాత ఆ ఆశ్రమము చాల చక్కగసాగుచు, ఇతరులందరకు ఆదర్శమయినది, గాంధిగారందరితోను చాల స్నేహము చేసుకొనెను, ఆ మూడేండ్లు రాజకీయములందు ప్రత్యక్షముగ పాల్గొనలేదు.

# 17. చంపారణసత్యాగ్రహము

ఉత్తరదేశములో బీహారురాష్ట్రపు ఉత్తరభాగమందు 'చంపారణ' అను జిల్లాయున్నది. అచటిజను లమాయకులు, కడుబీదలు; వారికి రాజకీయ జ్ఞానము సున్న, వారిభూమి ఫలవంతమే; అందు చాలభాగమును ఆంగ్లేయులు కారుచౌకగకొనిరి. రయితులచే నీలిచెట్లు పండించి, దానితో నీలిరంగు తయారుచేసి, దాని నమ్మి కోటీశ్వరులగుచుండిరి అప్పటికి మనదేశపు నీలిరంగు చాల గిరాకీగానుండెను. కాని యాంగ్లేయులా రైతులకందుకు తగు కూలి నీయక, వారిని బానిసలుగ జేసిరి, దారుణపుమరతుల బెట్టిరి.

ప్రతి 20 ఎకరముల భూమిలోను 3 ఎకరములందు నీలిగింజవేసి ఆ పంట
నుచితముగ రయితులీ దొరల కీయవలెను; అక్రమపన్నులు చెల్లించవలెను;
వారి కష్టములబాపు నాథులు లేరైరి. దొరలకు అధికారులయొద్ద చాల
పలుకుబడి. అచట ఎన్నియోదారుణములు జరిగినను రక్షించుదిక్కు లేదు.

ఆ ప్రాంతీయుడొకడు వారి నాస్థితినుండి యెట్లయిన రక్షించుమని
గాంధిని ప్రార్థించెను. పరిస్థితిని ముందుగ చూడదలచి, 1917 లో ఆయన
పాట్నా చేరి, అచటినుండి చంపారణకు వెళ్ళెను. అచటి ముఖ్యపురమగు
'మోతీహారి'లో గాంధిగారు బసచేసి, రయితులనుండి ముందుగా వాఙ్మూల
ములదీసికొనిరి గాంధిగారు సౌమ్యుడే, కాని ఆయనది భల్లూకపుపట్టు అని
ఆంగ్లవ్యాపారులకు తెలియును. తమయాటలు సాగవలెనన్న, గాంధీని
వెంటనే తొలగింపవలెను అచటి మేజస్ట్రేటు వెంటనే గాంధిపైన క్రి.ప్రొ.
కోడ్డు 144 వ సెక్షను ప్రయోగించి, తక్షణమాజిల్లాను వదలిపొమ్మని
నోటీసునిచ్చెను, గాంధి యానోటీసును తీసుకొని జిల్లానువదలనని తెలిపెను.
అంతట పోలీసువారు కేసుపెట్టిరి. గాంధిగారు కోర్టుకు హాజరైరి. మేజస్ట్రే
టుకు పోలీసులకు అట్టి కేసు నెట్లునడుపుటకును తోచలేదు ఈ సందిగ్ధ
స్థితిలో మేజస్ట్రేటుయెదుట గాంధిగారొక స్టేటుమెంటు నిచ్చిరి.

"ఈ జిల్లాలో రయితుల దారుణబాధల బాపుటకై నేను మేజస్ట్రేటు
ఆజ్ఞను మీరినాను. వారు చెప్పుబాధలసంగతి విచారించుచున్నాను.
ఆబాధితులకు సేవచేయుటకు ముందు విచారణతప్పదు. నా అంతరాత్మకు
తోచినట్లు దీనసేవచేయుట నావిధి." అని అందు తెల్పెను. అది నేరమో
కాదో, ఏమియు తోచక, మేజస్ట్రేటు ఆ కేసును వాయిదావేసెను.
ఈ వివరములనే గాంధిగారు తక్షణం వైస్రాయికి, మాలవ్య మున్నగు
జాతీయనాయకులకు, పత్రికలకును తంతిద్వారా బంపెను. అంతట పత్రిక
లన్నిటిలో పెద్ద కోలాహలము కల్గెను. గాంధి చెప్పునది నిజమేనని, ఆయన
కార్యశూరుడని స్పష్టమయినది. అంతట వారా కేసును రద్దుచేసుకొనిరి.

గాంధిగారు తన విచారణ పూర్తిచేసిరి. వేలకొలది రయితు లక్కడి
యక్రయములగూర్చి వాఙ్మూలము లిచ్చిరి. శ్రీరాజేంద్రప్రసాదు, బ్రజకిశోర

బాబు* మున్నగు వకీలునాయకు లాయనకు తోడైరి. అప్పుడే ఆయన గ్రామములలోకల్మషముతొలగించి జనులకు విద్యను,పారిశుధ్యమును,ఆరోగ్యపద్ధతులను నేర్పదొడగిరి. అందుకు తన సబర్మతీ ఆశ్రమమునుండి, పూనా ఆశ్రమాదులనుండి సంఘసేవకులను రప్పించిరి. చాల పాఠశాలల బెట్టించి జనులకు బోధించిరి. గాంధిగారి భార్యయగు కస్తూరిబాయియు, వారినాల్గవకొడుకగు దేవదాసునుగూడ ఆ కార్యములో పూర్తిగ పాల్గొనిరి. రయితులు వారియందనురక్తులైరి. ఆయన పంపు వార్త లాదేశమం దాందోళన తెచ్చెను. ఆ నీలితోటదార్ల నీలివార్తల విని వారిపై ప్రేమచే ప్రభుత్వ మశ్రద్ధగనున్నదని కల్లోలము రేగినది. ఒక విచారణసంఘమును ప్రభుత్వమే పెట్టవలసివచ్చెను. అందు గాంధిగారినిగూడ సభ్యుడుగ నియమించిరి, వారువిచారించి రయితుల మొర న్యాయబద్ధమనియు,వారికష్టముల దొలగింపవలెననియు ఏకకంఠముగ తీర్పునిచ్చిరి రయితు లదనముగ నిచ్చుపన్నులను, యజమానికి నీలికొట్టు నుచితముగ నిచ్చుషరతును ప్రభుత్వమువారు రద్దు చేయించిరి. గాంధిగారు మనదేశమందు జరిపించిన మొదటి సత్యాగ్రహ మిట్లు జయమొందినది. అంతటితో విడువక గాంధిగా రక్కడ గ్రామాభివృద్ధికార్యములను జనులకు నేర్పిరి. ఈ స్థితిలో హఠాత్తుగ పడమట నొక తుపానుపట్టెను.

## 18. మిల్లుసమ్మె

అహమ్మదాబాదులో చాల బట్టలమిల్లు లున్నవి. వాటియజమానులు గుజరాతీలు. చాలవరకు గాంధిగారి మిత్రులు. అది యూరపులో యుద్ధకాలము. సీమబట్టలు దిగుమతిలేక మన మిల్లుబట్టలకు గిరాకియు ధరలును హెచ్చినవి. యజమానుల లాభములకు లోటులేదు. గింజలధరలును హెచ్చినవి. కనుక కూలీలు తమజీతముల వృద్ధినికోరిరి. కాని యజమానులొప్పుకోలేదు. తగవు హెచ్చినది. అంతట గాంధిగారు చంపారణ్

---

* ఆయనయు అందులో సభ్యులు. ఈయన యిటీవలనే మరణించినారు. వ్రజకిశోరబాబు అప్పటికి ఆ రాష్ట్రి రాజకీయనాయకుడు. బీహారు శాసనసభలోను బయటను ఆయన చేసిన కృషిగూడ విచారణసంఘస్థాపనకు కారణమైనది.

నుండి వచ్చి చూచి మధ్యవర్తిద్వారా పరిష్కరించుకొమ్మనిరి. అందుకు కార్మికులొప్పుకొనిరి. కాని మిల్లుదార్లు పంచాయితీని నిరాకరించిరి. కనుక విధిలేక పనివాండ్రు సమ్మెకట్టిరి. గాంధిగారే వారినాయకుడు. ఇట్లాయన తన మిత్రులగు మిల్లుదార్లతో పోరుగద్దెను. ఇంకొక చిత్రమేమన అప్పటికా కార్మికులనాయకురాలై వారికి సలహానిచ్చుచు గాంధిగారికి తోడ్పడిన శ్రీ అనసూయాబాయి ఆ మిల్లు యజమానులలో ముఖ్యుడగు శ్రీ అంబాలాల్ సారాభాయిగారికి సోదరియే.

ఆ పనివాండ్రు రెండువారము లుత్సాహముతో సమ్మె సాగించిరి. గాంధిగారు కార్మికులకు సత్యాగ్రహపద్ధతిని బోధించిరి. "శాంతిగనుండ వలెను; సమ్మెకాలంలో మిల్లులం దితరులు పనికి చేరినను, వారిని బాంధిచ కూడెదు. వ్యవసాయము, నేత, కూలిపని మున్నగు మరొకవృత్తినేర్చి, సమ్మె ముగియువరకు వాటితో స్వతంత్రముగ జీవింపవలె, చందా సొమ్ముపైనే ఆధారపడకూడదు. సమ్మెదార్లెవరును రాజీయగువరకు మరల మిల్లులలో జేరకూడదు." అని వారికాయన చెప్పి తరిఫీయతు చేసెను. కొందరికి తన ఆశ్రమములో పనిచూపెను. కాని, కొందరికి పనులులేవు. మిల్లుయజమానులు శ్రీమంతులు, కనుక హెచ్చుజీతములకు క్రొత్తవారిని తెచ్చి మిల్లు పనులసాగించుకొనుచుండిరి. పనిలేని పాతవాండ్రు రెండువారములగుసరికి కడుపుమంటచే రోషావిష్టులై, తమ కూడు కడ్డుపడిన క్రొత్తపనివాండ్రపైన తిరుగబడబోయిరి; గాంధిగారు వారిని హింసనుండి వారించిరి.

కొందరు తాళలేక, తమవ్రతమునకు భిన్నముగ మధ్యనే మిల్లులలో చేరబోయిరి. మిల్లుదార్లు కోటీశ్వరులు. వా రిదివరలో సాలీనా లక్షలకొలది సంపాదించిరి. 'కొన్నినెలలు పని నిల్చిపోయినను సరే, దాసులవంటి కూలీలతో మేము పంచాయితీ కొప్పుకోము; నిరాధారులగు సమ్మెదార్లు లొంగక తీరరు' అని యెంచి పట్టుబట్టిరి. గాంధిగారికేమియు తోచలేదు సమ్మెనుండి జంకు పనివాండ్రకు నిగ్రహము కల్గించుటకై, గాంధిగారప్పు డుపవాస మారంభించిరి. ఆ మహాత్ము డాహార మసలే మానెనని తెలియగనే సమ్మెదార్లు సిగ్గుపడి మిల్లుపనికిపోక కట్టుగ నిల్చిరి,

మిల్లు యజమానులలోను, దేశంలో జనులందరిలోను గొప్ప ఆందోళన కల్గినది. 3 రోజుల ఉపవాస మగుసరికి, మధ్యవర్తి చెప్పిన ప్రకారమా

తగువును మిల్లుయజమానులు ఫైసలు చేసుకొని, సమ్మెదార్ల జీతములను న్యాయంగా హెచ్చించిరి. 'గాంధిగారిట్లు కార్మికపక్షము వహించి, కూలి హెచ్చింపు కోరుట న్యాయమే నని, మిల్లుపనివాండ్రు స్వంతసౌకర్యకారని, తరువాత మిల్లుయజమానులు గ్రహించిరి. వారికి గాంధిగారిపై ప్రేమ గౌరవములు హెచ్చినవి. గాంధిగారు కార్మికసమస్యల పరిష్కరించుట కదే యారంభం. అప్పటినుండి అహమ్మదాబాదు మిల్లులలో యజమానులకు పనివాండ్రకు ఎట్టి తగువు వచ్చినను గాంధిగారే ఫైసలుచేయుచుండెడివారు. బొంబాయి మొదలగు స్థలములందు తరుచు మిల్లుదార్లకు కార్మికులకు సామరస్యములేక దీర్ఘకాలము సమ్మెకల్గి, పనిచెడి చాల ద్రవ్యనష్టము గల్గుచుండెను. అహమ్మదాబాదులో మాత్రము సాధారణంగా ఉభయకక్షులకును తృప్తి, సానుభూతి, లాభము కల్గి అందరును బాగుపడుచున్నారు; అందుకు గాంధిగారే ముఖ్యకారణము.

అహమ్మదాబాదు కార్మికు లప్పటినుండి గాంధిగారియందు గురికల్గి ఆయన యేర్పర్చిన నిబంధనలప్రకారమే కార్మికసంఘం (ట్రేడుయూనియను) పెట్టుకున్నారు. దాని నియమావళియు, ఆచరణపద్ధతియు ఆదర్శరూపముగ నున్నవి.

# 19. ఖేరాసత్యాగ్రహము

ఈలోగా, ఇంకొక పెద్దసమస్య వచ్చెను. గుజరాతులోని ఖేరా జిల్లాలో 1916, 1917 సం॥రంలో పంటలులేవు. పంటలు బొత్తిగ పోయినవి; పన్నులు చెల్లలేదు. సర్కారుద్యోగస్థులు పన్నులకై బీదరైతులను నానాబాధలబెట్టిరి. బొంబాయి శాసనసభలో తీర్మానముచేయించి శ్రీవిఠలభాయిపటేలు మున్నగునాయకులు ఆ సాలుపన్ను మాఫుచేయుమని ప్రభుత్వమువారితో వాదించిరి. అది బూడిదలోపోసిన పన్నీరాయెను. పాతికపంటయే తేలితే సర్కారురూలుప్రకారం పన్నుఅంతయు రాయితీచేయవలె. ఆపాతికపంటయు అప్పుడాజిల్లాలోలేదు. ఉద్యోగస్థులు ¼ కన్న హెచ్చు పండినదనిరి; కాని బహిరంగవిచారణకొప్పుకోలేదు. ఉద్యోగస్థుల ఒత్తిడి

హెచ్చెను. అంతట రయితునాయకులు గాంధిగారి నాశ్రయించిరి. ఆయన ఆజిల్లాలో తిరిగి, రైతులవాదము నిజమని గ్రహించి కలెక్టరును కలుసుకొని రయితులతరఫున మాట్లాడెను; కాని లాభించలేదు. ఇంక చేయునదిలేక సత్యాగ్రహము చేయింప నిశ్చయించెను. ముందుగా జిల్లాలో చాలచోట్ల సభలు జేసి, సత్యాగ్రహపు మూలసూత్రములను బోధించెను, ఆ ప్రకారము 'శాంతిగ నుండెదము; మాఆస్తులు జప్తుచేసి వేలము వేసినను మమ్ము జైలుకంపినను సరే పన్నులనీయము; బీదవారిపన్నులు కొట్టివేసినచో, శ్రీమంతులమైనను చెల్లింతుము' అని పట్టాదార్లును, సేవ్యదార్లును ప్రమాణములు చేసిరి. ఇట్లు సాత్వికనిరోధ మారంభమాయెను. చాలమంది ప్రజానాయకులు చూడవచ్చిరి; కొందరాయనకు సాయపడిరి. ఆయన నైతికసూత్రములు కొందరి నాకర్షించి నవి.

వారిలోనొకరు వల్లభాయిపటేలు. అప్పటికాయన అహమ్మదా బాదులో గొప్ప లాయరు. ఆయుద్ధపుచిత్రత గమనించి, ఆయన ఆయుద్ధరంగ మున కురికెను. అప్పటినుండి గాంధిగారి కాయన కుడిభుజమై, వకీలుపని మానుకొని జాతీయసేవచేయుచున్నాడు. ఇట్లే శంకరలాలుబాంకరు, మహా దేవదేశాయి, అనసూయాబెను మున్నగువా రప్పటినుండి ఆయనకు సహాయకు లయిరి.

ఆ సాత్వికనిరోధంవల్ల ఆజిల్లాలో పన్నులు చెల్లలేదు. సర్కారు ఉద్యోగస్థు లెట్లైన పన్ను రాబట్టజూచిరి; రయితుల చరాస్తులకు జప్తులు, వేలములు తెచ్చిరి. మనుష్యుల అరెస్టులు, దౌర్జన్యమును సాగించిరి. కాని రయితులు పన్ను చెల్లింపలేదు, వేలంలో కొనువారులేరు. ప్రయత్నములన్నియు వ్యర్థంకాగా, ప్రభుత్వమువారు తుదకు రాజీకి వచ్చిరి. భాగ్యవంతులు పన్నులు చెల్లించుటకు, బీదల పన్నులు సర్కారు మాఫుచేయుటకు ఉభయులు నంగీకరించిరి. ఈ సత్యాగ్రహంవల్ల గుజరాతీల కందరకు ధైర్యము, ఆత్మవిశ్వాసము హెచ్చెను. ఉద్యోగుల అహంభావము తగ్గెను. మనదేశీయు లకు సత్యాగ్రహసిద్ధాంతముపై నభిమాన మేర్పడెను; సంఘీభావము, సహ కారబుద్ధి హెచ్చెను. బొంబాయి వర్తకులు సామాన్యులుగూడ ఆ సమ్మె దార్ల కప్పుడు చాల సొమ్ము చందానిచ్చిరి.

వాటివల్ల దేశమందు గాంధిగారిఖ్యాతి యింకను హెచ్చెను. గ్రామములోని రయితులకును కూలీలకును అభిమానము గల్గెను. మనదేశమందును సత్యాగ్రహము మంచి సాధనమని జయప్రదమని తేలినది. కాని సత్యాగ్రహము దేశమంతటకు అమలుజరుగుటకుముందు, జనులఐక్యము, అంతశ్శక్తి యింకను బాగుగ హెచ్చవలెను. అందుకై గాంధిగారు తన ఆశ్రమముద్వారాను ప్రచారమువల్లను దేశమంతటను కృషిచేసెను. జనులలో ఆర్థిక సాంఘికాది లోపములను, త్రాగుడు మున్నగు దురభ్యాసములను పోగొట్టి అభ్యుదయం కలిగించుటకు ఖద్దరు, సామాన్యభాష, మద్యనిషేధం, గ్రామపరిశుభ్రత ఇట్టి, నిర్మాణాత్మకమైన కార్యక్రమమును పత్రికాదుల ద్వారా ప్రజలలో ఆయన ప్రచారముచేయ నారంభించిరి.

# 20 పంజాబుసంఘటన

బ్రిటిషుఅధికారులు మనదేశీయులను మనద్రవ్యసంపదలను యథేచ్ఛగ ఆ యుద్ధంలో వ్యయపర్చిరి. 1914-1918 సం॥రం లలో మొదటి ప్రపంచ యుద్ధము జరిగెను. ఈ లోగా ప్రజల ఆర్థికబాధ హెచ్చి మనదేశమం దాందోళన గల్గెను. ఆ యుద్ధకాలమందు తిలకు, బిసెంటు, ఆలీసోదరులు మున్నగు జాతీయనాయకులను సర్కారువారు నిర్బంధమం దుంచిరి. 'ప్రతిదేశపు పాలన ఆ జనుల యిష్టప్రకారమే జరుగవలె. ఆ స్వయంనిర్ణయసూత్రమును లోకమంతట నమలుచేయుటకే ఈ యుద్ధము చేయుచున్నాము. ఈ యుద్ధానంతర మీ దేశపు పాలనగూడ ప్రజాయత్తము చేయుదుము' అని ప్రభుత్వమువారనిరి. ఆప్రమాణములను కొందరుమాత్రము నమ్మిరి. గాంధిగారు అట్లే తన సహచరులతో కలసి జిల్లాలలోతిరిగి ప్రచారముచేసి యుద్ధసహాయక దళముల నేర్పరిచిరి. 'నిరాయుధులగు మనమిప్పు డాయుధములవాడి, ప్రభుత్వమునకు వారిచిక్కులలో తోడ్పడితే ఆంగ్లేయులహృదయము మారును' అని కొందరు విశ్వసించిరి. ఇంతలో ఆయన జబ్బుపడెను. అంతట మిత్రమండలికి జయముకల్గి, 1918 నవంబరులో యుద్ధ మంతమొందెను.

యుద్ధానంతరమున మనకు స్వపరిపాలనకు బదులు విచిత్రమగు (మాంటుఫర్డు) చట్టమువచ్చెను, "స్వయంనిర్ణయ"పు వాగ్దానము హరించి

పోయెను, ఆ క్రొత్తచట్టము ప్రకారము శాసనసభలలో కొందరికి సభ్యత్వము రాష్ట్రాలలో కొద్దిమందికి మంత్రిత్వాదులు నేర్పడెను; కాని వారికిని సరియైన అధికార మీయలేదు, ప్రజలకు గట్టిహక్కులు లేవు. ఈ శుష్కసంస్కరణచే, ఆడంబరము, పన్నులబాధ, హిందువులలో కులతత్వభేదము, హిందూ మహమ్మదీయుల మధ్య జాతివైషమ్యపు తగువులును పెరిగెను. అప్పుడే ప్రజల వాక్స్వాతంత్ర్య మరికట్టుచు మరొకచట్టమునుగూడ ప్రభుత్వమువారు తేబూనిరి. అదే 'రౌలటుబిల్లు'. బ్రిటిషువారు కృతజ్ఞతకు బదులు కృతఘ్నత జూపెదరని తోచెను. గాంధి మొదలగునాయకులు దానిని ప్రతిఘటింప దేశమంతటను సభలుచేయించి, అర్జీలిప్పించి, ఆందోళన జేయించిరి కాని సర్కారువారు నిర్లక్ష్యముచేసి, దానిని అమలునకు తెచ్చిరి.

అంతట గాంధిగారు విసుగుజెంది, 1919 మార్చిలో బొంబాయిలో 'సత్యాగ్రహ' సభను స్థాపించిరి. 'రౌలటుచట్ట'మును ఖండించుచు కరపత్ర ముల బ్రచురించిరి. ఆసాలు ఏప్రిలు 6 వ తేదీనుండి 13 వరకు సత్యాగ్రహ వారముగ భావించి, ప్రతదినముగ 6 వ తేదీని దేశమంతటను జనులు హర్తాళముచేయ సూచించిరి. ఆరోజున జనులు ధ్యానంచేయవలె, లౌకిక కార్య ములు కట్టిపెట్టవలె. ఆ సాయంకాలము ప్రతిచోట సభలజేసి నిగ్రహము దెల్పు తీర్మానముల జేయవలె. దేశమందన్ని పట్టణాలలో హర్తాళము జరిగెను; నగరమునందు సంచారము, వ్యాపారమ్ము లేవు. ఈరీతిని మంచి ప్రబోధము కల్గినది. అంతట ప్రభుత్వోద్యోగులు కోపించి, చాలచోట్ల అరెస్టులు, సభలపై పోలీసు ఆశ్వికులదాడిని, నిరోధమును జరిగించిరి. ముఖ్యాంగా పంజాబులో నుద్యోగులు దౌర్జన్యము చేసిరి; అచటివా రనేకులు లోగడ ప్రభుత్వసైనికులై, మహాయుద్ధమున బ్రిటిషువారి కండయై ప్రస్తుతం పించను తీసుకొనుచుండిరి. ఆ ప్రజల కుపకారములకు బదులు క్రొత్తనిరోధములు రాగా, సహజముగ వా రుద్రేకమొంది, మహాసభలందు తమ దుఃఖమును తెల్పిరి వారికి శాంతిని అహింసను బోధించుటకు గాంధి, మాలవ్య మున్నగు వారు యత్నించిరి, కాని వారి నెవ్వరిని పంజాబుకు ప్రభుత్వమువారు రానీయ లేదు పంజాబులోని సత్యపాలు, దునిచందు మున్నగు ప్రజానాయకుల నరెస్టుచేసిరి. పంజాబు సరిహద్దువద్ద గాంధిగారి నరెస్టుచేసి, బొంబాయిలో దింపి, మరల పంజాబునకు రాకుండ నిషేధించిరి. గాంధిగారు బహిష్కృత

జాతీయగ్రంథముల ప్రచారరూపముగ సత్యాగ్రహం సాగించిరి. కాని అహింసాపద్ధతి కొత్తయై కొన్నిచోట్ల రక్తపాతము కలిగెనని, పంజాబులో పరిస్థితి చాల తీవ్రమాయెనని, తెలిసి, ఆయన ఆ సత్యాగ్రహమును నిల్పియుంచిరి

ఆ సత్యాగ్రహవారపు ఆఖరురోజున 1919 లో సౌర సంవత్సరాది యగు ఏప్రిలు 13వ తేదీని దేశమందంతటను సభలు జరిగెను. అమృతసరపురపు "జలియన్వాలాబాగు" తోటలో శాంతముగ సభచేయు నిరాయుధులగు వందలకొలది జనులను ప్రభుత్వసేనాని డయ్యారు మరఫిరంగులతో కాల్చి చంపించెను. పంజాబులో సర్కారు సైనికశాసనము పెట్టిరి. జనులకు నిర్బంధములు, బాధలు హెచ్చించిరి. ఆరునెలలవరకితరప్రాంతములవారిని పంజాబుకు రానీయలేదు. తరువాత కాంగ్రెసుతరఫున నెహ్రూలు, దాసు, మాలవ్య, జయకరు మున్నగు న్యాయవాదులు, గాంధిగారు పంజాబు దుండగములగూర్చి శ్రద్ధతో అహోరాత్రములు విచారణ జరిగించి రిపోర్టు తయారుచేసిరి. సాక్ష్యం పెట్టుటకు, రికార్డు చూపుటకు సర్కారు ఉద్యోగులకును వారవకాశ మిచ్చిరి, కాని సర్కారు కలిసిరాలేదు. తమ అధికార్యమునకు భంగంకలుగుననియో, లేక తాము పాల్గొన్నను విచారణఫలితంలో సర్కారుచర్యలకు వ్యతిరేకంగా న్యాయము తేలి, అట్టి రిపోర్టుకు తామును సమ్మతింపవలసి వచ్చునను భీతివల్లనో వారు జంకినారు. ఆ దారుణచర్యలకు ప్రభుత్వోద్యోగులే కారకులని, విచారణసంఘపురిపోర్టువలన స్పష్టమాయెను. తరువాతను ప్రభుత్వము ఒకకమిటీని పెట్టిరి; కాని, అందులో న్యాయమైన విచారణ జరిపించలేదు; తమ తీర్పుప్రకారమును తప్పుచేసిన ఉద్యోగస్థులను క్రమరీతిని శిక్షింపలేదు.

# 21. యంగు ఇండియా

సత్యాగ్రహసిద్ధాంతములను, జాతీయభావమును జనులలో ప్రచారము చేయుటకై గాంధిగారు 1919 ఏప్రిలునుండి ఇంగ్లీషులో 'యంగు యిండియా' గుజరాతీలో 'నవజీవన్' అను వారపత్రికలను అహమ్మదాబాదునుండి సాగించిరి. ఇట్లే హిందీలోగూడ నవజీవన్ పేరుతోనే వారపత్రికను

ప్రచురింపజేసిరి. వాటికి విశేషప్రచారము కల్గెను. ఒకప్పుడు 40 వేలవరకు చందాదారు లుండిరి. యంగుఇండియాలోని ముఖ్యవ్యాసములు మనదేశపు ముఖ్యవార్తాపత్రిక లన్నిటిలో (తర్జుమాయై మన ప్రాంతీయ భాషాపత్రికల లోను) ప్రచురింపబడుచుండెను. ఈరీతిగ అహింస, సత్యవ్రతము, స్వదేశీ దీక్ష, ఖద్దరుప్రాముఖ్యము, అస్పృశ్యతానివారణ, హిందూముస్లిము ఐక్యము, గ్రామోద్ధరణ, స్త్రీలయభివృద్ధి, స్వభాషావ్యాసంగము, సత్యాగ్రహము నడుపుపద్ధతి, వీటినిగూర్చి గాంధిగారిసిద్ధాంతములు జనులందరిలో వ్యాపించెను. ఆంగ్లేయులుగూడ యంగుఇండియావ్యాసముల నాతురతతో చదువుచుండిరి.

కాంగ్రెసు వార్షికసభలలో గాంధిగారి ప్రజ్ఞాశక్తులు తెలియవచ్చెను. 19 9 లో సత్యాగ్రహసభతో ఆయన దేశమున ప్రముఖుడాయెను. ఆయన నిగ్రహి, ధీరుడు, స్వార్థత్యాగి, అకళంక దేశభక్తుడు అని జనులందరికి స్పష్టమాయెను. కాంగ్రెసు అంతరంగచర్చలలోను తీర్మానముల తయారులోను ఆయన పాల్గొని సహాయపడుచుండెను. జలియన్‌వాలాబాగు హత్యలోని కీర్తిశేషుల స్మారకచిహ్నపు ట్రస్టీలలో నొకరై, గాంధిగారు అందుకు బొంబాయి మున్నగుచోట్ల చాలసొమ్ము చందా వసూలుచేసిరి. అప్పటి నుండి ఎన్నియో గొప్ప జాతీయకార్యముల నాయన చందాసొమ్ములద్వారా జరిపియున్నారు.

కాంగ్రెసుకప్పటివున్న రాజ్యాంగము పురాతనపద్ధతిది. సరిగా కార్యక్రమము నడుపుటకు క్రొత్తరాజ్యాంగము కావలె. గాంధిగారు సర్వసమ్మతితో నూతనకాంగ్రెసు నిర్మాణమునకు నియమావళిని తయారుచేసిరి. అది కాంగ్రెసువారి ఆమోదమును పొందెను. ఆ ప్రకారము ప్రతినిధుల సంఖ్యకు తగు మితియేర్పడెను. కార్యదర్శులు, కార్యసంఘసమితి, రాష్ట్రీయ సమితులు, క్రొత్తకట్టుదిట్టములక్రింద బాగుగ పనిచేయదొడగెను. కాంగ్రెసును దాని 'కమిటీలు'ను మూడునాళ్ళముచ్చటకాకుండ సంవత్సరముపొడుగున శ్రద్ధతో పనిచేయుట, కాంగ్రెసు చేయు తీర్మానములను సాలుపొడుగునను దేశమంతటను ఆయాప్రాంతములలో అమలుజరుపుట, మధ్య మధ్య కార్యవర్గమువారు ఆయాపనులను బాధ్యతతో పరిశీలనచేయుటయు ప్రారంభమాయెను.

# 22. అసహాయోగము

ప్రభుత్వపు అక్రమచర్యలవిజృంభణకు ప్రతిక్రియగ, అపుడు గాంధిగారు నాన్- కో-ఆపరేషను (=అసహాయోగ) ఉద్యమ మారంభించిరి బ్రిటిషు పాలనకు బలమిచ్చు కొన్ని ప్రభుత్వసంస్థలలో ప్రజలు పాల్గొనకుండుట దాని ముఖ్యసూత్రము. 1920 లో ముందు ముస్లిముల ఖిలాఫతు సభలోను, గుజరాతురాష్ట్రీయ సభలోను, గాంధీగారి సిద్ధాంత మొప్పించిరి. ఇంతలో ఆ సాలు సెప్టెంబరులో కాంగ్రెసు ప్రత్యేక మహాసభ కలకత్తాలో జరిగినది. అందులో గాంధిగారి తీర్మానంపైన తీవ్రచర్చ జరిగినది. కొందరు నాయకులు వ్యతిరేకించిరి, గాని తీర్మానము నెగ్గినది. తరువాత ఆ సాలు డిశంబరులో నాగపురంలో కాంగ్రెసువార్షికసభ జరిగినది. అందులో దాసు, నెహూౄ, లజపతిరాయి మున్నగునాయకు లందరును మనస్ఫూర్తిగ గాంధికి తోడ్పడిరి; 'అసహాయోగ'పు తీర్మానము కాంగ్రెసువారి పూర్ణాంగీకారము పొందినది. అప్పటినుండి గాంధీగారే ముఖ్య జాతీయనాయకులైరి.

ఈ అసహాయోగపు తీర్మానం ప్రకారం ప్రభుత్వవిధానంక్రింద జరుగు పాఠశాలలను, కళాశాలలను, కోర్టులను, శాసనసభలను, కల్లు ఇజారా పాటలను, విదేశవస్త్రములను, దేశీయులందరు బహిష్కరించవలెనని నిశ్చయ మయినది.

న్యాయమైన శాంతిపద్ధతులద్వారానే పోరి కాంగ్రెసువారు స్వరాజ్యమును సాధింపవలెను.

'స్వరాజ్య' మనగా వీలైతే బ్రిటిషు సామ్రాజ్యములోపలను, వీలు గాని యెడల సామ్రాజ్యముతో సంబంధములేకుండను స్వపరిపాలనము జరుపుట అని గాంధి నిర్వచించెను. ఆ నిర్వచనను కాంగ్రెసుసభ అంగీకరించెను. హిందూముస్లిముమైత్రి, మద్యనిషేధము, ఖద్దరు, అస్పృశ్యతా నివారణ వగైరా తీర్మానములుగూడ కాంగ్రెసులో నెగ్గినవి. అప్పటినుండి, యీనిర్మాణకార్యక్రమము కాంగ్రెసు ప్రణాళికలో ముఖ్యభాగమైనది. అంతట బజాజు, టాగూరు మున్నగు కొందరు మహనీయులు సర్కారు బిరుదులను, కొందరుద్యోగములను వదలిరి. దాసు, నెహ్రూ, రాజేంద ప్రసాదు, శ్రీనివాసఅయ్యంగారు, ప్రకాశం మున్నగుగొప్ప న్యాయవాదు

లనేకులు, కొలది వేలకొలది రూపాయల రాబడినిచ్చు తమ వృత్తులను వదలిరి. వారందరును గాంధిగారికి ముఖ్యసహాయకులైరి గాంధిగారంతట దేశమంతట తిరిగి తమ కార్యక్రమమును ప్రచారము చేసినారు.

1921 సాలంతయు ఆప్రణాళిక దేశమంతటను అమలుజరిగెను. కల్లుపాకలను, విదేశపుబట్టల దుకాణములను, కాంగ్రెస్‌తరఫున వాలంటీర్లు (ఇచ్ఛికసేవకులు) నిరోధించిరి. ఇదే 'పికెటింగు'. యువకులను వాలంటీర్లుగ జేర్చి, వారిద్వారా కార్యక్రమము నడిపించుపద్ధతి, గాంధిగారికి దక్షిణాఫ్రికాలో అలవడెను. ఆయనసూచనపైన జవాహర్లాలు, బులుసు సాంబమూర్తి మున్నగు యువకనాయకు లాయుద్యమమును సాగించి సీమబట్టలను, కల్లంగడులను 'పికెటు' చేయించిరి. అది ప్రజలకు క్షేమకరమయినది. కాని, వాటి వ్యాపారములు తగ్గగనే సర్కారు రాబడి, సీమవ్యాపారుల లాభము తగ్గినవి. అందుకు ప్రభుత్వమువా రాగ్రహించి శాంతిస్థాపనకని, జాతీయనాయకులను 'పికెటు' చేయు యువకులను అరెస్టుచేయించి జైలులో నుంచిరి. ఇక పైమెట్టు 'శాసనధిక్కారము' అనగా చెడుచట్టముల నుల్లంఘించుట. అన్యాయము సాగించు ప్రభుత్వమునకు పన్నులీయకుండుట. అందుకు ముందు జనులలో ఐక్యము పూర్ణత్యాగముతోబాటు, అందరిలో ఏకీభావమును గావలె. హిందువులతోబాటు ముస్లిములు కలసిరావలెను. ఆరోజులలో ముస్లిములు * 'ఖిలాఫతు'ను గూర్చి ఆందోళనచేయుచుండిరి.

అందుకు గాంధిగారు తోడ్పడిరి. ముస్లింనాయకులు స్వరాజ్యాందోళనకు అసహాయోగపద్ధతికి సాయపడునట్లు చేసిరి.

ఇట్లు ఆ ఉద్యమము బలపడి, ప్రభుత్వముపైన ఏవగింపు ప్రబలెను. దాని నరికట్టి జనులలో రాజభక్తిని పురికొల్పుటకై, ప్రభుత్వమువా రప్పుడింగ్లండునుండి బ్రిటిషుయువరాజునురప్పించి, నీదేశమందు సంచారము చేయించి; జనులందరా యుత్సవములలో పాల్గొనవలెనని బోధించి తొందర చేసిరి. యువరాజుపైన వ్యక్తిగతంగా మనకెట్టికోపమునులేదు, కాని ప్రభుత్వపు

---

* అన్ని దేశముల ముస్లిములపైన ఒక ముస్లిమురాజు 'ఖలీఫా' మతాధికారియగు పద్ధతినే 'ఖిలాఫత్' అందురు. అంతవరకాహక్కు తుర్కిసుల్తానుది. దానిని బ్రిటిషుప్రభుత్వము 1919 లో తొలగించెను.

పలుకుబడిని హెచ్చించుటకే సర్కారువారా సంచారము పెట్టినందున, దీనిని బహిష్కరింపవలెనని గాంధివగైరానాయకులు ప్రచారముచేసి, అందుకు వాలంటీరుదళముల నేర్పర్చిరి. యువరాజురాక సందర్భమున వైస్రాయి (రీడింగు ప్రభువు) గాంధిగారితో రాయబారము చేసెను, కాని 'ప్రజల హక్కుల మన్నించవలె. ముస్లింనాయకులైన 'అలీ' సోదరులను జైలునుండి విడువవలె'నని గాంధిగారు షరతుపెట్టిరి. అందుకు వైస్రాయి సమ్మతించనందున రాజీజరుగలేదు. గాంధిగారి ప్రబోధమున దేశమంతట గొప్పహర్తాళము జరిగెను. జనులారోజున వ్యాపారముల మాని విచారము సూచించిరి. బొంబాయివంటి కొన్నిపురములందు పోలీసుఉద్యోగుల జబర్దస్తీవలన జనులలో ఉద్రేకము కలిగినది, కొందరు పోలీసువారిపై తిరుగబడి కొట్టిరి. వెంటనే పోలీసువారు జనులను లాఠీలతోకొట్టి, తుపాకులతో కాల్చిరి. హర్తాళము బాగాజరిగినను దౌర్జన్యము జరిగినదని గాంధిగారు విచారించిరి. అప్పుడాయన బొంబాయిలోనే యుండి, ఎట్లో శాంతిని నెలకొల్పిరి. జనులకు అహింసాతత్వము పూర్తిగ అలవడనందున; గాంధిగారు సత్యాగ్రహ మాపివేసిరి.

ఖద్దరువ్యాప్తి, అహింస; అస్పృశ్యతానివారణ మున్నగు నిర్మాణ కార్యక్రమమును దేశమంతట ప్రజలు పూర్తిచేసినయెడల ఒక యేడాదిలోనే స్వరాజ్యమువచ్చునని గాంధిగారు 1921 లో చెప్పి. దేశమంతటను తిరిగి, తీవ్రప్రచారమునుజేసిరి. కాంగ్రెసుకార్యమునకై కోటిరూపాయలు వసూలై, దేశమున రాట్నములు వ్యాపించెను. కాని, ఆకార్యక్రమము ఇంకను పూర్తిగ ప్రజలలో నాటుకొనలేదు.

1921 సాలాఖరున అహమ్మదాబాదులో కాంగ్రెసు మహాసభ జరిగెను. ఇదివరలోవలె మహాసభకు పెద్దబంగళా యిల్లు కట్టుటకుబదులు శుద్ధఖద్దరుతో విశాలమైన డేరాలను నిర్మించిరి, నీటివసతి, ఆహారము చక్కని ఆరోగ్యపద్ధతులతో నమర్చిరి. వాలంటీర్లశిక్షణకూడ చాలబాగుగ జరిగెను. అక్కడి ఏర్పాటులను గాంధిగారు స్వయముగ జేయించిరి.

ఆ సభవారు 'అసహాయోగ' మును ఖాయపర్చి ప్రభుత్వసంస్థల బహిష్కారమును బలపర్చిరి. జాతీయవిద్యాలయములను పంచాయితీ కోర్టులను స్థాపింప నిర్ణయమాయెను. ప్రభుత్వపు చెడుశాసనములను శాంతముగ

సమిష్టిగ ఉల్లంఘించుటకును, తదంగముగ పన్నుల చెల్లింపును ఆపు
చేయుటకును గాంధిగారు సూచించిరి. అందుకు కాంగ్రెసు అంగీకరిం
చెను. పన్నుల వసూలుకై రయితులఆస్తులను వేలంవేయుదురు; ఉద్యో
గస్థు లెంతైన జబర్దస్తీచేయుదురు. ఐనను, జనులందరును పూర్ణ
శాంతితో నుండవలెను. ఇతరులపైన రయితులు దౌర్జన్యముచేసిన శాస
నోల్లంఘనోద్యమమునకు భంగముకల్గును. సత్యాగ్రహయుద్ధమున కహిం
సయే మూలకందము. అట్టి పరిస్థితు లున్నచోటనే పన్నులచెల్లింపును నిరా
కరింపవచ్చును. ఈ ఉద్యమమునుగూర్చి ఇతరనాయకుల కనుభవములేదు.
కనుక గాంధిగారే డిక్టేటరు (నియంత)గ నుండి వీలైనచోట దానిని నడుపు
టకు తీర్మానమైనది. 1922 ఆరంభమున సర్వపక్షసభ జరిగి, వైస్రాయికి
దేశీయుల ప్రతినిధులు రాజీసందేశ మంపిరి, కాని రీడింగుప్రభువు దానిని
నిరాకరించెను. అంతట కొద్దిరోజులలో గుజరాతులోని సూరతుజిల్లా బర్డోలీ
తాలూకాలో పన్నులనిరాకరణ మారంభింతుమని గాంధిమహాత్ముడు
1–2–1922 తేదీన వైస్రాయి కంత్యసందేశమంపెను. ఆయన ఆప్రాంతీయు
లందరిని సత్యాగ్రహయోధులుగ తరిఫీదుచేసెను. ఆ తాలూకాలో కొంద
రిదివరలో దక్షిణాఫ్రికాకువెళ్ళి గాంధిగారి నాయకత్వముక్రింద, అక్కడి
ప్రభుత్వమునకు పన్నులనీయ నిరాకరించినవారే. ఆ ధీరు లెన్నికష్టములైన
సహించి, శాంతముగ పోరుటకు సిద్ధమైరి.

# 23. యరవాడ జైలు

ఇట్లు రంగము సిద్ధమైనది. ఈ స్థితిలో 5–2–1922 తేదీన సంయుక్త
రాష్ట్రమం దొకమూల (చౌరి చౌరాలో) జనులు పోలీసులపై కోపించి,
వారున్నగృహమును తగులబెట్టిరి కొందరుపోలీసు లందులోచచ్చిరి. మద్రాసు
లోను కొంచెమల్లరి జరిగినదికనుక, దేశమం దహింస యింకను సరిగా యేర్పడ
లేదని తోచి, గాంధిగారా సత్యాగ్రహయుద్ధమును వెంటనే ఆపుదలచేసి
ప్రస్తుతమింకను నిర్మాణకార్యక్రమమునే జరుపగోరిరి ఇట్లు ఆయన చక్ర
మును వెనుకకుత్రిప్పగా, బర్డోలీవంటి చాలచోట్ల అసంతృప్తికల్గెను. గాంధి
గారి ఖ్యాతి కొంచెముతగ్గెను. అంతట 13–3–22 తేదీని ప్రభుత్వము

సబర్మతీఆశ్రమమందు గాంధిగారి నరెస్టుచేసి, ఆయనపై రాజద్రోహపుకేసును బెట్టిరి. సెషన్సుజడ్జియగు బ్లూమ్‌ఫీల్డు దొరయెదుట యంగుయిండియాలో గాంధిగారు లోగడవ్రాసిన మూడువ్యాసములు రాజద్రోహమును ప్రేరే పించునవని సర్కారువారు ఆరోపించిరి.

గాంధిగారా నేరమునంగీకరించిరి; "నే నిదివరలో బోయరు, జూలు, యూరపు యుద్ధములందు ఈ సామ్రాజ్యమునకు సహాయముచేసినాను; కాని, వారు స్వరాజ్యమిచ్చుటకు బదులు పంజాబు, ఖిలాఫతుసంఘటనల కలిగించుటవల్లను, ప్రభుత్వోద్యోగు లన్యాయచర్యల జరిగించుటవలనను, బ్రిటిషువిధానమందు నాకు నమ్మకము నశించినది. ఇక రాజభక్తి కవకాశము లేదు. నేజేసినది 'లా' ప్రకారము గొప్పనేరమే, కాని అది నైతికముగ ఉత్తమ ధర్మము. కనుక నాకు పూర్తిగ శిక్షవేయవచ్చు"నని తెలుపుచు గాంధిగారు గొప్పస్టేటుమెంటు నిచ్చిరి. మహాత్ముడు కోట్లకొలది జనులకు పూజ్యుడని జడ్జియు గుర్తించెను. కాని చట్టంప్రకారం దోషి, కనుక [18—3—22 తేదీని) గాంధిగారికి కారేండ్ల శిక్షవిధించెను. ఆయన యరవాడజైలులోనుండి తపస్వియై నూలువడుకుచు గ్రంథముల జదువుచు నుండెను.

ఈలోగా పరిస్థితులు మారెను. సత్యాగ్రహపుపట్టును, త్రివిధ బహి ష్కారతీవ్రతయు తగ్గెను. దాసు, మోతీలాలు మున్నగు కొందరు నాయకులు శాసనసభలలో నుండియే ప్రభుత్వమును ప్రతిఘటింప దలచిరి. కాంగ్రె సులో చీలికలు హెచ్చెను. మద్రాసుప్రాంతమున బ్రాహ్మణాబ్రాహ్మణుల మధ్యను, ఉత్తరదేశమున హిందూముస్లిముల మధ్యను, కలహములు పెరిగెను. అప్పుడు 1924 జనవరి నెలలో గాంధిగారికి హఠాత్తుగ చాల జబ్బుచేసెను. వెంటనే పొత్తికడుపులో శస్త్రచికిత్స చేయవలసివచ్చెను. యరవాడ జైలు నుండి ఆప్రక్కనున్న ఆసుపత్రి కాయనను తెచ్చిరి. 'మేడక్' అను సర్జను ఆపరేషను చేసెను. గాంధిగారి నిగ్రహశక్తివల్ల, ఆగండముగడచి ఆయన మరల క్రమముగ ఆరోగ్యమొందెను. జైలులో చాల నీరసించినందున 1924 సం॥ ఫిబ్రవరి 5వ తేదీని ప్రభుత్వమువారు ఎట్టిషరతులు లేకుండ గాంధిగారిని విడచిరి.

ఆతరుణమందు హిందూముస్లిముల మధ్య కలహము చాలచోట్ల తల యెత్తి రక్తపాతమాయెను వారి మధ్యను ఐకమత్యము గలిగించుట కష్టాడు

గాంధిగారు చాల కృషి చేసిరి. కోహాటు మున్నగుచోట్ల మతకలహములలో చాలమంది హతులైరని తెలిసి, గాంధిగారు ఢిల్లీలో డా॥ అన్సారిగారి గృహమున 21 రోజులు దీర్ఘోపవాసము చేసిరి. అంతట అన్ని మతముల నాయకుల పంచాయతియేర్పడి, దానికి గాంధిగా రధ్యక్షులయిరి. మతకలహ సమస్య వచ్చినప్పుడు దాని నా పంచాయతివారు తీర్మానించుటకు అన్ని పక్షములవారు అంగీకరించిరి.

# 24. బెల్గాం కాంగ్రెస్ అధ్యక్షత

ఈ లోగా 1923 సం॥లో శాసనసభ యెన్నికలు జరిగెను సభా ప్రవేశవాదులు 'స్వరాజ్యపార్టీ' అను పేర మోతీలాలు నెహ్రూగారి నాయకత్వమున కేంద్రశాసనసభలో సభ్యులై, అందు ప్రబలులయిరి. కాంగ్రెసులో ఈ సభాప్రవేశ మొనర్చువారికిని, తద్వ్యతిరేకులకును తీవ్రవాదము, సంఘర్షణ చెలరేగెను. గాంధిగారప్పుడు బొంబాయిదగ్గర సముద్రతీరమున 'జుహు' అనుచోట విశ్రాంతి తీసుకొనుచుండిరి. సభాప్రవేశ వ్యతిరేకులు సభాప్రవేశవాదులకు వ్యతిరేకముగా ప్రచారమును ఆటంకము కలుగజేయగూడదని నిర్ణయించి, ఆయన ఉభయకక్షులమధ్యను సామరస్యమును కలుగచేసెను. అప్పుడు వల్లభభాయి, జవాహర్లాలు, రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్, ఆంధ్రనాయకులు మొదలగువారు శాసనసభలకు పోకమానిరి. వారిసాయముతో గాంధిగారు ప్రజలలో నిర్మాణ కార్యక్రమమును సాగించిరి

1924 సాలాఖరున (కాకినాడ కాంగ్రెసుకు మరుసాలున) బెల్గాం పురమున జరిగిన కాంగ్రెసుమహాసభకు గాంధిగా రధ్యక్షులైరి. అప్పుడాయన ప్రవేశవాదులకు శాసనసభలలో ప్రవేశించుటకు పూర్తిఅధికారము నిప్పించిరి. కాంగ్రెసు రాజకీయకార్యములను వారికి వదలిరి, నిర్మాణ కార్యమునకే ఆయన తన అధ్యక్షోపన్యాసమునందును ప్రాముఖ్యమిచ్చెను. స్వరాజ్య పార్టీవారును అందుకు పూర్ణసహాయ మిత్తుమనిరి.

నిర్మాణకార్యము బాగుగ వ్యాపించినప్పుడే సత్యాగ్రహము జరుప వీలగును. కనుక ఖద్దరు హిందీవగైరాలు వెంటనే వ్యాపింపజేయవలెనని గాంధిగారు మరల నిరూపించిరి.

బెంగాలులో శాసనసభలోను, కలకత్తా కార్పొరేషనులోను 'స్వరాజ్య' పక్షమువారు ప్రబలులై, ప్రభుత్వపు నిరంకుశచర్యల కడ్డునిలిరి. 1924 లో ఆపార్టీప్రముఖులను సర్కారువా రరెస్టుచేసి, విచారణలేకుండ ఖైదులోనుంచిరి. (చిత్తరంజన దాసుగారు 1925 లో జబ్బుచే మరణించిరి.) ఆ పక్షమును బలపర్చుటకై అక్కడి రాజకీయకార్యక్రమమంతను గాంధిగారు 'స్వరాజ్యిస్టు'లకే ఒప్పగింపజేసిరి. తాము దేశమంతటను నిర్మాణ కార్యమునే సాగించిరి.

# 25. గాంధిసందేశం

అంతట జవాహర్లాలు వగైరాలు యువకపక్షనాయకులై, అన్ని ప్రాంతములలోను దేశమును తీవ్రకార్యక్రమమునకు తయారుచేసిరి. 'స్వరాజ్య' నిర్వచనమందును, కార్యక్రమమందును, పెద్దలతో విభేదములు హెచ్చెను. 1928 లో అన్నిపక్షాలవా రిష్టపడు రాజకీయప్రణాళికను మోతీలాలుగారి అధ్యక్షత నొక కమిటీవారు తయారుచేసిరి. అదియే 'నెహ్రూకమిటీ రిపోర్టు' వారు "భారతీయులగమ్యము బ్రిటిషుసామ్రాజ్యములోనుండు బాధ్యతాయుత ప్రభుత్వము" అని నిర్వచించిరి. సామ్రాజ్యమునకు లోబడని పూర్ణస్వాతంత్ర్యమే మన గమ్యమని, యువకుల వాదము. 1928 ఆఖరున కలకత్తా కాంగ్రెసులో ఈ భిన్నపక్షాల నాయకులగు నెహ్రూ (తండ్రికొడుకు) లిద్దరిమధ్య సంఘర్షణవచ్చెను. 'ఒక యేడాదిలో నెహ్రూరిపోర్టులో చెప్పిన రాజ్యాంగము బ్రిటిషువా రిత్తురా, సరే, లేకుంటె ఇక పూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్య'మని గాంధిగారు రాజీచేసి, అట్టి తీర్మానమా సభలో మంజూరుచేయించిరి. ఏడాదిలో ప్రభుత్వమువారు 'నెహ్రూరాజ్యాంగ'ము నమలుపరచలేదు. 1929 సా లాఖరున కాంగ్రెసు సభ లాహోరులో జరిగెను. దానికి గాంధిగారే అధ్యక్షులు కావలెనని, హెచ్చురాష్ట్రముల ప్రతినిధులు సూచించిరి; కాని ఉదారుడగు గాంధిగా

రందుకు నిరాకరించి, ఈసారి యుపకనాయకు లధ్యక్షులగుట న్యాయమని చెప్పి, జవాహర్లాలు పేరు నందుకు సూచించెను. అట్లే కాంగ్రెసుకమిటీవారు ఖాయపర్చిరి. వైస్రాయి ఇర్విను ఇప్పటి హాలిఫాక్సు ప్రభువా డిసెంబరులో కొంత రాజీమాటలు జరిపెను. గాంధిగా రాయనతో చర్చించిరి. ఇర్వినుగారి మాటలు తీయగనున్నను, క్రియశూన్యమైనది. అంతట 'పూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్య'మని తీర్మానము నా మహాసభలో గాంధిగారే ఉపపాదించిరి. ఆ తీర్మానమును, స్వరాజ్యసాధనకై వెంటనే సమిష్టి శాసనోల్లంఘనము జరిగించవలెనను తీర్మానమును, మహాసభవా రుత్సాహముతో నామోదించిరి. 1930 జనవరిలో కార్యసంఘమువారు గాంధిగారినే అందుకు 'నియంత'గ నేర్పర్చిరి. ప్రజాక్షేమమునకై ఈ క్రిందిపనుల త్వరలో చేయుదుమని ప్రభుత్వమువారు వెంటనే వాగ్దానముచేయవలె, లేకున్న శాసనోల్లంఘనము నారంభింతుమని కాంగ్రెసుతరఫున గాంధిగారు వైస్రాయికి తెల్పిరి.

1. దేశమంతట త్రాగుడును మాన్పించుట.

2. కాసు (పౌను) కు 15 రూపాయలచొప్పుననే మారకము నిర్ణయించుట.

3. భూమిపన్నును సగమునకైనను తగ్గించుట. దాని విధానముపైన శాసనసభ కధికార మిచ్చుట.

4 ఉప్పుపైన సర్కారుపన్నును రద్దుచేయుట,

5. సేనసిబ్బందికి ప్రభుత్వముపెట్టు ఖర్చును చెరిసగముకైనను తగ్గించుట.

6. సర్కారు పెద్దఉద్యోగులకిచ్చు జీతమును సగమునకో ఇంకా క్రిందికో తగ్గించుట.

7. స్వదేశీసరుకుల రక్షణకై విదేశపుబట్టలపైన తగు సుంకాలను విధించుట.

8. ఈ దేశపు రేవులమధ్య భారతీయుల స్టీమర్లే తిరుగునట్లు తీరనౌకలరక్షణకు చట్టముచేయుట.

9. ఖూనీ, దాని ప్రయత్నమునకుతప్ప, తక్కిన నేరములకు జైలులోనున్న ఖైదీలనందరిని వదలిపెట్టుట; లేదా వారిని మామూలుకోర్టులలో

విచారించుట, అప్పుడున్న రాజకీయపు కేసులను పీనలుకోడ్డు 124 ఏ. సెక్షను, 1818 సం॥ 3వ రిగ్యులేషను వగైరాలను రద్దుచేయుట.

10. సి. ఐ. డి. శాఖను ఎత్తివేయుట, లేదా అందుపైన ప్రజాప్రతినిధుల కధికార మిచ్చుట.

11. న్యాయనిబంధనకు లోబడి, ఆత్మరక్షణకై ఆయుధముల వాడుటకు జనుల కనుమతి నిచ్చుట.

ఇట్టిషరతులతో సందేశమును గాంధిగారు రెజినాల్డు రెయినాల్డ్సు అను భారతహితైషియగు ఆంగ్లమిత్రునిద్వారా 1930 ఫిబ్రవరిలో పంపెను. అయితే మరల వైస్రాయి కీ సందేశ మెందుకు? అందును స్వరాజ్యమే కోరక, ఈకొద్దిసంస్కరణల మాత్రము కోరుటలో మహాత్ముని భావమేమి ? గొప్ప యుద్యమముల నారంభించునప్పుడు (ఇప్పటి 'నవనాగరిక' యుద్ధములందువలె దొంగపాటునకాక) ప్రతికక్షికి ముందుగా తెలిపె న్యాయముచేయుటకు అవకాశమిచ్చుటయు, లోపమంతయు ప్రతికక్షిదే అని లోకమంతటికి స్పష్టపర్చుటయు, సత్యాగ్రహుల సంప్రదాయము. మరియు వెంటనే పూర్ణ స్వరాజ్యమీయక పోయినను, భారతక్షేమమున కవసరమగుకొన్ని ముఖ్య సంస్కరణలపైన బ్రిటిషువా రీయనియెడల వారిధోరణి యేమిమారలేదని వారిమాట నీటిమూటయని లోకులందరికిని స్పష్టమగును.

ఈ 11 సంస్కరణలు జాతీయత కావశ్యకములని, బ్రిటిషువారు సులభముగ మనకీయదగినవని, మితవాదులుగూడ నంగీకరించిరి. వాటినిగూడ ప్రభుత్వము నిరాకరించినప్పుడు, జనసమ్మతమగు ముఖ్యసంస్కరణములను తప్పక చేసెదమని 1929 సెప్టెంబరులోను, డిసెంబరులోను వైస్రాయి తెల్పినమాట సదుద్దేశపూరితంకాదని మితవాదులకును స్పష్టమగును. అట్టి స్థితిలో వర్తకులు మితవాదులుగూడ రాబోవు సత్యాగ్రహములో చేరి తోడ్పడవలె, అట్లు చేరనివారు నిజముగ ధీరులు దేశభక్తులును కారని విశదమగును.

గాంధిగారు కోరిన ఈ 11 విషయాలు చాల సబబైనవి. వీటిని పేర్కొనుట గాంధిగారిదూరదృష్టికి రాజనీతిచాతుర్యమునకును నిదర్శనము. ఇందు దేశసౌభాగ్య మెట్లిమిడియున్నదో చూడుడు.

1. త్రాగుడు:—మద్యపానము మన యుష్టదేశీయుల కెంతో హాని కల్గించి సంఘమును పాడుచేయుచున్నది. కల్లుపాకల వేలంవల్ల సర్కారుకు సాలీనా చాలా లాభమువచ్చు చుండెను. కాని, అందుకుపదిరెట్లు ప్రజల సొమ్ము నష్టమై, వారి దేహములును చెడిపోవును.

2. కాసు రూపాయల మారకము - పూర్వపుమారకపు రేటుకాసుకు రు 15 లు, తరువాత కాసురేటును రు 13-8-0 గ సర్కారువారు 192౯ లో మార్చిరి. సాలీనా మన ప్రభుత్వము బ్రిటిషు ఉద్యోగుల జీతములు పింఛను వగైరాలు పౌనులుగ నీయవలె. కనుక వారికెక్కువ కాసు లీయవలసివచ్చి, సర్కారుఋణభారము హెచ్చి, కోట్లకొలది రూపాయల నష్టమేర్పడినది. ఆస్థితిలో మన వ్యాపారస్థులకును ఇది చాలనష్టకరము. మనదేశపు సరుకులను విదేశములందు 1 కాసునకమ్మిన, రు 15 లకు బదులు రు 13-8-0 మాత్రం వచ్చును. విదేశపువర్తకులు వెనుక రు 15-0-0 కిమ్మి, కాసు గ్రహించు వారు, ఇప్పుడు రు 13-8-0 లకే ఆసరుకు నమ్మియు వెనుకటివలె కాసును పొందుదురు. కనుక సీమసరుకులను మన దేశపు సరుకులకన్న తక్కువధర కమ్మగలరు; ఈమారకము మనపరిశ్రమలకును సరుకులయొగుమతికిని నష్టకరము. బ్రిటిషు వ్యాపారస్థుల కెంతో లాభకరము. సర్కారువారు విలాయతీ వ్యాపారుల నిమిత్తం కాసుకు రు 15 నుండి 13-8-0 కు మారకపురేటును తగ్గించినను, ఆ రేటున ప్రజలకమ్మటలేదు. బజారురేటు తగ్గుటకుబదులు చాల హెచ్చిపోయినది. పూర్వపు రు 15 రేటైన నిల్వయుంచవలెనని మన ప్రతినిధులు, వర్తకసంఘములు ఎన్నిసారులో అర్జీలిచ్చిరి. ఐనను ప్రభుత్వము వినిపించుకోలేదు. *

(3) భూమిపన్ను:—మన పూర్వపుప్రభువులు పంటలో 1/6 వంతును పన్నుగా తీసుకొనిరి. అప్పుడు తక్కిన పన్నులు నింతగలేవు. భూమి రయితులదే, ప్రభుత్వముదికాదు. ప్రజాసమ్మతిలేకుండ పన్నువిధించుట అన్యాయము.

తరువాత అంతర్జాతీయపు ఆర్థికస్థితి మారినది. మనము ఋణదాతలము బ్రిటిషువారు 'ఋణగ్రస్తులు' అయిరి; కనుక ఈ తరుణంలో మార్చలేదు.

(4) § ఉప్పు పన్ను:— ఉప్పు ప్రకృతిసిద్ధము. నిరుపేదల కత్యవసరము, దాని యుత్పత్తిని సర్కారువారు నిరోధించి, హెచ్చుపన్ను విధించి నందున దానికిమ్మతు హెచ్చినది. సర్కారుకు మన బీదలపైన దయ యుంటే వెంటనే ఆ పన్నును రద్దుచేయక తప్పదు. నాగరిక రాజ్యాలలో ఉప్పుపైన పన్ను వేయు రివాజులేదు.

(5) సేనఖర్చు:— కేంద్రప్రభుత్వపు రాబడిలో రమారమి సగము సేనలకే ఖర్చుపెట్టుచున్నారు. ఇందు చాలభాగ మాంగ్లసైనికులకు, ఇంగ్లండులో వర్తకులు వగైరాలకును ముట్టును. ఇట్టి సేన మనదేశమున కవసరము కాదు. అది మనలను వశమందుంచుకొనుటకు బ్రిటిషువారి సామ్రాజ్య రక్షణకు నుద్దేశింపబడినది. వారు స్వలాభమువదలి మన సేన ఖర్చును సగమునకు తగ్గించవచ్చు. అప్పుడు ప్రజల విద్యారోగ్యాదులకు ఖర్చుపెట్టుటకు తగినంతసొమ్ము మిగులును.

* (6) ఉద్యోగులజీతము,— మన వైస్రాయి, గవర్నర్లు, కలెక్టర్లు వగైరాలకిచ్చు జీతములు 'అలవెన్సులు' ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీవగైరా విదేశాలలోకన్న చాలహెచ్చు. ఈ పెద్ద ఉద్యోగులలో హెచ్చుమంది బ్రిటిషువారు. ఈ సొమ్ము చాలవరకు విదేశమునకు చేరును. మరియు ఆయా శాఖలలో (వారికన్నను చాలహెచ్చుగ కష్టపడు) చిన్న ఉద్యోగుల కుటుంబపోషణకును చాలనంత తక్కువగ జీతమిత్తురు. ఇట్లు ఉద్యోగుల జీతములలో నింత భేదముండుట చాలతప్పు. ఈ పెద్దఉద్యోగుల కిచ్చు జీతమును సగము చేసినను అన్యాయ ముండదు.

---

§ ఇటీవల మన స్వతంత్ర ప్రభుత్వంవారు ఉప్పుపన్నును సీదాగా రద్దుచేయ నిర్ణయించి, అందుచే సర్కారు రాబడిలోగల్గు లోటును భర్తీ చేయుటకు గొప్ప వ్యాపారస్తులపైనమాత్రం కొత్తపన్ను విధించినారు.

* చిన్న ఉద్యోగుల జీతము కొంచెం హెచ్చించుటకు ఇటీవల మన స్వతంత్ర ప్రభుత్వంవారు నిర్ణయించినారు. కాని రాజ్యాంగసూత్రంప్రకారం వారికి పెద్దఉద్యోగులపైన పూర్ణాధికారము వచ్చినది. కనుక, ఆ పెద్దల జీతాలు తగ్గించవలసియున్నది.

(7) వస్త్రరక్షణ:—ప్రతిదేశపు ప్రభుత్వము ను అక్కడి పరిశ్రమ లను రక్షించవలెను, అందుకు విలాయతీ సరకులపైన దిగుమతిపన్ను విధిం తురు. బ్రిటిషువారును అమెరికనులును మొదట మనదేశపు బట్టలు వగైరాల పైన హెచ్చు పన్నులు విధించి, నిరోధించి, తమపరిశ్రమలను బాగుగవృద్ధి జేసికొన్నారు. తమ పరిశ్రమలిప్పుడు బలీయమై, ప్రపంచమంతటను వ్యాపిం చినను, వారు తమదేశపు పరిశ్రమల రక్షణకై దిగుమతిసరుకులపైన రక్షణ పన్నుల విధించుచున్నారు, ఇక్కడనో! మన దేశీయులు పోరగా పోరగా, కొన్నిటికిమాత్రం కొద్దిరక్షణ పన్నులను వేసినారు. అదిచాలదు. ముఖ్యంగా ఆంగ్ల అమెరికనుల సరుకులు, వారిడొమినియను సరుకులును మన పరిశ్రమలను పడగొట్టకుండ, రక్షణకై హెచ్చుపన్ను వేయవలెను. బ్రిటిషు వ్యాపారస్థులట్లు జరుగనీయరు. వారు స్వలాభమును సాధింతురు.

8. తీరనౌకలు:—ప్రతిదేశపు తీరమువెంట జరుగు సముద్రవ్యాపా రము నాదేశపు నౌకలకే ఇచ్చుట, వాటికి విదేశ నౌకలపోటీలేకుండ తగు నిబంధన లేర్పరుచుటయు ధర్మము. ఈవ్యాపారమునకు విదేశనౌకలపై నాధార పడిన, చాలసొమ్ము కేవునిమిత్తము విదేశీయులకు పోవును. మన నిర్మాణము అడుగంటుకు పూర్వం మనదేశములో గొప్ప ఓడలెన్నియో నిర్మితములై విదేశాలతో గొప్పవ్యాపారము సాగినది. బ్రిటిషుపాలన వచ్చినతరువాత, వారి పోటీవల్లను, వారి అన్యాయపు ఆర్థికనీతివల్లను, మన నౌకాపరిశ్రమ అడుగంటినది. ఇటీవల భారతీయవర్తకులు నౌకావ్యాపార మారంభించి, సమర్థతతోనే 'స్టీమరు'ల నడుపుచున్నారు కాని, చాలకాలం ప్రభుత్వపు అండతో పాదుకొనియున్న బ్రిటిషువగైరా విదేశనౌకల అన్యాయపు పోటీ వల్ల, మన నౌకావ్యాపారము బాధనొందుచున్నది. దీనిని రక్షించుటకు శాసనసభలో దేశీయులు బిల్లు పెట్టినను, అప్పటి ప్రభుత్వమువా రందుకు వ్యతిరేకులై, అందరికీ సమముగ నుందుమనిరి. కాని గాంధిగారన్నట్లు 'మరి గుజ్జుకు రాక్షసునికి' మధ్య పోటీలో సమత్వ మెట్లుండును? మన నౌకలు వృద్ధికానందున మనము నిస్సహాయులమయినాము. తీరనౌకాదళము ఉంటే ఈ యుద్ధకాలమందెంతో యుపయోగించియుండును, నౌకలేవృద్ధికానప్పుడు, దేశాంతర వ్యాపారము మనకు స్వతంత్రమై వృద్ధియగుట అసంభవము. ఆత్మ రక్షణయు అతికష్టము.

9. ఖైదీలు:— కొన్ని నిర్బంధశాసనముల క్రింద స్వాతంత్ర్య యోధులను లోగడ ప్రభుత్వమువారు ఖైదులోనుంచిరి. అందుకు కొంత మందిపైన విచారణజరుపుటయు, నేరమును రుజువు పరచుటయును జరుగ లేదు. అనుమానము పైననే అరెస్టుచేయుటచే, కొందరు నిర్దోషులును ఖైదులోబడిరి. కనుక గాంధిగారీపరతును కోరిరి. మరియు పరాధీనులమైన మనము స్వాతంత్ర్యప్రచారమునకై చేయు కొన్ని వాదనలు రాజద్రోహకర ములని, సర్కారువారు ఇ. పీ. కోడ్డు 124 ఏ. సెక్షనుక్రింద భావించి దండిం చుట మామూలైనది. ఆసెక్షను జాతీయప్రచారమున కడ్డమువచ్చును. 1818 వ సం॥ 3 రిగ్యులేషనుక్రింద దోషారోపణ, విచారణయులేకుండనే ఎంతకాలమైనను జైలులో నుండవచ్చును. లజపతిరాయి, తిలకు, సుభాసు మొదలైన దేశభక్తు లెందరో దీనిక్రింద విచారణలేకుండ జైలులో నుంచబడిరి.

10. సి. ఐ. డి:-సి. ఐ. డి. పోలీసువారు రహస్యవిచారణ చేయుదురు. వారనుమానముపైననే ముఖ్యముగ రాజకీయవిషయములందు నిందలుమోపుట, వాటినినమ్మి ప్రభుత్వమువారు శిక్షకు చర్యలు దీసుకొనుటయు జరిగినది. మరియు, ఈ సి. ఐ. డి. లు జాతీయవాదుల ననేకవిధముల చిక్కులు బెట్టుచు, ఒక్కొక్కప్పుడు వారిని 'నేరములకు ప్రేరేపించి' అంతట దోష మారోపించుటయుకలదు. వారిపైన ప్రజాప్రతినిధుల కధికారములేదు. కనుక ప్రజారక్షణ కట్టి పరతు అవసరము.

11. ఆయుధధారణకు ప్రజల కధికారము:— స్వతంత్రదేశాలలో ప్రతిదేశపు పౌరునకును ఆయుధములను ధరించుటకును, వానిని అవసర మైనప్పుడు న్యాయముగ వాడుటకును అధికారముండును. బ్రిటిషు పాలకులు మనదేశంలో 'ఆర్మ్సుఆక్టు' పెట్టి, మనల నిరాయుధులుగ జేసిరి. సర్కారువారినుండి సిసలైన 'లైసెన్సు' లేకుండ భారతీయు లెవరైన తుపాకీ, బాకు, పిస్తోలు వగైరాలను నుంచుకొన్నను, వాడినను, అదినేరమై, వారు జైలునకు పోవలె బ్రిటిషువారిపైన తిరుగబడకుండ ఎప్పటికిని మనలను అసహాయులుగ నుంచుటకే బ్రిటిషువారీ శాసనమును తెచ్చి, కఠినముగ నమలు జరుపుచుండిరి. తరచు సర్కారుభక్తులకే లైసెన్సుల నిచ్చియుండిరి. శత్రువులనుండి, బందిపోట్లనుండి, క్రూర జంతువులనుండియు మనకాత్మరక్షణ కష్టమైనది. అందువలన మనదేశీయులకు

పౌరుషము ఆత్మవిశ్వాసముకూడ క్షీణించినవి. మనల నిరాయుధుల జేసియు, బ్రిటిషువారు మనము పిరికివారము, స్వతంత్రత కనర్హులమని మనపై లోటు పెట్టుచువచ్చిరి.

పైనజెప్పిన ఈ "షరతుల" నిచ్చినయెడల మన సంఘబలమును, వ్యాపారమును కొంత వృద్ధికాగలదు. తరువాత జవహర్లాలును గాంధియు 1931 సం॥ లో కరాచీకాంగ్రెసులో ఆమోదింపజేసిన ప్రాతిపదిక హక్కుల తీర్మానములలోను ఇవి చేరియున్నవి. వారికోరికలు సబబుకావని బ్రిటిషు వారును ఆక్షేపింపలేదు. కాని, వాటిని వైస్రాయిగా రొప్పుకోలేదు; వాటిని చర్చించనుగూడలేదు. చట్టముల్లంఘించితే శిక్షింతుమని మాత్రము జవా బిప్పించిరి. అంతట గాంధిగారు మరల ప్రభుత్వమువారికి తెల్పి, సత్యాగ్రహ మారంభించిరి.

# 26. ఉప్పుసత్యాగ్రహము

సత్యాగ్రహమున ప్రభుత్వపుచట్టము నుల్లంఘించవలె. ఏచట్టమును ? గాంధిగారాలోచించి, 'ఉప్పుచట్టము' నని నిర్ణయించినారు.

నిర్బంధశాసనములు, ఆయుధశాసనము వగైరా లెన్నియో ఉండగా పాతబడిన ఉప్పుచట్టమునే ఎత్తుకొనిరేమి ? సముద్రపునీటిని కాచితే,అర్ధణా ఉప్పు తయారునకు నాల్గణాల పుల్లలుకాల్చవలె, ఇట్లు బజారువెలకన్న చాల పిరియముగ ఉప్పు తయారుచేసిన లాభమేమి ? మరియు, సముద్రపు రేవు, ఉప్పుగనులు నున్న ప్రాంతముతప్ప, తక్కినచోట్ల ఈ సత్యాగ్రహము చేయుటెట్లు ? అని కొందరు సందేహించిరి. కాని, ఉప్పే జనుల కుత్సాహ మిచ్చునది; మహాత్ముని దూరదృష్టి అందులో వ్యక్తమైనది.

ఉప్పు ప్రతివారును వాడునది. గంజికైనను ఉప్పు తప్పదు. శరీర రక్తమం దుప్పు ప్రధానము. అది జీవుల కవసరము. ప్రకృతిలోను, సముద్రపు నీటిలోను, గనులందును సమృద్ధిగనున్నది. ఇంగ్లండుకా పన్నులేదు. మన ప్రభుత్వమువారు మాత్రం దానిపైన హెచ్చుపన్ను వసూలుచేసినారు. ఈ పన్ను పైకి తెలియనిది. ఉప్పు స్వేచ్ఛతో జనులు తయారు చేసుకొను

టకు 'సాల్టు ఆక్టు' అడ్డమువచ్చును. దానిప్రకారం ప్రభుత్వమువా రేర్పర్చు మళ్ళలోనే వారిసమ్మతిపైననే ఉప్పు తయారుచేయుట కధికార ముండును; తప్పితే నేరమగును. మరియు ఉప్పు ఆమళ్ళలో నుండగనే, దానిపైన సర్కారుపన్ను వసూలుచేయబడును.

ఈ పన్ను కొట్టివేయమని; లేదా బాగుగతగ్గింపుమని, భారతశాసన సభవారెన్నిసారులో తీర్మానించిరి కాని ప్రభుత్వమొప్పుకోలేదు. ఇంకొక సంగతి. యూరపున కీదేశముతో సముద్రవ్యాపారము ముఖ్యముగా బ్రిటిషు ఓడలపైన జరుగును. పరాధీనులగు మన మింగ్లండుకేదో పేరునచాల కప్ప మీయవలెను. అందుకు యూరపుకు హెచ్చుసరుకు లందిచ్చి సొమ్ము చేయవలెను. మరియు, దిగుమతి బట్టలు వగైరాతయారు సరుకులకన్న మన మెగుమతిచేయు ప్రత్తివగైరా ముడిసరుకు నెక్కువస్థల మాక్రమించును. కనుక, ఇటునుండి భర్తీగనే పోవు స్టీమర్లలో కొన్ని ఇంగ్లండునుండి ఖాళీగవచ్చును. ఖాళీయోడలు తుపాను వగైరాలచే త్వరలోనే భగ్నమగును. అవి త్రుళ్ళకుండ, లోపలబరువు సరుకుండవలెను. కనుక ఓడక్షేమమునకై అక్కడపన్నులేని కారుచౌకఉప్పును తమ స్టీమర్లలో నింగ్లీషువా రిక్కడకు తెచ్చుచు; ఇక్కడ కొంత పన్నిచ్చి నను దానిని మనకమ్మి కొంతలాభ మొందుదురు. మనదేశపు ఉప్పుకు పన్నులే కున్న నదికారుచౌకయగును. అప్పుడు సీమయుప్పున కిక్కడ ధరరాదు; ఈ పన్నువలనను,ఉత్పత్తి తగ్గింపువలనను మన ఉప్పు ప్రియమైతే,బ్రిటిషు ఉప్పు నిక్కడ మంచిధర కమ్మవచ్చు; సర్కారువారు 'సాల్టుఆక్టు' నేర్పర్చి, ఇక్కడ ఉప్పుతయారును నిరోధించి హెచ్చుపన్ను వసూలుచేయుచు వచ్చినారు.

సత్యాగ్రహ మారంభించుటకు ముందే శాసనసభలను కాంగ్రెసు సభ్యులు వదలిరి. 26-1-30 తేదీని గాంధిగారిసూచనపైన కాంగ్రెసువారు దేశమంతటను 'స్వాతంత్ర్యదీక్షా' దినమును జరిపిరి. హరతాళ్ముజరిగినది,

పూర్ణస్వాతంత్ర్యమునకై నిండుసభలలో జను లుత్సాహముతో ప్రతిజ్ఞజేసిరి * ప్రజలుద్యమమునకు సిద్ధమైనారని తెలిసినది. మరల వైస్రాయికి తెల్పి గాంధిగారు సత్యాగ్రహము నడిపిరి. ముందుగా ఆయన 71 మంది సహచరులతో సబర్మతీ ఆశ్రమమునుండి 12-3-1930 తేదీని బయలుదేరి పాదచారియై, ఆయాగ్రామములందు స్వాతంత్ర్యసందేశమును, సత్యాగ్రహసూత్రములను జనులకు బోధించుచు, సూరతుజిల్లాలో సంచరించెను. ఇట్లు 200 మైళ్ళునడచి పడమటి సముద్రపుతీరమందున్న 'దండి'రేవుచేరి, గాంధిగారు ఏప్రిలు 6 (జాతీయవారపు మొదటిరోజు) న సముద్రపునీరు కాచి, ఉప్పుసత్యాగ్రహ మారంభించిరి. ఆయన యనుజ్ఞతో దేశమందన్ని ప్రాంతములందును ఉప్పు సత్యాగ్రహ మందుకొన్నది. మన యాంధ్రరాష్ట్రమందును ఉత్సాహముతో విజృంభించి, కొందరాయా గ్రామములనుండి సముద్రపు రేవుల కూరేగింపుజరిగించి ఉప్పు సత్యాగ్రహమును జేసిరి. ముఖ్యముగ అప్పటి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు బులుసు సాంబమూర్తి గారు కాకినాడ రేవులో సహచరులతో సహా ఉప్పు తయారుచేయించి అన్ని ప్రాంతములందు అమ్మించిరి. గుంటూరుజిల్లాలో శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులు, శ్రీ సీతారామశాస్త్రి, శ్రీ ఉన్నవదంపతులు, శ్రీ నడింపల్లి వెంకట నరసింహారావుగార్లు ఓడరేవువద్దను ఉప్పు తయారుచేసి గుంటూరు పరిసరాదులలో ఆ యుప్పును బహిరంగముగా సరఫరాచేసి, యింకను చాల మందిచేత ఉప్పుచట్టమును ఉల్లంఘింపజేసిరి. ఇట్లే తమిళనాడులో వేదారణ్యము, వంగరాష్ట్రమందు చిట్టగాంగు మొదలగు రంగములందును దేశమంతట నాయకులు ప్రజలును బహిరంగముగ ఉప్పు తయారుచేసి, జనులకు పంచిపెట్టిరి

దానిని మొదట ప్రభుత్వోద్యోగులు పరిహసించిరి; ఇది వ్యర్థము, గిట్టనిది, సాగనిది అనుకొనిరి. కాని, కొద్దిరోజులలో అది ప్రచండముగ

---

*దీనినిబట్టియే ప్రతిసాలున జనవరి 26 వ తేదీని 'ఇండిపెండెన్సు డే' అనుపేర సాతంత్ర్యదీక్షాదినము నిప్పటికిని జరుపుచున్నారు. మనదేశపు 'రిపబ్లిక్' అను ప్రజాతంత్రపు క్రొత్తరాజ్యాంగము 1950 జనవరి 26 తేదీ నుండియే అమలుకు వచ్చినది.

దేశమంతటను వ్యాపించినది.'ఈ ఉప్పుశాసనము అన్యాయము, దాని నుల్లంఘింతుము. ఇట్లే తక్కిన అక్రమ శాసనములకును వ్యతిరేకించి, మాహక్కుల సంపాదింతుము.' అను ఆవేశము ప్రజలలో వ్యాపించినది. సత్యాగ్రహము హెచ్చగా, ఉద్యోగులు మొదట నాయకులను, తరువాత వాలంటీయర్లను గూడ అరెస్టుచేసి, జైలులోనుంచిరి. కొందరుద్యోగులు తమ నౌకరీలను వదలుకొనిరి. నాయకుల నిర్బంధింపగనే సత్యాగ్రహము మరింత వ్యాపించెను. జైళ్ళు సత్యాగ్రహులతో నిండిపోయినవి. పోలీసువారంతట సత్యాగ్రహులను లాఠీలతో కొట్టుచుండిరి. అంతట గాంధిగారు సూరతు జిల్లాలోని 'దర్శన' అనుచోటనున్న సర్కారు ఉప్పు డిపోమీదకు 'దాడి' వెడలుదునని ముందుగ వైస్రాయికి నోటీసునిచ్చిరి. అందుపైన 1930 మే ౫వ తేదీని అర్ధరాత్రివేళ పోలీసు సూపరింటెండెంటు గాంధిమహాత్మునరెస్టుచేసి, మోటారుపైన రహస్యముగ తెచ్చి, ఉదయమగునప్పటికి 'యరవాడ' జైలులో నుంచెను. మరునాడన్నిచోట్లను సంపూర్ణమగు హరతాళము జరిగెను. అంతట కాంగ్రెసువారు విదేశపు సరుకుల కొట్లవద్ద, కల్లుదుకాణములయెదుట 'పికెటింగును'ను ఆరంభించిరి.

కొట్లలో నిలవఖద్దరంతయు పదిరోజులలో సీదాగా ఖర్చైనది. జనులు కోరినంతఖద్దరు ఉత్పత్తి లేక, బొంబాయి అహమ్మదాబాదు మున్నగు చోట్ల స్వదేశపు మిల్లుబట్టలవాడుక హెచ్చెను. మిల్లుయజమానులు విదేశపు నూలు కల్తీచేయకుండ, ధరలు హెచ్చించకుండ కాంగ్రెసువారు హామీతీసికొనిరి. అట్టి మిల్లులబట్టలు ధరింపవచ్చునని అప్పుడు తత్కాలముకు కాంగ్రెసు వర్కింగుకమిటీవా రంగీకరించిరి. అప్పుడు సీమబట్టల బహిష్కారంవల్ల బ్రిటిషుసరుకుల దిగుమతి నిల్చిపోయెను. కల్లుపాటల నెవ్వరును పాడరైరి. 'పికెటింగు' బాగుగ ఫలించినది. అంతట సప్రూ, జయకరులద్వారా ప్రభుత్వమువారు గాంధిగారితో రాజీమాటలు జరిపిరి. కాని ప్రభుత్వము ప్రజల హక్కుల మన్నించ సిద్ధంకాలేదు, కనుక రాజీకాలేదు. శాసనసభలతో నిమిత్తములేకుండ వైస్రాయి'ఆర్డినెన్సు'అనుపేరను నిర్బంధపుచట్టములు తెచ్చిపెట్టెను. కొన్ని జాతీయపత్రికల నణచివేసెను. గాంధిగారి నవజీవన్ పత్రిక ప్రెస్సును ప్రభుత్వము స్వాధీనము చేసికొనెను. అంతట యంగుయిండియా నవజీవను పత్రికలు నిల్చిపోయెను. పోలీసుల జులుము హెచ్చెను. చాలచోట్ల

జనులు పన్నులు చెల్లింపులనుమానిరి. కొన్ని భూములను సర్కారువారు వేలము వేసిరి. అంతట వందలకొలది మహిళలు 'దేశసేవిక'లై 'పికెటింగు' జరిపి, సత్యాగ్రహమునకు శిక్షనొంది, జైలులో నుంచబడిరి. జనులు ఉద్రిక్తులై నను సాధారణముగ శాంతముగ నుండిరి. ఇదివరలో రక్తపాతమునకే అలవడిన శూరులగు సరిహద్దుప్రాంతపు పఠానులును యిప్పుడు పూర్ణముగ శాంతులై సత్యాగ్రహులైరి.

సత్యాగ్రహము బలమైనకొలదిని క్రమముగ విదేశపు బట్టలేగాక, మందులు, ఇనుపసామానులు, వగైరా ఇతరవిదేశీవస్తువులనుగూడ భారతీయులు కొంతవరకు బహిష్కరించిరి. దిగుమతులు నెలనెలకు తగ్గిపోవుచు, బ్రిటిషు వ్యాపారస్తుల లాభముపోయెను. మరియు, మన పారిశ్రామికులును వ్యాపార స్థులును, యిన్సూరెన్సువగైరాలలో బ్రిటిషుకంపెనీలను మాని, దేశీయసంస్థలకే ప్రోత్సాహమొసంగ నారంభించిరి. అందువల్ల జాతీయోత్సాహమున ఈ దేశమందు కొత్తవ్యాపారసంఘము లేర్పడి వృద్ధియైనవి.

ఆసాలుకు సర్కారువారికి భూమిపన్నులు చెల్లించు సమయమాసన్న మయ్యెను. ఇంతలో గింజలన్నిటిధరలు మందగించుటచే కొన్నిచోట్ల బీద రయితులు పన్నులుచెల్లింప నిరాకరించిరి ముఖ్యముగ గుజరాతులోని బర్డోలి తాలూకా మొదలగుచోట్ల పన్నులు వసూలు కానేలేదు. ప్రభుత్వమువారు 'ఆర్డినెన్సు'ల పేర కొత్తహుకుములబెట్టి, ఆస్తులను జప్తుచేసియు, తామే స్వాధీనము చేసికొనియు, పన్నుచెల్లించనివారి నెన్నియో నిర్బంధముల పాలుగావించియు పరీక్షించిరి. ఎన్ని కఠినచర్యల జేసినను, 'ఈ కరబంధ' మేర్పడిన తాలూకాలలో నూటికైదు కన్న హెచ్చుమొత్తము వసూలగు నట్లు కనబడలేదు. జనుల యావేశమును హెచ్చెను. ఈలోకోత్తరయుద్ధము లోకమంతటి దృష్టి నాకర్షించెను. ఇట్లుండగా, ఈదేశీయులలో పలుకుబడి లేనికొందరు రాజభక్తులను కులతత్వపరులను మాత్రంచేర్చి లండనులో సంప్ర దింపుసభ జరుపుట నిరర్థకమని తోచి, ప్రభుత్వమువారు రంగుమార్చిరి. జైలులో సప్రూ జయకరు వగైరాలద్వారా మరల రాజీసంప్రదింపులు జరిగి నవి. కాని నాయకులందరును విడుదలయై తమలో తాము సంప్రదించుకొన్న మీదటనే సమాధానమీయగలమని గాంధీ, జవహరులు జవాబిచ్చిరి.

# 27. గాంధి - యిర్విను సమాఖ్య

అంతట కాంగ్రెసుతో రాజీ సూచించుచు బ్రిటిషు ప్రధాని 19-1-31 తేదీని, వైస్రాయిగారు 26-1-31 తేదీన ప్రకటనల గావించి ముఖ్యనాయకు లందరిని జైలునుండి 26 వ తేదీని వదలిపెట్టిరి.

ఈలోగా మోతీలాలు నెహ్రూగారు చాల జబ్బుతోనుండిరి. ప్రత్యేక చికిత్స చేయించినను బాగుపడక, ఆయన 5-2-31 తేదీన చనిపోయెను. అందుచే, గాంధిగారికిని తక్కిన నాయకులకును చాల పరితాపము కలిగెను.

అంతట సర్కారువారి కోరికపైన ఢిల్లీలో రాజీసంప్రదింపులు జరిగెను. కాంగ్రెసు కార్యవర్గమువారు అందుకు గాంధిగారినే తమ ప్రతినిధిగ నియమించిరి.

ఆయన 19-2-1931 తేదీనుండి ఢిల్లీ ప్రభుత్వభవనములో వైస్రాయితో ఆయాసమస్యలను చర్చించుచు, కాంగ్రెసు కార్యసమితి సభ్యులతోగూడ మరల సంప్రదించుచుండెను. గాంధిగారిదీక్ష, చాతుర్యము, నిగ్రహము, సమయస్ఫూర్తి అద్భుతముగనుండెను. ఒకప్పుడు రాజీ చెడిపోవు నట్లుండెను. మితవాదులు, కొందరు కాంగ్రెసువర్గపువారును గాంధిగారిని రాజీకై ప్రోత్సహించిరి. వైస్రాయికిని, లండనులో బ్రిటిషు ప్రభుత్వమునకును 'కేబిలు' తంతిద్వారా జరుగు సంప్రదింపులు పూర్తికాగా, 15 రోజులైనమీదట తుదకు తాత్కాలికమైన రాజీకుదిరినది. 5-2-1931 తేదీని రెండుపక్షాల తరపున గాంధి ఇర్వినులు సమాఖ్యపత్రముపైన దస్కతుచేసిరి. "ఈదేశపు పాలన మికనుండి ప్రజాప్రతినిధుల యిష్టప్రకారమే జరుగవలె. ఈ ప్రజా యత్తకు కొన్ని రక్షణ నియమము లుండును. కాని అవి భారతదేశమునకు క్షేమకరములుగనే యుండవలెను. సముద్రతీరపు ప్రజల స్వంతవాడుకకై ఉప్పు తయారుచేసుకోవచ్చును. కొత్తరాజ్యాంగమును నిర్ణయించుటకు లండనులో సంప్రదింపులకు కాంగ్రెసు ప్రతినిధులను ప్రభుత్వమువా రాహ్వానింతురు. కొత్తరాజ్యాంగము ఫెడరలు(సమిష్టిపాలన) పద్ధతినే యుండును, ఇటీవల జారీచేసిన ఆర్డినెన్సులను ప్రభుత్వము రద్దుచేసి, సత్యాగ్రహపు ఖైదీ లందరిని విడుదలచేయును. విదేశవస్తువులకును కల్లుపాకలకును ముందు

శాంతంగా పికెటింగు జరుపవచ్చును, కాని, నిర్బంధము కూడదు." ఈ షరతులనుభయపక్షములు నంగీకరించెను. సత్యాగ్రహము నిల్పివేయ కాంగ్రెసు వారంగీకరించిరి. ఐనను, ఆర్థికస్థితివల్ల బాధ కల్గినప్పుడుమాత్రం రయితులు పన్నులను చెల్లింపకుండవచ్చునని ఉభయులు నొప్పుకొనిరి. ఇట్లు కొంత కష్టంమీద తుదకప్పుడు రాజీకుదిరినది, ప్రత్యర్థిసద్భావం చూపెనపుడు, ఉచితమగు సమాఖ్య నంగీకరించుట సత్యాగ్రహిలక్షణము. కనుక గాంధిగారప్పుడు సమ్మతించిరి.

# 28. లండను సమావేశం

ఆ ప్రకారం వెంటనే గాంధిగారు దేశమంతటను సత్యాగ్రహమును మాన్పించిరి. 'పికెటింగు' దీక్షతో చేయుపద్ధతి నిల్చిపోయినది. రయితులు పన్నులు చెల్లించివేయవలెనని గాంధిగారు ముఖ్యముగ తొందరజేసిరి. బర్డోలీ మొదలగుచోట్ల ఆర్థికవ్యత్యాసంవల్ల బాధపడినను నగలు వగైరాలను అమ్మిరైనను రయితులు చాలవరకు బకాయిపన్నుల నెట్లో చెల్లించి ఆ సమాఖ్య నమలుచేయుటలో తమ లోటు లేకుండ జేసిరి.

1930లో సత్యాగ్రహంవల్ల కాంగ్రెసుమహాసభ జరుగలేదు. సమాఖ్య జరుగగనే సిందులోని కరాచీనగరమందు మహాసభను జరిపిరి. గుజరాతులో గాంధిగారి కుడిభుజమగు శ్రీ వల్లభభాయిపటేలుగారా సభకధ్యక్షుడుగ నుండిరి. సత్యాగ్రహంలో గాంధిగారు నియంతగనుండి జరిపిన చర్యలను, తరువాత వైస్రాయితో జరిగిన సమాఖ్యషరతులనుగూడ మహాసభవారామోదించిరి. భావిరాజ్యాంగములో కొన్ని 'సేఫ్‌గార్డు' (రక్షణనియమము) లుండవలెనని ఆ సమాఖ్యలో షరతువ్రాసిరిగదా? ఆ షరతులు భారతదేశమునకు స్పష్టముగ క్షేమకరమైనవే కావలె, అని తీర్మానము జరిగినది. వైస్రాయికి గాంధిగారు వ్రాసిన ఉత్తరములోచెప్పిన 11 షరతుల నింకను విపులపర్చి, గాంధిగారితో నాలోచించి, జవహర్లాలు కాంగ్రెసు ఉద్దేశ ప్రకారము ప్రజల హక్కులను తెల్పు దీర్ఘమగు ప్రణాళికను తయారుచేసెను, దానినా మహాసభవారు గాంధిగారి సాయముతో పూర్తిగ నామోదించిరి.

అప్పుడు గాంధిగారికొక తొందరగల్గెను. ఒక పోలీసు ఆంగ్లోద్యోగిని హత్యచేసెనని భగత్సింగ్ (భక్తసింహ్) అను యువకునిపైన అప్పుడు కేసు వచ్చెను. ఆ యాంగ్లోద్యోగి కఠినుడై లోగడ సైమనుకమీషను లాహోరు వచ్చినపుడు బహిష్కారమును సాగించు లజపతిరాయిగారిని లాఠీతో పొడిచి బాధించెను. పూజ్యుడు, ప్రజాప్రియుడునగు లాలాగారా దెబ్బలు దినిన కొద్ది వారాలకు చనిపోయిరి. లాలాగారినిట్లు కొట్టిన పోలీసుఉద్యోగి తరువాత యేడాదికి చంపబడెను. ఆ నేరమును భగత్సింగే చేసెనని నమ్మి జడ్జి యతని కురిశిక్ష విధించెను. ఆ విచారణ సవ్యముగ జరుగలేదని, మరియు, హింసాచర్య అక్రమమైనను, ఆయాంగ్లోద్యోగిని భగత్సింగు స్వార్థమునకై గాక లాలాగారియందున్న గౌరవాతిరేకముననే చంపెనని, కనుక ఆయురిశిక్షను ద్వీపాంతరవాసముగ మార్చునట్లు ఒత్తిడిచేయవలెనని, గాంధిగారిని కొందరు యువకులు కోరిరి. * ఉరిసెట్లయిన ఆపించుమని గాంధిగారు వైస్రాయిని కోరిరి. కాని సర్కారువారు కరాచీకాంగ్రెసునకు ముందే భగత్సింగు నురితీసిరి. అంతట చాలమంది కుద్రేకముకల్గి కరాచీలోనే కొందరు యువకులు నల్లజండాలతో నల్లపువ్వులతో గాంధిగారిపైకి వచ్చిరి. వారి కోపావేశము జూచి, వారు గాంధిగారిని బాధింతురని కొందరాలోచించిరి. కాని గాంధిగారొంటిగనే వారికెదురుగవచ్చి, చిరునవ్వుతో వారిచేతిలోని నల్లపువ్వులను గ్రహించి, తాము అట్లు యత్నించినను వ్యర్థమగుటను తెల్పి, వారి నుచితవచనములతో నోదార్చిరి. గాంధిగారి సౌమ్యప్రవర్తనమున, ఆ యువకు లుగ్రతమాని తృప్తులై తమధూర్తతకు సిగ్గుపడి వెడలిపోయిరి.

కొత్తరాజ్యాంగము నేర్పరచు సంప్రదింపుసభకై లండనుకు తమ తరఫున 20 మంది ప్రతినిధుల నంపవలెనని, కాంగ్రెసును ప్రభుత్వమువా రాహ్వానించిరి. కార్యసమితివా రాలోచించి, సమ్మతించి కాంగ్రెసుతరఫున గాంధిగారొక్కరే లండనుసభలో ప్రతినిధియై పాల్గొనునట్లు నిర్ణయించిరి.

---

* లజపతిరాయిగారి ప్రాణమిత్రుడై, జాతీయోద్యమంలో ఆయనకు సహచరుడై ఆయనతోబాటు సర్కారుచే 1907 లోనే నిర్బంధంలో పెట్టబడిన అజితసింగు సోదరపుత్రుడే యీభగత్సింగు. 30 ఏండ్లు అజ్ఞాతవాసం చేసి అజితసింగుగారు మరల మాతృభూమికి విచ్చేసి, గతసాలునే మరణించినారు.

కాని గాంధిగారు సంశయించిరి. కొన్ని సమస్యలు తేలలేదు. రాజ్యాంగమందేర్పర్చు 'సేఫ్‌గార్డులు' భారతీయులకు బ్రిటనుకుగూడ క్షేమకరమైన వేర్పర్తుమని భారతమంత్రిగారన్నను, బ్రిటిషువారికి లాభకరమగు షరతులు తరచు మనకు నష్టకరములైనను క్షేమకరములే అని బ్రిటిషువారందురు. అట్లుకాక భారతీయులకే క్షేమకరమగువానిని చేర్పింతుమని స్పష్టపర్చవలెను, అని గాంధిగారు కోరిరి. అప్పటి వైస్రాయియగు విల్లింగ్డను ప్రభువుగారు తుదకొకవిధముగా దీనిని తేల్చిరి.

రెండవసమస్య—సమాఖ్య అమలు. ఈ విషయమున ప్రభుత్వము వారు తమ షరతులను పూర్తిగ అమలు జరుపలేదు. కొందరు రాజకీయబందీలింకను విడుదలకాలేదు. పన్నుబకాయీలు చెల్లింపలేని రయితులపైన, బర్డోలిమున్నగుచోట్ల, 'రివిన్యూ'ఉద్యోగులు జప్తులు వగైరాలతో రయితుల బాధపెట్టిరి. ఇట్టి చర్యలుమానినగాని తానింగ్లండు వెళ్ళనని గాంధిగారనిరి. అందుకు కాంగ్రెసుకార్యసమితియు నొప్పుకొనెను. అ తరు ముఖ్యముగ బర్డోలీనిగూర్చి ప్రభుత్వముతో చర్చజరిగి, తుదకొక కలెక్టరు నందుకు పంచాయితీదారుగ నేర్పరుప పరిష్కారము జరిగినది.

మూడవది—సాంఘికసమస్య. లండనుసభచర్చలో పాల్గొను భారతీయులలో సర్వదృక్పథము ఏకీభావము నుండవలెను. రాజులువగైరా లెట్లున్నను, ముస్లిములు హిందువులు వగైరా సాంఘిక ప్రతినిధులలో విభేదములుంటే కొత్తరాజ్యాంగముగూర్చి వారిలో నేకీభావములేదని తేలి లోకువయగును. కనుక ముఖ్యముగా ముస్లింసంఘప్రతినిధులతో ముందుగ రాజీయేర్పడిననే బయలుదేరుదునని గాంధిగారనిరి. కాని ముస్లిములలో 'అన్సారీ' మున్నగు కొందరు జాతీయవాదులు జిన్నావగైరాకొందరు పట్టి కులతత్వవాదులు, కొందరు నబాబులు. అందువలన వీరిమధ్య ఎన్నిసభలు, సంప్రదింపులు జరిగినను, సమన్వయము కుదరలేదు. సమన్వయము కుదురకున్న లండనుసభలో కాంగ్రెసువారు పాల్గొనుటనిరుపయోగము. "కాంగ్రెసువారు,హిందూమహామ్మదీయప్రతినిధులు, తమలోతాము కలహించుచు విభిన్నముగావాదించిన భావిరాజ్యాంగమునుగూర్చి వారిలోసమ్మతి, ఏకీభావము లేదనిచెప్పుటకు సర్కారువారికి సాకుదొరుకును. మరియు, ముస్లిములు వగైరా అల్పసంఖ్యాక సంఘములరక్షణకై ముఖ్యాధికారము బ్రిటిషువారి

హస్తమందుండవలెనని పేచీవచ్చును," అని గాంధిగా రనిరి. అట్లు ముందుగా రాజీకుదరకున్నను లండనులో కాంగ్రెసుతరపున గాంధిగారు పాల్గొనవలె ననియే తుదకు వర్కింగుకమిటీవారు నిర్ణయించిరి. ముస్లిములలో జాతీయ వాదుల నెవ్వరిని ప్రభుత్వమువారు లండనుసభకు పిలువనేలేదు. గాంధిగారు కోరిన అన్సారీనైనను సర్కారువారు పిలువలేదు. కాంగ్రెసుకు 20 మంది ప్రతినిధులుండవచ్చునని సర్కారువారు చెప్పినను కాంగ్రెసు గాంధిగారి నొక్కరినే నియమించెనుగదా! అట్టిస్థితిలో వారికోరికపైన నొక్క జాతీయ ముస్లిమునైన బిలువక జిన్నా వద్దన్నాడని నెపంజెప్పిరి. ఇది ప్రభుత్వమువారి దురుద్దేశ్యమును సూచకము. తాను లండనుసభకు వెళ్ళివచ్చులోగా ప్రభుత్వాధికారు లిక్కడ కాంగ్రెసుసంస్థల నణచివేయ యత్నించుచున్నారని గాంధిగా రనుమానించిరి; వారుసమాఖ్యను వ్యతిరేకులనుసంగతిని, వైస్రాయికి తెల్పిరి. కాని సర్కారువారు చాల న్యాయముగ ప్రవర్తింతురని, తప్పక వెంటనే యింగ్లండుకు వెళ్ళవలెనని నమ్మించి, వైస్రాయిగారు గాంధిగారిని ప్రయాణము చేయించిరి.

తన కిట్లు అసంతృప్తియు అనుమానమును కల్గుచున్నను, తుదకు కాంగ్రెసుఆజ్ఞను పాలించి ప్రజేచ్ఛ నెరవేర్చుటకే గాంధిగారు 29-8-31 తేదీని బొంబయిరేవులో స్టీమరెక్కిరి. గాంధిగారు ఓడలో భావిరాజ్యాంగము సాంఘికసమస్య, సంస్థానసమస్య, హరిజనాది సమస్య, ప్రభుత్వ ఋణము, ఆయారాష్ట్రముల సమస్య, బ్రిటిషువారికి భారతప్రభుత్వమునకు ఇకముం దుండవలసిన ఆర్థిక సైనికాది సంబంధములు, ఇట్టి సమస్యల క్లిష్టవిషయము లను మిత్రులసాయముతో నవగాహన చేసుకొని, అందుకు సంబంధించిన కాగితముల బరిశీలించి, మనజాతీయక్షేమమును సాధించుదీక్షతో కృషిచేసెను. ఆస్టీమరులో భారతకోకిలయగుసరోజినీదేవియు, ఆర్థికశాస్త్రజ్ఞుడురంగస్వామి అయ్యంగారును, రాజకీయవిజ్ఞాతమాలవ్యాగారును గాంధిగారికితోడుగనుండిరి. ఇంగ్లండుచేరి, లండనులో కేవలము బీదలు, కూలీలు వసించు 'ఈస్టెండు' అను తూర్పుపేటలోనే గాంధివసించెను. తన జీవితమునంతను దీనోద్ధరణ కర్పించు 'మిస్ లెస్టరు' అను సాధ్వీకతిథియై గాంధిగా రచట కార్మికులతో కలసియుండి వారి కష్టసుఖముల గమనించెను. తక్కిన భారత ప్రతినిధు లందరు ప్రభుత్వపు ఖర్చులపైన లండనుమధ్య మహాభవనములం దుండుచు,

శ్రీమంతులు బుజ్జగింప, వారి విందులు గుడుచుచు, సర్కారు దయపైన విమాన సంచారాదుల విహరించుచు, విలాసులై ఆనందించుచు అసలు విషయమునుగూర్చి ఏకాగ్రత లేకయుండిరి.

అక్కడ తక్కినభారతీయులతో గాంధిగారు సంప్రదించి ఆయా విజ్ఞులతో ఆర్థికాదిసమస్యలు చర్చించిరి. లండనులో ముఖ్యసభలోను, ఉపసంఘములలోను పాల్గొనిరి. ముఖ్యసమస్యలగూర్చి కాంగ్రెసువారి భావముల వెల్లడించి వారికిని, ఆయా పక్షములధోరణికిని, సర్కారువారి దృక్పథమునకు నెట్లైన సమన్వయముచేయ విశ్వప్రయత్నము చేసెను; బ్రిటిషుపాలకుల హృదయమును కరిగింప యత్నించెను, కాని వారెప్పటిరీతిని భారతీయులలో నాయావర్గములమధ్య పరస్పరవిభేదములను రేపి, వాటికే ప్రాముఖ్య మిచ్చిరి. వాటిని హిందవులు తమలో ముందుగా తేల్చుకోవలెను; అట్లు తేలనియెడల ఆయా అల్పసంఖ్యాక సంఘముల హక్కులను బ్రిటిషు ప్రభుత్వమే రక్షించును; అందుకై రాజ్యాంగములో ప్రత్యేకపు హక్కులు బ్రిటిషుపాలకుల కుండవలెనని, నేనే ఆ సమస్యల బరిష్కరింతునని బ్రిటిషుప్రధాని చెప్పెను. ఇట్టి భేదనీతిలో బ్రిటిషురాజనీతిజ్ఞులారి తేరినవారు. ఈ పేచీవచ్చునని ముందే గ్రహించిన గాంధిగారు, ఆగాఖాను, జిన్నాగార్లను, అంబేద్కరు, ఎం. సి. రాజాగార్లను, సిక్కునాయకులను, సంస్థానరాజులను ముందుగ కలుసుకొని మాట్లాడిరి. వారు విశాలభావము వదలి తమ సంఘముల కేదో ప్రత్యేకపుహక్కు లుండవలెనని కుదరని కోరికల గోరిరి. వీరినిజూచి క్రైస్తవులు, ఆంగ్లోయిండియనులు నట్లేచేసిరి. స్వపరిపాలనమును ముందుగా వారు కోరుపద్ధతిని, జాతీయతకు భంగము లేకుండ వారు కోరు హక్కులన్నిటిని కాంగ్రెసుచే సమ్మతింపజేయుదుననని గాంధిగా రభయమిచ్చి, స్వదేశక్షేమమును, జాతీయగౌరవమును విదేశమందు రక్షింపుడని, మాతృభూమి మర్యాద కాపాడుడని, కొద్దిమంది స్వలాభమునకై కోట్లకొలది బీదల కపకారముచేయకుడని ఎంతయో వేడుకొనెను. కాని వారందుకొప్పుకోలేదు. రాబోవు శాసనసభలలోను, ఉద్యోగములలోను తమతమ వారికెక్కువ స్థానములు కావలెనని హిందూమహాసభ, ముస్లింసమితిమొదలగు ఆయాసంఘాల ప్రతినిధులు కలహించిరి. మరియు జమీందార్లహక్కులకు రక్షణ,సంస్థానరాజులకు కేంద్రసభలో హెచ్చుప్రాబల్యము,

ఇట్లుకోరిన గొంతెమ్మకోరికలకు మితిలేదు. వెనుకనుండి త్రాడులాగు బ్రిటిషువారు పురిరెక్కించి, అసలు స్వరాజ్యవిషయం తేలకుండగనే మైనార్టీల సబుకమిటీని బ్రిటిషుప్రధాని యధ్యక్షతను ముందుగ సమావేశ పర్చి పేచీసమస్య లారంభించిరి. ఆసభలో చర్చజరుగునప్పుడు, భారతీయు లలోనే పరస్పర కలహములతో సభారంగము రణరంగమయినది. అట్టి సాంఘిక మూర్ఖులను, కులతత్వపరులను సంఘప్రతినిధులుగ లండనుకుపిల్చి బ్రిటిషువారు ఆ సభను కప్పలతక్కెడగజేసిరి. అసలుసమస్య స్వరాజ్య సమస్య. అనగా బ్రిటిషువారి హస్తములనుండి మనదేశపు పాలనాధికార మును మన ప్రజలకు వశపర్చుట. దాని నంతవర కిత్తురో ఎప్పుడిత్తురో ముందుగా బ్రిటిషుఅధికారులు తేల్చవలె. అధమము డొమినియను స్వరా జ్యమునైన వెంటనే యిచ్చుటకు సర్కారువా రొప్పుకుంటే భారతీయులలో దానిని పంచుకొను పరస్పరసమస్యలు సులభముగ పరిష్కారమగును; ఈ అంతరంగ విషయములను భారతసభ పరిష్కారమునకే విడువదగును. కాని బ్రిటిషుసర్కారువారు కుయుక్తిచేసి, స్వరాజ్య సమస్యను వెనుకకు పెట్టి, ఆయా సాంఘిక ప్రతినిధులను స్వార్థము కులతత్త్వము వైపునకు ప్రేరేపించిరి; ఆ తగవులు ముందుగ తేలవలెనని ఆప్రతినిధులచే ననిపించిరి. ఆ కులతత్వపరులు బ్రిటిషువలలోబడి గాంధిగారితో వ్యతిరేకించిరి; అది తేలినగాని రాజ్యాంగసమస్య తేల్చమని, మనకండ్లు మన వేళ్ళతోనే బ్రిటిషుప్రధాని పొడిచెను.

ఈలోగా 1931 సం॥ మధ్యను బ్రిటనులో పార్లమెంటున కెన్నికలు జరిగెను. ఇదివరకు కార్మికపక్షీయు లధికారమందుండిరి. వారు స్వల్పవిష యములందైన కొంతవరకు భారతీయుల కనుకూలధోరణిని జూపిరి. అప్పుడు లోకమంతట గొప్ప ఆర్థిక దుస్థితికల్గినది. ఆ కొత్తయెన్నిక సంరంభములో భారతసమస్య వెనుకబడినది. ఆర్థికసమస్యయే ప్రాముఖ్యం వహించినది. తుద కెన్నిక పూర్తియై, కార్మికులు, ఉదారులు నోడిపోయిరి. కరడుగట్టిన సామ్రాజ్యవాదులు, కేవలం స్వార్థపరులు నగు కాన్సర్వేటివు లధికారులైరి. ఆకొత్తమంత్రిత్వమునకు పెట్టిన 'జాతీయప్రభుత్వ' మనుపేరు 'నేతిబీరకాయ' వంటిది. బ్రిటిషు ప్రధానియగు మాక్డొనాల్డు ఈలోగానే తన పట్టుగొమ్మ యగు కార్మికపక్షమును గన్నివేసి, పల్టీకొట్టి, ఈ కొత్తసామ్రాజ్యపక్షపు

ప్రధాని యయిరి. అంతట సర్కారు తమ కఠినతనమును ఎక్కువ సాహసంతో భారతీయుల గూర్చియు గనపర్చిరి. వారికి విధేయులై మనవారిలో కులతత్వపరులు గాంధిగారి నెదిర్చి బహిరంగంగా రసాభాసచేసిరి. ఇక లండనుసభ భగ్నమైనదని తెలిసినది వెంటనే, ఇక్కడి భారతప్రభుత్వపు కాఠిన్యము, క్రౌర్యము హెచ్చుచుండెను. కాని, గాంధిగారు బ్రిటిషుప్రజలకు భారతీయసమస్యను దీక్షతో విశదపర్చి, వారికిదివరలో శ్రీమంతులు స్వార్థులు సామ్రాజ్యపరులు గల్గించిన యపోహలను కొంతవరకు పోగొట్టిరి. లండనులోని మాన్చెస్టరు, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి మొదలగు పురప్రజలు మహాసభలుచేసి, గాంధిగారి సందేశమును వినిరి. శాంతి, అహింస సోదరభావము అన్నిసంఘములకును క్షేమకరములేనని, లోకమంతటికి మోక్షమిచ్చునని, ఆయన ఆ ప్రజలకు బోధించెను.

ఇంగ్లండులో కొంతకాలముండి, ఆయావిదేశములకు వచ్చి సందేశమిమ్మని విదేశాలనుండి గాంధిగారి కాహ్వానములు వచ్చెను. లండనులోని విదేశప్రతినిధులు అమృతోపమమగు ఆయన సందేశములను అన్నినాగరిక దేశాలలోని తమ పత్రికల కంపిరి. ఇట్లాయన సిద్ధాంతములు లోకమంతట వ్యాపించినవి. ఇంకను కొంతకాలముంటే ఆప్రచారము బాగుగ నాటుకొని యుండును. కాని, ఈలోగా మనదేశపు స్థితి తారుమారగుచున్నదనియు, వెంటనే మరల సత్యాగ్రహము తప్పదనియు, కాంగ్రెసు నాయకులనుండి ఆయనకప్పుడు తంతివార్తవచ్చెను.

ఆయన కాంగ్రెసువారిపరతులను స్పష్టపర్చి, 1931 డిసెంబరు 5 వ తేదీని మరల మనదేశమునకు బయలుదేరెను. దారిలో ఫ్రాన్సునకును, అక్కడనుండి స్విడ్జర్లండునకును వెళ్ళి అక్కడ 'రోమైన్ రోలండు' అను శాంతిప్రియుడగు తత్వవేత్తతోను, ఇతరవిద్వాంసులతోను సంప్రదించెను. ముస్సోలినీకూడ ఆయనతో మాట్లాడెను. అంతట ఇటలీనుండి స్టీమరులో 28-12-1931 తేదికి గాంధిగారు బొంబాయిచేరిరి.

# 29. సమాఖ్య చెడుట

బ్రిటనులో ఇట్లు 1931 ఎన్నికలలో 'కాన్సర్వేటివులే గెలువగా లండనులో రాజీకుదరదని తేలి, ఈసారి సత్యాగ్రహ మారంభించుటకుముందే కాంగ్రెసును నిర్మూలింప ఇక్కడి పాలకులు ముందే నిశ్చయించి, జంకులేకుండ, క్రూరచర్య లారంభించిరి కాంగ్రెసుసంస్థల పునర్నిర్మాణమునకు, మామూలురాజకీయసభలకు కొన్నిచోట్ల అధికారులు ఆటంకముల బెట్టిరి. కేసులు, శిక్షలు, నిర్బంధములు, లాఠీప్రహారములును 1931 లోనే మరల ఆరంభించినవి. ఉద్యోగులు కల్లుత్రాగుడును ప్రోత్సహించి, పికెటింగును నిరోధించిరి. కొన్నిచోట్ల పాఠశాలల మానిన విద్యార్థులను, గ్రామోద్యోగులను ముందెప్పుడును సత్యాగ్రహము చేయమని మాటయిచ్చినగాని మరలచేర్చుకోలేదు. కొందరువకీళ్ళనుండియు వాగ్దానముకోరిరి. మన మద్రాసు ప్రాంతమందును వాలంటీర్లకు నిరోధములేర్పడెను, కొందరు ఖైదీ లింకను విడుదలకాలేదు. గుజరాతులో రయితులనుగూర్చి ప్రభుత్వము జరుపుటకొప్పుకొన్న విచారణయు సరిగా జరుగలేదు. దేశమందంతటను భూమికిని, గింజలకును ధరలుపడిపోయినవి. రయితుల దుస్థితిని గమనించక వారిని జమీందారులును, ప్రభుత్వమును, పన్నులకై ఒత్తిడిజేసిరి; వస్తువునమ్మి బకాయిచెల్లించిన బీదరయితులను గూడ వెంటనే పాలుశిస్తును చెల్లించుమని కొన్నిచోట్ల తొందరచేసిరి; కొన్నిచోట్ల వాయిదారాకముందే వసూలుకై నిర్బంధము లారంభించిరి. పోలీసువారు జులుముచేసిరి. ఇట్లు గాంధియిర్వినుసమాఖ్యను ప్రభుత్వము భగ్నపరచెను. ఉద్యోగుల యీదుశ్చర్య లన్యాయములని కాంగ్రెసువారు, రయితులు సర్కారువారికి తెల్పినను వ్యర్థమైనది. అంతట విధిలేక సంయుక్తరాష్ట్రమున బాధితులగు కొందరు శిస్తు చెల్లింపు మానిరి. ప్రభుత్వోద్యోగులు అక్కడి జమీందార్లకుతోడై, జప్తులుచేసి, ఆరయితులను జిరాయితీలనుండి గెంటివేయజొచ్చిరి. ఇక బెంగాలు విషయం చెప్పనలవికాదు. చిట్టగాంగులో కొందరు యూరపియనులును, రౌడీలునుగూడ దౌర్జన్యచర్యల జరిగించిరి. హిజ్లి మొదలగు కొన్నిచోట్ల పోలీసులు జులుముచేసి. ప్రభుత్వమువారు ఈదేశపునాణెముకు బంగారుప్రమాణమును వదలి మన ద్రవ్యవిధానమును

బ్రిటిషువారి విధానముకుముడిబెట్టి, వారి ఆర్థికలాభమునకు వినియోగించిరి. అందువల్ల మన వర్తకులకును, సామాన్యజనులకును క్రొత్తనష్టమారంభించినది. 1931 సెప్టెంబరునుండి మనదేశమునుండి ఇంగ్లండుకు అమెరికాకు బంగారపు ఎగుమతి ఆరంభించినది. ఈస్వర్ణప్రవాహము మన ఆర్థిక దేహమునకు రక్తస్రావమువంటిది. విదేశములవారు తమ బంగారును నిలవజేయుచుండగా, మన అప్పటి ప్రభుత్వమువారట్లు చేయక, దానియెగుమతినే ప్రోత్సహించిరి.

ఇట్లే సరిహద్దురాష్ట్రములోను జాతీయవాదులకు చాల నిర్బంధములనుపెట్టిరి. చాలమందిని జైలులోనుంచిరి. అక్కడి నాయకుడగు అబ్దుల్ గఫూర్‌ఖానునుగూడ గాంధిగారి దేశమునకు రాకముందే అరెస్టుచేసిరి. బెంగాలులోను, సంయుక్త రాష్ట్రములోను క్రొత్త ఆర్డినెన్సులు నిర్బంధపు హుకుములుపెట్టి చాలమందిని జైలులోనుంచిరి. ఈపరిస్థితిని గాంధికి తెలిపి ముందు కార్యమాలోచింప బయలుదేరిన జవాహర్లాలును దారిలోనే అరెస్టుచేసి ఖైదులోబెట్టిరి. ప్రభుత్వమువారిలోగా రహస్యముగ క్రొత్త నిర్బంధ శాసనములను తయారుచేసినట్లు గుమానుగ తెలిసినది. ఈ విషమపరిస్థితులను జర్చించిప్రభుత్వముతో అనుకూలపరిష్కారమునకై సంప్రదించుటకు దర్శన మిప్పింపుడని గాంధిగారు వైస్రాయికి తంతినంపిరి. కాని, ప్రభుత్వ మప్పటికే తీవ్రధోరణిని బట్టినది. ఈసమస్యల చర్చింపకూడదని సర్కారునుండి జవాబు వచ్చెను. మరల నాయకులకు బంధాలు జారీయగుచున్నవనియు తెలిసెను. ఇక వ్యవధిలేదు. కనుక వెంటనే కాంగ్రెసు కార్యసమితిలో బయట మిగిలి యున్నవారు బొంబాయిలో కూడిరి, ప్రభుత్వమువారు నిర్బంధముల నారంభించగా కాంగ్రెసు కార్యసమితివారు మరల సత్యాగ్రహము జరుపవలెనని తీర్మానించిరి.

# 30 మరల సత్యాగ్రహము

ఇట్లు జరుగుచుండగనే (4-1-1932) తేదీని పిడుగువంటి నిర్బంధ శాసనములు ఆర్డినెన్సులపేర దేశమంతటను హఠాత్తుగ జారీయైనవి. గాంధి గారిని, కార్యసమితిసభ్యులను ప్రముఖులగు జాతీయవాదుల నందరిని పోలీసువా రరెస్టుచేసి వెంటనే జైలులోనుంచిరి.

గాంధిగారి నీసారి విచారణలేకుండగనే ఒక పాతరిగ్యులేషనుప్రకారం స్టేటు (ప్రభుత్వపు) ఖైదీగచేసి, సర్కారువారు కాలపరిమితిలేకుండ యరవాడజైలులో నుంచిరి. తిరిగి దేశమం దన్నిప్రాంతాలలో వెంటనే మరల సత్యాగ్రహమారంభమాయెను కొంద రుప్పుచేసిరి,కొందరు కల్లుపాకలు, విదేశవస్తువుల దకాణములయొద్ద పికెటింగుచేసిరి. కొంద రాంక్షలోనున్న గీతముల బాడిరి. కొందరు గ్రామమునసబు వగైరా ఉద్యోగముల వదలిరి. కొన్ని ప్రాంతాలలో పన్నులు చెల్లించుట మానిరి. 1921 లో కన్న 1930 లోను, అంతకన్న 1932 లోను ఉద్యమ మెక్కువతీవ్రమై, గ్రామములందును బాగుగ వ్యాపించినది. కొందరు ముస్లిములు, క్రైస్తవులు, స్త్రీలుగూడ సత్యాగ్రహము చేసిరి. ఆ రెండేండ్లలో సుమారు లక్షమంది భారతీయు లా సత్యాగ్రహములో జైలుకు వెళ్ళిరి. ఇంకను చాలమంది ఖైదుకు సిద్ధమైరి. కాని ప్రభుత్వంవారీ సారి లాఠీప్రయోగమును హెచ్చించిరి. 1931 సాలా ఖరుకు కొంతవరకా సత్యాగ్రహపు తీవ్రత తగ్గినది.

అందుకు ప్రత్యేకకారణములు కల్గినవి. సమాఖ్యాపరతులను యెంతో జాగ్రత్తతో నమలుజరుపమని, సర్కారుతో సంఘర్షణవద్దని గాంధివగైరా నాయకులు బోధించి, 1931 లో వాలంటీర్లను శాసనబద్ధులుగ నుంచిరి, రాజీకుదురునని, మరల సత్యాగ్రహము జరుప నవసరముండదని; ప్రజలు అనేకులు తృప్తులై యేమరుపాటున నుండిరి. ప్రభుత్వపు ముఖ్యోద్యోగులగు ఆంగ్లేయులు కాంగ్రెసుతో ఆ రాజీ కుదరుట కిష్టపడలేదు; ఆ రాజీకుదురదని మొదటినుండి భావించిరి. చాలమంది యాంగ్లేయులకు గాంధి యిర్విను సమాఖ్య సరిగా అమలుజరుగుట యిష్టముగాదు. వారు ఈసారి సత్యాగ్రహ మును మొదలంట అణచివేయదలచి, అందుకుముందే సన్నాహ మారంభించిరి,

ఈలోగా ఇర్విను వెళ్ళిపోయి, ఆస్థానే విల్లింగ్డను ప్రభువు వైస్రాయిగ (1931 ఏప్రిలులో) వచ్చెను. ఈ ఉద్యోగులు స్వేచ్ఛగ నిట్టి ప్రయత్నముల చేయుటకు అప్పుడు బ్రిటిషు ఎన్నికలలో కాన్సరేటివుల కమితమైన ప్రాబల్యము వచ్చుటయు తోడ్పడినది. అంతట ఆవేశంతో మన సర్కారుద్యోగులు రాబోవు సత్యాగ్రహమును వెంటనే పూర్తిగా అణచతలపెట్టిరి. అందుకై ముందుగనే ఆర్డినెన్సులతోబాటు వేలకొలది కొత్త లారీల దయారుచేయించి అమర్చిరి. 1932 జనవరిలో (కాంగ్రెసువారుద్యమము నడుపు పద్ధతులాలోచించుచుండగనే) సైనికశాసనములవంటి హుకుములతో పోలీసులకు సర్వాధికారమిచ్చిరి. వారు వేలకొలది కాంగ్రెస్ ప్రముఖులను ముందే జైలులో పెట్టిరి. లక్షలకొలది జనులను పోలీసువారు లారీలతో కొట్టిరి; దౌర్జన్యంచేసిరి. అనుమానస్థులగు వ్యాపారస్తుల ఆస్తులను ప్రభుత్వంవారు స్వాధీనము చేసుకొనుటకు ఇండ్లనాక్రమించి, అందుండి జనులను లేవగొట్టుటకు సిద్ధమైరి; సబర్మతీ, సీతానగరం ఆశ్రమంవంటి ఆశ్రమములు స్వరూపనాశనమయినవి. కొందరు పోలీసువారు అనుమానితులను గూడ బాధపెట్టిరి. జాతీయపత్రికలను, జాతీయసంఘములను అణచివేసిరి. దేశమంతటను భీభత్సము గల్గినది. మరియు జనులలో తగినంతగా నిర్మాణ కార్యక్రమ మింకను వ్యాపించలేదు. దాని ప్రాముఖ్యమును గాంధిగారు ఎంతో చెప్పినను చాలమంది గమనించకపోవుట గొప్పలోపము.

లండనులో ముస్లిము ప్రతినిధులు కాంగ్రెసుపక్షముతో కలసి రాకుండుటకు భారతీయులలో చీలికలింకను హెచ్చుటకును ఆంగ్ల వర్తకులు కొంతవరకు కారణము. వారు ముస్లిములు, పంచములు వగైరాలకు తమ కంపెనీలద్వారా ముందు లాభము గల్గింతుమని ప్రభుత్వముచేతగూడ ప్రత్యేక సదుపాయములు కల్పింతుమని ఆశపెట్టి, లాలించి, ఆప్రతినిధులను చీలదీసిరి; ఈ దేశములోను ఆ సంఘములలో గట్టి ప్రచారము చేసిరి. అందుకు ఫలితముగా ముస్లిములును, కొందరు నిమ్నజాతీయులును ఆకృష్టులై, 1932 సత్యాగ్రహమున సర్కారుకు తోడ్పడిరి. మితవాదులును తటస్థులమని చెప్పుచు, గోడమీద పిల్లివలె నుండుచు, పరోక్షముగ ప్రభుత్వచర్యలకు కొంత సహాకారులైరి. మరియు, ఆర్థికస్థితి తారుమారై, గ్రామాలలో అప్పుడు రైతులు, వర్తకులు వగైరాలు బాధలబడుచు శాంతినిగోరిరి. కాంగ్రెసువారు సాగిం

చిన సత్యాగ్రహమువల్లనే యార్థిక దుస్థితి గల్గెనని అజ్ఞానులను సర్కారువారు భ్రమపెట్టిరి. ఈ స్థితిలో గాంధిగారపుడు హరిజనదీక్ష కెక్కువ ప్రాముఖ్య మిచ్చిరి. అందుచే సామాన్యప్రజల దృష్టియు, కొంతవరకు కాంగ్రెసువారి శక్తియు, ఆ సమస్యలో లగ్నమై సత్యాగ్రహముపైన ధ్యానము తగ్గినది. ఆ ప్రచండ సత్యాగ్రహము ఇట్టి కారణములవల్ల మందగించినది. చివరకు దానిని 1933 లో గాంధిగారే నిలుపుచేయించిరి.

1931 లో లండనుసభలో సాంఘికసమస్యనుగూర్చి భారతీయుల మధ్య తగవేర్పడి, వారందరును కోరిన తాను పరిష్కరింతునని బ్రిటిషు ప్రధాని చెప్పెను. అప్పుడందుకు కొందరొప్పుకొనిరి. "ముస్లిములువగైరా యితరమతస్థులకు, హిందువులకు మధ్య సమస్య నాతడు పరిష్కరించినను హిందువులలోని హరిజనుల యెన్నికపద్ధతిని మాత్రము పరిష్కరించకూడదు" అట్లుగాక బ్రిటిషుప్రధాని హరిజనులను చీలదీసి ముస్లిములవలె, క్రైస్తవుల వలె, వారిని ప్రత్యేకవర్గముగ జేయునెడల అట్టిదానిని తన ప్రాణమిచ్చి యైనను యెదిరింతునని గాంధిగారు లండనులోను, భారతదేశమునకు తిరిగి వచ్చినతరువాత బొంబాయిలోను తెల్పిరి. శాసనసభ్యుల యెన్నికలలో హరిజనులను హరిజనులే యెన్నుకొనునట్లు ప్రత్యేక నియోజకవర్గ మేర్పర్చిన యెడల, దానిని గర్హించుటకు ఖండించుటకు తాను ఆ మరణాంతం ఉపవసింతునని, యరవాడజైలునుండియు గాంధిగారు బ్రిటిషుప్రధానికి దెల్పిరి. కాని ఆ వార్తను ప్రభుత్వమువారప్పుడు వెంటనే బయటకు రానీయక కప్పిపుచ్చిరి. గాంధిగారిమాటను తోసివేసి బ్రిటిషుప్రధాని హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గ మేర్పర్చెను. ఈ పద్ధతిపెట్టుటవల్ల మాలమాదిగలు సవర్ణులనుండి వేరుజాతి యగుదురు. వారి అస్పృశ్యతయు వారితో సవర్ణులకు విభేదమును చీలికయు స్థిరమగును. హరిజనులకు తక్కినహిందువులతో విరోధమేర్పడి, శాశ్వతహాని గల్గును. మరియు ప్రత్యేక నియోజకవర్గముద్వారా ఎన్నికయగు ప్రతినిధులు స్వలాభపరులై, జాతీయతకు వ్యతిరేకులై, ముఖ్యాంశములలో బ్రిటిషుసర్కారున కండయగుదురు. హరిజనులు, ముస్లిములు, క్రైస్తవులు వగైరాలకు తోడై, శాసనసభలయందును, బయటనుగూడ, కాంగ్రెసుకు వ్యతిరేకులగుదురు. జాతీయభావము ఉదారత క్షీణించి, ద్వేషము కలహములు బలపడును. హిందూజాతికిక మోక్షముండదు. అట్టిస్థితిలో సత్యా

గ్రహమును క్షీణించును. బ్రిటిషుప్రధానిగారి యీ 'ఫైసలా'వల్ల సత్యాగ్రహమునకేగాక, మన జాతీయతకు, హిందూసంఘమునకునుగూడ శాశ్వతహాని వాటిల్లుపరిస్థితి సంభవించును.

దూరదృష్టితో గాంధిగారీ ప్రమాదములను ముందేకనిపెట్టి, వాటినెట్లయిన నివారింపబూనిరి. "హిందువులలో (హరిజనులుసహా) అన్నిపక్షముల నాయకులును కలిసి ఏకాభిప్రాయులై సవరణ ప్రణాళికను సూచిస్తే వారట్లు సూచించుపద్ధతి నంగీకరింతుము; లేకున్న మానిర్ణయము తప్ప"దని బ్రిటిషుప్రధాని ప్రచురించెను. కనుక హిందువులందరిహృదయముల మార్పించుటయే అట్టిసవరణ ప్రణాళికను తయారుచేయించుటకు మార్గము. అందుకు గాంధిగారప్పుడు జైలులో కఠోరమైన ఉపవాస మారంభించిరి. బ్రిటిషుప్రధానినిర్ణయము 17-8-31 తేదీని వెలువడెను; మరునాడే జైలులోనుండియే వారికి తంతిద్వారా మహాత్ముడు తాను 20-9-32 నుండి యుపవసింతునని తెల్పెను, కాని ఆవార్తను ఆలస్యముగా 12-9-32 తేదీన ప్రభుత్వము వెల్లడిచేసెను. వెంటనే ప్రజలలో గొప్ప యాందోళన గల్గినది. ఈసమస్యప్రాముఖ్యము నంతట గ్రహించి హిందువులలో పరస్పరం అంగీకారమును కుదుర్చుటకై, శ్రీ మాలవ్యవగైరా హిందూనాయకులు వచ్చిరి. గాంధిగారు చాల నీరసస్థితిలో నుండిరి. రాజకీయములో హరిజన నాయకులైన ఎం. సి. రాజా, అంబేడ్కరు వగైరాలును, సవర్ణ హిందువుల ముఖ్యనాయకులును పూనాలోకలసి చర్చించిరి. ఇందు ఎం. సి. రాజా హరిజనులకును సవర్ణులతోబాటు సమిష్టి నియోజకవాది. అంబేడ్కరు ప్రత్యేక నియోజకవాది. ఐదురోజులు దీర్ఘచర్చ జరిగి తుదకెట్లో రాజీ ఏర్పడెను.ఆప్రకారం శాసనసభలలో హరిజనులకు బ్రిటిషుప్రధాని యిచ్చిన వాటికి రెట్టింపు సభ్యత్వస్థానము లిచ్చిరి; ఒక్కొక్క స్థానమునకు హరిజనులు ముందుగా నలుగురి నెన్నుకోవలె, వారిలో నొకనిని తరువాత వోటరులందరు (సవర్ణులతోసహా తక్కిన స్థానములకువలె) ఎన్నుకొందురు. అస్పృశ్యతను తొలగింప వెంటనే తీవ్రకృషి జేతుమని సవర్ణనాయకు లప్పుడు తీర్మానించిరి. ఈ పద్ధతివల్ల సవర్ణులకు హరిజనులకు మధ్య సహృదయతయు, సహకారము నుండును. (ఇట్లు హరిజనులు ముందుగా యెన్నుకొనుట పదేండ్లవర కుండును.) ఈ రాజీప్రకారము సర్కారువారు తమ

సాంఘికనిర్ణయమును సవరించిరి. ఈ ఆరురోజులలో గాంధిగారు చాల నీరసించినను, ఆరోగ్యముగనుండిరి. ఈ పరిష్కారమున కన్ని వర్ణములవారును తృప్తులైరి. హిందువులలో సవర్ణులకు హరిజనులకు మధ్య విభేదములు పోగొట్టి సంఘటనజేయుటే గాంధిగారి యీప్రతిజ్ఞకు ముఖ్యోద్దేశము. హరిజనుల కస్పృశ్యత యున్నంతవరకా భేదముపోదు. కనుక అస్పృశ్యతను నివారించి వారిని వీలైనంత త్వరలో దేవాలయములలోనికి రానిచ్చుటకు వారందరు సభలో తీర్మానించిరి. ఆప్రకారం హరిజనోద్ధరణకై గాంధిగారు తమకాలము నంతను వినియోగింతునని ప్రచురించిరి. ప్రభుత్వమువా రందుకుమాత్రము, జైలునుండి పత్రికలకు వ్యాసములు వ్రాయుటకు, హరిజనసేవకులతో అందునుగూర్చి ప్రసంగించుటకు అవకాశ మిచ్చిరి, ఆయన జైలునుండియే తదేకదీక్షతో హరిజనోద్ధరణకై జనులకు సందేశము లంపుచుండెను.

# 31 విరామము

ప్రభుత్వంవారెంతో కఠినచర్యలనుజరిపినను 1932 ఆఖరువరకు దేశంలో కొత్తఆర్డినెన్సుల నతిక్రమించుట, పికెటింగుచేయుట, జాతీయపత్రికలప్రచారము, నిషిద్ధకరపత్రముల వ్యాప్తి వగైరాలు సాగుచునేయుండెను. ఈ పత్రికలు రహస్యముగ నచ్చుబడి వాలంటీర్లద్వారా చాలదూరం ప్రచారమగుచుండెను. కాంగ్రెసు సంఘములను, కొన్ని ఖద్దరుసంస్థలు వగైరాల కార్యాలయములనుగూడ పోలీసులు వశపర్చుకొనిరి. కాంగ్రెసువారును సంఘములకు బదులు ప్రతిప్రాంతములోను కాంగ్రెసుకు 'డిక్టేటరు'ల నేర్పర్చిరి. అరెస్టు అయిన నియంత తనస్థానే కొత్తవారిని నియమించును. కాంగ్రెసువారు రహస్యచర్యలనుజేయుట సత్యాగ్రహపుసూత్రాలకు విరుద్ధమని గాంధిగారనిరి. సత్యాగ్రహపువార్షికోత్సవము 4-1-1933 తేదీని దేశమంతటను పోలీసువారి లాఠీ ప్రహారపు వర్షములో తీవ్రముగజరిగెను. కాంగ్రెసుపక్షీయులు కానివారిని, సత్యాగ్రహము చేయనివారిని, హరిజనసేవయే గట్టిగసాగించుమని గాంధిగారు మొదటతెల్పిరి. తగినంతమంది యట్లుచేయలేదు; కనుక హరిజన సమస్యవైపు ప్రజలందరి దృష్టిని మరల్చుటకు ఆయన 8-5-1933 నుండి మరల మూడువారముల దీర్ఘోపవాస మారంభించెను. ఈసారి, ఆయన

జీవింపడని ఘన వైద్యులు చెప్పిరి. ప్రభుత్వము వారంతట ఆయనను విడుదల చేసిరి. ఆయన 21 రోజులు ఉపవసించియు, అంతశ్శక్తిబలంతో జీవశక్తిని నిల్పుకొనెను. జాతీయనాయకులు చాలవోట్ల హరిజనోద్ధరణకై కృషి జరిపిరి; కాంగ్రెసు నాయకులు 1933 జూలైలో పూనాలో సభచేసి, పరిస్థితు లాలోచించి సమిష్టి సత్యాగ్రహమును నిల్పివేసిరి.

# 32 వ్యక్తి సత్యాగ్రహము

గాంధిగారప్పుడు తన సబర్మతీ ఆశ్రమము నసలే రెత్తివేసి, అందలి వస్తువులను కొన్ని ధర్మసంస్థల కిచ్చిరి. ఆప్రదేశమున హరిజనాశ్రమ మేర్పడినది. ఆయన ఆస్తుల సంపర్కమును వదల్చుకొని వెంటనే మరల గుజరాతులో సత్యాగ్రహ యాత్రను తలపెట్టిరి. కాని 31-7-1933 అర్ధరాత్రి వేళ ఆయనను ఆశ్రమవాసులతోసహా సర్కారువారు అరెస్టుచేసి జైలులో నుంచిరి. తరువాత 1-8-33 తేదీన ఆయనను విడిచిపెట్టుచు పూనాలోనే ఉండవలెనని నిర్బంధాజ్ఞను విధించిరి. గాంధిగారాయాజ్ఞ నుల్లంఘించిరి. అందుకు విచారణయై, ఆయన కేడాది శిక్ష విధింపబడినది. వందలకొలది యోధులు మరల జైలుయాత్ర జరిపిరి.

గాంధిగారు జైలులోనుండిన ఆ సమయంలో హరిజనోద్యమ ప్రచారమున కాయనకు జైలులో ప్రత్యేక సదుపాయములను సర్కారువారు ఇచ్చిరి గదా, ఈసారి వాటిని తొలగించిరి. ఆ కారణమున గాంధిగారు జైలులో మరల నుపవాస మారంభించిరి. వారంరోజుల కాయనస్థితి అపాయమునకు రాగా, సర్కారువారాయనను విడచిరి. ఈ కారణముననే విడుదలయైనందున ఆయన ఆ యేడాదియు హరిజనప్రచారమే సాగించెను. రాజకీయములం దవసరమగు సలహాలమాత్ర మిచ్చుచుండెను.

ఆ ప్రకారము గాంధిగారప్పుడు మనదేశమంతట దీర్ఘప్రయాణమును చేసి, చాల సభలందు ఉపన్యసించి ఉద్బోధించిరి దేశభక్తులతోను సంప్రదించిరి. గ్రామములలో సభలకు వేలకొలది జనులు వచ్చుచు, మహాత్ముని దర్శించి, ఆయన సందేశమును వినుచుండిరి. ఆయన చాల ద్రవ్యమును వసూలుచేసి, హరిజన సేవకే వినియోగించిరి.

# 33 వ ప్రస్తత

ఇట్లు 1934 లో గాంధిగారు హరిజనోద్యమమున మగ్నులైరి. అప్పుడు దేశమున రాజకీయ కార్యక్రమ ముండవలెనని కొందరు కోరిరి. మరికొందరు సామ్యవాదిపక్షమును స్థాపించి, వారి సిద్ధాంతముల ప్రచారము చేసిరి. వీరును అహింసా శాంతిపద్ధతుల కొప్పుకొనిరి. హెచ్చుమంది కాంగ్రెసువారు శాసనసభలలో పాల్గొనదలచిరి. శాసనసభాకార్యము స్వరాజ్యసాధనం కాదని, బయటనుండి నిర్మాణకార్యమునే జరిపి, ప్రజలలో సంఘటనను స్వాతంత్ర్యదీక్షను కల్గించుటే యెక్కువ ముఖ్యమని గాంధిగారెంచిరి. ఐనను, ఆయన సహచరులలో హెచ్చుమంది యెన్నికల వరించిరి. కనుక గాంధిగారు సమ్మతించిరి. వ్యక్తి సత్యాగ్రహమునుగూడ నిల్పివేసిరి. అంతట ప్రభుత్వమువారు కాంగ్రెసు సభలపైన నిరోధమును తొలగించిరి. 1934 లో కేంద్రశాసనసభ (ఢిల్లీఅసెంబ్లీ) కెన్నికలు జరిగినవి. అందు కాంగ్రెసువారును పోటీచేసిరి. హిందువుల సామాన్యస్థానములలో చాలవరకు కాంగ్రెసువారే గెల్చిరి. ముస్లింస్థానములకై కాంగ్రెసువారంత శ్రద్ధ వహించలేదు. ఆబాధ్యతను జనాబ్ జిన్నా వగైరాలపై విడచిరి. అందువలన కాంగ్రెసుకు మొత్తంమీద మెజారిటీరాలేదు; కాని వెనుకటికన్న కాంగ్రెసుబలము పలుకుబడి హెచ్చి ప్రభుత్వమువారును కొంత ప్రజాభిప్రాయమును మన్నింపజొచ్చిరి. (ఈస్థితిలో 1934 అక్టోబరు) గాంధిగారు కాంగ్రెసు సభ్యత్వమును అనగా (నాల్గణాల చందాదార్ల) ప్రాథమిక సభ్యత్వమునుగూడ మానిరి. "బయటనుండియే కాంగ్రెసునిర్మాణమున కెక్కువ సేవ జేయగలుగుదును, అది కాంగ్రెసుకును చాల సహాయకారి, నా సహాయమును కోరినప్పుడెల్ల తోడ్పడుటకు, ముఖ్యవిషయములందు సలహాల నిచ్చుటకు అభ్యంతరములేదు" అని ఆయన చెప్పి సహచరులను తృప్తిపర్చిరి. మరల సత్యాగ్రహము సాగించుటకైనను గ్రామాలలో ముందుగా పునర్నిర్మాణము జరుగుట ముఖ్యావసరమని ఆయన నిర్ణయించిరి.

# 34 సంఘపునర్నిర్మాణము

గాంధీగారంతట గ్రామపునర్నిర్మాణమునకై ఒక ప్రక్రియను తయారు చేసి, దానివ్యాప్తికి తమశక్తినంతను వినియోగించిరి. అది అన్ని పక్షములవారికి సమ్మతము. దానిసంస్థయే 'ఆలిండియా విలేజి ఇండస్ట్రీస్ ఎసోసియేషన్' అఖిలభారత గ్రామపరిశ్రమలసంఘము. 1934 అక్టోబరులో కాంగ్రెసు మహాసభ బొంబాయిలో శ్రీ రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతను జరిగినది. మహాత్ముడు కాంగ్రెసు సభ్యత్వమును వీడినందుకు శోకమును, కాంగ్రెసున కాయన చేసిన యపారసేవకు కృతజ్ఞతను తెలుపుచు కాంగ్రెసువారు తీర్మానించిరి. గాంధీగారు క్రొత్తగ స్థాపించు గ్రామపరిశ్రమలసంఘమున కామోద మిచ్చి దానికందరును తోడ్పడవలెనని తీర్మానించిరి.

కాంగ్రెసుసంస్థలో నేర్పడిన లోపముల బోగొట్టుటకై దానినిర్మాణములో కొన్ని మార్పులు చేయుట అవసరమని ఆయన సూచించిరి. ఆ ప్రకారము ఆ మహాసభవారు ఇదివరకువలె మొత్తము జనాభానుపట్టిగాక, ఆయా ప్రాంతముల కాంగ్రెసుసభ్యుల సంఖ్యనుబట్టియే కాంగ్రెసుకు ప్రతినిధుల సంఖ్యను నిర్ణయించుట కేర్పాటుచేసిరి, కాంగ్రెసు కార్యవర్గీయులందరును, ప్రతినిధులును విధిగ ఖద్దరునే కట్టుచుండవలెననియు నిర్ణయించిరి.

అంతటినుండి గాంధీగారు మధ్యరాష్ట్రమందలి వర్ధాపురికి సమీపమందున్న 'సేవాగ్రామం'లో వసించుచు, అక్కడ తమ కార్యస్థానము నుంచి నిర్మాణకార్యక్రమమును, చేతిపరిశ్రమలను వృద్ధిచేయించినారు. గ్రామప్రజల ఆయురారోగ్యాదు లభివృద్ధిజెందుటకై వివిధ పరిశోధనలను జేసినారు.

# 35 కొత్త రాజ్యాంగము

పాలితదేశీయులను విభజించి పాలించుటే సామ్రాజ్యవాదుల పద్ధతి. కనుక బ్రిటిషుసర్కారువారు జాతీయవాదుల నణచుచు, మితవాదులను కులతత్వపరులను స్వార్థపరులను తమ దగ్గరకు చేరదీయుచుందురు. వారు ఆసమయంలోను అట్లేచేసి లండనులో విచిత్రనాటకము జరిపించి, మన కీయ దలచిన కొత్తరాజ్యాంగపద్ధతిని మాత్రమును దెల్పునట్టి శ్వేతపత్రమును జారీ చేసి, ఆప్రకారం రాజ్యాంగమును తయారుచేసి వ్రాయుటకు ఒక ఉపసంఘము నేర్పరచిరి. ఆ ఉపసంఘమువారు విచారణచేసి నివేదికను తయారు చేయగా, దాని ననుసరించి బ్రిటిషుప్రభుత్వమువారు పార్లమెంటులో నొక చట్టమును చేసిరి. ఆచట్టముప్రకారము అసెంబ్లీసభ్యులను, ప్రజలకు బదులు రాష్ట్రశాసనసభ్యు లెన్నుకోవలెను. కేంద్రప్రభుత్వమందు సేన, ద్రవ్యము వగైరా ముఖ్యాంశములు బ్రిటిషువారి వశమందుండును. రాష్ట్రములకు కొంత యధికార మిచ్చినను, దానికిని కొన్నియాటంకముల బెట్టిరి. డొమినియను రాజ్యాంగదృష్టినిగూడ ఆచట్టము యెంతమాత్రం తృప్తికరంకాదు. చిత్తు చట్టములోనున్న కొద్ది అధికారమునుగూడ పార్లమెంటు చర్చల సందర్భమున నింకను తగ్గించిరి. రక్షణలను పేర అడుగడుగునకు గవర్నర్లకు, సివిలియనులకు, ప్రత్యేకాధికారముల నిచ్చిరి. వా రింగ్లీషుప్రభుత్వపు ఆజ్ఞప్రకారము నడుచుకోవలెనట! ఈ వికృతరూపముతో నిది 1935 లో చట్టమయినది. కేంద్రంలో సామంతరాజ్యాలతో కలిపి ఒక 'ఫెడరలు' (సమిష్టి) రాజ్యాంగ పద్ధతినిగూడ నేర్పాటుచేసినారు. ముందుగా రాష్ట్రములకు సంబంధించిన రాజ్యాంగమునే ప్రభుత్వా రమలునకు తెచ్చినారు. (సంస్థానాధిపతులు కలసివచ్చుట లేదనుసాకున అందలి కేంద్రభాగమును అమలులో పెట్టనే లేదు. ఈ కొత్తచట్టంప్రకారం ప్రజలలో హెచ్చుమందికి 'ఓటిచ్చు హక్కు' కలిగినది.) 1936 ఆఖరునుండి ఆచట్ట మమలునకు వచ్చినది. ఆయెన్నికలో పాల్గొన్న, తద్వారా కాంగ్రెసు సిద్ధాంతమును దేశమంతట ప్రజలకు బోధింపవచ్చు, ఎన్నికలలో గెల్చి కాంగ్రెసే నిజమగు ప్రజాసంస్థయని చూపవచ్చు; ప్రజాద్రోహు లీ సభలోదూరి విదేశప్రభుత్వమున కండగాకుండ నిరోధించవచ్చు, సభలో ప్రభుత్వమువారి నిరంకుశపద్ధతుల నడ్డుకొనవచ్చు,

కనుక, గాంధీగారి సమ్మతితో, 1936 సాలున జరిగిన కాంగ్రెసు మహాసభ యందు కాంగ్రెసువారు ఆ కొత్తయెన్నికలలో పోటీచేయవలెనని తీర్మా నించిరి. 1937 ఆరంభమందన్ని రాష్ట్రాలలో కొత్తశాసన సభలకు ఎన్నికలు జరిగెను. అందులో హిందువులస్థానములకే కాంగ్రెసువారు తగు శ్రద్ధతీసి కొనిరి. ముస్లిములు హెచ్చుగనున్న స్థానములలో కాంగ్రెసుసభ్యులు హెచ్చుమంది గెలువలేదు. మద్రాసు, బొంబాయి, బీహారు మొదలగు ఆరు రాష్ట్రముల అసెంబ్లీలలో కాంగ్రెసువారికే హెచ్చుస్థానములు వచ్చినవి. అక్కడి మంత్రిత్వము 'మెజార్టీపార్టీ' అగు కాంగ్రెసువారికి రావలె. ఆ మంత్రిత్వము నంగీకరించదగునని పటేలు, రాజేంద్రప్రసాదు, రాజ గోపాలాచారి వగైరాలును, కూడదని సోషలిస్టులును వాదించిరి. ఇట్లు కాంగ్రెసులో సంఘర్షణము కల్గెను. అంతట, ఆ చట్టమునకు లోబడి మంత్రులుచేయు కార్యములకు గవర్నర్లు తమ ప్రత్యేకాధికారము క్రింద అడ్డుదగులమని ఒప్పుకొన్నయెడల కాంగ్రెసువారు మంత్రిత్వము వహింప వచ్చునని గాంధిగారు 1937 మార్చిలో సూచించిరి. దానిని అఖిలభారత కాంగ్రెసుసంఘము ఖాయపర్చెను. అప్పుడట్టి మాట యిచ్చుటకు గవర్న ర్లొప్పుకోలేదు. అందువలన కాంగ్రెసువారు మంత్రిత్వమును వహింప నిరాకరించిరి. ఇతర పక్షములవారు తాత్కాలిక మంత్రులైరి. కాని, వారు శాసనసభలలో తమ పక్షబలం లేనందున ఆ సభలనే సమా వేశపరచలేకపోయిరి. అంతట, మంత్రులు శాసనబద్ధంగాచేయు కార్యాలలో సాధారణంగా గవర్నర్లు కల్పించుకోరని వైస్రాయియు, భారతమంత్రియు ప్రచురించిరి. కాంగ్రెసుసభ్యు లుద్యోగమును వెంటనే వహించి ప్రజలకు మేలైన యుపకారముల జేయవలెనని జనులును ఆతురపడిరి. గాంధిగా రందుకు సమ్మతించిరి. 1937 జూలైలో కాంగ్రెసుసభ్యులు ఆరురాష్ట్రములలో మంత్రిత్వబాధ్యత వహించిరి. అప్పటినుండి నిర్మాణకార్యములను జరుపుట కును, సందిగ్ధసమస్యల నిర్ధారణకును, మంత్రులకును గాంధిగారు తమ హరిజనపత్రికద్వారాను, సంభాషణలందును గొప్పసూచనల జేయుచుండిరి. ఆ ప్రకారం ఆయా రాష్ట్రాలలో నిర్మాణాత్మకమై, ప్రజోపకారియైన చట్ట ములను, ప్రణాళికలను కాంగ్రెసుప్రభుత్వంవారు యథాశక్తిగ అమలు జరిపినారు. జాతీయస్వాతంత్ర్యమును సాధించుటకుగాను ప్రభుత్వోద్యోగుల

పైన 1908 సం॥నుండి బాంబుల ప్రయోగము మున్నగు హింసాచర్యల జరిపించి, కొందరు యువకు లిదివరలో ద్వీపాంతరవాస దండనపొంది, అండమానుదీవులలో నిర్బంధముల ననుభవించుచుండిరి. గాంధిమహాత్ముని సహాయంవల్ల ఆ ఖైదీ లనేకులు వారివారి రాష్ట్రములకు సర్కారువల్ల రప్పింపబడిరి. ఆయనవల్లనే, దౌర్జన్యచర్యకై నిర్బంధమందుంచబడిన యువకు లనేకులను కాంగ్రెసుప్రభుత్వములేకాక బెంగాలు ప్రభుత్వమును గాంధిగారి ప్రోద్బలంమీదనే అప్పుడు విడుదలచేసినది. బెంగాలులో అప్పట్లో కాంగ్రెసు ప్రభుత్వము ఏర్పడలేదు. కాని, ఆ యాశయములు కొంత మన్నింపబడినవి.

# 36 హరిపుర కాంగ్రెసు

1938 ఫిబ్రవరిలో కాంగ్రెసు వార్షిక మహాసభ గాంధిమహాత్ముని సలహాప్రకారం హరిపురగ్రామంలో జరిగినది. హరిపురం గుజరాతులో గాంధిగారికి ప్రియమగు బర్డోలీ తాలూకాలోనిది. గాంధిగారు కాంగ్రెసు పురమునకు (విఠలనగర) మను పేర స్వర్గీయ శ్రీ విఠలబాయి పటేలుగారికి స్మారకముగ నామకరణ మొనర్చిరి. ఆయన గ్రామసౌభాగ్యమునకై తాను జరిగించు పరిశోధనల అనుభవమును ప్రజలందరికిని బోధించి, ఆ పద్ధతి నక్కడ అమలుజరిపినారు. గాంధిగారి కొత్తపద్ధతివలన కాంగ్రెసు మహాసభ వార్షిక సమావేశము జరిపించెడు గ్రామప్రాంతమున సుమారు 6 నెలలు నిర్మాణాత్మక కార్యములు జరుగుట వలన, అక్కడ కాంగ్రెసునుగూర్చి జనులలో ప్రత్యేకప్రచారము జరుగును; కాంగ్రెసు తమసంస్థయే [illegible]ని, ఆ ప్రాంతపుప్రజలందరికిని బోధపడును. ఆ ప్రాంతీయులు స్వయంసహాయ పద్ధతిని గ్రహించి, నగరనిర్మాణమంతను స్వయముగా జేయుదురు. వారికి నిర్మాణకార్యాలలో అనుభవమును, ఆత్మవిశ్వాసమును, జాతీయోత్సాహమును హెచ్చును. ఫెయిజ్‌పుర కాంగ్రెసునకన్న ను హెచ్చుగ హరిపురకాంగ్రెసునకు 2½ లక్షలమంది వరకును జనులు వచ్చిరి. అంతమంది ప్రేక్షకులకును గ్రామాలలో తయారైన దేశీయవస్తువులతోనే యావత్తు యేర్పాట్లును జరిగినవి. అనగా ఆ సభనిమిత్తము ఖర్చైన 7 లక్షల రూపాయలు రమారమి

ఆ ప్రాంతపు ప్రజలకే లభించినవి. ఆసాలు కాంగ్రెసుకధ్యక్షుడుగ గాంధిగారి సలహాపైన సుభాసచంద్రబోసుగా రెన్నుకోబడి, కార్యక్రమమునంతను ఉత్సాహంతో నిర్వర్తించిరి మహాసభ ఉపాంగములలో ముఖ్యము ఖద్దరు స్వదేశీప్రదర్శనం. ఆ కాంగ్రెసుసభకు వారమురోజులు ముందుగ చక్కని యేర్పాటులతో ఖద్దరుప్రదర్శనము జరిగినది. మహాత్ముడే దానికి ప్రారంభోత్సవమును చేసి, జనుల కుత్తేజకమగు సందేశము నిచ్చుచు, ఆర్థిక రాజకీయ ముల సమన్వయించుచు, యువకునివలె ఉత్సాహముతో నుపన్యసించెను; నిజముగా గ్రామజనులందరికి స్వదేశవస్తుప్రదర్శనమే యెక్కువ ముఖ్యమని, దాని యభివృద్ధియే దేశమునకు మోక్షమిచ్చునని మరల జనులకు నిరూపించెను. తరువాత కాంగ్రెసునాయకులు కార్యసమితి వగైరాలందు జరుపు సంప్రదింపులలో గాంధిగారి సూచనలు మార్గదర్శక మయినవి.

# 37 మొదటి కాంగ్రెసు మంత్రివర్గము

కాంగ్రెసువారు రాష్ట్రీలలో పరిపాలన మారంభించిన కొన్ని నెలలతరువాత పరాను, అస్సాం రాష్ట్రీలలోను వారి ప్రాభవ మేర్పడినది. వారు ఎన్నికల కార్యప్రణాళికను మనఃపూర్వకంగా అమలు జరుపుచు రెండేండ్లుపైగా 8 రాష్ట్రీలలో పాలనను సాగించిరి. కొంతవరకు ప్రజలకు సౌఖ్యముకల్గినది. జనులలో జాతీయోత్సాహము, స్వాతంత్ర్యభావము, ప్రబలినది. ఖాదీమున్నగు చేతిపరిశ్రమలవృద్ధి, హరిజనులకు అస్పృశ్యత తొలగించి వారికి ఆలయప్రవేశమున కవకాశమిచ్చుట, లోకలుబోర్డు మునిసిపలుపాలన ప్రజానుకూలమగుట, విద్యారోగ్యాదులవృద్ధి, త్రాగుడు తగ్గించుట, రయితులస్థితి బాగుచేయుట, ఇట్టి కార్యాలకు క్రొత్తచట్టము లేర్పడి, కొన్ని ప్రణాళికలు తయారయినవి. ఈ రాష్ట్రంలో రాజాజీ ప్రకాశంగార్ల నాయకత్వమున కొంతకార్యము జరిగెను. కాని జరుగవలసి నంత జరుగకముందే ముఖ్యాంశము లింకను చర్చలో నలుగుచుండగా కాంగ్రెసుమంత్రివర్గములు తమ యుద్యోగములనుండి విరమించవలసివచ్చెను.

ఈ మంత్రుల కార్యక్రమమునకు గాంధిగారి సహచరులగు పటేలు, ఆజాదు, పట్టాభి, రాజేంద్రప్రసాదు ఇత్యాదులు పార్లమెంటరీ బోర్డుగా

సలహాయిచ్చుచుండిరి. కాని, గాంధీయులకును, కాంగ్రెసు అధ్యక్షుడగు సుభాసుపక్షీయులకును దృక్పథంలో కొంతవిభేద మేర్పడినట్లు క్రమంగా తేలినది. కేంద్ర ప్రభుత్వమును, గవర్నరులును, గవర్నర్ల చేతిక్రింది ఐ. సి. ఎస్. పోలీసు వగైరాల గొప్ప ఉద్యోగులును కాంగ్రెసు ప్రణాళికకు వ్యతిరిక్తులు. ఈ కొత్తరాజ్యాంగము ప్రకారము వారిపైన కాంగ్రెసు మంత్రులకు నిజమైన అధికారములేదు; కనుక, జాతీయవాదు లా సమయమున కాంగ్రెసు సర్కారుద్వారాను, బయటను, నిర్మాణకార్యక్రమప్రణాళికను అమలుపరచి, జనులలో ఐక్యమును పెంపొందించి, అహింసాధోరణిని బలపర్చవలెనని, రయితుల నుద్ధరించవలెనని, గాంధీయులభావము. 'బ్రిటిషు సామ్రాజ్యమును వెంటనే తొలగించుటే కాంగ్రెసు ముఖ్యాశయము. జనులలో జాతీయావేశమును బలపర్చి, మంత్రివర్గము బ్రిటిషుసర్కారుతో డీకొనవలెన'ని బోసుపక్షీయుల వాదము. వీరి తీవ్రవాదముకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు తోడయిరి ఈ వామ, దక్షిణ పక్షములమధ్య సంఘర్షణమేర్పడి, మంత్రివర్గంవారి పరిపాలనపైన కొందరు, ముఖ్యంగా కార్మికులు ఒత్తిడి తెచ్చిరి. నిర్మాణకార్యమును సాగించుటకు జనులకెంతో శాంతి, ఓపిక, పూనికయు కావలె. తీవ్రమగు ఆందోళనను ప్రేరేపించు కార్య మెక్కువ ఆవేశకరము కనుక, నియమ నిగ్రహాలకన్న, సద్యోమోక్షమునకు ఆశ గల్గించు 'ఘాటు' అగు కార్యక్రమమే ఆవేశపరులగు హెచ్చుమందికి నచ్చినది. మరియు అధికారపదవి చేతికందగనే కొందరు కాంగ్రెసువాదులలో త్యాగసేవాపరతతగ్గి వ్యక్తివిభేదములవలన కొంత సంఘర్షణమేర్పడెను. ఈ కారణములవలన కాంగ్రెసుప్రభుత్వపుపాలన మొదట అనుకొన్నంత లాభకారిగ సాగలేదు. ఈలోగా కొత్త అవాంతరములు వచ్చినవి.

# 38 త్రిపురి

కాంగ్రెసులో యీ పక్షవిభేదము 1938 సాలాఖరునకు ప్రకోపించినది. తరువాత జాతీయమహాసభ మధ్యరాష్ట్రంలోని త్రిపురి అను చిన్న గ్రామమున జరిగెను అందుకు కాంగ్రెసు అధ్యక్షుని యెన్నికలో పెద్దపోటీ కల్గినది. సుభాసుబాబు మరల అధ్యక్షుడు కాదలచెను. ఆయన తీవ్రవాదము

కార్మికవర్గమునందును, దేశీయ రాజ్యములందు విప్లవం కల్గించుట కాయన చేసెడి ప్రోత్సాహము, అహింసాతత్వమునుగూర్చిన నిరసన, కాంగ్రెసు మంత్రివర్గమును సంఘర్షమున కాయత్తపర్చు ఆతురత, నిర్మాణకార్యమును గూర్చిన ఉపేక్ష, ఇత్యాదులు గాంధితత్వమునకు వ్యతిరిక్తములు. దేశీయ సంస్థానములలో కాంగ్రెసువారు ప్రత్యక్షరంగంలోనికి దిగకూడదని, అక్కడి ప్రజామండలులే జాతీయోద్యమమును సౌమ్యపద్ధతులలో నడుపదగునని, ఆ రాజ్యమునకు సంబంధించినవారుమాత్రం ఇతర ప్రాంతములలో నుండుచున్న ఆ ఉద్యమమున పాల్గొనవచ్చుననియు, గాంధీయు ఉద్దేశించిరి. ఇందుకు అక్కడ తగు నాయకత్వము కావలె. ఈసంస్థాన ప్రజామండలికి జవాహార్లాలును, కాంగ్రెసు మహాసభకు పట్టాభిగారును అధ్యక్షులుకావలెనని గాంధిగారప్పుడు సంకల్పించిరి. అంతట సంస్థానప్రజాసభకు నెహౄ ఏకగ్రీవంగా ఎన్నుకోబడెను. ఇక, కాంగ్రెసు అధ్యక్షతకు పట్టాభి,సుభాసు గార్లమధ్య పోటీయేర్పడెను. పటేలు, ప్రసాదు, పంతు, ప్రఫుల్లఘోష్, ఆజాదు, రాజాజీ ఇట్టికాంగ్రెసు పెద్దలందరూ పట్టాభిగారి కనుకూలముగా కాంగ్రెసు ఎన్నిక వోటరులను ప్రోత్సహించిరి. కాని, ఈకాంగ్రెసు పెద్దల ధోరణిపైన అసంతృప్తిజెందిన నారిమన్, ఖరే, ప్రభృతులు వామపక్షీయులతో ఏకంకాగా బెంగాలులోని ప్రాంతాభిమానపువోట్లు ఇందుకు తోడుకాగా కొద్దిసంఖ్యహెచ్చుతో బోసుగారే తిరిగి అధ్యక్షులయిరి. గాంధి సుభాసులమధ్య సిద్ధాంతభేద మేర్పడెనని తెలియక ఆపోటీ వ్యక్తిగతమని హెచ్చుమంది యెంచిరి. నిజంగా కాంగ్రెసీయులలో హెచ్చుమంది గాంధిసిద్ధాంతమునకు అప్పుడును వ్యతిరేకులుకారు. బోసుగారు పెట్టదలచిన 'డెడ్లాకు' అను సంఘర్షణమునకు సిద్ధంగాలేరు, అంతవరకు ఆఎన్నిక పోటీలో గాంధిగారేమీ చెప్పలేదు (నెహ్రూ తటస్థుడైయుండెను). ఆ ఎన్నిక ఫలితం తెలిసినమీదట మాత్రం ఆఓటమి పట్టాభిదికాదు; తనదేనని గాంధిమహాత్ముడు ప్రచురించెను. అంతట గాంధిపక్షమునకు బోసుపక్షమునకు సిద్ధాంతవిషయమున తీవ్రవిభేదాలేర్పడినట్లు జనులకు వెల్లడియైనది. గాంధిగారీమాట మొదటనే తెల్పియుంటే ఆఎన్నికలో పట్టాభిగారే గెల్చియుందురని తోచును.

1939 మార్చిలో త్రిపురిగ్రామంలో కాంగ్రెసుమహాసభ వైభవంతో జరిగెను. గాంధిగారక్కడకు రాలేదు. బోసుగారు కొంతిజబ్బుపడి ఎట్లో అధ్యక్షతవహించి కార్యమును సాగించిరి. అయితే, మహాసభలో బోసు వర్గంవారి తీర్మానాలకుబదులు గాంధిపక్షపు తీర్మానాలే నెగ్గినవి. ఈ తీర్మానాల నమలుజరుప నిష్టపడక తనకార్యక్రమమును జరుపకాంగ్రెసులో తనకు బలముచాలక, తుదకు కలకత్తాలో బోసుగారు అధ్యక్షతను వదలుకొనిరి. ఆస్థానంలో బాబు రాజేంద్రప్రసాదుగారి నధ్యక్షులుగ కాంగ్రెసు సమితివా రెన్నుకొనిరి.

# 39 రాజకోట ఉపవాసం

త్రిపురికాంగ్రెసు జరుగుసమయంలో గాంధిగారు రాజకోటలో నొక విచిత్రకృషిలోనుండిరి. గాంధిగారి స్వంతప్రాంతమగు కాఠియవాడ్‌లోని దేశీయరాజ్యాలలో ముఖ్యమైనది రాజకోట. మహాత్ముని బాల్యంలో ఈయన తండ్రి, పెత్తండ్రిగూడ వరుసగ రాజకోట దివానులుగ పనిచేసిరి. ఇట్లారాజ్యముతో గాంధిగారికి గట్టి సంపర్క మ్ముండెను. తక్కిన దేశీయరాజ్యాలలో వలె రాజకోటలోను బ్రిటిషు రెసిడెంటు ప్రాభవము చాల హెచ్చు. రాజు రెసిడెంటుయాజ్ఞల నెరవేర్చును. ప్రజాప్రతినిధులను తృణీకరించి విశృంఖలుడై ప్రజాసంస్థల నణచివేసెను. ప్రజానాయకు లప్పుడు సత్యాగ్రహము చేసి జైలులో నుంచబడిరి. కొంతకాలం ఆంగ్లోద్యోగియే రాజకోట దివానుగ నుండెను. ఆపిమ్మట వెనుకటిదివాను మరల అధికార మారంభించెను. ప్రజలతో సంఘర్షము తీవ్రమయ్యెను. రాజకోట తమ స్వస్థలము వంటిది; గనుక, ఆప్రజోద్యమంలో పాల్గొనుటకు కస్తూరిబాయి ననుసరించి గాంధిగారక్కడకు చేరిరి. ఈలోగా, రాజు వల్లభయిపటేలుగా రేర్పరిచిన ప్రణాళిక కంగీకరించి, ఆ పద్ధతిని ప్రజాప్రభుత్వ మేర్పర్చుట కొప్పుకొని మరల మాట తప్పెను. తనకు మిత్రుడనుకొన్న రాజు ఇట్లు (రెసిడెంటుకు వశుడై) ద్రోహంచేసినందున, ఆయన హృదయమున పరివర్తనము కల్గించి, ప్రజలకు న్యాయముకల్గించునిమిత్తం గాంధిమహాత్ము డప్పుడు రాజకోటలో దీర్ఘోపవాస మారంభించెను. త్రిపురికాంగ్రెసు సమయమందే సంఘటన గల్గినను, కాంగ్రెసువారెవరును రాజకోటకు రావద్దని గాంధిగారు నిషేధించిరి.

గాంధిమహాత్ముని యీ ఉపవాసంవల్ల రాజకోటలోనే గాక ఇతర సంస్థానాలలోగూడ చాల అలజడి కల్గినది. ఈస్థితిలో తానొప్పుకున్న ప్రణాళిక ప్రకారమే తన రాజ్యములో కొత్తరాజ్యాంగము నేర్పరుతుననీ, అయితే సభ్యులనియమించుటలో పటేలు ప్రణాళికలోని కొన్నిపదాల అర్థమునుగూర్చి తనకు, ప్రజామండలికి భేదాభిప్రాయము కల్గినదని, తన అర్థంప్రకారం అమలుజరుపుటకు సిద్ధంగా ఉన్నానని రాజు తెల్పెను. అప్పుడా భేదమును పరిష్కరించుటకు ఆపదముల అర్థమును ఫెడరల్ కోర్టు ప్రధానజడ్జిగారు చెప్పవలెనని, అందు కుభయులు సమ్మతింపవలెనని గాంధిగారు సూచించిరి. అయితే ఛీఫ్ జస్టిసు గ్వైయరుగా రందులో కల్పించుకొని తీర్పునిచ్చునట్లు చేయుటకు వైస్రాయి కల్పించుకొనవలసి వచ్చెను. గ్వైయరుగారి నొప్పించుటకు, ఇట్లు బ్రిటిషు అధికారవర్గము నాశ్రయింపవలసివచ్చెను. తుదకు వైస్రాయి కల్పించుకోగా ఆ పద్ధతికి వివశుడై రాజకోటరాజును సమ్మతించెను. అంతట గ్వైయరుగారు కాగితము లన్నిటిని పరిశీలించి, ఆపదములకు గాంధి (ప్రజా) పక్షమువారు చెప్పిన అర్థమే సిసలు అని నిర్ణయించి తెలిపిరి. ఇట్లు గాంధిగారి ఉపవాస సత్యాగ్రహము జయమొందెను అందుకు రాజకోటరాజు సమ్మతించెను. కాని, ఇట్లు వైస్రాయి గ్వైయరుల మధ్యవర్తిత్వంద్వారా పరిష్కారం జరుగుటలో వైస్రాయికి సర్వదా విధేయుడగు రాజుపైన ఒకరీతిని నిర్బంధము కల్గినదని, అది నిజమైన అహింసాతత్వమునకు వ్యతిరిక్తమని గాంధిగారి కప్పుడు తట్టినది. కనుక, ఆతీర్పుప్రకారం నడవవలసిన బాధ్యతనుండి రాజును గాంధిగారే విముక్తునిచేసిరి. ఇందువల్ల రాజలోకము గాంధిగారి ఉదారత కెంతయు మెచ్చుకొనెను.

# 40 యుద్ధజ్వాల

రాజకోట సత్యాగ్రహంద్వారాను, సంస్థానప్రజాసభ కాసాలున జవాహర్లాలు అధ్యక్షుడైనందునను, సంస్థానాలలో ప్రజోద్యమము బలపడెను. పాలకులు చాలచోట్ల బ్రిటిషు అధికారుల తోడ్పాటుతో దౌర్జన్యమవలంభించినను, ప్రజలు అహింసాపద్ధతిని వీడక నిర్మాణకార్యపరులగునట్లు

గాంధిగారు ప్రబోధించిరి. దేశమంతటను నిర్మాణకార్యక్రమము వేగంగా సాగించునట్లు గాంధిగారప్పుడు అహింసాప్రబోధం చేయుచుండిరి. కాని, ఈలోగా బయటిపరిస్థితులు మారినవి. సుభాసబోసుగారు బహిరంగంగా సంఘర్షోద్యమమును లేవదీయుచు అందుకై ఫార్వర్డ్‌బ్లాక్ అగ్రపక్షం అని ఒక పక్షమును పెట్టిరి. ఎం. ఎన్. రాయి పార్టీ, కమ్యూనిష్టులు, సోష లిష్టులు గూడ ఇట్టే సంఘర్షంవైపుకు మొగ్గుచుండిరి. ఇందుకు అంతర్జాతీయ పరిస్థితులు తోడైనవి. యూరపు అంతటను హింసాతత్వము చెలరేగుచుం డెను. హిట్లరునాయకత్వమున జర్మనునాజీలును, ముసోలినీక్రింద ఇటలీ ఫాసిష్టులును, జాతిద్వేషమును, దౌర్జన్యమును పురికొల్పుచు, రష్యాపైన కాలుదువ్వుచుండిరి. బ్రిటిషువారు గోడమీద పిల్లివలెనుండి రష్యా జర్మనీల మధ్య విభేదమును హెచ్చింపుచుండిరి. రష్యా తుదకు విధిలేక హిట్లరుతో సంధికి వచ్చెను. అంతట హిట్లరు పోలండుపైన యుద్ధమారంభించగా, బ్రిటను ఫ్రాంసులు జర్మనీపైన యుద్ధం ప్రకటించెను. ఇట్లు పోలండులో అంటు కొన్న మహాజ్వాల త్వరలోనే యూరపుఅంతట అల్లుకొనుటేగాక, క్రమ ముగా తూర్పునకును వ్యాపించినది. యుద్ధము ప్రకటితమైన రోజుననే మన భారతదేశమునుగూడ బ్రిటిషువారు తమతరఫున యుద్ధమున దింపి, మన దేశీయ సేనలను ఇతరదేశాల రంగస్థలాలకు తీసుకొనిపోయిరి. అందునుగూర్చి మన దేశీయసంస్థల సంప్రదించలేదు. అందుకుతోడు, ఆయా రాష్ట్రాలలోకూడ కేంద్రప్రభుత్వమునకు విశేషాధికార మిచ్చిరి. ఇట్టి దుర్భరపరిస్థితులలో కాంగ్రెసుమంత్రివర్గము ప్రజోపయోగకరముగా పనిచేయుట సాధ్యం కాదని గాంధిగారును, కాంగ్రెసుకార్యవర్గమును నిర్ణయించగా, కాంగ్రెసు మంత్రివర్గాలు వెంటనే రాజీనామా యిచ్చినవి. మరల, రాష్ట్రాలలో నిరం కుశప్రభుత్వ మారంభించినది. నిర్బంధశాసనాలు, ఆర్డినెన్సులు, ప్రజా నాయకులపై నిరోధములు, ఆంక్షలు జారీయైనవి. జనుల స్వాతంత్ర్య మడుగంటినది.

# 41. యుద్ధ సత్యాగ్రహపు ఆరంభం.

హిట్లరే దౌర్జన్యమునకు సిద్ధమైనాడని లోకశాంతి నిమిత్తం అన్ని రాజ్యాలలో ప్రజాయత్తతను, స్వేచ్ఛను స్థాపించుటకే యీ యుద్ధమును సాగింతుము, కనుక స్వాతంత్ర్యప్రియులందరు తమకు తోడ్పడవలెనని బ్రిటిషువారును, అమెరికా సంయుక్తరాజ్యంవారును ప్రచురించిరి. అది నిజమయితే వారికి కాంగ్రెసువారు నైతికసహాయం చేయుదురు. కాని, ఈ మహాయుద్ధము ఘోరహింసాభరితము కనుక, ఆ దారుణ రక్తపాతంలో కాంగ్రెసు పాల్గొనరాదు; అని గాంధిమహాత్ము డప్పుడు భావించెను. కాని, ప్రభుత్వంవారు ఎన్నియో ఆకర్షణల బెట్టియు ఒత్తిడిగల్గించియు జబర్దస్తీతో లక్షలకొలది జనులను, కోట్లకొలది ప్రజలసొమ్మును ఆ రణరంగంలో చేర్చిరి. ఇదిగాక, ఆ మహాయుద్ధజ్వాల క్రమంగా అబిసీనియా, ఈజిప్టు, గ్రీసు వగైరాలలోనికి, రష్యాలోనికిని ప్రచండంగా వ్యాపించినది. భటులను, సామాగ్రులను, ఆహారవస్తువులనుగూడ ఈదేశంనుండి యుద్ధమునకు సరఫరా చేయుచుండిరి. మరియు యుద్ధమున కందరు తోడ్పడునట్లు ఒత్తిడిచేయుచు, భారతీయులు సంతుష్టులై తోడ్పడుచున్నట్లు బ్రిటిషువారు లోకమంతటను ప్రకటించిరి. ఈయుద్ధానంతరమైన, ఈ దేశమునకు స్వాతంత్ర్యమిత్తుమని స్పష్టపర్చుటకు ప్రజానాయకులు కోరగా అందు కధికారులు నిరాకరించిరి. బ్రిటిషు ప్రయత్నమున కెవ్వరు వ్యతిరేకించకూడదు. ప్రజాస్వాతంత్ర్యము నశించినది. ఆమాట లోకమునకు వెల్లడించుటకు గాంధిగా రప్పుడు చిత్రమగు సత్యాగ్రహమును లేవదీసిరి. 'హింసాప్రకోపమునకు హింసాపద్ధతి తగు చికిత్సకాదు, ఈయుద్ధప్రయత్నంలో జనులు పాల్గొనుట భావ్యముకాదని నా భావము' అను మంత్రమును కొందరు ప్రముఖవ్యక్తులు మాత్రం ఒంటిగ వెల్లడించుటే యీ సత్యాగ్రహము. ఇందువల్ల బ్రిటిషు యుద్ధప్రయత్నమునకు ప్రత్యక్షపు ఆటంకమేమియు లేదు. యుద్ధమున కనుకూలంగా కోట్లకొలది రూపాయలఖర్చుతో లక్షలకొలది సిబ్బందితో ప్రభుత్వప్రచారము సాగుచునేయున్నది. ఈసత్యాగ్రహము కేవలం నైతికము. శ్రీవినోబాభావే, జవాహర్లాలుగార్ల అరెస్టుతో యీ సత్యాగ్రహ మారంభించినది. నిర్మాణ

కార్యకర్తలను మాత్రి మిందులో పాల్గొనవద్దని చెప్పి గాంధిగారు తాము నిర్ణయించిన ప్రజాప్రతినిధులచేతనే యీసత్యాగ్రహంచేయించిరి. అందువు ఫలితంగా కాంగ్రెసువారు కొన్ని వేలమంది జైళ్ళలో నుంచబడిరి. ఈ సౌమ్య సత్యాగ్రహమునుగూడ సహింపక, జనుల వ్యక్తిస్వాతంత్ర్య మణచి వేయుటబట్టి తాము ధర్మయుద్ధము చేయుచున్నామని ప్రభుత్వముచెప్పు ప్రకల్భములు అసత్యములు, వారిది సదుద్దేశ్యముగాదు, అని అందరికిని వెల్లడియైనది. ఇట్లు 1940 సం॥రం నవంబరునుండి ఒక యేడాది సత్యాగ్రహము గడచినది.ఇంతలో తూర్పున జపానువారు రణరంగంలోనికి దిగుచున్న మాటనుగ్రహించి, బ్రిటిషువారొక కొత్తయుక్తి నవలంభించి ఈ సత్యాగ్రహులనందరిని తమంతటనే వదలిపెట్టి రాజీబేర మారంభించిరి.

# 42 క్రిప్సు రాయబారం

పాశ్చాత్యుల యాంత్రికసంస్కృతిని, వారి సామ్రాజ్యనీతినిగూడ అనుకరించి క్రమంగా కొరియాను, మంచురియాను కబళించిన జపాను 1937 సం॥రం జూలైనుండి చీనాతో యుద్ధం సాగించుచుండెను. జపాను వారు జర్మనులతో మైత్రితో నున్నందున వారిని తమశత్రువుగా నెంచి సాధించి, చీనాను తమ ప్రాబల్యంలో నిల్పుకొనుటకు ఆంగ్ల అమెరికను రాజ్యాలు చీనా కాయుధాలను సప్లయిచేయుచు 1941 సం॥లో జపానుపైన ఆంక్షపెట్టెను. అంతట 7-11-41 తేదీని జపానుప్రభుత్వము ఆంగ్ల అమెరికను మిత్రమండలితో యుద్ధమునకు దిగి, చీనా తూర్పు దక్షిణములకు తోడు ఫిలిప్పైన్సులను సుమత్రా, జావా మున్నగు దీవులను సింగపూరు మలయాప్రాంతములను జయించి, రంగూనురేవు బట్టుకొని, బర్మాలో జొరబడెను. సూర్యాస్తమయ మెరుగనిది, అసమానబలయుతమైనది అనుకొన్న బ్రిటీషుసామ్రాజ్యపు పటాటోపము కండ్లయెదుట ఇసుకమేడవలె కూలి, పటాపంచలైనది. 'మాలో నెవరైన లేచిన మనుష్యులముకామన్న' ఏ. బి, సి. డి. (అమెరికను, బ్రిటిషు, చీన, డచ్చి) సామ్రాజ్యములు నాల్గును కలసియు జపానీయుల భూ జల వాయు సేనల స్వైరవిజృంభణ

నరికట్టలేకపోయిరి. ఆంగ్ల అమెరికనునాయకులు నిర్విణ్ణులై దిగ్భ్రమజెందిరి. ఈలోగా, యూరపులో తమ మిత్రులగు గ్రీకు, రష్యనులుగూడ జర్మనులచే పరాజితులగుచుండిరి. వెల్లివిరిసివచ్చు ఈ రెండు అక్షౌహిణుల నరికట్టుటకు భారతదేశకేంద్రమునుండి సర్వశక్తులతో సమరం సాగించుట అవసరమని సంయుక్తమిత్రమండలివారి సర్వసేనానులు స్థిరపర్చిరి. ఇట్టి ఆపత్సమయమున భారతీయులను మంచిమాట చేసుకొనుట అత్యావశ్యకమని అమెరికా అధ్యక్షుడును మందలించగా, బ్రిటిషుప్రభుత్వం వారప్పుడు ఒక స్నేహప్రకటనను జేసిరి. రష్యనులను 1941 సం॥ జూనులో జర్మనీనుండి తప్పించి బ్రిటిషు పక్షీకులుగా మార్చిన చాణక్యుడు, సామ్యవాది ప్రముఖుడు, బ్రిటిషుమంత్రియగు క్రిప్సుగారి నప్పుడీదేశమునకు సంధికై రాయబారిగ బంపిరి. (ఈయుద్ధకాలంలో బ్రిటిషు వారుజాతీయప్రభుత్వంలోఅన్ని పక్షాలవారిని చేర్చుకొన్నారు) బ్రిటిషు న్యాయవాదుల కగ్రణిగ ఖ్యాతినొందిన యీ దొరగారు ఈదేశంలో రాజకీయనాయకులతో చర్చించిరి. చర్చిలుప్రభుత్వపు యీ సూచన ఇక్కడి ముఖ్యపక్షనాయకుల కిష్టంకాలేదు. “యుద్ధానంతరమందు ప్రజలెన్నుకొను రాజ్యాంగపరిషత్తువారు ఈదేశమునకొక రాజ్యాంగమును తయారుచేయుదురు. ఆ రాజ్యాంగమున ముస్లింరాష్ట్రాలలో హెచ్చుజనులు విడివడగోరితే ఆరాష్ట్రాలు విడిపోవుట కధికార ముండును. ఆ రాజ్యాంగమును మేము అంగీకరింతుము. ఈ యుద్ధకాలంలోమాత్రం రాజ్యాంగంలో మార్పుఉండదు. ఆయా పక్షనాయకులను వైస్రాయిగారు తమ కార్యసమితి సభ్యులుగ నియమింతురు. యుద్ధసంబంధమగు యావత్తు అధికారములు వైస్రాయి అధీనములే. ఇందుకు సంబంధించని తక్కిన బాధ్యతాధికారములు భారతీయులవి. అందులో కల్పించుకొనుట వైస్రాయి యిష్టం. ఈ యుద్ధం పూర్తియగు వరకు భారతీయమంత్రులు అన్ని పక్షాలవారు బ్రిటిషువారికి పూర్తిగతోడ్పడి యావత్తుసహాయము జేయవలయును. ఇది క్రిప్సుప్రణాళిక. గాంధిగారు అహింసా వాది. ఈ యుద్ధమున భారతీయులు పాల్గొనుట కిష్టపడక ఆయన వ్యతిరేకించినందుననే కాంగ్రెసు కార్యసమితి దీనిని నిరాకరించె”నని అపవాదును క్రిప్సుగారు మోపిరి. గాంధిగారు అహింసావాదియే కాని, జాతీయావశ్యకతనుబట్టి ఆ షరతులు తృప్తికరమయితే కాంగ్రెసువారొప్పుకోవచ్చుననియే గాంధిగారు స్పష్టపర్చిరి. ఆషరతులనుగురించి 1940 సం॥రం

నుండి కాంగ్రెసు అధ్యక్షుడయిన మౌలానా ఆజాదు, నెహూృగారలు క్రిప్సుగారితో చర్చించిరి. మహాయుద్ధకాలమున తక్కినవి యుద్ధశాఖకు లోబడవలెను. యుద్ధనిర్వహణం సర్వసేనాధిపతి యాజమాన్యములోనే యున్నను అందుల ముఖ్యవిషయాలనైనా ప్రభుత్వమంత్రులకు తెల్పి వారి సమ్మతితో నిర్ణయించవలయుననియు, యుద్ధసంబంధం లేనివాటి నిర్వహణలో మంత్రులకు వైస్రాయి అడ్డుతగలకూడదనియు, ఈ రెండుషరతులను నెహ్రూ ఆజాదులు కాంగ్రెసు తరఫున కోరిరి. అందుకు క్రిప్సు వైస్రాయిలు తుదకు సమ్మతించనందుననే కాంగ్రెసు ఆప్రణాళికను నిరాకరించెను.

ఆక్రిప్సుప్రణాళిక (p. st dated cheque) దరిమిలా తారీఖుననే మార్చి సొమ్ము తెచ్చుకొనదగిన చెక్కువంటిది అనిమాత్రం గాంధిగారు చెప్పిరి. నిజమే, అది సూత్రప్రాయంగా యధాస్థితినే తెల్పెను. దేశ మల్లకల్లోలమై శత్రువులు సరిహద్దులు సమీపించి, మనదేశంలోనికి దిగుతారేమో నని బ్రిటిషు అధికారులే ఆందోళితులయిన సమయ మది. సింగపూరు, మలయా, బర్మాలలో బ్రిటిషునాయకులు చూపిన అసహాయశూరత లోకవిదితము. జపానీయులు దిగి విజృంభించినచోట్ల ఆదేశీయులను వదలి బ్రిటిషువారెట్లో స్వదేశమునకు ఎగిరిపోవుచుండిరి. అట్టి స్థితిలో మననాయకుల కిక్కడ నిజమైన అధికారముంటేనే, వారు ప్రజలలో దేశరక్షణకు ధైర్యదీక్షలు కల్గింపగలరు. మరియు భారతీయమంత్రివర్గము యుద్ధకార్యములలో తప్ప తక్కినవాటిలో కాబినెట్టువలె పూరాహక్కులు కల్గియుండునని క్రిప్సుగారు చర్చలో మొదట లిఖితంగా ఒప్పుకొనియు, బ్రిటిషుప్రధాని చర్చిలు లండనునుండి త్రాడులాగగ తమ ధోరణిని మార్చివేసిరి. అందుపైనే రాయబారం చెడినందున క్రిప్సుగారింగ్లండుకు చనిరి.

# 43 క్విటిండియా

పిమ్మట క్రమంగా జపానువెల్లువ వెనుకకు తగ్గసారంభించెను. సుభాసబోసుగారు రప్పటికి దేశమునుండి తప్పించుకొని, "అజాద్ హింద్ ఫౌజ్" అనుపేర గొప్ప భారతీయసేనను మలయాబర్మాలలో తయారుచేసి జపానువద్దతుతో అస్సాం, మణిపురం ప్రాంతంపయిన దాడిచేసెను; కాని,

దాడి వ్యర్థమై, వెనుకకు పోవలసివచ్చెను. 1942 ఆగస్టు నాటికి రష్యాలో, యీజిప్టులో, ప్రాచ్యరంగంలోకూడ శత్రువిజృంభణ నిల్చిపోయెను. ఇక మిత్రమండలి పైచేయి యగు సూచనలు వచ్చెను. అంతట బ్రిటిషువారి కాందోళన తగ్గినది. ఆపద మొక్కులు కష్టములుతీరినపిమ్మట జ్ఞప్తికిరావు గదా! ఎట్లయిననేమి, మనదేశమంతట యుద్ధకార్యముల పేరున సర్కారు ఉద్యోగులుచేయు ఉద్ధతచర్యలవల్ల ప్రజలబాధలు హెచ్చినవి ప్రభుత్వం వారు ప్రజాశక్తి నణచివేయుచు, జనుల నిర్వీర్యులుగ జేయబూనుటను, దేశంలో ఆయాపక్షాలమధ్య సాంఘికభేదాలను పెంచుటను అవినీతిని చూచి, యుద్ధానంతరమయినను మనకు దేశస్వాతంత్ర్యమిచ్చు చిత్తశుద్ధి బ్రిటిషు అధికారులకు లేదని యెంచి గాంధిమహాత్ముడప్పుడు 'క్విటిండియా' అను క్రొత్తమంత్రమును చర్చించెను. 'బ్రిటిషుఅధికారు లీదేశమును వదలిపెట్టవలె' అని దీనియర్థము. బ్రిటిషుపాలకు లీదేశమును ప్రజాసమ్మతిలేకుండా మహా యుద్ధంలో దింపుటయేగాక, ఇక్కడనుండి ప్రాచ్యపాశ్చాత్యరంగాల యుద్ధప్రయత్నముల సాగించుచు, అందు కీదేశపు వస్తుసంపదను, జనశక్తిని పూర్తిగ వినియోగించుటజూచి, మనలను శత్రువులుగనెంచి, జపానీయులు జర్మనులుగూడ ఈ దేశంవైపు దాడిచేయ దలపెట్టిరి. లేనియెడల ఈ దేశము రణరంగమగు ప్రశంసయేరాదు అప్పటికి దేశీయుల కితరదేశీయులతో విరోధములునులేవు. ఆశత్రుపక్షమున కప్పు డితరరంగములలో చేతినిండా పనికల్గుచుండెను. ఈ దేశమును దాడిచేసి వశపర్చుకొందగినంత సేన లాయత్త పర్చుట ఆ పరిస్థితిలో అసంభవమని ప్రతివారికిని తెలియును. జర్మనులకు రష్యా యీజిప్టుల రంగాలలోనే విమానాదులు చాలలేదు. ఇక్లే జపానీయులు ఆస్ట్రేలియా ప్రక్కనుండి వచ్చు అమెరికనుదాడుల నెదుర్కొనుటకును, తమ అధికారముననున్న వేలకొలది ద్వీపములను, చీనాను కాపాడు కొనుట కును తమయావత్తు సేనాశక్తిని ఆరంగాలలోనే పెట్టుకోవలసివచ్చెను. కనుక అప్పుడు శత్రువులనుండి మన దేశస్వాతంత్ర్యమునకు ప్రమాదము రాలేదు. దానినుండి కాపాడ బ్రిటిషువారు మనకు చేసిన మహోపకారమును లేదు.

గాంధిగారి "క్విటిండియా" 'భారత్ ఛోడో' మంత్రము వెంటనే దేశమంతటను వ్యాపించినది. "బ్రిటిషు అధికారులు యుద్ధానంతర మీదేశ మును విడుచుట కొప్పుకొని వెంటనే కేంద్రప్రభుత్వంలో ప్రజానాయకులకు

నిజమయిన అధికారమీయవలె, లేనియెడల వారిధోరణి తియ్యగ నున్నను క్రియ శూన్యమని నిశ్చయించి, బ్రిటిషు అధికారులకు ముందుగా తెల్పి జనుల ఆత్మరక్షణకై సమిష్టి సత్యాగ్రహము చేయబడును" అని గాంధి మహాత్ముడు సూచించెను. దానిని కాంగ్రెసు కార్యసమితివారు 1942 జూలైలోను, అ. భా. కాంగ్రెసుకమిటీవారు ఆగస్టు 8 వ తేదీ రాత్రియు ఆమోదించిరి.

ఈ లోగానే ఈ క్విటిండియాసూచనకు అపార్థంజెప్పి, గాంధిగారికి దురుద్దేశ మారోపించి, శాంతిస్థాపన పేరుపెట్టి కాంగ్రెసునాయకులందరిని ఒక్కమారుగ బంధించి వేయుటకు బ్రిటిషుప్రభుత్వంవా రన్నిపన్నుగడలను పన్ని రహస్యంగా హుకుములన్నియు జారీచేసి, సన్నాహములను పూర్తి చేసికొనిరి. 9-8-42 తేదీ తెల్లవారునప్పటికే బొంబాయినగరములోనుండిన దాదాపు అన్నిప్రాంతాల కాంగ్రెసు ప్రముఖులకు వారంట్లు జారీయయినవి. అక్కడ అరెస్టు జరుగక, తమ ప్రాంతాలకు చేరినవారినిగూడ, ఆయా జిల్లాల అధికారులు పైనుండి తాకీదులు పొంది జైలులో నుంచిరి.

# 44 ఘోరాపత్తులు

బొంబాయిలో 8-8-42 తేదీని అ. భా. కాంగ్రెసు కమిటీవారు సత్యాగ్రహ మారంభించి నడుపు భారమంతను (సహజంగా) గాంధిగారి పైనే పెట్టుచు తీర్మానించిరి. తానీవిషయంలో వైస్రాయిగారికి వ్రాసి రాయబారాలుచేసి, వీలైతే స్వయంగా మాట్లాడి, సాధ్యమయితే సత్యాగ్రహం లేకుండ జేతుననీ, ఒకవేళ సత్యాగ్రహమే తప్పనిసరియయినచో ఆ పిమ్మట నెల వ్యవధి నిచ్చియే సత్యాగ్రహ మారంభింతునని, దాని ప్రక్రియగూడ ముందు వివరింపబడునని, గాంధిగారు ముందుగ ఉపన్యాసంలో అందరికీ వ్యక్తపర్చిరి. ఆ స్థితిలో వెంటనే అరెస్టులు సాగించుట కవసరములేదు. కాని, 8-8-42 తేదీ సత్యాగ్రహ తీర్మాన మొకసాకు. అంతకు ముందే జాతీయోద్యమము నెట్లో దౌర్జన్యంతో అణచివేయ చర్చిలు ప్రభుత్వమును, వైస్రాయియు సంకల్పించిరి. తెల్లవారకముందే గాంధిమహాత్ముని,

ఆయన స్వంత పరివారమునంతను అరెస్టులుచేసి, పూనాకు కొంతదూరం లోని ఆగాఖాన్ భవనంలో బందీలుగ నుంచి, ఆ భవనంచుట్టు కాపలా యుంచిరి. ఆ నిర్బంధ మెందుకో, ఎంతకాలమో తెలుపలేదు. గాంధిగారికి ముందుగ వైస్రాయితోను, సహచరులగు నాయకులతోను సంప్రతించుటకు అవకాశ మీయలేదు. మనోవ్యధతోనున్న గాంధిపరివారమున కా సౌధము దెయ్యాలకొంపగ తోచుట సహజము. అస్లే, ఆయన కక్కడ ఆప్తవియోగ బాధయు కల్గెను.

గాంధిగారికి ధర్మపుత్రుడని పేరొంది, నిర్మాణకార్యక్రమమును సాగించుటలో కుడిభుజమై ఆయన కన్నివిధముల నతివిధేయుడై నడివయస్సులోనున్న యోధుడు జమనాలాల్ బజాజు ఆ ఫిబ్రవరిలోనే వర్ధాలో హఠాత్తుగ మరణించెను. ఆ కుటుంబమునకు తానే మార్గదర్శకుడు కావలె. ఇక ఆగస్టులో జైలులోకివెళ్ళిన వారంలోనే తన సఖుడు, సచివుడు, సారథి, సహచరుడు నగు మహాదేవదేశాయి హఠాత్తుగ తన చేతులలోనే కాలధర్మ మొందెను. మహాత్ముని కాయన రెండవదేహమై, గాంధిగారి సమగ్రజీవితచరిత్రను ప్రామాణికంగా వ్రాయదలచెను. ఇట్టి ప్రియశిష్యుని యంత్యక్రియలను వేడికన్నీళ్ళతో ముగించి, దుఃఖమును దిగమ్రింగుచుండగా, ధర్మపత్ని కస్తూరిబాయి జబ్బుపడి మంచమెక్కినది. ఆమాట సర్కారునకు తెలిసియు, వారామెను విడుదలచేయలేదు. క్రమముగా క్షీణించి 22-2-44 తేదీని ఆ కారాగృహములోనే ఆ సాధ్వీమణి కీర్తిశేషురాలయినది. 60 ఏండ్లు పైగా కంటికిరెప్పవలెకాపాడు అర్ధాంగిగూడ మరణించుట ఆయన హృదయమునకు బాధకమయినది. ఈ సందర్భమున వనంలో సీత హరింపబడి, జటాయుమరణం చూచి శ్రీరాము డన్నట్లుగ వాల్మీకిచెప్పిన, శ్లోకము జ్ఞప్తికి వచ్చును. ఆదుస్థితి అగ్నినే దహించునట్లుండెను.* ఆ దుఃఖాబ్ధిలోనే గాంధీమహాత్ము డెట్లో యావార్ధకంలో, యేకాంతవాసంలోను, ప్రకృతిని గోల్పోక, మనశ్శక్తిని నిల్పుకొని మరింత లోకసేవాదీక్షితుడగుట ఆయన స్థితప్రజ్ఞతకు గొప్పనిదర్శనము. ప్రియనాశము శల్యమగుటకు బదులు

* రాజ్యభ్రంశో వనేవాసః సీతానష్టా హతోద్విజః,
ఈదృశీయంమమాలక్ష్మీః నిర్దహే దపి పావకం.

(రామాయణము, 3-47 అ.)

స్థిరచిత్తులకు క్షేమప్రవృత్తికి దర్శకమగునను కాళిదాసువాక్య మాయనకు వర్తించినది ♦

ఈ ఆపత్సమయంలో మహాత్మునికి మరొకరీతి బాధ కల్గినది. మగనిగొట్టి మొరబెట్టినట్లు ప్రజానాయకు లందరిని బంధించి, నోరుమూసి, వారిపైన లోకమంతటను బ్రిటిషుప్రభుత్వమువారు అసత్య ప్రచార మారంభించిరి. జపానీయులదాడి నెదుర్కొన ఈ ప్రభుత్వము చేయు కృషిని భగ్నపర్చుటకే గాంధిగారును, కాంగ్రెసును సత్యాగ్రహం చేయదలచిరని బ్రిటిషువారు తప్పుడుప్రాత లచ్చువేసి, ఇక్కడను, అమెరికాలోను పంచిపెట్టిరి. క్రిప్సురాయబారవిఫలతకును దీనికిని ముడిపెట్టిరి; బ్రిటిషువారు జయమొందుట కాంగ్రెసునాయకులకు గిట్టలేదనిరి. ఈ అపవాదులకు జైలులోని ప్రతికాంగ్రెసువాదియు విడిగ జవాబులు చెప్పవలెనట. కాని వారు సంప్రతించుకొనుటకు, తుదకు గాంధిగారు అహమ్మదునగరు జైలులోని నెహ్రూ ఆజాదు ప్రభృతులతో కలియుటకును అవకాశ మీయరయిరి. అంతట గాంధిగారీతప్పుడుమాటల కాధారమును తెల్పుమని, ఆ ప్రచారముల ఖండించుట కవకాశమిమ్మని వైస్రాయిని కోరిరి. తా నింకను సత్యాగ్రహ మారంభించనేలేదు. అహింసావాదియగు గాంధియు కాంగ్రెసువారును ఆ నాజీఫాసిష్టుచర్యలను బ్రిటిషువారికన్న చాల ముందుగనే ఖండించి,ప్రజాయత్తతయే యుక్తమని లోకమంతటికీ చాటియున్నారు. సత్యాగ్రహం చేయునప్పుడును కాంగ్రెసువా రెట్టిదౌర్జన్యమునకును పూనకూడదని గాంధిగారు తా మిదివరకే ప్రచురించిన సంగతిని తన ఉత్తరంలో వ్యక్తపర్చినను, బ్రిటిషువారు లక్ష్యపెట్టలేదు. ఇట్లు కాంగ్రెసువారిని జైలులో నుంచి వారిపైన తప్పుడుప్రచారమే చేయుచు లోకంకళ్ళలో దుమ్ముకొట్టి భ్రమపెట్టు సర్కారుదుష్టతను నిరసించుట కప్పుడు గాంధి మహాత్ముడు జైలులోనే మరల 21 రోజులు దీర్ఘోపవాసం సాగించెను. ఈ ఉపవాసమున కాయన తాళలేడని ప్రముఖవైద్యులందరు నెంచిరి. ఉపవాస మధ్యయం దొకరోజున, ఆయన యిక మరణించునని చాలమంది స్థిరపర్చిరి. కాని, ఆయన రెట్లో గండము గడచి బ్రతికిరి. అందుకు గాంధి

♦ అవగచ్ఛతిమూఢచేతసః ప్రియనాశం హృదిశల్య మర్పితం,
స్థిరధీస్తు తదేవమన్యతే కుశలద్వారతయా సముద్ధృతం. (రఘువంశం 8-88)

గారిలోని ఆత్మశక్తియే కారణమగునని డా॥ బి. సి. రాయివంటి భిషజ్మణు లెంచిరి అట్టి ప్రమాదస్థితిలోగూడ జైలునుండి గాంధీగారిని బ్రిటిషుసర్కారు వారు విడువకుండుట వారికే తగినది.

# 45 మహావిప్లవం.

ఆ కారాగృహంలో గాంధిగారి స్థితి యిట్లుండగా 1942 ఆగస్టునుండి రెండేండ్లవరకు మనదేశంలో ఇదివరలో ఎక్కడను కని విని యెరుగనట్లు మహావిప్లవం జరిగినది. 1930-32 లోని సత్యాగ్రహంలోను వేలకొలది జాతీయవాదులు జైలులో నుండిరని, ఇంక నెందరో సకలబాధల నొందిరని గమనించినాము. అంతకన్నను చాల హెచ్చుగ నిప్పు డట్టి బాధలు కల్గినవి. ఈరెంటికి గల భేదముమాత్ర మిక్కడ చెప్పినచాలును. 1930 మార్చిలో దండీయాత్ర నారంభించి, ఆ ఏప్రిలులో సత్యాగ్రహ మారంభమై, అన్ని ప్రక్కల శాసనధిక్కారము గాంధిసూచనలప్రకారం జరిగినది. 1932లో ముందుగనే గాంధి, నెహ్రూ ఇత్యాదు లరెస్టు అయినను, చాలవరకు సత్యాగ్రహము వారు నిర్దేశించినవిధమున జరిగినది. 1942 సం॥లో సత్యాగ్రహ మారంభించనేలేదు, దాని నియంత గాంధిగా రందు కాజ్ఞ నీయలేదు. ఒక్కుమ్మడిగ నిర్హేతుకంగా నాయకులందరు అరెస్టుఅయిరి. 1930-32 లో వలె అరెస్టుఅయినవారిస్థానే కాంగ్రెసు నియంతలైనను ఏప్రాంతంలోను నియమితులుకాలేదు. ఈసారి ఉప్పుచేయుట, కల్లుదుకాణాలు, విదేశీ బట్టలు పికెటుచేయుట, ఇట్టి క్రమమైన సత్యాగ్రహం చేసినది చాల తక్కువ. అసలు కాంగ్రెసుచర్చలలోనే రాజాజీ, డా॥ సయ్యద్ మహమ్మదు మున్నగు కొందరు గాంధిసహచరులును భిన్నాభిప్రాయమును చూపిరి. మరికొందరు సందేహించియు గాంధినిర్ణయమునకు తలయొగ్గి సమ్మతించిరి. 1942 ఆగస్టులో వాతావరణ మింకను సత్యాగ్రహమున కనుకూలంగాలేదు. దేశంలో హింసావాతావరణమే వ్యాపించియుండెను. యుద్ధపరిస్థితివల్ల, దేశంలో వస్త్రాహారాదులకు గల్గు బాధలవల్ల, విపరీతపు నిరోధాలవల్ల,

కొంత జపానీయుల దాడిభయంవల్లగూడ, జనులలో వ్యాకులత హెచ్చి
శాంతి, నిదానము లేకుండెను. ఆహారాదులు దొరకుట కష్టమయినది.
పండినపంట, తయారైనబట్ట, కాగితం, నూనె వగైరాలు దాదాపు
అంతయు ప్రభుత్వాజ్ఞప్రకారమే సరఫరా కావలె. అంతయు పరాధీనతయే.
క్షామంవల్ల బెంగాలులో అప్పుడు అధమం 20 లక్షల జనులు చచ్చిరి.
ఈ స్థితిలో సరియైన అహింసాపద్ధతిని సత్యాగ్రహము సాగించుట కష్టకర
మని మహాత్మునికి తెలియును. కనుకనే ఆయన యింకను రాజీయత్నాలు
చేసి వ్యవధి యిచ్చియే తగుపద్ధతిని నిర్ణయించదలచెను; కాని అట్లు జరుగ
లేదు. మరియు, ఈసారి సర్కారువారి దుష్టచర్య మామూలుకన్న చాల
హెచ్చినది. యుద్ధకాలంలో అహింసాసత్యములు ముందుగా ఆహుతి
యగుట సహజం. తీవ్రహింసాతత్వంతో, సర్వశక్తులతో, తదేకదీక్షతో,
శత్రువులతో పోరు బ్రిటిషుప్రభుత్వంవారప్పుడు మన ప్రజలపైన దౌర్జన్యం
చేయుటకేమీ జంకలేదు. అరెస్టు లారంభించిన 9-8-42 తేదీనే ఒక్క
బొంబాయినగరంలోనే పోలీసువారు ప్రజాసమూహంమీద పదిసార్లు తుపా
కులు కాల్చిరి. ఇక ఆంక్షలకు, లాఠీచార్జీలకు లెక్కయేలేదు ఇదిగాక సర్కారు
వారే సత్యాగ్రహోద్దేశమునుగూర్చి అసత్యప్రచారమును చేసిరి. గాంధిగారి
నాయకత్వమున కాంగ్రెసు రైలుపట్టాలు పీకి, తంతితీగెలు తెంపి దౌర్జన్య
విప్లవం చేసి యుద్ధయత్నం బందుచేయించుటకు పూనుకొన్నదని అధికారులు
నాయకుల నోరుకట్టివేసిన రెండురోజులకే, మనదేశమందేగాక, లండను బి బి సి.
రేడియోద్వారా, దినపత్రికలద్వారా లోకమంతటను అసత్యమైనప్రచారం చేసిరి.
ఈ సర్కారువార్తలు మనదేశభాషా పత్రికలలో తర్జుమాయై ప్రచురితమైనవి.
అట్టి కార్యక్రమము కాంగ్రెసుసంస్థది కాదని కొందరనగా, ఇట్టి హింసా
పద్ధతితో 'ఆంధ్ర కాంగ్రెసు సర్క్యులర్' అనుపేరుతో కాంగ్రెసు అధి
కారపత్రిక జారీయైనదని బ్రిటిషుఅధికారులు సర్వత్ర ప్రచురించిరి. కాని
ఆ 'సర్క్యులర్' కాంగ్రెసు అధికార ప్రకటన కాదని గాంధి అజాదు,
(అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడు) ప్రభృతులు చెప్పినారు. మరియు ఆ
'సర్క్యులర్' లోను దౌర్జన్యచర్యలు కూడదని, గాంధీమహాత్ముని అనుజ్ఞ
అయినతరువాతనే అందులోని కార్యక్రమమును సాగించవలెనని గూడ
స్పష్టపరుపబడి యుండెను. గాంధీగారు చెప్పిన పికెటింగు ఇత్యాదుల

నందులో వ్రాసి తుదను తీగలు తెంపుటకూడ వ్రాయబడుట నిజమే. కాని పట్టాలు పీకుట, మొదలగు హింసాచర్యలు ఆంధ్రసర్క్యులర్‌లో ఉదహరింపబడనేలేదు. 9-8-42 నుండి కాంగ్రెసు సంఘాలన్నిటిని నొక్కసారిగ అక్రమసంఘాలని నిషేధించి, ప్రముఖులందరిని బంధించి జనులకు, పత్రికలకు వాగ్బంధనం చేసి అంక్షలు మొదలు లాఠీచార్జి, తుపాకికాల్పులవరకు వివిధదౌర్జన్యాలు చేసి, సర్కారు భారతదేశమునంతను ఒక పెద్ద జైలుఖానాగా జేసిరి. ఇట్టిస్థితిలో ఆవేశంవల్ల పౌరులుంకొందరి ప్రతిక్రియగ కొందరు తమకు తోచినట్లు వర్తించిరి. తీగలు తెంపుట, రైలుపట్టాలు పీకుట కొన్ని సర్కారు భవనాలమీద దాడి, కొంతరికాస్థ నశింపు, ఇట్టివి జరిగి, సర్కారు కేసులు జారీ అయి, కఠినశిక్షలు వేయబడినవి. కొందరికి మరణ నేర్పడినది. చిత్రవిచిత్రమగు కొత్తనేరాలు, కొత్తకోర్టులు సృజింపబడి, విచారణ స్వాతంత్ర్యము క్షీణించినది. జాతీయ ప్రముఖులు అప్పటికి జైలులోనుండే, వారు హింసాప్రేరణచేసి రనుటలో అర్థములేదు. ఈ శిక్షపొందినవారిలో హెచ్చుమంది కాంగ్రెసుసభ్యులేకారు. మరియు ఇట్టిచర్యలు కాంగ్రెసు ఆశయములని సర్కారు ముందే ప్రచురించినందున అదే నిజమని కొందరు భ్రమపడి అట్టిచర్యలకు గడగియుండవచ్చును. ఆ బాధ్యత ప్రభుత్వము వారిదే. వాటినిసాకుగ జేసికొని కొందరుపోలీసులును మిలిటరీవారును అప్పుడు చేసిన చర్యలు అతిక్రూరములు. జనులగొట్టుట, స్త్రీలమానభంగం చేయుట, ఆస్తులు నష్టపర్చుట, తుపాకులు కాల్చి నిరాయుధుల నిర్దోషులగూడ చంపుట, ఇట్టి భీభత్సచర్యలతో భయోత్పాతం కల్గించిరి. మరియు, తిండి, బట్టవంటి అవసరములన్నింటికి సర్కారు ఉద్యోగులపైనే జను లాధారపడవలె. ఈలోగా వాటిధరలు విపరీతంగా పెరిగి క్షామ మేర్పడినది; కాని జనులలో జాతీయావేశము పొంగుచుండెను. సతారా, బారెల్లీవంటి కొన్ని జిల్లాలలో బ్రిటిషుప్రభుత్వము కొంతకాలం విఫలమైనది. తెనాలి, భీమవరం వంటి చోట్ల రైలుస్టేషన్లు, తాలూకాభవనములు ఇత్యాదులు తగలబెట్టబడినవి, కాని ఈ చర్యలు సాకుగగొని ప్రభుత్వోద్యోగులు ఎక్కువ పీడించగా ప్రజలలో నిరాశ, నిరుత్సాహము పెరిగినవి. జాతీయోద్యమంలో జనులు అహింసను విడుచుట తుదకు ఉద్యమమునకు భంగకరమని స్పష్టపడినది.

ఈలోగా కొత్తవ్యాధులును, క్షామమును, లక్షలకొలది జనుల బలిగొనుచుండెను.

# 46 విడుదల

దేశంలోని ఈ క్లిష్టపరిస్థితిని, దుర్భరబాధలను వార్తాపత్రికలద్వార గమనించిన గాంధిగారి హృదయవేదనకు మితిలేదు. యథాస్థితిని తెల్పుచు దేశంలో ప్రజాపీడ తగ్గించి శాంతపరిస్థితు లేర్పరుచుటకై రాజకీయబందీ నందరిని విడువుమని గాంధీగారు వైస్రాయికి వ్రాసి సూచించిరి. ఇదివరకు జరిగిన సత్యాగ్రహచర్యలకు పశ్చాత్తాపం తెల్పి, ఇక యుద్ధచర్యలో తోడ్ప డుదుమని మాటనిస్తేనే, మీసూచన నంగీకరింతునని లిన్లిత్గో క్రూరముగా జవాబిచ్చెను. కాంగ్రెసు సత్యాగ్రహ మారంభించకముందే ప్రముఖులందరిని సర్కారు బంధించి అపవాదులను ప్రచారం చేసినందునను, కొందరు ఉద్యోగులు కాల్పులవంటి దుశ్చర్యలుచేసినందుననే, ప్రజలు కొన్ని తప్పు చర్యలు చేసిరి; ఐనను అందుకు అసలు బాధ్యత ప్రభుత్వమువారిదేకనుక కాంగ్రెసునాయకులతో సంప్రదించకుండ తా నట్టిమాట నిచ్చుట భావ్యము కాదని మహాత్ముడు జవాబిచ్చెను.

ఈలోగా యీ దేశమును యుద్ధయత్నాల కేంద్రముగా జేయవలసి వచ్చుటచే అందుకు ఈ దేశములో శాంతమైన వాతావరణముండుట, ప్రజానాయకుల విషయంలో కొంతన్యాయం కలిగించుట, యుద్ధజయమున కావశ్యకమని, బ్రిటిషువారికి పరోక్షంగా అమెరికనులు ఇత్యాదులు సూచించిరి. కాని బ్రిటిషుప్రముఖులు ఆ సూచననంగీకరించకపోగా పైపెచ్చు హిందూ ముస్లిం, హరిజన, సవర్ణ కలహాలు పెంచిరి. ఇట్లు ఐకమత్యమును చెడగొట్టి నను దేశంలో శాంతిని స్థాపించుట వారికిని అవసరమాయెను.

ఈలోగా యుద్ధరంగ పరిస్థితులు కొంతమారినవి; లిన్లిత్గోపోయి బ్రిటిషుసేనాని వవెలుప్రభువు ఈదేశపు వైస్రాయి ఆయెను. అంతట కొంత రహస్యరాయబారము జరిగినది. కేంద్ర అసెంబ్లీ సభలో కాంగ్రెసునాయకుడైన శ్రీ భూలాభాయి దేశాయి, ముస్లింలీగు ఉపనాయకుడు లియాఖత్ అలీఖానులతో, ఈరెండు పక్షాల నాయకులు కేంద్ర ప్రభుత్వములో చేరి యుద్ధం సాగించేయెడల కాంగ్రెసు ఖైదీలనందరిని విడుతునని వవెలు సూచించెను. వచ్చే కేంద్రమంత్రివర్గములో కాంగ్రెసు, లీగుసభ్యులు సమానసంఖ్యగ నుండవలెనని లియాఖతాలీ కోరెను. దేశాయిగారప్పుడు గాంధిగారితో లోపాయికారీగా ఆలోచించి తుదకా యంశముల కంగీక

రించిరి. వవెలుగారప్పటికి ముందే 1944 మేనెలలో గాంధిగారిని బేషరతుగా విడుదలచేసిరి. ఆగాఖాను భవనమునుండి గాంధిగారు మరల సేవాగ్రామము చేరుకొనిరి.

# 47 వవెలు-రాజీయత్నం

కాంగ్రెసునాయకులు వెంటనే జైలునుండి విడుదలయై లీగు వగయిరాలతో కలిసి కేంద్రములో మంత్రులై, శాంతి బాధ్యత వహింపవలెనని అప్పుడు బ్రిటిషు అధికారులును ఆతురపడినారు. ఇందుకు కారణాలున్నవి. అప్పటికి లక్షమందికిపయిగా భారతీయులను నిర్బంధాలలో నుంచి, తక్కిన వారి పయినను లెక్కలేని రహస్యపు పోలీసులనుంచి, కేవలము నిరంకుశ పద్ధతితోనే బ్రిటిషువారిక్కడ పాలన సాగించుచుండిరి. 1942 సం॥రం ఆగష్టులోని 'క్విటిండియా' తీర్మాన మామోదించినందుకు జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలనుకూడా వారు రద్దుచేసి నిలంకుశులయిరి. ఇంకను భారత దేశములో నిరంకుశముగా పాలించు బ్రిటిషుమిత్రమండలికి సామ్రాజ్య తత్వము పోయినదన్న ఎవరు నమ్మురు? జర్మనుల వశములోని యూరపు రాజ్యాలలోను, జపానువశములోని ఫిలిప్పైను, జావా, సుమత్రా, మలయా, బర్మాలలోను గల కోట్లకొలది జనులకు నిజమయిన స్వాతంత్ర్యమును అట్టి మిత్రమండలి కల్గించునను విశ్వాస ముండునా? ఆ జనులు (బ్రిటిషువారు కోరినట్లు) జర్మను, జపానుపాలనపైన తిరుగబడి బ్రిటిషుమిత్రమండలికి తోడ్పడుదురా? వారిమద్దతు తోడ్పాటులేకుండా ఆదేశములను శత్రువశమునుండి తప్పించి, తాము వశపర్చుకొనుట దుర్ఘటము. ఆ విడుదల జరిగి తాము మరల ఆదేశాలలో ప్రవేశిస్తేనేగాని, మిత్రమండలి వెంటనే కోరిన నిజమయిన విజయమురాదు. ఈలోగా బ్రిటిషువారికి విశేషముగా నష్టము, ఇంగ్లండులో ఆర్థికకష్టము ఈతిబాధలును హెచ్చినవి; కనుక వెంటనే తమ జయము నిమిత్తమే ఈరాజ్యాల ప్రజలకు మిత్రమండలిద్వారా విడుదల లభించునను నమ్మిక కలిగించవలె యుద్ధానంతరం స్వరాజ్య మిత్తుమను క్రియాశూన్యమగు వాగ్దానము వట్టి బూటకమని, ఈ క్రిప్సురాయబారపు రసాభాసంవల్ల తేలిపోయినది ఈ మహాయుద్ధమున రేడియోలలో, పత్రికలలోను రెండు శత్రుపక్షాలమధ్య ప్రచారయుద్ధం తీవ్రముగా సాగెను.

చిరకాలమునుండి తమ సామ్రాజ్యవశములోనున్న నాగరిక భారతదేశమునకు వెంటనే స్వాతంత్ర్యమిస్తేనే బ్రిటిషునాయకులు పరాధీనరాజ్యాలకు ప్రమాణముగా చెప్పినమాటలు వారు నమ్మెదరు; ఈ దేశములోను ప్రజా సహకారముండును. లేకుంటే సైన్యంలోను అశాంతిగల్గును.

ఈ యుద్ధకాలములోనే క్రియారూపముగా నిజమయిన అధికారమును భారతీయుల కొప్పగించుట యుద్ధజయమున కావశ్యకమనియు, నెహ్రూ మున్నగు ఫాసిస్టువిరోధులగు నాయకులను జైలులోనుండి తక్షణం విడుదల చేసి, వారి కధికార మీయవలెనని, జాన్సను, ఫిలిప్సు, ఫిషరు మున్నగు అమెరికను ప్రముఖులు తొందరచేసిరి. అమెరికను అధ్యక్షుడును చర్చిలు గారిని మందలించెను. ఈ దేశములో అన్ని ప్రాంతాలలోను అప్పుడు జరిగిన విప్లవాలు, బ్రిటిషువారిపయిన చెలరేగిన ద్వేషమును, 1857 సం॥పు సిపాయి యుద్ధము తరువాత ఇంకెప్పుడును జరుగలేదు. రహస్యముగా అధికారులకు దొరకకుండా అచ్యుత పట్వర్ధను, శ్రీమతి అరుణా అసఫలీ మున్నగు కొందరు తీవ్రముగా పోరు సాగించుచుండిరి. సిద్ధాంతరీత్యా గాంధిగారి అహింసా సత్య పద్ధతులకు కొంత భిన్నమయినను, ఈ సమరమంతయు గాంధిభక్తులుగ గాంధిపేరటనే వీరు సాగించి సర్కారును తికమకలలో బెట్టిరి. ఎట్లయిననేమి, తుదకు విధిలేక వైస్రాయి వవెలుగారు అహమ్మదు నగరులో బంధితులై యుండిన కాంగ్రెసు కార్యసమితి సభ్యులను, తంజావూరు మొదలగు జైళ్ళలోనుండిన తక్కిన కాంగ్రెసు ప్రముఖులనుగూడ 1945 సం॥లో బేషరతుగనే విడుదల చేసిరి. అజ్ఞాతముగ పోరు సాగించు వారందరు పోరు చాలించి బయటకు రమ్మని గాంధిగారు ప్రచురించగా తమ కప్పటిరాజీ సమ్మతము కాకున్నను గాంధిగారియందున్న గౌరవమువల్ల వారును అట్లు చేసి బయటపడిరి. రైలుపట్టాలు పీకుట, దొమ్మీ చేయుట, మున్నగు హింసాశిక్షలకు దీర్ఘశిక్షలో నున్నవారినిగూడ విడుదల చేయుడని గాంధిగారు ప్రభుత్వమును తొందరచేసిరి. వారిలో కొద్దిమందిమాత్రం అప్పుడు విడుదలయైరి. కొందరి ఉరిశిక్ష దీర్ఘఖైదుగా మార్చబడినది. తరువాత 1946 సం॥లో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వంవారు ఆ ఖైదీలందరినిగూడ పూర్తిగ విడుదలచేసిరి. ఈ రీతిగ ఆ స్వాతంత్ర్యసమర మంత ముగిసినది.

# 48 కస్తూరిబా గాంధి

ఇప్పుడు జైలులో మరణించిన గాంధిగారి అర్ధాంగిని నొకసారి స్మరింతము. సమవయస్క, ఏకగ్రామవాసురాలు, మిత్రసంతతి యగు కస్తూరి బాయికి బాల్యమందే గాంధిగారితో పరిణయ మయినది. అప్పటికామె విద్యావతికాదు, తరువాత క్రమముగా కొంచెము చదువుకొన్నది. కాని ఆమె ధీరత్వము, దైవభక్తి, ధర్మశీలత, పాతివ్రత్యమువల్ల ఆమె హిందూనారీలోకమునకు నాయకమణి యయినది. భర్త బారిస్టరై వచ్చిన తరువాత (మొదటిసారి దక్షిణాఫ్రికాకు వెళ్ళినప్పుడు తప్ప) ఆమె యెన్నడూ తనభర్త నెడబాయక ఆయన ఆత్మపరిశోధన, సత్యాగ్రహము, లోకసేవాకార్యములన్నిటిలో తాను సహకారిణియై, భర్త కెప్పుడును తోడ్పడుచుండెను.

ఆమె తన నలుగురు కుమాళ్లలో హరిలాలుగాంధి అవిధేయుడయినందున కెంతయు దుఃఖించి, అతని కుమారుడగు కనూగాంధిని తనయొద్దనే ఉంచుకొని, గాంధియాదర్శముల నలవరచి వృద్ధిచేసెను. నాల్గవకొడుకు దేవదాసు ఆమె ముద్దు బిడ్డడు. ఆకారంలో, సౌజన్యంలో, వివేకంలో, ప్రజాసేవలో, వారిప్రతిబింబమై ఆతడు తల్లిదండ్రులకు ఖ్యాతిని తెచ్చినాడు.

దక్షిణాఫ్రికాలో 40 ఏండ్ల వయస్సులోపుననే గాంధిగారు బ్రహ్మచర్యవ్రత మవలంబించిరిగదా! అప్పటినుండియు కస్తూరిబాయియు భర్తతో నుండుచునే సంపూర్ణనిగ్రహ మలవరచుకొని, బ్రహ్మచారిణిగ నుండినది. (గృహస్థు లందరును పౌత్రులు కలుగగనే కుటుంబసుఖమును వదలి శాస్త్రరీత్యా వానప్రస్థులుగ జీవితము గడపవలెను. అప్పుడే వర్ణాశ్రమధర్మము రక్షితమగును) ఆమె యిట్లు భర్తతో అసిధారావ్రత మవలంబించుటేగాక భర్త జాతీయసేవ, ఆహార విహార నిగ్రహము, ప్రజోద్యమములు, వీట్లలో పాల్గొనుచు, అలంకారాలను ఆభరణాలను వదలెను. లోకులు భర్తకేగాక తన కిచ్చు కానుకలనుగూడ ఆమె ప్రజాసేవ కిచ్చివేసెను. తనకొడుకులకు భర్త ఆంగ్లపాఠశాలలో విద్యను, ఉద్యోగసాధనాలను లేకుండజేసినను సమాధానపడెను. సంఘసేవాపరుడగు భర్త నిరంతర కార్యపరుడైనందున ఆయన ఆరోగ్యము, చిత్తశాంతి, సౌమనస్యము, చెడకుండుటకై కంటికి రెప్పవలె రక్షించి, ఉపచారము చేయుచుండెను. తీవ్రాదర్శపరు డగు భర్త

జీవితము కత్తిసాముఒంటిది, అట్టివానిభార్య వానితో సరిపెట్టుకోలేక కోపిష్టి యగుటయు, కుటుంబసుఖము చెడుటయు, తరుచు సంభవించును; సోక్రటీసు, రామానుజులు మొదలగు తత్వవేత్తల దాంపత్యబాధలు చరిత్ర ప్రసిద్ధములు. మరియు గాంధిగారు సర్వవేళలందును వివిధకార్యమగ్నుడగుటచే, ఎల్లకాలములలోను రకరకముల అతిథులు తమయింటికి వత్తురు ఇంట ద్రవ్య ముండదు తమది కేవలము స్వాత్విక మితాహారమైనను, అతిథులు తినగల ఆహార మిచ్చి సత్కరింపవలెను. వ్యక్తిగతముగా బాల్యమునుండి పూర్వాచారపరురా లయినను, ఆమె ముస్లిములు, క్రైస్తవులు మున్నగు అందరిని ఆతిథ్యముతో ఆదరింపుచుండెను. ఇంతియుకాక, హరిజనుల అస్పృశ్యతను తొలగింప కంకణము కట్టుకొన్న భర్త మాలమాదిగలకును భార్యచేతి ఉపచారము చేయించుచేగాక, లక్ష్మియను మాలపిల్లను తన కుమార్తెగా పెంచుకొనెను. మొదట ఈ ఉదారాశయముల మహాత్వమును తాను గ్రహింపకున్నను, భర్తయందున్న అనురాగభక్తులనుబట్టి 'మగని తోడిదే మగువజీవిత'మని తాను సర్దుకొని ఆ మాలపిల్లను దనబిడ్డగ పెంచి, అన్నికులాలవారిని, అన్నిప్రాంతాలవారిని సమానముగ నాదరించుచు, మహాత్ముని ఉద్యమము లన్నిటికి తోడ్పడుచుండెను. దక్షిణాఫ్రికాలో భారతీయు లను కూలీలను, అస్పృశ్యులుగ చూచుచు వారిని పెట్టు విపరీత బాధలను, జాతిద్వేషపు న్యాయతను భర్తతోబాటు తానును అనుభవించెను; భర్తతోబాటు సత్యాగ్రహం చేసి ఆయన వెనుకనే జైలుయాత్ర సాగించి, ఖైదీగ రాయిరప్పల గొట్టి, సంతుష్టితో కష్టాలు సహించెను. ఆ పరాయి దేశములోగూడ హరిశ్చంద్రునివంటి భర్తతోబాటు సత్యమును, సత్యాగ్రహమును సాగించి జయముసు చేకూర్చెను. (ఇప్పుడు వీరి రెండవ కుమారుడు మణిలాల్ గాంధిగారు దక్షిణాఫ్రికాలోనే ఉండి, మరల శ్వేతజాతీయులతో తీవ్రముగా పోరు సాగించుచున్నారు.)

**1915** సం॥రం నుండి మనదేశములో సబర్మతీ, సేవాగ్రామముల ఆశ్రమాలలో ఈమె సత్కారమును మనదేశపు నాయకులు, సంఘసేవకులును పొందినారు. ఎందరో విదేశీయులును వచ్చి ఆమె యాతిథ్యమును సౌజన్యమును మెచ్చుకొన్నారు. కొందరు తెల్లవారు, హరిజనులు, సనాతనులు,ఎవరో గుండాలు, ద్వేషపూరితులై గాంధిగారినికొట్టి హింసింపవచ్చిరి;

అట్టి తీవ్రఘట్టాలను లక్ష్యంచేయక తిరిగే భర్త కషాయము రాకుండ ఆమె వేయికండ్లతో కనిపెట్టుచుండెను. దైవకృపవల్ల, వారి కషాయము తప్పి పోవుచుండెను. గాంధిగారు సాగించిన ఖాదీ, మద్యనిషేధం, హరిజనసేవ హిందీప్రచారము మొదలగు నిర్మాణకార్యాలన్నిటి ప్రచారమును ముఖ్యముగా స్త్రీజాతిలో బాగా వ్యాపింపజేయుటలోను, స్వాతంత్ర్యయుద్ధములో స్త్రీలు పాల్గొనునట్లు చేయుటలోను, నిశ్శబ్దముగా, నిరాడంబరముగా, పేరు కోరకుండా, ఆమె చేసిన కృషి అపారము. తిలకు మున్నగు ఇతర నాయకుల ఉద్యమాలకన్న గాంధిఉద్యమములో స్త్రీ లెక్కువ పాల్గొన్న మాట నిర్వివాదము. అందు కాయన సహధర్మచారిణి సహకార మెంతయు తోడ్పడినది. ఆరంభస్థితిలో భర్తతో వాదించి తగువుపడినను, ఉభయుల మధ్య పరస్పరగౌరవ మెప్పుడూ చెడలేదు. కుటుంబకలహములోను భర్త సత్యాగ్రహపద్ధతి నవలంబించుటవల్ల పిమ్మట ఉభయులమధ్య కలతలుపోయి ప్రేమభావము మరింత స్థిరపడినది. 1940 సం॥రం నుండి, ఈసాధ్వీమణి ఆరోగ్యము చెడుచుండెను. కాని, 1942 ఆగష్టులోను బొంబాయిరంగంలో హాజరై ఆగాఖానుజైలులో చేరెను, అప్పటినుండి విరేచనవ్యాధి ప్రబలి ఆమె నీరసించి క్షీణించెను. అంత్యదశ సమీపించినప్పుడు సర్కారును వేడి ప్రాణభిక్ష పొందదలచుకోలేదు. తుదకు 22—2—44 తేదీని ఈ ఆదర్శసుమంగలి భర్త హస్తములందే మరణించెను. వారి పరివారములోని ప్యారీలాలు, డా. సుశీలానయ్యర్ ఇత్యాదులనేగాక దేశమంతటినీ శోకవార్త దుఃఖసముద్రమున ముంచెను.

ఇట్లు మనసంప్రదాయప్రకారము ఆదర్శముగా వర్తించిన ఆ మహిళామణికి స్మారకముగా, ఆమె వయస్సు 75 ఏండ్లనుబట్టి 75 లక్షలరూపాల నిధిని వసూలుచేయ కొందరు సంకల్పించిరి. కొద్దినెలలలోనే అందుకు కోటి యిరవైలక్షలు వసూలగుట గాంధిదంపతుల ఖ్యాతికి, జనుల కృతజ్ఞతకు గూడ నిదర్శనము. దీనిని సవ్యముగా వ్యవహరించుట కొక ధర్మసంస్థ యేర్పడెను. దాని సభ్యులు గాంధిగారి నధ్యక్షులుగ నెన్నుకొనిరి. ఈసంస్థ కస్తూరిబాగాంధి జాతీయస్మారక ధర్మసంస్థ. అది స్త్రీజాతి యున్నతికే కృషి చేయవలె. స్త్రీ లెందరో ప్రసవవ్యాధులకులోనై మరణింతురు. శిశుమరణములును మనదేశములో హెచ్చు. ఆసుపత్రులు బస్తీలకే బాగా వినియోగమగు

చున్నవి. మరియు స్త్రీలలో తగు విద్య లేకున్నది. కనుక, ఈ నిధితో, ప్రసవసౌకర్యమునకు, స్త్రీవ్యాధిచికిత్సకు ఆసుపత్రులను, నవ్యజాతీయ విద్యాలయాలను స్త్రీలకై గ్రామాలలోనే నడుపనిశ్చయమైనది. "నీవు జైలులో మరణించితే, నిన్నొక దేవిగ పూజింతును" అని గాంధిగారొకప్పుడు చలోక్తిగ భార్యతోననెను. ఈ అమోఘవాక్కు సఫలమై, క్రియలో విగ్రహపూజగమాత్రమే సమాప్తముగాక, భారతీయులు ఆమెకు చేయు గౌరవము వల్ల స్త్రీజాతికి లాభము కలుగునట్లు మహాత్ముడు చేసినాడు. ఈ ధర్మసంస్థ నిర్వహణము చాలవరకు ప్రసిద్ధ దేశసేవికలగు యోషామణుల హస్తములలో నున్నది. శ్రీమతి సుచేతాకృపలానీ మున్నగు మహిళలెందరో యీ భారమును వహించుచున్నారు ఈ విధానము ప్రకారముదేశమంతట కస్తూరిబా పేరిట ఎన్నియో ప్రసూతిచికిత్సాశాలలు, ప్రాతిపదిక విద్యాలయాలును సాగింపబడుచున్నవి. ఈనిధి యింకను వృద్ధియగుచున్నది. కస్తూరిబా భౌతికముగా మరణించినను, దీనిద్వారా భారతమహిళోద్ధరణకు, తోడ్పడుచు చిరంజీవురాలాయెను.

# 49 వంగ దక్షిణ యాత్రలు

1943-44 సం॥రములలో దేశసమస్యనుగూర్చి గాంధి వవెలుగార్ల మధ్య కొంత ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. 'క్విటిండియా' మంత్ర ముప సంహారింప గాంధిగారు నిరాకరించిరి. 'సత్యాగ్రహ ముపసంహారించు కొమ్మన్న తాను ప్రారంభించని సత్యాగ్రహమును మానుటేమిటి? మరియు, ఆతీర్మానము కాంగ్రెసు సమితిది; దాని సభ్యులు విడుదలరై వారితో సంప్రదించినప్పుడే ఆప్రశంస వచ్చును' అని గాంధిగారనిరి. తుదకు అనారోగ్యముగ నున్నదను మిషతో బేషరతుగనే 1944 సం॥రం మేలో వైస్రాయి గాంధిగారిని విడిపించెను. 1944 మే నుండి, గాంధిగారు దేశంలోని వివిధసమస్యల పరిష్కారమునకు తీవ్రకృషి నారంభించిరి. ముంధుగ సవర్ణహారిజన సఖ్యమును, హిందూముస్లిం మైత్రిని బలపర్చుట కాయా సంఘములతో కలపి దేశసంచారంచేసిరి. జనులలో ప్రబలియున్న హింసాద్వేష

భావాలను పోగొట్టి పరస్పరప్రేమను వృద్ధిచేయబూనెను, ఆహారవస్త్రముల
సమస్యలను ప్రజలు పరిష్కరించుకొనుటకు స్వయంసహాయాధారమగు
కొన్ని అమూల్యసూచనలను చేసెను, అప్పుడే, రాజ్యాంగసమస్య పరిష్కా-
రమునకై సిమ్లాసమావేశములో పాల్గొనెను.

ప్రజల ఆవేదనవల్ల, సర్కారు ఉద్యోగుల నిరోధమువల్ల, కొన్ని
నిర్మాణసంస్థలు కుంటుబడియుండెను. ఆ విషవాతావరణములో భిన్నభిన్న
మైన చరఖాసంఘు, హరిజనసేవక సంఘు, గ్రామోద్యోగసంస్థలను పునరుద్ధ
రించి, సమయోచితముగా ఆయన వాటికి నవజీవమును, కొత్తవ్యవస్థ
మును కల్గించెను.

ఈలోగా బెంగాలుపుస్థితి దుస్సహమయినది అక్కడ గింజల సరఫ
రాను మిలిటరీ అవసరాలకై సర్కారువారు వశపర్చుకోగా, క్షామంవల్ల
25 లక్షల జనులు చచ్చిరి. అక్కడి ముస్లింలీగు ప్రభుత్వము తగుచర్య చేయ
లేకపోయెను. బర్మా కాందిశీకులద్వారా బెంగాలులో (కొంచెముగా మన
ప్రాంతములోను) కొత్తవ్యాధులు వ్యాపించెను. కొంత వరదలనష్టము
కల్గినది ఈ యీతిబాధలనుండి తగు ప్రతిక్రియల సూచించుట కాయన
వంగదేశమునకు వెళ్ళి, రెండు నెల లక్కడిజనులకు ధైర్యము కల్గించి,
నిర్మాణాత్మకమగు ప్రక్రియలను సూచించెను. లక్షలకొలది జనులాయనను
దర్శించి ప్రతిరోజు 'సోదేపురాశ్రమములోని సాయంత్రప్రార్థనలలో పాల్గొని,
ఆయన ఉపదేశముల విని, మనశ్శాంతిని పొంది, ఉత్సాహితులై, ఉద్యమ
పరులైరి.

గాంధిగారంతట మద్రాసుకు విచ్చేసిరి. 1937 సం॥రం తరువాత,
మరల 1946 జనవరి 20 తేదీని కలకత్తానుండి ప్రత్యేకపు ట్రెయినులో
బయలుదేరివచ్చి, మద్రాసు హిందీ ప్రచారసభ కార్యాలయములో బస
చేసిరి. దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి రజతజయంతి ఉత్సవ మంతకు
ముందే జరుగవలసియుండియు, దాని అధ్యక్షులగు గాంధిమహాత్ముని రాకకై
నిలుపబడెను. అక్కడ ఆయన వసించిన 12 రోజులలో ఆయన నిర్మాణ
కార్యసమావేశాలలోనే మగ్నుడాయెను. హిందీ ప్రచారసభవారి రజత
జయంతి ఉత్సవము, వార్షిక పట్టప్రదానోత్సవము (కాన్వొకేషను) మాత్రమే
గాక, ఖాదీ, హరిజనోద్ధరణ, గ్రామపరిశ్రమలు, జాతీయసాహిత్యము

మున్నగు ఇతర విషయాలనుగూర్చి గాంధిమహాత్ముడు ప్రశ్నలకు సమాధానముగ తన అభిప్రాయాలను హిందుస్తానీభాషలో తెల్పుచువచ్చెను. ఆరోజులలో వేలకొలది హిందీప్రచారకులు మున్నగు నిర్మాణ కార్యకర్తలేగాక సాయంకాల ప్రార్థనలలో ప్రతిరోజు లక్షవరకు జనులువచ్చుచు, ఆయన యుపదేశముల వినుచుండిరి. అప్పుడాయనప్రాంతీయ రాజకీయసమస్యల నెత్తుకొనక, కేవలం నిర్మాణ కార్యక్రమపు ఆవశ్యకతనుగూర్చియే ప్రబోధముచేసిరి. 1-2-46 తేదీని మద్రాసులో హరిజనులకై క్రొత్త పరిశ్రమాలయమునకు శంకుస్థాపనచేసి, గాంధిగారు మరునాడు తమిళనాడులోని హరిజనలకు మొదట ప్రవేశమిచ్చి మార్గదర్శకమైన మధుర, పళనిదేవాలయములకు యాత్రచేసిరి. అక్కడనుండి మరలి వెళ్లునప్పుడు బెజవాడలోని ఆంధ్ర రాష్ట్ర హిందీప్రచారసంఘ భవననిర్మాణము నాశీర్వదించి ఆంధ్రులకు లిఖిత సందేశము నొసంగిరి.

## సందేశము.

"ఆంధ్రదేశమునుండి నేను చాలా ఆశించుచున్నాను. ఆంధ్రులు నా ఆశయములను తప్పక నెరవేర్తురని నా పూర్ణ విశ్వాసము.

అస్పృశ్యతను పోగొట్టవలెను. దేవాలయము లన్నింటిలోను హరిజనులకు ప్రవేశ మొసంగవలెను ఇంటింట రాట్నము తిరుగవలెను. అందరును ఖాదీ ధరించవలెను. జాతీయైక్యతానిర్మాణము జరుగవలెను. మాతృభాషను అభ్యసించవలెను. రాష్ట్రభాషయగు హిందూస్తానీని దేవనాగరి, ఉర్దూ రెండులిపులలో నేర్చుకొనవలెను."

ఖాజీపేట,
5-2-46.

(సం) మో. క. గాంధి.

# 50 సిమ్లా సంభాషణలు

దేశపు అశాంతిస్థితిలో వెంటనే ప్రజానాయకులతో రాజీచేసికొని, భారతప్రభుత్వమును ప్రజానాయకులతో పునర్నిర్మాణము చేయుట ఆవశ్యక మని బ్రిటిషుప్రభుత్వమువారు గమనించిరి. అప్పుడు బ్రిటనులో పార్లమెంటు ఎన్నికలు జరుగగా అందులో చర్చిలుపక్షపు కాన్సర్వేటివు లోడిరి; లేబరు (కార్మిక) పక్షమువా రధికారమునకు వచ్చిరి. సిమ్లాలో వైస్రాయి వవెలు గారు గాంధిగారిని, కాంగ్రెసు ముస్లింలీగు నాయకులను, ఇతర ప్రముఖులను, పిల్చి కొంతచర్చ జరిగించిరి. లోగడజరిగిన 'దేశాయి లియాకతు' సమాఖ్యను కొంత మార్చి కేంద్రప్రభుత్వ సభ్యులలో సవర్ణహిందువులు, ముస్లిములు సమసంఖ్యగనుండుట కొప్పుదలచేసిరి. ఆ ముస్లిములందరు లీగు పక్షీయులే. తనచే నియమితులే ఉండవలెనని లీగునాయకుడు జిన్నాగారు పట్టుబట్టగా, అందుకు కాంగ్రెసు ప్రముఖులేగాక పంజాబునాయకులుకూ ఒప్పుకోలేదు. ఆ సమావేశ మట్లు నిష్ఫలంకాగా గాంధిగారు తక్కిన నాయకులతో బాటు వచ్చివేసిరి. అప్పుడు వైస్రాయి బాధ్యతవహించి వెంటనే పరిష్కరించ వలసినదిగాని అట్లు చేయలేదు.

# 51 కొత్తయెన్నికలు

ముస్లిములందరికీ లీగుపక్షమే ఏకైక ప్రతినిధి అను తన వాదమును సమర్థించుకొనుటకు వెంటనే శాసనసభ లన్నిటికిని ఎన్నికలు జరిపించవలెనని జిన్నాగా రప్పుడు వాదించిరి. ఎన్నికద్వారా ప్రజాభావము వ్యక్తమగుటకు కాంగ్రెసువారును సమ్మతించిరి. కాని, 6 ఏండ్లనుండి విదేశప్రభుత్వపు అండ తోను, నవాబులు, జాగీర్దారులు మున్నగు ధనాఢ్యుల పూర్ణసహాయముతోను, మతమార్గులగు సాంఘికతత్వపరుల ఖుద్దతుతోను లీగువారు ముస్లిముజనులలో పాగుకొని బాగా పలుకుబడిని సంపాదించిరి. అట్టివారితో మొన్నటివరకు అక్రమసంఘముగానుండి; అంగబలము, అర్థబలము లేకున్న జాతీయముస్లి

ములు పోటీచేయుటెట్లు ? చాలవరకు ధనికులకే వోటుహక్కు. అదిగాక తగినంత వ్యవధినీయక 1945 సం॥రం అక్టోబరులోనే కేంద్రసభకును, 1946 ఫిబ్రవరి ప్రాంతములో రాష్ట్రసభలకును, లోపభూయిష్ఠమగు వోటరు జాబితాలతోనే సర్కారువారు యెన్నికలు జరిపించివేసిరి. తక్కిన యితర స్థానాలు చాలవరకు కాంగ్రెసు ప్రతినిధులకే లభించినవి. ఈసారి అస్సాం, వాయవ్యసరిహద్దురాష్ట్రాలలోను, కాంగ్రెసుకు 'మెజారిటీ' (హెచ్చు స్థానాలు) లభించెను. కాని, ముస్లిముస్థానాలు చాలవరకు లీగుపక్షమునకే లభించెను. పక్షప్రాబల్యము, హంగు, ధనబలము, పరపతి, మసీదులలో ప్రమాణపద్ధతి, సాంఘికతత్వప్రకోపమును పనిచేసినవి. కొన్ని ప్రాంతాలలో ముస్లిముయెన్నికలలో దౌర్జన్యము, లంచము, నిర్బంధము బహిరంగముగా ప్రయోగింపబడెనని, అందుకు సర్కారు అధికారులు అడ్డలేదు సరికదా, లీగుజయమునకే స్వయంగా తోడ్పడిరని, చాల నిర్ణయములు దొరికినవి. ముఖ్యముగా బెంగాలులోను, సింధులోను బహిరంగముగానే హింస, నిర్బంధములు జరిగెను. జాతీయముస్లిములు చెప్పుకుంటే వినే దిక్కులేదు సరికదా, వారికి, వారి యేజంట్లకుగూడ ప్రమాదములు, ఆపత్తులు సంభవించెను. అట్టిస్థితిలో లీగుపక్షమే బెంగాలులో ప్రబలమైనది. అక్కడను, సింధులోను, ఆంగ్లేయుల పక్షపాతమును ఉపయోగించుకొని, లీగుప్రభుత్వ మేర్పడెను. పంజాబులో ముస్లిముస్థానాలు చాలవరకు లీగుకు వచ్చినవి. కాని, మొత్తముమీద యూనియనిస్టులు, కాంగ్రెసువారు కలిసి పాలన మారంభించిరి. తక్కిన అన్ని రాష్ట్రాలలో 1946 ఏప్రిలునుండి కాంగ్రెసుమంత్రివర్గములు మరల నేర్పడినవి. సింధులో మరల యెన్నికలు జరిగి, లీగువారు దౌర్జన్య నిర్బంధాదులను స్వేచ్ఛతో నుపయోగించగా, వారి కక్కడ అధికారబలము హెచ్చినది. పంజాబులో సాంఘికకలహములు పెరిగి, లీగుఒత్తిడివల్ల యూనియనిస్టుమంత్రివర్గము పడిపోయినది.

# 52 ప్రకృతి చికిత్సాలయం

జాతీయకార్యాల నిరంతరకృషిమధ్యనే గాంధిగారు 1945-46 లలో ప్రకృతిచికిత్సాలయమును స్థాపింపజేసిరి. ఆరోగ్యరక్షణ ప్రతివానికి ఆవశ్యకము అని గుర్తించి, ఆయన చరకాదిమునులు చెప్పిన ఆరోగ్యవిధులను (అనుభవముద్వారానే) సదా గమనించెను. ఇటీవల మన దేశభాషలన్నిటిని, లిపులన్నిటినిగూడ ఆయన నేర్చుకొనుచుండే, "ఈవార్ధకములో, కృశించిన శరీరముతో, ఈరాత్రింబవళ్ళ కృషియేమి?" అనియెవరో అడిగిరట. అందుకు "అదేమిమాట, నేను యువకుడను 125 యేండ్లు జీవించదలచినాను" అన్నారట. అయితే మీదేహమును దృఢపర్చుకొని, ఈచికాకులనుండి విశ్రాంతి తీసుకోండి"అనగా, "అట్టే, 125 యేండ్లు నాసుఖమునకా? దేశమాతకు, లోకమునకు ఇంకా నిరంతరము సేవజేయుటకే జీవింతును" అని జవాబిచ్చిరి. మనదేశమును ఆధ్యాత్మికముగా లోకప్రసిద్ధముజేసిన మహాత్ములలో శంకర, రామతీర్థ, వివేకానందాదులు 40 ఏండ్లలోపు యువకదశలోనే పరమపద మొందిరి. కాని, మధ్వ, రామానుజ, రామకృష్ణాదులు దీర్ఘాయుష్కులయిరి. పూర్వపు వసిష్ఠ విశ్వామిత్రాదులు వందలకొలది వర్షములు జీవించిరట. తగు తైల, వాయువు, సూర్యరశ్మి, గంగోదకము, వగైరాలతో తేజోవృద్ధిజేసుకొని ప్రకృతిజీవనులై సుదీర్ఘకాలము జీవించిరి. 125 ఏండ్లు లోకసేవకై జీవింప జూచుట శ్రుతిచోదితమని గాంధిగారి విశ్వాసము. *

తరుచు వైద్యులాయనదేహమును పరీక్షించినను ఆయన ఔషధాలను (వైద్యులు చెప్పినను) తీసుకోలేదు. "అలోపతి"కన్న ఆయుర్వేదమే శ్రేయస్కరమైనను, ఇప్పటి ఆయుర్వేదవైద్యము సరియైనస్థితిలోలేదని ఆయన భావన. ఆయుర్వేదముకన్న ప్రకృతివైద్యమునే ఆయన యెక్కువ ఆదరించెను. అజీర్ణజ్వరాదులకు, గాయములకు నేగాక, ప్లేగు, విషూచి, మశూచివంటి అంటువ్యాధు'లకును ఆయన స్వయముగా ఆశ్రమములో చికిత్సజేసి నిర్వహించెను. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం". కనుక ప్రజా

---

* 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః.' ఈశావాస్యోపనిషత్తు.

క్షేమమునకు మార్గదర్శకముగా ఆయన స్వయముగానే ఒక ప్రకృతిచికిత్సా లయమును స్థాపించదలచెను. కాని తీరికలేదు. ఇటీవల పూనా సమీపములోని "ఉరులి కంచన్" అను గ్రామములో ఘనులగు అనుభవవైద్యులద్వారా ఒక ప్రకృతి చికిత్సాలయమును స్థాపింపచేసి, అందుకు విరాళములు రాబట్టెను. జబ్బును కుదుర్చుటకన్న జబ్బురాకుండ ఆరోగ్యము బాగు చేయుట, దేహ మనో హృదయాంశముల సమన్వయించుట, ఆహారవిహారాదులను సరిచేయుట ఇందు ముఖ్యములు. జలచికిత్సద్వారా దేహములోని చెడుపదార్థమును తొలగించుట, ఆతపచికిత్స (అనగా సూర్యరశ్మిప్రసారం) ద్వారా ఉష్ణతను నాడీశక్తిని బలపర్చుట, ఉపవాస జలపానములద్వారా అజీర్ణమును పోగొట్టుట, మట్టిపూత, లేతఆకులగప్పుటద్వారా గాయములు, చర్మవ్యాదులు, రక్తపుపోటుబాధ ఇత్యాదులు మాన్పించుట ఈ చికిత్సాలయపు ముఖ్యపద్ధతులు. పంచభూతాత్మకమగు దేహము భూమి, జల, తేజో, వాయ్వాదుల సవ్యప్రయోగమువల్లనే ఆరోగ్యమొందును. భక్తియు, ప్రపత్తి అనగా దేవునిపైన పూర్ణవిశ్వాసముతో ఆధారపడి దేవుని స్మరించుటయు వ్యాధి నివారకమని పూర్వపు ఆయుర్వేదజ్ఞులును చెప్పిరి.

# 53 ఆమాత్య ప్రకాశిక

క్రిప్సు రాయబారమువలె వవెలు మంత్రాంగమును మాయామయమయి, 'విభజించి పాలించు' పాతపంథానే నడచినది. ఈ లోగా జర్మనీ జపానులు పూర్తిగనోడి, మిత్రమండలికి విజయము చేకూరెను. కాని ఈ యుద్ధాంతమున బ్రిటిషుసామ్రాజ్యపు ప్రతిభ, ప్రతిష్ఠయు క్షీణించినవి. ఇక సామ్రాజ్యమును బలముతోను, పటాటోపముతోను అణచియుంచ వీలులేదు. సామ్రాజ్యతత్త్వము మూర్తీభవించిన చర్చిలుగారి కెన్నికలలో శృంగభంగంచేసి యేర్పడిన కార్మికప్రభుత్వమువారు ఇక్కడకు ముగ్గురు మంత్రులను రాయబార మంపిరి. ఈ మంత్రిత్రయము ఢిల్లీ, సిమ్లాలలో మరల నాయకులతో కొంత చర్చలు జరిపెను. 1946 సం॥ మార్చి నెలలో గాంధిగారు | కేంద్రప్రభుత్వములో కాంగ్రెసుపక్షమువారిలో ముస్లిములుకూడ

ఉండవలెనని షరతుపెట్టిరి. కాంగ్రెసులో ముస్లిములు లేకుండజేయుట జిన్నాగారి కోరిక. చివరకు మంత్రిత్రయ ఇంగ్లండుకు పోయి, తమ ప్రణాళికను ప్రచురించిరి.

"భారత కేంద్రప్రభుత్వము రాష్ట్రకూటపుమండలి, రాష్ట్ర ప్రభుత్వము, ఇట్లు రాజ్యాంగాలలో మూడంచెలు పెట్టిరి. దేశరక్షణ, విదేశాంగ శాఖ, రహదారీశాఖ యీ మూడుశాఖలే భారత కేంద్రప్రభుత్వం వశమై యుండును. తక్కిన అన్ని పాలనశాఖలు ఆయా రాష్ట్రాలవే. మరియు వాయవ్యకూటము, ఈశాన్యకూటము, శేషము. ఇట్లు మూడుకూటాలు ఏర్పడును. ఈ కూడలిపద్ధతికి మొదట ప్రతిరాష్ట్రమూ సిద్ధముకావలె. కాని, కూడలిలో చేరి, క్రొత్తరాజ్యాంగప్రకారం యెన్నికయయిన తరువాత యే రాష్ట్రం వారయిన ఆ సమితిలోనుండి విడిపోవచ్చు; ఈ పద్ధతిని, సమగ్రరాజ్యాంగమును తయారుచేయుటకొక రాజ్యాంగపరిషత్తు ఉండును. అప్పటి రాష్ట్ర అసెంబ్లీల సభ్యులే (ముస్లిములు వేరుగను, తక్కినవారు వేరుగను) ఈ పరిషత్తుకు జనాభానుబట్టి పదిలక్షల కొకనిచొప్పున సభ్యుల నెన్నుకొందురు. అట్టి రాజ్యాంగపరిషత్తులో పాల్గొను పక్షాలనాయకులను (తత్కాల) ప్రభుత్వమంత్రులుగ నియమింతురు." ఈవిచిత్ర ప్రణాళికను మొదట సమ్మతించియు, తరువాత లీగువారు నిరాకరించిరి. ఏరాష్ట్రమైన గ్రూపింగు అనగా కూటంలో పాల్గొనుట ఐచ్ఛికము. ఆసిద్ధాంతమునకు భంగములేకుండ దీని నంగీకరింపవచ్చు అని గాంధిగా రభిప్రాయపడిరి. (ముఖ్యంగా అస్సాంవారు తూర్పుగ్రూపులో చేర నొప్పుకోలేదు.) కాంగ్రెసు కార్యసంఘమువారు అట్లే తీర్మానించిరి. అంతట జవహర్లాలుగారి నాయకత్వమున కేంద్రమంత్రివర్గ మేర్పడినది. అందులో లీగుపక్షము మొదట చేరనన్నందున వారిస్థానే స్వతంత్ర ముస్లిములు చేర్చబడిరి. ఈసమిష్టిమంత్రులు 15 గురిలో 6 మాత్రం కాంగ్రెసు పక్షీయులు, ఐనను ఈ అందరు కాబినెటువలె ఏకీభావముకల్గి స్వతంత్ర జాతీయ దృక్పథముతో ప్రభుత్వమున ప్రగతికరముగా పనిచేసిరి.

# 54 బ్రిటీషుసర్కారు కప్పదాటు

నెహ్రూప్రభుత్వపుజాతీయప్రవృత్తి వైస్రాయి వవెలుకు సివిలి యనులకును గిట్టలేదు. మంత్రులలో విభేదాలేర్పడితేనే వైస్రాయి కేంద్ర పాలనలో కల్పించుకోవచ్చు. కాని, మంత్రులందరు ఉపాధ్యక్షుడగు నెహ్రూనాయకత్వములో మైత్రితో ఏకధోరణి కలిగియుండిరి. గాంధి గారు ముఖ్యసమస్యలనుగూర్చి వీరికందరికి సలహా లిచ్చుచుండిరి. అప్పటి ముస్లింమంత్రులును నెహ్రూతో ఏకీభవించిఉండుట బ్రిటీషుపాలకులకును, లీగుపక్షమునకును కన్నెర్రగనుండెను. అప్పుడు వైస్రాయి జిన్నాను తొందరగ ఆహ్వానించి మొదటిముస్లింమంత్రులను వదలించి, ఆస్థానే 5 ముస్లింలీగు పక్షీయులను మంత్రులుగ తగు నియమాలులేకుండగనే చేర్చెను. వారు నెహ్రూపక్షముతో నేకీభవింతురు. ఇక లీగు ముస్లిములును రాజ్యాంగపరిషత్తులో పాల్గొందురు, కనుక ఈరీతిగ పేచీలేకుండ క్రొత్తరాజ్యాంగము త్వరలో ఏర్పడి బ్రిటీషుప్రభుత్వపు ఆమోదము నొందుననియు, వవెలు గారు నెహ్రూవర్గము నొప్పించిరి. కాని, క్రియలో లీగుపక్షమంత్రులు బ్రిటీషు ఐ. సి. ఎస్. లతో ముస్లిం ఉద్యోగులతో, వవెలుతో, లాలో చీయై, జాతీయవర్గమున కడ్డుతగులుచుండిరి, తమవశమందున్న శాఖలపరిపాలనలో వేరుపంథా త్రొక్కుచుండిరి, ఇంతేగాక రాజ్యాంగపరిషత్తువారి సమావేశాలలో ముస్లింలీగువారు పాల్గొనక దేశమున దౌర్జన్యప్రచారమును సాంఘిక సంఘర్షమును సాగించిరి.

# 55 అగ్ని పరీక్ష

స్వరాజ్యసంపాదనకు సాంఘికమైత్రి ముఖ్యావశ్యకము. అహింసా సాధకుల కది మరీముఖ్యము. అయితే బ్రిటీషువారి కొన్నిచర్యలవల్ల విదేశ పాలకు లీదేశమును వదలిపోతేగాని హిందూముస్లింమైత్రి గట్టిపడదని, విభేదాలు పెంచుటలో దిట్టలయిన బ్రిటీషువారి ప్రవృత్తివల్ల గాంధిగారికిని తోచెను. లీగుపక్షీయులు రాజ్యాంగపరిషత్తును నిరసించుటేగాక,

ప్రభుత్వముమీద ప్రత్యక్షయుద్ధము 16-8-46 నుండి ఆరంభించినను, కేంద్ర ప్రభుత్వమునుండి లీగుమంత్రులను వైస్రాయి పంపివేయలేదు. ఆ ప్రత్యక్ష చర్య లీగుపాలితమగు బెంగాలులో, ముందుగా కలకత్తాలో, పిమ్మట తూర్పుబెంగాలులో సాగింపబడెను. అయినను బ్రిటిషుఅధికారులు వారికి సహకారమే జేసిరి. లీగువారును తమ పోరునంతను హిందూ సిక్కుల మీదనే సాగించిరి. శాంతమనుపేరతో దారుణమగు హత్యాకాండ, బజారులో మహాభవనాలను భస్మముచేయుటయు, వేలకొలది జననష్టము, కోట్లకొలది రూపాయల ఆస్తినష్టము కల్గించుటనే జరిగెను. ఆ ముస్లిము గూండాలకు లారీలు, పెట్రోలు, శూలాలు, బల్లెములు, బాకులు, తుపాకులుగూడ ధారాళముగా ఎట్లులభించెనో? హిందువులు మొరపెట్టినను గవర్నరు కల్పించుకోలేదు. కృతఘ్నులగు ముస్లింగూండాలును యూరపియనులను, వారి ఆస్తులను యెట్టినష్టమూ చేయలేదు. మొదటి రెండురోజుల దారుణముల తరువాత హిందువులు, సిక్కులును ముస్లిములపైన హత్యలతో ప్రతిక్రియ జేసిరి. అప్పుడు సైనికులు సిద్ధమయిరి. అంతట ముస్లింసంఖ్య చాల హెచ్చగు తూర్పు బంగాళపు నవఖాలీజిల్లాను ముస్లిములు రంగమును మార్చిరి. ముస్లిముగూండాలు అక్కడ తమ ప్రత్యక్షచర్యలను స్వేచ్ఛతో సాగించిరి. వేలకొలది హరిజనులను దౌర్జన్యముతో ముస్లిము మతములో కలిపిరి. సవర్ణ హిందువులకు హత్య, ఆస్తి నాశము లభించినవి. రక్షకులగు లీగప్రభుత్వమువారే భక్షకులైరని, హిందువులనేకులటనుండి కాందిశీకులయి పశ్చిమజిల్లాలలో చేరిరి. వారి కొంపలను, పంటలను కాపాడునదెవరు? సాంఘిక ద్వేషము లీగుపత్రికలచే ముందుగ ప్రచారితమై, కార్చిచ్చువలె దేశమంతటను వ్యాపించెను. ఖాండవవనాగ్నివలె హింసావృతమైన నవఖాలీప్రాంతములోనికి గొప్పఉద్యోగులు, హిందూనాయకులును వెళ్ళలేకపోయిరి. సహజముగా వార్తలతిశయోక్తిగ వ్యాపించెను. పరిశీలన సాధ్యంకాలేదు. గాంధిగారికిది జీవితసమస్య. వెంటనే ఆయన నవఖాలీ వెళ్ళి అక్కడ స్వయముగా పరిశీలింప నిశ్చయించెను. నిరాయుధుడు, అసహాయుడు నగు గాంధిగారట్లు ఆ అగ్నిమండలములోనికి దూకుట ఆత్మహత్య పాలగుటేనని అందరు భయపడి వద్దనిరి. కాని ఆయన సాహసించి నవఖాలీకి వెళ్ళెను.

ఈలోగా, బెంగాలు కాందిశీకు లనేకులు బీహారు చేరగా ఆ వార్తల వల్ల ఉద్రిక్తులైన కొందరు బీహారు హిందువు లక్కడి ముస్లిములను హింసింప దొడగిరి. ఆ మాట విని, ఆ హత్యాకాండ వెంటనే ఆగిపోనియెడల ఆమరణోపవాసము చేతునని కలకత్తానుండి గాంధిగారు తెల్పిరి. బీహారు మంత్రులు నెహ్రూ, ప్రసాదులుగూడ స్వయముగా పూనుకోగా ఆరంభించిన వారమునకే బీహారు అల్లరులు నిలిచిపోయినవి నవఖాలీ, తిప్పెరజిల్లాలలో ముస్లిముగూండాలు హత్యలు, ఇండ్లధ్వంసము నేగాక, స్త్రీలను చెర బెట్టుట, నిర్బంధముగా మతమును చెరపుట, ఆలయాలను తగులబెట్టుట, ఇట్టి రాక్షసచర్యలను చేసిరి దారి తెన్నులేని ఆ గ్రామాలలో ప్రతిదానికి గాంధిగారు స్వయముగా వెళ్ళి, ధైర్యముచెప్పి, ముస్లిముల యిండ్లలోనే బసచేసి, ఉభయులమధ్య మైత్రికి మానవసాధ్యమయిన కృషినంతయు నెలల కొలదిగ చేసిరి. గట్టుపుట్టలు దాటుచు బురదలో, ఇసుకలో ప్రాణము లరచేత బెట్టుకొని, కొద్దిమంది ఆయనతో వెళ్ళిరి. కాని తన పరివారమును కూడ ఆయన వేర్వేరు గ్రామాలకు పంపి, అక్కడి లీగుముస్లిములు తనకు వ్యతిరిక్తులు, ఉద్రిక్తులు నని తెలిసియు, ఆతతాయులతోగూడ చిరునవ్వుతో కలసి ఆదరింప, వారు నిశ్చేష్టులై శాంతులయిరి. ఇట్లు ఆ యాత్ర, గాలిలో దీపమువలె మొదట తోచినను, ఆత్మశక్తి, దైవబలమువల్ల తుదకు హిందూ ముస్లిములమధ్య తద్వారా కొంతమైత్రి యేర్పడెనని అందరు నంగీకరించిరి. స్థిరసఖ్యమునకై ఆయన కొంత ప్రక్రియను మంత్రివర్గమునకు సూచించెను. అప్పుడు మీరటులో జరిగిన అఖిలభారత కాంగ్రెసునకును, ఢిల్లీలోని ముఖ్యరాజకీయ సమావేశాలకును (వేడినను) వెళ్ళక, ఆ ప్రచండహింసాగ్ని నార్పి ప్రేమామృతముతో ఆ విషపూరితమైన వాతావరణమును మార్ప గలిగెను. అప్పుడు బీహారులో ముస్లిములకు మరల స్థిరావాసము కల్గింప, అక్కడిమంత్రి డా. సయ్యదు మహమ్మదుగారు కోరగా, గాంధిగారు బీహారురాష్ట్రమునకు విచ్చేసిరి. అక్కడి దౌర్జన్యాలు వారంరోజులలోనే (గాంధి, నెహ్రూ, ప్రసాదులందున్న గౌరవమున) అణగిపోయినను, అప్పటికి వేలకొలది ముస్లిములకు ఆస్తి ప్రాణనష్టములు కలిగినవి. కనుక మిగతా ముస్లిములు కాందిశీకులై కొందరు స్వగ్రామాలను విడచి పాట్నా ప్రాంతమునకు చేరిరి. అక్కడి కాంగ్రెస్ప్రభుత్వము కొంత సహాయము

చేసినను, వారి భయోద్రేకముపోలేదు. అప్పుడు సరిహద్దురాష్ట్రమునుండి గఫ్ఫార్ ఖానుగారు వచ్చి కొంత తోడ్పడిరి. గాంధిగారు బీహారు ముస్లిము లతో కలిసి గ్రామాలు పరిశీలించి, ప్రభుత్వపు రక్షణయేర్పాట్లను తృప్తికర ముగా జరిగించి, ఆ హిందువులకు పశ్చాత్తాపమును, ముస్లిములకు ధైర్యమును కలిగించి, వారి గ్రామాలలో మరల వసించి నమ్మకతో తమ వృత్తులు చేసుకొనునట్లు ఏర్పాట్లు కిగించిరి. కలకత్తా, నవఖాలీలకు ప్రతిక్రియ గనే బీహారు అల్లరులను హిందువులు జరిపిరని, అట్లు చేసినందుననే ముస్లిముల గూండాచర్య లణగినవని, కనుక ఆ హిందువులను తీవ్రముగా గాంధిగారు నిరసించుట అన్యాయమని కొందరు హిందూప్రముఖులు తప్పుపట్టిరి. కాని గాంధిగారు ఆ వాదము భ్రమజనితమని, ఇట్టి ప్రతిక్రియనుజూచి అంతట పంజాబులో ముస్లిములు హిందువులు, సిక్కులమీద జరిపిన హింసనుజూపి ఈ మారణహోమము మహానర్థదాయకమని స్పష్టపరచిరి. గాంధిగారి అద్భుత కృషియే అక్కడిశాంతికి, తగాదాలు తక్కినజిల్లాలకు వ్యాపించకుండుట కును కారణము. అహింసాప్రేమపద్ధతివల్లనే స్థిరమైత్రియు, శాంతియు కలుగునని గాంధిగారు విశదపర్చిరి.

# 56 ఆసియా మహాసభ

యూరపియనుల వశమునుండి బయటపడు ఆసియావారు ఢిల్లీలో 1946 సం॥ మార్చిలో ఒక ప్రతినిధిసభను జేసిరి. శ్వేతజాతుల క్రౌర్యమునుండి ఆసియాజాతులరక్షణకు గాంధిగారు కృషిచేసిరిగదా! ప్రాంతీయతత్వము, కులతత్వము, సాంఘికతత్వము, మతమూర్ఖత, జాతిద్వేషము లేకుండ, సర్వ సమత్వముతోనే అన్నిజాతులు వృద్ధికావలెనని ఆయన కోరిక. అసలు నాజీ ఫాసిస్టుపద్ధతులు జాతిద్వేషహింసాతత్వములపై నేర్పడినవి. వాటి నాయన చాలసార్లు ఖండించెను. హింసాదౌర్జన్యముల నవలంబించుట తుదకు లోక మంతకు హానికరము. స్వజాతివృద్ధికిని బాధాకరమే. కనుక యుద్ధసంరంభ మును మానుమని జర్మనునియంత హిట్లరుకు, జపానునియంత టోజోకుగూడ ఆయన బహిరంగలేఖలు వ్రాసెను. అపారబలముగల అమెరికా ఒకపక్ష

మనకే జయముచేకూర్చి స్వలాభపరమగుటకన్న, సంపూర్ణముగా యుద్ధ
ప్రవృత్తి నణచివేయుటకు మధ్యవర్తియై, రెండుపక్షాలకు సఖ్యము కల్పింప
బూనవలెనని, చిత్తశుద్ధితో స్వార్థదృష్టిలేకుండ అమెరికా అట్టి యత్నము
చేస్తే, అన్నిపక్షాలు రాజీకి వత్తురని, అప్పుడు లోకశాంతి యేర్పడి ప్రపంచ
జనులు సుఖింతురనియు ఆయన ఆమెరికానుగూడ ఉద్బోధించెను. అందుకు
ఆంగ్ల అమెరికను నాయకులు కొందరు అపార్థముచేసికొని ఆయన
జపాను అభిమాని అని అపవాదులు వేసిరి. కాని, ఇట్టి ఆగ్రహానుగ్రహాల
వలన ఆయనభావాలు మారలేదు. "ఉదారచరితానాం తు వసుధైవ
కుటుంబకం"గదా! ఆయనకు అన్నిజాతులు ఒకటే. కీ. శే. వెండెల్
విల్కీ అను అమెరికను ప్రముఖుడు అన్నట్లు ప్రపంచమంతయు ఒకే
మానవజాతి; వారందరూ మైత్రికలిగియుండుటే లోకమునకు క్షేమకరము.
ఈ యుద్ధజయమువల్ల లోకమునకు శాంతి రాలేదు. ద్వేషము, కలహాలు
రేగుచున్నవి. రష్యాపైన అమెరికనులు కాలుదువ్వుచు, కొత్తఆటంబాంబు
లతో సోవియటురష్యాను బెదరించుచు, పశ్చిమ యూరపుఅంతట తమ
ప్రాభవమును హెచ్చించుకొనుచున్నారు. శ్వేతజాతీయుల లోకప్రాబల్య
మును ఆంగ్ల అమెరికనులు తోడ్పడుచున్నారు. పింగళిజాతి చీనా రష్యను
వశమయితే జపానుపయిన గట్టిగా అమెరికా ఉచ్చుబిగించుచున్నది.
ఈజిప్టు, పాలెస్టీను, టర్కీ, ఇరాకు,ఇరానలపయిన ఆంగ్ల అమెరికనులు
తమ ప్రాబల్యమును హెచ్చించుకొనుచున్నారు తూర్పున ఇండోచీనా,
మలయాలలో ఫ్రెంచి, బ్రిటిషువారు ఆధిపత్యము నిల్పుకొని ఆ దేశీయుల
నణచుచున్నారు. (ఇండోనీషియా ఎట్లో బయటబడుచున్నది). ఈ
శ్వేతేతరజాతుల మహాసభ దక్షిణాసియాకు కేంద్రమగు ఢిల్లీలో 1947 లో
శ్రీమతి సరోజినినాయుడు అధ్యక్షతను జరిగినది వాటి సంస్కృతి
మన దేశపు పునాదిపయిన ఒకేతత్వముతో వృద్ధియైనది. ఈ జాతులు
చాలాకాలము సహకారముతో మెలగినవి. శ్వేతజాతివారి జబర్దస్తీదాడినుండి
ఆత్మరక్షణయు వీరికందరికి కావలెను. మనదేశమునుండి పిలుపు రాగనే
టర్కీనుండి ఫిలిప్పైనువరకు (పరాధీనమగు జపానుతప్ప) అన్నిదేశా,
నుండి ప్రతినిధులందరు వచ్చి పరమానందముతో సమావేశమున
పాల్గొని, పరస్పర ప్రేమతో మెలగి, తమ సమస్యలను అనుకూలముగా

చర్చించుకొన్నారు. ఈ సభ నలంకరించి గాంధిమహాత్ముడు సందేశమివ్వ వలెనని ఆ ప్రతినిధులు, శ్రీబ్రహ్మాగారును కోరిరి. గాంధిగారు రప్పుడు బీహారులో హిందూముస్లిముసమాఖ్యాలో మగ్నులై రాలేమనిరి. అప్పుడే క్రొత్త వైస్రాయి మౌంటుబాటనువచ్చి తక్షణం రమ్మని గాంధిగారికి కబురుపంపిరి. అందువలన గాంధిగారు ఢిల్లీ చేరి సభాంతములోగా ఒకరోజు ఆసియాను సమావేశములో పాల్గొనిరి. సదస్యులందరు ఆయన నెంతో సన్మానించిరి. ఇందులో ముస్లిములీగుతప్ప తక్కిన మనదేశంలోని పక్షాలన్నియు పాల్గొన్నవి అన్యదేశాల ప్రతినిధులలో హెచ్చుమంది మహమ్మదీయులే. కనుక, సభలో ఎక్కువమంది ముస్లిములే. ఆ సమావేశమున గాంధిగారిట్లు ప్రసంగించిరి:—

"ఈ భారతీయుల సంస్కృతి, దానితో సన్నిహితసంపర్కముగల మీ అందరిసంస్కృతియు, అహింసాసత్యబీజములనుండి మొలకెరించి, శాంతితో చిగిర్చి, ప్రేమతత్వముతో పెరిగినది. మన పూర్వసాంగత్యమును స్మరించి,మరల అందరు కలియుట శుభావహము. మనఅందరి సహకారముతో ఆసియావాసుల ఐకమత్యము దృఢపడుగాక. యూరపుసామ్రాజ్యమునుండి ఈ యుద్ధాంతమందు మనము బయటపడుచున్నాము. వారి ప్రాబల్యము తగ్గి, మనకందరికి భౌతికోన్నతితోబాటు ఆధ్యాత్మికోన్నతియు కలుగుగాక. యూరపు అమెరికాలుచేయు అక్రమవిజృంభణను మన మరికట్టెదుము. కాని వారిపయిన మనకు విరోధములేదు. పాశ్చాత్యులకయిన, శ్వేతజాతుల పయిన ద్వేషముతోకాక లోకమంతటి మైత్రికొరకు మరల యుద్ధాలు, యుద్ధకారణాలు కలుగకుండ ప్రపంచమంతయు స్నేహముతో ఉండవలెనని మనకోరిక. మన మైత్రి విశ్వజనీనతలో అంతర్భాగమే; కనుక శ్వేతజాతులు కలవరపడనక్కరలేదు. యుద్ధజ్వాల చల్లారినను, తచ్ఛేషముగా ద్వేషాగ్ని మిగిలియున్నది. మా దేశములోను సాంఘికవిరోధాలు, రక్తపాతాలు యిప్పుడు సాగుట మాకు లజ్జాకరము ఐతే, అట్టి తాత్కాలికమగు దృశ్యము మరచి, స్థిరమగు అహింసాసఖ్యభావాలనే ఈ దేశమునుండి స్వదేశాలకు గొంపోదురని నా కోరిక"

ఆ మాటలను అమృతసందేశముగ నందుకొని సంతుష్టులై ప్రతినిధులు ఆనందముతో మైత్రితీర్మానాలు చేసికొనిరి

# 57 సేవాగ్రామం

1930 లో సబర్మతీ ఆశ్రమ మెత్తివేసి, సత్యాగ్రహాదులు చేసి, గ్రామపునర్నిర్మాణకార్యమునకై ఆయన యేదో గ్రామములో వసింప దలచిరి. మనదేశపు నాభి అనదగిన వర్ధానగరమునకు నాలుగైదుమైళ్ళలో నున్న సేవాగ్రామ మాయనకు నచ్చెను అప్పటి కది హరిజనులుండు చిన్న పల్లె. వారి కారోగ్యాదులు నేర్పి ఆయన వారిని బాగుచేసిరి. వర్ధాలో కొంతభాగము సేవాగ్రామముసహా గాంధిగారి ప్రియశిష్యుడగు బజాజు గారిది. ఇక గ్రామజనుల ఆరోగ్యము, యుక్తాహారము, కుటీరపరిశ్రమలు ఇత్యాదుల వృద్ధికే ఆయన తన జీవితమును వినియోగించదలచిరి. కనుకనే అది తగువసతులు లేని ఉష్ణస్థలమైనను అక్కడనే ప్రశాంతస్థితిలో వసింపుచు, గ్రామసేవ కవసరమగు సంస్థలను దేశమంతటి ఉపయోగము నిమిత్తము మార్గదర్శకముగా ఆ చుట్టుపట్లనే నిర్మింపజేసి, సానుభూతిగల సమర్థులనిర్వహణలో ఆ సంస్థల సాగించినారు. అందులో యీ క్రింద జెప్పినవి ముఖ్యముగా పేర్కొనదగినవి.

మొదటిది—సేవాగ్రామంలోని అ. భా. చరఖాసంఘము; దానికి మొదట శ్రీ శంకరలాల్ బాంకరు, పిమ్మట శ్రీకృష్ణదాసబజాజు, (యిప్పుడు కృష్ణదాసగాంధియు) కార్యదర్శులు దేశమం దన్ని ప్రాంతీయశాఖల కిది కేంద్రము. ఇందులో వడుకుట, పత్తిగింజలు తీయుట, రకరకముల నేత, వడ్రంగం, యిట్టివాటినిగూర్చి పరిశోధనలు జరుగును ఇదిగాక ఖాదీశాస్త్ర మంతయు నేర్పుట కొక మహావిద్యాలయమును కలదు. తక్లీలు, రాట్నములు, యిత్యాదులు తయారుచేయబడును.

ఇక్కడ నవ్యవిద్యావిధాన పాఠశాలయు శ్రీ ఆర్యనాయకం, ఆశా దేవిగార్ల నిర్వహణలో నడుపబడుచున్నది. పిల్లలకు గుడ్డివల్లింపు, మన శరీర శ్రమ లేకుండ చేతిపరిశ్రమతో సమన్వయించి, గ్రామావశ్యకత కుపయోగించు విద్యను, హిందూస్తానీని, జాతీయతను, వ్యవసాయవృద్ధినిగూడ ఇక్కడ నేర్పుదురు. ఇక్కడ వైద్యచికిత్సచేయు నవ్యరీతి చికిత్సాలయ మును నున్నది.

ఇందుకును, అతిథులబసకునూ, ఆశ్రమవాసులకును కట్టబడిన కుటీరములు అన్నీ కలసి ఒక ప్రత్యేక గ్రామ మయినది. ఇవి చక్కని వెలుతురు, గాలిప్రసారముతో విశాలముగా, కుదిమట్టముగా, వాసయోగ్యముగా, చాలచౌకగా గ్రామపరికరాలతోనే కట్టబడి సౌమ్యముగ నుండును. ఇట్టి కుటీరములోనే గాంధిమహాత్ముడు సేవాగ్రామంలో నాయకులతో, విదేశ ప్రముఖులతో భాషించుచు, అమూల్యవ్యాసముల వ్రాయుచు, శ్రమించు చుండెను.

కృషిప్రధానమగు మనదేశములో గోపోషణ చాల ముఖ్యమయినది. గోసంపత్తువల్లనే జనుల ఆరోగ్యము రక్షితమగును. కనుక, ఒక గోరక్షణాలయము నిర్మింపబడి, అందులో గోవుల పోషణ, చికిత్సవగైరాలు జరిగించబడుచున్నవి. గ్రామస్థులకై చక్కని ఆకుకూరలు వగయిరాలు పండింపబడును. అ. భా. గ్రామపరిశ్రమల సంఘము వర్ధాలో శ్రీ జె. సి కుమారప్పగారి నిర్వహణలో విశాలస్థలమందు పనిచేయు మహా సంస్థ. ఇందులో రకరకముల చేతికాకితం, పొట్టతో గోధుమబిస్కట్లు, జొన్నవగయిరాల మాల్టు, దంపుడుబియ్యపు తిరగళ్ళు, తేనెటీగలపెంచి తేనెపట్టుట, నూనెగానుగల కృషి, మున్నగుచేతిపరిశ్రమల జేయుటేగాక, అందులో విద్యార్థులకు తరిఖీయతు యివ్వబడును.

వర్ధాలో స్త్రీల యభివృద్ధి నిమిత్తము గొప్ప మహిళావిద్యాలయము నడుపబడుచు, అందులో స్త్రీల యున్నతి కుపయుక్తమగు శిక్షణమీయబడి, దేశసేవికలకు శిక్షణము, సహాయము చేయబడును హిందీని సామాన్య భాషగ వ్యాపింపజేయుటకు రాష్ట్రభాషాప్రచార కార్యాలయము స్థాపింపబడినది. దాని సంచాలకులు భాషాశైలి, ఉర్దూలిపివాడుకనుగూర్చి గాంధిగారితో భేదించగా, హిందుస్తానీ ప్రచారసభ అనుపేర వేరే సంఘమును శ్రీ కాకా కాలేల్కరుగారి నిర్వహణములో గాంధిగారు స్థాపించిరి ఇవి హిందూస్తానీ పరీక్షలను నడుపుచు, ఉత్తర మధ్యదేశములలోని అహిందీ ప్రాంతాలలో హిందూస్తానీని జాతీయభాషగ ప్రచారము చేయును. ఇట్లే యిట్టి సాహిత్యమును జాతీయకృషితో వృద్ధిచేయుటకు హిందూస్తానీ తాలిమీ సంఘమును ఏర్పడి పనిచేయుచున్నది. గాంధిగారి సిద్ధాంతప్రకారము ఆర్థిక సమత్వపద్ధతిని, ఆర్థిక వ్యాపారపద్ధతులను, వాటి సూత్రములను, బోధించుటకు

వర్ధాలో వ్యాపారకళాశాలయు శ్రీమన్నారాయణ అగ్రవాల్ గారి అధ్యక్షతను నడుపబడుచున్నది. ఈ అగ్రవాల్ గాంధిసిద్ధాంతప్రకారము బీదల కుపకారకమగు ఆర్థికవాఙ్మయమును తయారుచేసినారు.

దీని సమీపములో కుష్ఠరోగపీడితుల కొక చికిత్సాలయము శ్రీ వినోబాభావేగారి నిర్వహణలో చక్కని పద్ధతులతో సాగింపబడుచున్నది.

సేవాగ్రామంలో ఆయా సంస్థల నడుపు ప్రవీణులు, శిల్పులు, విద్యార్థులు నేగాక, గాంధిగారి మహత్వముచే నాకర్షితులును కొందరాశ్రమ వాసులు కలరు.

"సేవాగ్రామం" పేరుతో బాటు కీ. శే కస్తూరిబా గాంధి, మహాదేవ దేశాయిగార్ల కటీరములు జ్ఞప్తికి వచ్చును. మహాత్ముని కార్యదర్శి ప్యారీలాలు పంజాబీ. ఈయన సోదరి సుశీలానయ్యర్ డాక్టరు. ఆమె గాంధిగారి బిడ్డగ, సహాయకార్యదర్శినిగకూడ నుండెను. గాంధిగారి హిందూస్తానీ ఉపన్యాసాలను ప్యారీలాలు ఉర్దూలిపిలో కుడినుండి ఎడమవైపునకు, డా॥ సుశీల నాగరిలిపిలో ఎడమనుండి కుడివైపునకును, (ప్రసంగసమయమందే) వ్రాయుచుండుట చోద్యముగ నుండెను. గాంధిగారి మనుమడు కనూగాంధియు నిర్మాణకార్యాలలో పాల్గొనుచుండును. ఆచార్యభంసాలీ అను గొప్ప విద్వాంసుడు, (మహారాష్ట్రీయుడు) గుజరాతు విద్యాపీఠములో బోధకుడై, పిమ్మట హిమాలయాలలో కేవలము పర్ణభక్షకుడై దిగంబరిగ చాల యేండ్లు తిరిగి, చిమూరులో సర్కారుసైనికులు స్త్రీల నన్యాయముగా బాధించి దౌర్జన్యము చేసినందుకు నిరసనగా 50 రోజులు దీర్ఘోపవాసము చేసిన మహర్షి. కేవలము పాలే త్రాగుచు, నిరంతరము నూలు వడకుచు, ఈ యాశ్రమములో నుండును. ఇంగ్లీషు నౌకాసేనాని కుమార్తె 'మీరాబెను' గాంధి శిష్యురాలై, సన్యాసిరూపముతో ప్రజాసేవ చేయును. ఇట్లే రాజకుమారి అమృతకౌరు తన జమీని, సర్వమును వదలి గాంధీయనిర్మాణకార్యాలలో మగ్నురాలై యుండును. ఇంక ననేకులు తరచు యిక్కడ దీర్ఘకాల ముందురు.

# 58 జీవితపద్ధతి

గాంధీమహాత్ముని దినచర్య లోకోత్తరమయినది. అర్ధరాత్రివరకు పని చేసినను, నిద్రించి ఆయన బ్రాహ్మముహూర్తములో (ఉదయం 4 గంటలకు) లేచి, కాలకృత్యాలను తీర్చుకొని, ముందుగ గీతాశ్లోకాదులను పరివారముతో కలిసి చదివి ప్రార్థనచేసి, అంతట కొంచెము పండ్లు, మేకపాలును తీసికొని సూర్యోదయంవేళ గంటసేపు ఊరుబయట నడచును. ఈ నిర్మలప్రభాతంలో దూరస్థలంవారును ఆయనతో నడచుచు సంప్రతింతురు. ఆ పిమ్మట కార్యదర్శులు తెచ్చిన ఉత్తరాలనుచదివి, అందులో ముఖ్యమయిన వాటికాయన జవాబులు వ్రాయును.అంతట తనకై వేచియున్న కాంగ్రెసుప్రముఖులు మున్నగు వారితో ఆయా సమస్యలను చర్చించి, పిమ్మట స్నానముచేయును. మధ్యాహ్నభోజనము పొట్టుతీయని చిన్ని గోధుమరొట్టె, వేరుశనగ మున్నగు పచ్చిపప్పు, కారము ఉప్పు లేని ఉడికించిన కూరగాయల ముక్కలు, పండ్లు, పాలు లేక పెరుగు మాత్రము ఆయన భుజించును. ఈ యాహారము మితముగా (ఆకలి తీరునంత మాత్రమే) సాత్వికముగా నుండును. అంతట తన హరిజనపత్రికకు వ్యాసాలువ్రాయుట, ఆశ్రమములోని ఆయా కార్యకర్తలతో చర్చ, కార్యపరిశీలన, రోగులకు చికిత్సచేయుట, నాయకులతో సంప్రతింపులు జరుగునప్పటికి సాయంకాల మగును. (మధ్యాహ్న వేళ ఒకప్పుడు కొంచెముసేపు విశ్రమింతురు.) సాధారణముగా సాయంకాలము 4 గంటలకు సూత్రయజ్ఞము జరుగును. అస్తమయమునకు పూర్వమే, సాయంభోజనము (మధ్యాహ్నమువలె) చేసుకొని, బయట కాలినడకను తిరిగి, బహిరంగస్థలములో జనసమూహంమధ్య ఈశ్వర ప్రార్థన జరిగించి యేదో నొక జనహితకరమయిన విషయమునుగూర్చి ఉపన్యసింతురు; రాత్రి కొంతసేపు మిత్రులతో, కార్యకర్తలతో సంభాషింతురు కొంతసేపు చదువుట, వ్రాయుటయు కలదు. సాధారణముగా రాత్రి 10 గంటల తరువాత నిద్రింతురు. ప్రతిసోమవారం మౌనదినము.

ఆయన జాతీయకార్యాలకై వివిధప్రాంతాలలో ప్రయాణములు సాగించునప్పుడును వీలయినంతవరకు పై పద్ధతినే అవలంబించిరి. ఈ యాత్రలలో వేలకొలది జనులు బృందముగా ఆయనను దర్శింపవచ్చిరి. ఆయా

ప్రాంతాల ప్రముఖులు, వివిధరంగాల కార్యకర్తలు, అక్కడి పరిస్థితులను తెలిపి, ఆయన సలహాను కోరుచుండిరి తరుచు క్లిష్టసమస్యలు నిర్మాణ కార్యపు ముఖ్యాంశములనుగూర్చి ఆయన ప్రత్యేకశ్రద్ధ తీసుకొనును. బెంగాలీ, ఒరియ, తమిళ, బ్రాహ్మణ, శూద్ర, క్రైస్తవ, పార్శీ, యువక, వృద్ధ, కాంగ్రెసు, మితవాది, సోషలిస్టు, ఇట్టి భేదాలు లేకుండ అందరూ ఆయన సలహా నపేక్షించిరి ఆయన నిజముగా సర్వమిత్రుడు. ఈదేశమునకు వచ్చు ప్రముఖ విదేశీయులు ఆయనను తప్పక దర్శింప గోరిరి. ఖండాంతరీయులను ఎందరో ఆయా సమస్యలనుగూర్చి ఉత్తరాలద్వారాను సంప్రదించగా ఆయన శాంతచిత్తుడై అందరికిని తగు సలహా లిచ్చి పంపుచుండెను. తన ప్రతికార్యమును నిమిషమయిన భేదములేకుండ సకాలములో నిర్వర్తించుచు, కాలమేమియు వ్యర్థముచేయక, చురుకుగ తేల్చుకొనుటచే, ఎంతటి కార్యక్రిమమైనను భారముగా తోచక అనాయాసముగా ఆయన జరిగించుచుండెను. జీవితాంతమువరకు ఆయన దినచర్య యిట్లు గడచినది.

# 59 ఖాదీ

ఇప్పుడు నిర్మాణ కార్యక్రమంలోని కొన్ని ముఖ్యాంశములగూర్చి గాంధిగారి ప్రవృత్తిని గ్రహింతము. ఖాదీని అనగా వడుకు నూలుబట్టనే ధరించుచు, ప్రతివారు ధరింపవలెనని ఆయన తీవ్ర ప్రచారము చేసినారు. కాంగ్రెసు కార్యవర్గంవారు కాంగ్రెసుప్రతినిధులు కేవలము ఖాదీధారులు కావలె; కనుక అది మన స్వాతంత్ర్యవేషచిహ్నము. ఆయన పరివారము వారందరు ఖాదీనే ధరించి, నూలు వడకుదురు. ఆయన ప్రతిరోజూ ఉదయ సాయంవేళలందు నూలు వడకుచుండిరి.

ఇప్పుడు జాతీయవాదులలోను ఖాదీయందు పూర్ణవిశ్వాసము లేకుండుట శోచనీయము. మిల్లులు పెరుగుచున్నను గాంధిగారికి ఖాదీవిశ్వాసమెంతమాత్రము తగ్గలేదు. ఆర్థికముగా లక్షలజనులకు అది పోషకము.

ఖాదీ అహింసా సత్యముల ప్రతీకము. మిల్లుబట్టద్వారా పూర్ణస్వదేశీ సిద్ధించదు. ఖాదీ స్వదేశియని చూచుటతోడనే మూఢుడుగూడ తెలిసికొనగలడు. మిల్లుల ప్రోత్సాహమువలన ప్రబలురగు మిల్లుదార్లను, అందుకు

దిగుమతియగు లోహయంత్రాల నిర్మాతలకు లాభము కలుగును మిల్లుపని వాండ్రు కిక్కిరిసిన నగరప్రాంతాలలో యిరుకుకొని అవినీతిజీవనమును చేయుదురు. ఖాదీకిచ్చుసొమ్ము కొంచె మెక్కువయినను, గ్రామాభివృద్ధికి వినియోగపడును. వికేంద్రీకరణము జరుగును. ప్రత్తిని, రాట్నాలను, ఖాదీని గ్రామాలలోనే ఉత్పత్తి చేయవచ్చును. పెద్దపరిశ్రమలను యుద్ధకాలములో శత్రువులు భగ్నపర్చవచ్చు. ఈ ఆటంబాంబుయుగములో వికేంద్రీకరణమే ప్రశస్తము. మంచిరాట్నముల ఉత్పత్తికై గాంధిగారు పరిశోధన చేయించి, చరఖాసంఘముద్వారా ఖాదీవ్యాప్తికి శ్రమపడినారు. సాధారణముగా యేజిల్లా ఖాదీ అక్కడనే ఖర్చుచేయువచ్చు. నైతికంగా ఖాదీ వృద్ధికావలెనని గాంధిగారి కోరిక. ప్రతిగ్రామములో గృహస్థులు మంచి ప్రత్తి పండించి, యింట నూలు వడుకవలెనని, ఖాదీనే ధరించవలెనని ఆయన సంఘంద్వారా నిబంధనలజేయించినారు. "ఖాదీజగత్" అను హిందీ మాసపత్రిక కాయన తరచు వ్రాయుచుండిరి వడుకు, నేయువారి కిచ్చుకూలి, జీవనమునకు చాలవలె. మనరాష్ట్రప్రభుత్వమువారు ఖాదీఅభివృద్ధికై ఫిర్కాప్రణాళిక నేర్పర్చి అమలు చేయుచు కొన్నివిద్యాలయాలలో శిక్షణ నిచ్చి ఖాదీయుత్పత్తిని వృద్ధిచేయుచున్నారు. కాని ఖాదీధారుల సంఖ్య యింకను హెచ్చుట చాల ఆవశ్యకము.

# 60 గృహపరిశ్రమలు

కోట్లకొలది గ్రామజనులకు ఖాదీవలె, గ్రామపరిశ్రమలు గ్రామాభివృద్ధికి తోడ్పడును. మరబియ్యము, ఫ్యాక్టరీపంచదార వచ్చినతరువాత లక్షలకొలది దంపువారికి, బెల్లముచేయువారికి వృత్తులుపోయినవి. మరియు, ఇవి చాల అనారోగ్య మిచ్చునవి కనుక, దంపుడుబియ్యమే అందరు వాడవలెను. కర్రనాటు తిరగళ్ళలో విసరినబియ్యము కూడ దంపుడుబియ్యము వంటివే. దంపుడుబియ్యమును ముందుగా నానబెట్టితే అన్నము సగమై మెత్తగనుండును తక్కువ అన్నమే ఎక్కువ జీవశక్తి నిచ్చును. ఇట్లే చెరకుసాగు చేసినచోట్ల బెల్లము ఉపయంత్రమునై [illegible] వృద్ధి చేయును. గ్రామాలలోని గుడ్డపేలికలు, ఎండు వరిగడ్డి, వెదురుపుల్ల, వెదురు నగయిరాలను పొడిచేసి, వాటి ముద్దనుండి కుటీరాలలోనే గట్టికాగితమును

చేయవచ్చును. ఇందుకు కొన్ని జాతుల నీటిమొక్కలు, గడ్డిరకములు నుప
యోగించును. పున్నెందు కాగితపుగిరాకి హెచ్చుగ నుండును. ఉత్పత్తి
ఎక్కువకాగా గిరాకీతగ్గును. ఇట్లే కంపెనీచెప్పులకు బదులు తోళ్ళపరిశ్ర
మను [illegible], నాటుచెప్పులను అందరు వాడవలెను. ఇట్టు నాటుగుండీలు,
నాటువర్ణరంగులు చేయు క్రిసామానులు, నాటుచాకులు, చేతితోచేయు
బొట్టుగోరువ, పొన్న వయిరాల విస్తళ్లు, తేనెటీగలనుపెంచి తేనెచేయు
పరిశ్రమ, చేతితో వడికి నేయు పట్టుపరిశ్రమ, పట్టుపురుగులపెంచుట,
నాటుగానుగలతోనే నూనెలు తయారుచేయుట, చేతితో సబ్బుబిళ్ళలు,
అగ్గిపెట్టెలు వగైరాలుచేయుట,ఇట్టి కుటీరపరిశ్రమలను వృద్ధిచేయుమని గాంధి
గారు ప్రచారంచేసినారు. వర్ధాలో జె. సీ. కుమారప్పగారి నాయకత్వమున
అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘము పనిచేయుచున్నది.

## 61 ఆర్ధిక సమత్వము

పూంజీపతులకు, బీదవారికి మధ్యనున్న విపరీతపు అంతరము పెరిగి
పోయినది. మిల్లుదార్లకు, కూలీలకు ఆర్థికసంఘర్షణములు పెరిగినవి. ఇందు
ఒక వర్గము నింకొకవర్గము అణచివేయుటవలన వర్గకలహములు, సమ్మెలు,
పోట్లాటలు,హింసాపరత్వము హెచ్చిపోవును. ఇవి నగరములలో హెచ్చు.
ఖాదీ గ్రామపరిశ్రమలు వగయిరాలద్వారా గ్రామాల పూర్వోన్నతిని
బలపర్చి, సంఘర్షణకారణాలు త్యజించవలె. సంస్థానాలలోను ప్రజామండ
లులు, రాజులు అన్యోన్యతతో వర్తించవలె. ప్రజాసమ్మతితోనే రాజు
పాలించవలె. జమీందారీలను తొలగించినను జమీందారులకు ప్రజాప్రభు
త్వము న్యాయమైన ప్రతిఫలమీయవలె; ఫ్యాక్టరీ యజమానులు తమ లాభా
లలో వాటాలను గుమాస్తాలకు, పనివాండ్రకుగూడ బోనసుగ పంచిపెట్ట
వలె. ఇట్టిపద్ధతులు గాంధిగారు ధనికవర్గమునకంతకు బోధించినారు. ఆయన
బీదలపాలిటి పెన్నిధి; ఐనను ఆయన సహజసౌజన్యము, మిత్రభావము,
దాక్షిణ్యమువలన ఎందరో మిల్లుయజమానులు, రాజులు, జమీందార్లు,
వ్యాపారస్థులు, భూస్వాములు, పూంజీపతులు ఆయనతో చర్చించి ఆ
సిద్ధాంతాలను మన్నించి వీలయినంతవరకు అమలునకు తెచ్చుచున్నారు.

# 62 హరిజనోద్ధరణ

మన దేశములో మాలమాదిగలు మున్నగు సుమారు 6½ కోట్లు జనులు హరిజనులు అంటరానివారని సవర్ణులలో ఇంకను భావనకలదు. కొండలలోని కోయ, చెంచు, సవర, గోండు మున్నగు అడవిజాతులు, 2½ కోట్లును సుమారీస్థితిలోనే యున్నారు. ఇట్లు మొత్తం హిందూజనసంఖ్యలో ⅓ వంతు దీనజనులను, మనము నరులకన్న హీనముగా చూచుటవలన దేవుడు హర్షింపక, మనకు ఈ హీనస్థితిని కల్పించెనని గాంధిగారెంచిరి. ద్వేషము ఆత్మహత్యవంటిది. ఇప్పటి మన ముస్లిములలో హెచ్చుమంది లోగడ ముస్లిమమతము స్వీకరించిన హరిజనుల సంతతియే. ఇకనయినను హరిజనులను సవర్ణులు సమభావముతో ఆదరించకుంటే, మన స్వరాజ్యములో ప్రజలు సుఖమనుభవించలేరు. సవర్ణహిందువులు ముస్లిములనుగూడ హరిజనులతో సమముగా వ్యాపర్చి, అణచివేతురని లీగునాయకులు ముస్లిమ్‌జనుల నమ్మించిరి. పాకిస్తానువాదమును హెచ్చుముస్లిములు ఆమోదించుట కిదియొక కారణము. మరియు హీనస్థితిలోనున్న హరిజనులు స్వమతరక్షణకు తోడ్పడక, వారిలో వేలకొలదిని నిర్బంధంగా ముస్లిముమతములోనికి కల్పుటకు తూర్పుబెంగాలులో, పంజాబులో ముస్లిముప్రముఖులు యత్నించుటలో యెక్కువ హిందూముస్లిము కొట్లాటలు, దౌర్జన్యాలు జరిగినవి. హరిజనుల అస్పృశ్యతను వెంటనే తొలగిస్తే హిందూసంఘమంతయు బలపడి, హిందూముస్లిము కలహాలును చాల తగ్గి జాతీయైక్య మేర్పడును. సాంఘికవిశేషాలు తొలగి స్థిరముగా నిల్చుటకును, హరిజనోద్ధరణము, అస్పృశ్యతా నివారణము అవశ్యకములు. గోమాంసభోజనము, నరబలి, సహగమనము, నియోగము (మరదిచే బిడ్డల గనుట) అతిబాల్యవివాహము, యిట్టి పూర్వపు ఆచారాలు మార్చినట్లే దీనినిగూడ వెంటనే మార్చుకొనవలె. పూర్వాచారాలు దేశకాలానుసారముగా హానికరమైనవానిని శాస్త్రీయమయినను

ఆచరించక మాన్పుకొమ్మని శాస్త్రములలోను చెప్పినారు * "ఈ అస్పృశ్యత అనేది హిందూమతమునకు వేరుపురుగు. అస్పృశ్యత పోతేనే హిందూమతము బాగుపడి పుష్పింపగలదు." అని గాంధిమహాత్ముడు చాలసార్లు చెప్పియున్నారు.

గ్రామసముష్టివగు నూతులు, చెరువులు, బడులు, హోటల్సు, చావిడులు ఇత్యాదులలోనికి హరిజనులు రాకూడదనుటలో అర్థములేదు. గాంధిగారి కోరికపయిన కొన్నిరాష్ట్రములతోబాటు మన రాష్ట్రములోను వాటిలోనికి హరిజనులను రానివ్వకపోయిన, అందు కడ్డుపడినవారికి శిక్ష విధింపబడునని ప్రభుత్వమువారు శాసనసభ సమ్మతితో చట్టము చేసియున్నారు. ఇట్లే మన యిండ్లలోనికిని హరిజనులను రానిచ్చుట న్యాయము. గాంధిగారు ఒక హరిజనబాలికను కుమార్తెగా పెంచిరి. తన ఆశ్రమమునందు హరిజనులకు సమానస్థాన మొసంగిరి. అఖిలభారత హరిజనసేవకసంఘము నేర్పాటుచేసిరి.

పల్లెపుదేవాలయములు హిందువులందరి నిమిత్తము యేర్పడినవి. ముఖ్యముగా ఈదేవాలయముల ప్రత్యేకత సమిష్టివిగ్రహారాధన. విష్ణుభక్తులు విష్ణ్వాలయములలోనికి, శివభక్తులు శివాలయములలోనికి వెళ్ళి భగవంతుని దర్శించి, సమిష్టిప్రార్థనలో పాల్గొనుట వారి జన్మహక్కు. హరిజనులు మాత్రము దేవాలయములలోనికి రాకూడదనుట సబబుకాదు. ఈ ఆలయస్థాపకులుగాని, శాస్త్రములుగాని అట్లు నిషేధించినట్లు నిదర్శనాలులేవు. లోగడ గాంధిమహాత్ముడు సనాతనధర్మ మహామండలి అధ్యక్షులగు కీ శే. శ్రీ పండిత మదనమోహనమాలవ్యాగారి పర్యవేక్షణక్రింద ఆచార్య ధ్రువవంటి ప్రకాండ విద్వాంసుల ఆధ్యక్షతను అన్నిపక్షాల పండితులసభను జరిపించిరి. కొన్నిరోజులు విపులచర్చ జరిగి, తుదకు 'హరిజనుల దేవాలయప్రవేశము శాస్త్ర

* అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్నతు .. దేవరేణ సుతోత్పత్తిః మధుపర్కే పశోర్వధః, మాంసదానం తథా శ్రాద్ధే వానప్రస్థాశ్రమస్తథా ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యా నాహుర్మనీషిణః

(బృహన్నారదీయం)

దత్తౌరసేతరేషాంతు . భృగ్వగ్నిపతనం చైవ వృద్ధాదీనాం తథైవచ,
నివర్తితాని కర్మాణి వ్యవస్థాపూర్వకం బుధైః, సమయశ్చాపి సాధూనాం
ప్రమాణం వేదవత్ భవేత్ - (ఆదిత్యపురాణ వచనం)

నిషిద్ధముకాదు; అస్పృశ్యత శాస్త్రసమ్మతముకాదు' అని ఆసభవారు తీర్మా
నించి స్థిరపర్చినారు స్వతంత్రభారతదేశములో అస్పృశ్యత అసలేకూడదని
రాజ్యాంగచట్టంలో యిప్పుడు శాసించినారు.

'విగ్రహారాధన అనేది పామరులనిమిత్తమే. జ్ఞానవంతులు సర్వవ్యాపి
యగు దేవుని తమ హృదయములలో సర్వత్ర ధ్యానించి భజింపవలె. వారికి
మూర్తిపూజ వ్యర్థము' అని పురాణములలో చెప్పినారు *హిందువులలో
హరిజనులే అప్పటికి యిప్పటికి యెక్కువ అజ్ఞానులు, పామరులు. కనుక
సమిష్టిమూర్తిపూజ నుద్దేశించు దేవాలయాలు ముఖ్యముగా వారికే ఉప
యోగకరము వారిని నిషేధించుట ఆసుపత్రిలోనికి రోగులను, విద్యాల
యాలలోనికి విద్యలేని విద్యార్థులను అడ్డగించి ట్లుండును. పురాణాలకన్న
ముఖ్యప్రమాణాలు అగు శ్రుతి స్మృతులలో, గీతలలో, వేదాంతసూత్రాలలో
గూడ విగ్రహారాధన ప్రశంసలేదు, ఈశ్వరుడు రూపరహితుడు, అప్రమే
యుడు, సర్వభూతాంతరాత్మ, హృదయస్థుడు, అనియే నిరూపించినారు.

దరిమిలాను యేర్పడిన కొన్ని ఆగమాలలో వ్యాధిగ్రస్తులు, త్రాగు
బోతులు యిత్యాదులకు కొన్ని ఆటంకాలు చెప్పుచు పతితులు, పాతకులు,
చండాలురు లోపలకు వచ్చిన కొంతపరిహారము చెప్పిరి నిజమే, కాని
శాస్త్రాలలో చెప్పిన అవర్ణమువేరు. ‡ ఈకోవది హరిజనులు బ్రాహ్మణస్త్రీ
సంతతి. పంచమజాతి అనేది లేదని, మొత్తము నాలుగే వర్ణాలు, జాతులు
అని మనుస్మృతిలోను చెప్పినారు.

---

* శివ మాత్మని పశ్యంతి ప్రతిమాసు నయోగినః, అజ్ఞానాం భావ
నార్థాయ ప్రతిమాః పరికల్పితాః (స్కాందపురాణం) యో మాం సర్వేషు
భూతేషు సంత మాత్మాన మీశ్వరం, హిత్వార్చాం భజతే మౌఢ్యాత్
భస్మన్యేవ జుహోతి సః (శ్రీమద్భాగవతం) నచక్షుషా గృహ్యతే నాపి
వాచా (ముండకోపనిషత్తు) తతో యదుత్తరతరం అరూప మనామయం.
(శ్వేతాశ్వతరోపనిషత్తు)

‡ పతితః, పాతకీచైవ... (ఈశ్వరసంహిత)

మరియు, ఇప్పుడు పతితులు పాతకులుఅగు సవర్ణుల ఆలయములోనికి
వచ్చుచునేయున్నారు. వారితరువాతనే చండాలురకు బహిష్కరణ మాట
వచ్చును. చండాలురనగ కోపిష్ఠులు అని శబ్దార్థము.

పూర్వము వసిష్ఠవిశ్వామిత్రాది ఋషులసంతతికిని చండాలసంపర్క ముండెను. మరియు శంకర రామానుజాది పూర్వ ప్రవక్తలు, దయానంద రామకృష్ణ వివేకానందాది ప్రవక్తలును హరిజనుల నుద్ధరించుటకే మార్గదర్శకు లయినారు. శ్రీ హిందువులలో తిరుప్పాణాళ్వార్, నందనార్, చోఖా మేళ, రవిదాసు, హరిదాస ఠాకూరు, యిట్టి హరిజనజాతివా రెందరో మహాభక్తులయి సనాతనులకును పూజ్యులయినారు. హరిజనదేవాలయప్రవేశము అందరి ఆధ్యాత్మిక నైతికాభివృద్ధికిని, ఆత్మగౌరవమునకును సహాయకరము. గ్రామాలలోగూడ ధారాళముగా దేవాలయాలలోనికి హరిజనులను రానిస్తే సాంఘికముగ యీ అంటు అణగిపోయి, హిందూసంఘము, జాతీయతయు మరల వృద్ధిపొందును. కనుక, మాలమాదిగలు మున్నగు హరిజనులును పబ్లికు దేవాలయాలన్నిటిలోకి వచ్చి ప్రార్థించుటకు హక్కుకలదని మదారాసురాష్ట్రములోను కాంగ్రెసుప్రభుత్వమువారు శాసనసభద్వారా చట్టముచేసినారు. ♦ అయితే ఆ ప్రకారము ధారాళముగా గ్రామాలలో అమలు జరిపించుట ఆవశ్యకము.

# 63 ఆదిమజాతి సేవ

హరిజనసమస్యవంటిదే కొండజాతుల సమస్య. దక్షిణమున నీలగిరి మొదలు ఉత్తరమున హిమాలయపర్వతాలు, అస్సాం తీరలవరకు ఈ మన్యపు జనులు చాలకోట్లు గలరు. వారి అజ్ఞానము, మూఢవిశ్వాసము, త్రాగుడు, దరిద్రము, భీరుత్వము, జ్వరగ్రస్తత అంతింతని తెలుపవశమా. మన్యప్రదేశాల ప్రకృతిసంపద అద్భుతము. ఈ ఏజన్సీప్రాంతాలను కేటాయించి సర్కారు వారింతవరకు యథేష్టంగా పాలించినారు. ఏజన్సీకిని వెల్లడి ప్రాంతాలకును పరస్పర సమన్వయముచేసి 'ఏజన్సీ' జనుల మూఢవిశ్వాసాలను, అజ్ఞానమును పేదతనమును పారద్రోలి, అక్కడ కృషి పరిశ్రమలు నేర్పర్చి, మన ప్రాంతపు నాగరికభావాలను కొండజనులకు నేర్పవలె. అక్కడి జలవాయువులను, ఆహారవస్తువులను పరిశుభ్రస్థితిలో నుంచితే ఆరోగ్యవాతావరణము కలుగును. మన్యపుజనుల బాధించక వెల్లడిప్రాంతాలవారు ఆ సంపదను

♦ మదరాసురాష్ట్రపు 1947 సం. నెం 5 వ ఆక్టు.

వృద్ధిజేసి వ్యాపారములొనర్చి, అక్కడ జనసంఖ్య, వస్తూత్పత్తి, నాగరికత బాగుపడునట్లు కృషిచేయవలెనని గాంధిగారి యుద్బోధన. ఈ సమస్యను పరిష్కరించి, గుర్గమప్రాంతాలను సంచారయోగ్యముగా, జనవాససుకర ముగా, నాగరికముగా చేయుటకు మన రాష్ట్రములలో ప్రభుత్వమువారు ప్రణాళికను తయారుచేయుచున్నారు. కోయలు, చెంచులు, బడగలు, భిల్లులు, గాండులు, సవరలు, సంథాలులు మున్నగు ఈ కొండజాతులు కాష్టలోష్టములనే పూజించుచు, మూఢాచారములతో నుందురు వారి భాషలును విచిత్రములు కొందరు మాన్యులీ కొండజాతులతో వసించి, వారి నుద్ధరించుటకు కృషిచేయుచున్నారు ముందుగనే క్రైస్తవ మిషనరీలీ రంగములో ప్రవేశించి, మిషనుసంస్థలను మన్యాలలోను వ్యాపింపజేసినారు. వారు చేయుపని మంచిదే; కాని, వారు లోగడ పాశ్చాత్యదృక్పథముతో క్రైస్తవమత వ్యాప్తికై కృషిచేసిరి. హిందూప్రముఖులా ప్రాంతాలలో పరిశుద్ధ హిందూమతమును, భారతీయసంస్కృతిని, శుద్ధసంప్రదాయాలను బోధించి, రెండు ప్రాంతాలమధ్య ఐకమత్యము వృద్ధి చేయించవలెననియు గాంధిగారు బోధించినారు.

# 64 సాంఘిక మైత్రి

అఖండ భారతంలో దాదాపు నాల్గవవంతు జనులు ముస్లిములు, అనగా తురకలు. వారిలో దాదాపు అందరూ హిందువులలోనుండియే లోగడ ముస్లిములైనవారి వంశీకులు. జిన్నా, లియాకత్, నాజిముద్దీను, హక్, ఇక్బాలు, ఖిజిరుహాయ్యత్, షేక్ అబ్దుల్లా, ఛటారీ మున్నగు నాయకులందరు యిట్టివారే. సుమారు 40 యేండ్ల క్రిందటివరకు హిందూముస్లిములు ఐక మత్యము గల్గియుండిరి. ఆ యా ప్రాంతపుభాషనే స్వభాషగ మాట్లాడు చుండిరి. చీనా, రష్యా మున్నగు పెద్దరాజ్యాలలో వివిధమతస్థు లొకజాతిగ వ్యవహరించుచు కలసి కృషి చేయుచున్నారు. బ్రిటీషువారి భేదనీతి, మన తెలివితక్కువవలన మన దేశములో మతకలహాలు పెరిగి రాజకీయైక్యమున కడ్డువచ్చినవి.

బ్రిటిషు, డచ్చి, ఫ్రెంచి, ఈజిప్టు, పాలెస్తీను, బర్మా, సింహళ్, మలయా, ఇండో చైనా, ఇండోనీసియా మున్నగు తమ పాలిత దేశాలన్నిటిలో ఇట్టి భేదనీతి నవలంబించిరి, విభజించి పాలించుట సామ్రాజ్యవాదుల సంప్రదాయము. వారు జాతీయవాదుల నణచి, ఆయామురాలను ప్రోత్సహింతురు. హిందూసంస్కృతికి కాశీని, ముస్లిముసంస్కృతికి ఆలీఘర్‌ను కేంద్రాలుగ చేయించి, అక్కడ ప్రత్యేక మతాధారపు కళాశాలలకు, విశ్వవిద్యాలయాలకు ప్రోత్సాహమిచ్చి, వారి దృక్పథములను సాంఘిక కులతత్వము వైపునకు మార్చించిరి. ఎన్నికలలో ప్రత్యేక నియోజక వర్గా లేర్పర్చి, మత కులముల బట్టి ఉద్యోగాలలోగూడ పోటీలు పెంచినారు. అందుకు బదులు మనము జాతీయతను సాంఘికమైత్రిని బలపర్చుకోవలె.

గాంధిమహాత్ముడు అన్నిమతాల గ్రంధాలనూ చదివి, సమభావము కలిగి, మొదటనుండి ముస్లిములతోను, క్రైస్తవులు మొదలగువారితోను స్నేహము కలిగియున్నాడు. 1919 సం॥రం నుండి ఖిలాపతు యుద్యమ సందర్భములో ముస్లిము లనేకులు జాతీయవాదులయిరి. తరువాత బ్రిటిషు అధికారుల ఆకర్షణతో కొట్లాటలు, సాంఘిక కలహాలు, విద్యావంతులలో ఉద్యోగాదులయందు పోటీలు పెరిగినవి. ధనికవర్గములో, జమీందార్లలో, రాజులలో, విద్యార్థులలోగూడ సాంఘికతత్వము పెరిగి చీలిక లేర్పడినవి. అన్నివర్గములలోను ముస్లిములు వేరుసంస్థలను ఏర్పాటుచేసుకోగా ఈరీతిగ క్రైస్తవులు, సిక్కులు మొదలైనవారిలోగూడ ప్రత్యేకతత్వముగల సంస్థలు తలలెత్తినవి. ఈ సాంఘికద్వేషమును పోగొట్టి మైత్రి స్థాపించుటకు గాంధిగారెంతో కృషిచేసిరి. చాలవ్యాసాలు, ఉపన్యాసాలు చేయుటయే గాక, 1924 సం॥రంలోను దరిమిలాను, సాంఘికసఖ్యసాధనకు ఉపవాసాలను చేసిరి. జాతీయముస్లిములకు కాంగ్రెసులో ఉచితస్థాన మిప్పింప 1931 సం॥రము రౌండుటేబిలుసభ, ఇటీవల సిమ్లాసమావేశము యిత్యాదులలో ఆయన యెంతో కృషి చేసెను.

ఉభయసంఘాల ప్రముఖులమధ్య సామరస్యబుద్ధి తగ్గియు, పరస్పరము అవిశ్వాసము, స్వార్థదృష్టి, పరాయివారి కూటనీతివలన సాంఘిక విభేదాలు హెచ్చినవి.

ముస్లిములు హెచ్చుగాగల రాష్ట్రములలో బ్రిటిషువారు లీగువారికే యెక్కువ ప్రాముఖ్య మిచ్చి, వారినే ముస్లిమునాయకులుగ నెంచి, జాతీయ ముస్లిముల నణచివేసినారు. లీగుముస్లిములకే బ్రిటిషువ్యాపారస్థులు, యిత్యాదులును సదుపాయాలిచ్చి తోడ్పడిరి. మరియు ముస్లిముజనాభా హెచ్చుగా నున్న రాష్ట్రాలు ప్రత్యేకరాజ్యాలు కావలెనని, వారు ప్రత్యేకజాతియని మొదట ఆంగ్లేయులే వాదముతెచ్చిపెట్టి లోలోపల జిన్నాపక్షమునకు బల మిచ్చిరి. 1940 సం॥రంలో ఈ 'పాకిస్తాను' ముసలము పుట్టినది. ఉభయ పక్షాలమధ్య తీవ్రద్వేషప్రచారము దేశమంతట సాగి ఘోరహత్యాలును సాగినను వాటిని సవ్యాంగా అధికారు లణచలేరు. మౌంటుబాటనుగారు (కాబినెటు సమ్మతితో) పాకిస్తాను నంగీకరించి కథ పూర్తిచేసినారు. మరియు ముస్లిములలో హెచ్చుమందికి హిందువులపయిన అవిశ్వాసం ఉన్నట్లు క్రిందటి ఎన్నికలలో సూచితమయినది. మరల సుహృద్భావ మేర్పరచుటకు గాంధిగారు గట్టి కృషి చేసినారు. హిందువు లీవిషయములో కొంత ఆత్మ పరిశోధన చేసుకొనవలెను. సాంఘికముగా పరస్పరమైత్రి వృద్ధిచేసుకొంటే, అవిశ్వాసాలు పోవును. కనుక ప్రతిప్రాంతములోను మైత్రికృషి నే చేయవలె నని ఆయన ఉద్బోధించి, ఆత్మార్పణ చేసినారు

# 65 జాతీయ భాష

'భారతదేశ మొకటే, అది అఖండహిందూస్తానము' అని హిందువు లందరు వచింతురు. అది క్రియాత్మకము కావలెనంటే వెంటనే దేశమంతటికి జాతీయభాష యేర్పడవలె. స్వభాష గుజరాతీయైనను గాంధిగారు హిందీ లేక హిందూస్తానియే జాతీయభాష కావలెనన్నారు బ్రిటిషుసామ్రాజ్యపు బాధపోయినది. కాని ఆంగ్లభాషాసామ్రాజ్య మింకను వదలలేదు. చాలయేండ్ల నుండి ఆయన సమావేశా లన్నింటిలో హిందూస్తానీనే వాడుచువచ్చి నారు. 1917 సంవత్సరంలో యుద్ధసహాయసభలో వైస్రాయి మున్నగు మహోద్యోగుల యెదుటను ఆయన హిందీ-హిందూస్తానీలో మాట్లాడెను. కేంద్ర జాతీయసమావేశాలన్నిటిలో హిందూస్తానీలో చాలవరకు ప్రసంగాలు

జరుగుచున్నవి ఇటీవల మద్రాసులో సమావేశాలలోను ఆయన హిందీ-హిందూ స్థానీలోనే మాట్లాడెను. హిందీరాని ప్రాంతాలలో జాతీయ భాషాప్రచారము నై మద్రాసులో హిందీప్రచారసభ, (ఇప్పుడు హిందూస్తానీ ప్రచారసభ) వల్లనే దక్షిణ ప్రాంతాలనిమిత్తము వేరే మరొక సంఘమును ఆయన స్థాపించి నడిపించుచు వచ్చినారు. తాను 'ఆంగ్లహరిజన్'తో బాటు హిందూస్తానీలో "హరిజన సేవక్" అను వారపత్రికను రెండు లిపులలో సాగించినారు ఈ భాష దేశము మొత్తముమీద సగముమందికి బాగా తెలిసినది. ఇంకను కొందరికి దానితో పరిచయ మున్నది. అది సంస్కృతపు క్రమపరిణామమగు ఆర్యభాష. కాశీ, గయ, ప్రయాగ, హరిద్వార్, బృందావనాదిప్రాంతముల స్వభాష. కనుక మన ప్రాచీన మధ్యకాల సంస్కృతి చాలవరకిచటి వాఙ్మయములోనే నిల్చియున్నది. మన దేశపు హృదయప్రాంతములోనే యున్నందున దీనికి తక్కిన మన ముఖ్యభాష లన్నిటితో పొరుగుసంపర్క మున్నది. వాటిలో (మన తెలుగులోను) వేలకొలది హిందూస్తానీపదాలు చేరినవి.

జాతీయత బలపడుటకు, పరస్పరమైత్రికి, ముఖ్యముగా వేరుపొడు కొన్న ప్రాంతీయదృక్పథముపోయి విశాలభావ మేర్పడుటకు, సంస్కృతి సమన్వయము కలుగుటకు హిందువులందరి సంఘటనకు, హిందూముస్లిము మైత్రికిగూడ, జాతీయభాషను విద్యావంతు లందరు నేర్చుకోవలె. మాతృ భాషకుతోడుగ హిందీ - హిందూస్తానీ నేర్చుట కష్టముకాదు. ప్రాంతీ యాభిమానమునకు జాతీయతకు సంఘర్షణ లేనట్లే, మాతృ, జాతీయభాషల మధ్యను సంఘర్షణ యక్కరలేదు. ముఖ్యముగా కవులు, రచయితలు, ఉద్యోగులు, వ్యాపారస్థులు, ప్రయాణాభిలాషులు, సినిమాప్రియులు యిత్యా దులును తప్పక హిందూస్తానీ అభ్యసించదగును. అది భారతదేశమంతటిభాష.

హిందూస్తానీవాఙ్మయము చాల వేగముగా వృద్ధిజెందుచున్నది, అది మున్ముందు మనదేశపు జాతీయవాఙ్మయ మగును. దానిద్వారా మన మాతృభాషల సాహిత్యమును వృద్ధిచేసుకోవచ్చు. ఆంగ్లము అంతర్జాతీయ భాష. కనుక దానివలన కొందరి కుపయోగముండును. కాని క్రమముగా మన స్కూళ్లలో యింగ్లీషున కిప్పుడున్న ప్రాముఖ్యము తగ్గి హిందీకి ఉచితస్థాన ముండవలదు.

ఈ జాతీయభాష శైలి సంస్కృతం, అరబ్బీ, పారసీ భరితము కాకుండ మధ్యరకముగ నుండవలెనని గాంధిగారి భావన. ఈ శైలిలోనే మంచి వాఙ్మయము సృజించుటకు కృషి జరుగుచున్నది. దక్షిణభారత హిందూస్తానీ ప్రచారసభకు ఆయన ఆజీవనాధ్యక్షుడుగ నుండిరి. వారి మరణానంతరం రాజేంద్రప్రసాదుగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

ఆంధ్రదేశములోను, నిజాముసంస్థానపు తెలంగాణాలో రాజభాషగ ఉర్దూలిపిలో పారసీమిశ్రితభాష వ్యాపించినది. ఆ సంస్థానములో హిందూస్తానీని నాగరలిపిని మాతృభాషతో బాటుగా ప్రోత్సహించుటకు కృషి ఆరంభించినది.

# 66 మాతృభాషాభిమానం

జాతీయభాషతో బాటు మాతృభాషావిషయములోను గాంధిగారు చాల శ్రద్ధ వహించినారు. దక్షిణాఫ్రికానుండి ఆయన 1914 సం॥రములో వచ్చినప్పుడు బొంబాయి ప్రజల సన్మానసభలో, నాయకుడుగ జిన్నాగారాంగ్లములో ఆయన కభినందనపత్రిక చదువగా, ఆయన గుజరాతీలోనే జవాబిచ్చిరి, ఇట్లే గుజరాతీలో ఆత్మకథ, సర్వోదయ, మంగళ ప్రభాత్, ఆరోగ్య సాధన్ మున్నగు ఆయన గ్రంథాలును, తన గుజరాతీపత్రికలు, నవజీవన్ (దరిమిలాను), హరిజనబంధులో వివిధవిషయాలగూర్చిన వ్యాసాల పునర్ముద్రణ సంపుటాలును, గుజరాతీ వాఙ్మయములో చాలా ప్రాముఖ్యమొంది ఆ సాహిత్యములో నవయుగమును క్రాంతిని ఆరంభించినవి. ఆయన తన ప్రాంతములో యెప్పుడూ గుజరాతీలోనే మాటాడెను, వ్రాసెను అహమ్మదాబాదులో ఆయన 1921 సం లో మాతృభాషలోనే జాతీయపద్ధతిని విద్య బోధించు 'గుజరాతు విద్యాపీఠము' ను స్థాపింపచేసెను. చాలసారు లాయన గుజరాతు సాహిత్యపరిషత్తువారి వార్షికసభల కధ్యక్షులై, ఆ వాఙ్మయాభివృద్ధికి మంచి సూచనల జేసెను. మాతృభాషను, జాతీయభాషను సంఘర్షణ ఉండదనుట కాయన జీవిత మొక నిదర్శనము.

# 70 ఆరోగ్యరక్షణ

ఆరోగ్యమనగా రోగములేకుండుట. పైకి బలవంతులుగ కనపడినను వ్యాధిగ్రస్తులు కావచ్చును. దేహములో నాడీ, మనస్సు, హృదయము సవ్యంగా ఉండి, ఈ మూటికి పరస్పరసమన్వయము సరిగా నుండవలెను. ఇదిగాక, మనదేహము దేవాలయమువంటిది. దానిని హృదయస్థుడగు దేవుని కావాసమగుట కర్హముగ మన ముంచవలె. అందుకు దేహపరిశ్రమయు అవసరము. రోజూ నడచుట, నూలువడకుట ప్రతివానికి మంచిపరిశ్రమ నిచ్చును. పరిశుభ్రమగు గాలిని నీరునే వాడుట, సాత్వికాహారమునే తినుట మితవిహారములు అవసరములు. ఈ విషయాలన్నింటిలో గాంధిగారిది ఆదర్శజీవనము. ఆయుర్వేదములోకూడ ఇట్టి విషయములు చెప్పినారు ఆయన విశ్రాంతి లేకుండ వార్ధకంలోగూడ ప్రయాణాలు, నిరంతరం తీవ్రమానసిక కృషి చేయుచుండినందున సహజంగా నాడులపీడన రక్తపుపోటును హెచ్చుచుండెను. కనుక వాటితీవ్రతపోవుటకై ఆయన దేహమునకు తైలం వ్రాసి మర్దన చేసెడివారు. బ్రహ్మచర్యము, మనశ్శుద్ధి, మితభోజనము, మధ్యమధ్య ఉపవాసము, సదా ఈశ్వరధ్యానము గూడ ఆరోగ్యపోషకము లని ఆయన దృఢవిశ్వాసము.

ఎట్టి కష్టాలలోను శోకగ్రస్తుడుకాక ప్రసన్నుడగుటయు ఆరోగ్య రక్షకము. ఆయన ఈశ్వరచోదనప్రకారమే సదా ప్రవర్తించి ఫలిత మన్యథా అయినను వ్యసనమొందక, ఎప్పుడును ఉత్సాహము గల్గియుండెను. గాంధిగారు బాలురతోను పెద్దలతోను ఉత్సాహకరమగు ఛలోక్తు లాడును. ఆయన ముఖము ఎప్పుడు శుచిస్మితంతో నిండియుండును. ఎంత వ్యాకులస్థితిలోగూడ తొట్రుపడక ఇతరులలోను ప్రసన్నతను జనింపజేయును. ఆయన ఛలోక్తులు చక్కనివి, ఎవరికిని బాధాకరములు కావు. కాని, భావగర్భితములు. ఈ క్రింది కొద్ది ఛలోక్తులను గమనిం చుడు. గత సం॥ మద్రాసు హిందీప్రచారసభ సమావేశములో హిందీ 'విశారద' పట్టముల నాయన కృతార్థులకు వరుసగ నిచ్చుచుండెను. అట్టి వారిలో ఒక యువతిపేరు 'బేబీ'. ఆపట్టి మామె కిచ్చుచు ఆయన 'పర్, యహ్ బేబీ బహుత్ బడీ హోగయీ' అనగా అందరు నవ్విరి (బేబీ అనగా

ఆంగ్లములో శిశువు, తన కుమారు 16 ఏండ్లకే, 'విశారద' ఉన్నత పరీక్ష
కినుక మానసికంగానుగూడా కృష్ణదైనదని ఆయన భక్తోత్తముల) ఆసభలు
జరిగిన పదిరోజులు వేలకొలది హిందీవిద్యార్థులకు విద్యాంసులకు ఉచిత
భోజనాలేర్పాటు చేసిన మద్రాసు వర్తకప్రముఖు లాయన నక్కడ దర్శించి
చక్కని వెండి శ్రీరామవిగ్రహము నాయనకు బహుమతి నిచ్చిరి. "నేను
విగ్రహారాధనతో తృప్తినొందను, అసలు ఆత్మ నారాధింతును మీ రిందరి
పొట్ట నింపినారు, సరె కాని, నా ఆకలి తీర్చలేదు" అను గాంధిగారి
ఛలోక్తికి అందరు నవ్విరి భౌతికభోజనముకంటె తా నుద్దేశించివచ్చిన హిందీ
ప్రచారము, హరిజనోద్ధరణ వృత్తియగుటయే ఆయన కోరెడి ముఖ్యభోజన
మని గ్రహించి, ఆ వర్తకులు హిందీకి హరిజనోద్ధరణకు కొంత ద్రవ్యమును
సమర్పించిరి. తరువాత మహారాష్ట్ర, మిల్లు యజమాని అగు డా॥ అలగప్ప
చెట్టియారు సాయంకాలం గాంధిగారి నక్కడ దర్శించెను. గాంధిగారితో
పనియేమీ లేకున్నను రిక్తహస్తాలతో చూడనొల్లక, ఆయన ధర్మమునకని
పదివేలరూపాయలకు చెక్కువ్రాసి గాంధిగారి కిచ్చెను. అప్పుడు గాంధి
గారు "ఓహో నేను కోమటిని, వ్యాపారయుక్తిలో మీకు లొంగను, మీ
పూర్వోత్తరాలు గ్రహించాను. దరిద్రనారాయణ ప్రతినిధిని తెల్లవారితే
హరిజనపరిశ్రమాలయం స్థాపించవలె ఈశ్వరుడందుకే మిమ్మిక్కడకు పంపి,
నాకు బోధించాడు, 'ఒకారం' తప్పను, మాటలోకి సున్న చేర్చండి" అని
చెప్పి లక్షరూపాయలకు చెక్కు తీసుకొనిరి. గాంధిగారు మరునాడుదయమే
అక్కడ తాము పునాదివేయ నిర్ణయం అయిన 'ఠక్కర్ బాబా హరిజన పరి
శ్రమాలయము' నిధికా సొమ్మునిచ్చిరి. అంతట చెట్టియారువలకువచ్చి, "అబ్బా,
గాంధిగారు అసాధ్యులు" అని పలికి మనశ్శాంతితో వెళ్ళిరి

ఒకసారి యెవరో చాల సుందరముగా గాంధిగారి చిత్రపటమును
చిత్రించి ఆయనకిచ్చిరి. 'ఇదేమిటి, కోతివంటి నన్నిట్లు అందంగా చిత్రించారు'
అని పరిహాసించి, అయితే నాకీ పట మెందుకు? పేదవాడను, పెట్టుకొనుట
కిల్లువాకిలిలేదు, వేలము వేయండి" అనెను. యెవరో పదిరూపాయలకు
పాడిరి. అంతట గాంధిగారు "ఏమి, గాంధివెల పదిరూపాయలా? బాగానే
వున్నది" అని నవ్విరి అంతట జనులు పోటీపడి పాడగా తుదకు చాల
హెచ్చు సొమ్ము వచ్చెను. ఆయన వెంటనే ఆ సొమ్మును హరిజననిధి కిచ్చి

నేటి. మద్రాసు హిందీప్రచారసభలో 1946 జనవరి తుదను ఒకనాటి రాత్రి యువకులయు కార్యకర్తల సమావేశంలోనికి గాంధిగారు ఆహ్వానింపబడిరి. అందులో కొందరు ఆంగ్లములో ఆయనను ప్రశ్నలడిగిరి "అది మీకు, నాకు పరభాష. ఇంతకాలము ఆంగ్లేయులతో పోరి, మళ్ళీ ఆభాషను లోబడమనెదరా?' అని ఆంగ్లప్రశ్నలకు జవాబు చెప్పనెను. ఆయన హాస్యమునకు వింటిలోనే మాటాడెను "ఇప్పటికే మీరు హిందీ నేర్చుకోక పోతే, మాతృభాషలోనైన అడగండి" అని గాంధిగారనగా, ఆయువకుడు 'రాబోవు రాజ్యాంగ నిర్మాణమును గూర్చి కాంగ్రెసుధోరణి యేమిటి' అని ప్రశ్నించెను. 'ఈప్రశ్న నెహ్రూ; ఆజాదు మున్నగు కాంగ్రెసునాయకుల నడగండి. నేను కాంగ్రెసు సమితిలో లేను' అనిరి. అంతటితో విడువక 'Provisional గా మీ అభిప్రాయము చెప్పవలె.' అని ఒత్తిడిచేసిరి. అంతట గాంధిగారు 'మీరు చెప్పే Provisional అనే వస్తువేమిటి? అది గుర్రమా గాడిదా?' అని నవ్వుచు ప్రశ్నించిరి. అంతటితో అందరు గొల్లున నవ్విరి.

ఢిల్లీ ఆసియామహాసభకు రానొల్లకున్నను నెహ్రూ వైస్రాయీలు తొందరచేయగా, తుదకు గాంధిగారు ఢిల్లీ వచ్చిరి; మీరు యిష్టపడకున్నను యిప్పుడు జరుగు ఆసియా సభకు మిమ్ము రప్పింప నేను హేతువు నయినాను, చూచినారా? అని మౌంటుబాటనుగారు గాంధిగారితో ఛలోక్తిగా ననెరట. అంతట గాంధిగారు "అవును కాని నేను మీకు ఖైదీని. మీరు, నెహ్రూ నన్ను బలవంతంగా రప్పించారు యింతకూ నెహ్రూ యిప్పుడు మీ వైస్‌ప్రెసిడెంటే గదా" అనిరి. అందరు నవ్విరి. భారతీయుల కింకను స్వాతంత్ర్యములేదని, ఇంటరింప్రభుత్వ నాయకుడు నెహ్రూ కిప్పటికి పూర్ణాధికారము లేదనియు ధ్వనియా? పత్రికాప్రతినిధులు వార్తలకు, ఆయన భావాలకొరకు, ఆయన చెప్పుమా చుట్టుకొని వేధించుట అందరికిని తెలిసినదే. ఆయన యొకసారి విసుగుగా తప్పించుకోబోగా "మీకు హాస్యభావము (Sense of humour) యుండవద్దా?" అని వారనిరి. "నాకెంతో హాస్యభావము ఉండబట్టె కాట్లకుక్కలవంటి మీతో యింతకాలమునుండి వేగుచున్నాను?' అని ఆయన నవ్వుచు జవాబీయగా అందరు గొల్లుమని

నవ్విరి. ఇట్టివి హృదయవికాసమునకు, సుఖోత్పత్తి కారకములగుచు, ఆరోగ్యవర్ధకము లగును

గాంధిగారు రాగద్వేషచింతారహితుడు, నిగ్రహి. అట్టివారికి ప్రసాదగుణ మేర్పడి సర్వదుఃఖములు నశించును. ప్రసన్నచిత్తుని బుద్ధి స్థైర్యమొందును. * అని భగవద్గీతలో చెప్పబడెను. గాంధిగారు నిజమైన యోగి, జీవన్ముక్తుడు. కనుక సద్బుద్ధితోబాటు ఘనారోగ్యముకూడ కలిగియుండెను.

# 71 గ్రామపరిశుద్ధి

భారతదేశము గ్రామప్రధానము. అక్కడ సమృద్ధిగ దేవు డిచ్చిన గాలివగయిరా ఉన్నను, పరిసరములను శుభ్రపరచుకొనక వ్యాధులను వ్యాకులతను గ్రామీణులు తెచ్చిపెట్టుకొనుచున్నారు. దారులను మలినపర్చుట బురద కుళ్ళినఆకులు వగయిరాలను కుప్పలుగాపోసి దుర్వాసన కల్గించుట, చెరువులు వగయిరాలనీరు పాడుచేయుట యిట్టివి మాని, గ్రామస్థులందరు స్వగ్రామాలను పరిశుభ్రస్థితిలో నుంచుకొనుట ముఖ్యమని గాంధిగారెంచుచున్నారు. ప్రతిరాష్ట్రములోను ఆయన వేలకొలది గ్రామాలలో సంచరించి అనుభవమువలన "వ్యక్తిశుభ్రతకన్నను, సాంఘిక శుభ్రత చాలముఖ్యము. ఎవరి సౌకర్యమును వారు చేసుకొని సంఘములో యితరులకు బాధకలిగించుట చాలతప్పు. చెడువాయువు, మలినజలము, కుళ్ళిన ఆహారాది వస్తువులు, అంటువ్యాధులవ్యాప్తికి, జనుల అనారోగ్యమునకు కారణమగును, కనుక, సాంఘిక క్షేమము విషయములో జాగ్రత్తవహించవలె. గ్రామారోగ్యము, జలవసతివగయిరాల విషయమై ప్రభుత్వముపైన, జిల్లా బోర్డుపైననే ఆధారపడుటకన్న జనులు ఐకమత్యము కలిగి పరస్పర సహాయముతో పరిశుభ్రము చేసుకోవచ్చు. స్వగ్రామము స్వగృహమువంటిదే,

* రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్, ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే, ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ (గీ. 2-64, 65)

ఈసు భావముతో నొకరు సిద్ధపడి పూనుకుంటే తక్కిన మరికొందరును తోడ్పడుదురు. అట్టివారియందు గ్రామస్థులకును గణ్యత హెచ్చును, గ్రామసేవ, పరోపకారము వ్యర్థముగాపోవు ఇందువల్ల కక్షలు తగ్గి గ్రామాలలో ఐకమత్యమును పెంపొందును." అని గాంధిగారు బోధించిరి.

## 72 కుషరోగచికిత్స

నాగరిక దేశాలన్నిటికంటెను మన దేశములో హెచ్చుమంది కుష్ఠు వ్యాధిపడితులున్నారు. వారికి క్రైస్తవమిషనరీలుతప్ప తక్కినవారు తగు చికిత్సాలయాల నేర్పర్చలేదు. గాంధిగారీ విషయములో శ్రద్ధవహించినారు ఒక గొప్పవిద్వాంసుడు కుష్ఠురోగపీడితుడు కాగా ఆయన ఆ విద్వాంసునకు తన సేవాగ్రామ ఆశ్రమములోనే ప్రత్యేకస్థానమిచ్చి, ఆయనకుతానే స్వయముగా చికిత్సచేయుచు చాల ఆదరించెను. వర్ధాసమీపములో ఒక కుష్ఠురోగచికిత్సాశ్రమము, నిర్మాణకార్యకర్తలలో అగ్రగణ్యుడగు శ్రీ వినోబాభావే గారిచే గాంధిగారి ప్రోత్సాహమున నేటికి నడుపబడుచున్నది. ఈమహావ్యాధి వ్యాపించకుండ అరికట్టి ఆ రోగులకు తగు చికిత్సచేయుట జాతీయక్షేమమున కవసరము. కనుక, ఈ చికిత్సకు నిర్మాణకార్యక్రమాంశాలలో గాంధిగారు ప్రత్యేకస్థాన మిచ్చినారు.

## 73 స్త్రీజనోన్నతి

జాతిలో సగమై ముందుతరమువారి తల్లులైన స్త్రీజాతి వృద్ధిలోనికి వచ్చినగాని సంఘమెప్పుడు బాగుపడదు. పూర్వము భారతస్త్రీలు విద్యావతులై కొంత స్వాతంత్ర్యము కలిగియుండినను, మధ్యకాలములో ఆస్థితి చెడినది. గాంధిగారి యుద్యమ మారంభించినమీదట, మన స్త్రీలు జాతీయోద్యమములో పాల్గొన్నారు. చాలమంది దేశసేవికలు విదేశపుబట్టలు; కల్లుదుకాణాలవద్ద పికెటింగుచేసి జైళ్ళకు వెళ్ళిరి. నూలు వడకుట, హిందీ

నేర్చుకొనుట మొదలగు నిర్మాణ కార్యాలలో వేలకొలది స్త్రీలు పాల్గొను చున్నారు. అతిబాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యమువంటి దురాచారాలను పోగొట్టి స్త్రీలను విద్యావతులగావించుటకు, వారిఆరోగ్యమును బాగుచే యుటకు స్త్రీస్వాతంత్ర్యమునకు గాంధిగారు చాలవరకు తోడ్పడిరి

పురుషులు స్త్రీలను తమ భోగసాధనాలుగా నుపయోగించు పద్ధతిని ఖండించి,సంతానార్థమే స్త్రీసంయోగము చేయవగునని, ఆవిషయము లోను స్త్రీకి స్వాతంత్ర్యము కలదని పురుషులు సామాన్యముగా స్త్రీలను తల్లులు, సోదరీమణులవలె చూచుకొని ఆదరించవలెనని, బోధన, ఆచరణ రెంటిద్వారాకూడా నిరూపించినారు. తనభార్యవిషయములో అట్లు వర్తించి నారు. ఆమె అనంతరము ఆమెకు స్మారకముగా వసూలయిన నిధిని కేవలము స్త్రీజాతిప్రసవచికిత్సకు, విద్యాభివృద్ధికినే వినియోగింపచేసి స్త్రీజాతి కమి తోపకారమునుచేసినారు. ఇప్పటికిని యెందరో స్త్రీలు ఆయనను తండ్రిగా నెంచుకొని ఆయనఉపదేశప్రకారము వర్తింతురు. సాంఘికముగా, ఆర్థిక ముగా, ఆధ్యాత్మికముగాగూడ స్త్రీలు త్వరలో వృద్ధిబొందునట్లు కాంగ్రెసుకూడ యత్నించుటకు ఆయనబోధనయే కారణము.

# 74 కార్మిక జనాభివృద్ధి

పరిశ్రమలలో ఉత్పత్తికారకులగు కార్మికుల యోగక్షేమములు గమ నించుట నైతికముగానేగాక, ఆ పరిశ్రమల అభివృద్ధికిని అవసరము. ప్రతి మనిషియు నిర్వ్యాపారుడు, సోమరి కాకుండ పనిచేయుట అతని విధి కనుకనే కోట్లకొలది నిరుద్యోగులనిమిత్తము ఖాదీమున్నగు యెక్కువమందికి పని నిచ్చు పరిశ్రమల నాయన ప్రోత్సహించినారు. ఈ కార్మికులకు కనీస జీవనభృతికి తగినంత జీతమిచ్చుట న్యాయము, అవసరము. అట్లే యాంత్రిక పరిశ్రమలందు పనిచేయు కార్మికులు సంఘముగా నేర్పడి తమహక్కులను రక్షించుకొనదగును. అహమ్మదాబాదులో మిల్లుకార్మికులహక్కులను రక్షిం చుటకు నాయన చేసిన కృషి అలోకించదగినది. కార్మికవర్గమువిద్య, ఆరోగ్యము,

జీతము యిత్యాదులగూర్చి కాంగ్రెసువారిని న్యాయము చేయవలెనని గాంధిగారు ప్రోత్సహించినారు. ఆయా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములు కార్మికక్షేమమునకు, పరిశ్రమాభివృద్ధికి కొన్ని శాసనాలను చేసినవి. అయినా యీ కార్మికులు రాజకీయాలలో దిగి కమ్యూనిస్టుల బోధలకైన దూరాలోచన లేక సమ్మెకట్టుట, జాతీయతకు వ్యతిరిక్తముగా సంచరించుట ఘటనల జరుగుచున్నవి, కనుక 1947 సం॥లో జాతీయ కార్మికసంఘ మేర్పరుపబడినది. అది కార్మికులహక్కులకు జాతీయతకు సమన్వయము చేయును. కార్మికులు విద్య నేర్చి, పత్రికలద్వారా రాజకీయజ్ఞానం పొందవలె, కాని దూరదృష్టి, దేశక్షేమంకూడ లక్ష్యంచేసికొని వర్తించవలె వస్తూత్పత్తి తమ పవిత్రకర్తవ్యము జాతిసేవ అనుభావముతో కార్మికులు పనిచేయవలెనని గాంధిగారి భావము. కార్మికులు, యజమానులమధ్య తరచు సంఘర్షణ కలుగుట ఉభయపక్షాలకు, దేశమునకు హానికరము.

# 75 కర్షకులు

మనదేశమున కృషిప్రధానము. చిరకాలపు సాంప్రదాయము లనుసరించియే మన సేద్యదార్లు పంటలను పండించుచున్నారు. జమీందార్లు, సర్కారువారు వారిపైన హెచ్చుపన్నులు విధించి, అన్యాయపు నియమాలను పెట్టి, రాజకీయముగా, ఆర్థికముగా వారిని బాధించుట, నీటివనర్లు సరిగా బాగుచేయకుండుట, దైవయోగమువలన పంటలు పండకపోయినను పూర్తిగా పన్నులు వసూలుచేయుట యిట్టి అన్యాయాలు జరుగుచున్నవి. కనుక, ముఖ్యముగా రయితులక్షేమమునకై కాంగ్రెసుఆజ్ఞపైన అన్ని రాష్ట్రాలతోబాటు మన రాష్ట్రములోను వ్యవసాయక్షేమము నిమిత్తము కొత్త శాసనాలు చేయబడుచున్నవి. పట్టాదారులకు, లోపాయికారీరయితులకు, సేద్యముచేయువారికి పరస్పరసంఘర్షణములేకుండ వారివారికి న్యాయకరమైన అందరికి సమన్వయముగా క్షేమకరమయిన శాసనాలుచేయు కృషి జరుగుచున్నది. దేశములో నింకను బంజరుభూములనుగూడ సాగుకు లాయకుచేసి, నీటిసదుపాయములను హెచ్చించుటకు, తుంగభద్ర, గోదావరి మున్నగు

మహానదులకు గొప్పకట్టలుకట్టి నీటిపారుదలకు, ఎరువులకు, హెచ్చుపంటలకు సహాయముచేయుటకుకూడ జరుగుచున్నది. జమీందారీవిధానమును తొలగించి సర్వేవగయిరాలు చేయించి పన్నులను న్యాయంగా నిర్ణయించు చున్నారు. ఆధునికవిజ్ఞానంప్రకారం రైతులకు కృషి పరిజ్ఞానమును కల్గించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

# 76 విద్యార్థులు

1921 సం.రములో గాంధిగారి ఉద్బోధనవిని త్యాగముచేసి విద్యార్థులు జాతీయయోధు లయినారు. ఇప్పటి విద్యార్థులే ముందుతరమున పౌరులై దేశాభివృద్ధికి భారమంతయు వహింతురు. మరియు విద్యార్థిదశలో వారినడవడి, ధోరణినిబట్టియే వారి భవిష్యత్తంతయు నాధారపడును. కనుక, గాంధిగారు విద్యార్థులవిషయములో మొదటనుండి ప్రత్యేక శ్రద్ధవహించి వారినిగూర్చి చాలబోధలను చేసినారు. 192' సం॥రములో సర్కారు స్కూళ్ళుమాని విద్యార్థు లనేకులు త్యాగము చేసినారు. మానవులకు విజ్ఞానాభివృద్ధి కావలెనని, బాల్యదశలో వీలయినంత ఉన్నతవిద్య నొందవలెనని కోరుట సహజము. విద్యార్థులు రాజకీయాలను గ్రహించుటయు మంచిదే. వారు నిర్మాణకార్యక్రమపు అంశాలు అమలుజరుపుట తప్పకవగ నున్నది. హెచ్చుమందివిద్యార్థులు పెడదుడుకులలోనున్నారని, ఉత్సాహమునకుబదులు ఉద్రేకములోబడి, రాజకీయనాయకుల తాత్కాలికపు వ్యక్తిగతతగాదాలో బడినారని చాలసార్లు తమ విచారమును తెలిపినారు. నిర్మాణకార్యాంశాలను అమలుచేయుట జాతీయవాదులగు విద్యార్థు లందరి కర్తవ్యము. ఇందు సాంఘికవిభేదాలు తొలగించుట, ఖాదీధారణ, నూలు వడకుట, మాతృభాష చదువుట, హిందుస్తానీ నేర్చుట ఇతర విద్యార్థులకు శిల్పాదులను ఖాళీసమయాలలో నేర్పుట, హరిజననిధికి సొమ్ము వసూలుచేయుట, అస్పృశ్యతను మాన్పించుట, యిట్టి కార్యాలను తమ చదువులకు ఎట్టి ప్రతిబంధకమూ లేకుండానే విద్యార్థులందరూ సాగిస్తే, స్వాతంత్ర్యసాధనకు విద్యార్థు లెంతో తోడ్పడుదురు. విద్యార్థులుగ నున్నంతకాలము వారు

జ్ఞానార్జనవిషయములో శ్రద్ధవహించవలె. అందుకు భంగము లేకుండానే ఆయా ఆర్థిక రాజకీయసమస్యలను, సిద్ధాంతాలను అవగాహన చేసుకుంటూ నిర్మాణ కార్యక్రమమును అమలుజరుపుట, తాము స్థాపించిన సంస్థలశాఖల కార్యాలకు తోడ్పడుట, ప్రతివిద్యార్థి చేయదగినపని అని గాంధిగారిభావన. ఏ దేశములో నయినను, ఏ కార్యక్రమమయినను విద్యార్థి యువకసంఘాల ద్వారానే వృద్ధియగును. తనను మాటకన్న నిర్మాణకార్యక్రమమును గ్రహించి దాని నమలుజరుపుట తమకు, దేశమంతకు యెక్కువ క్షేమకరమని గాంధిగారు 1946 జనవరిలో ఆంధ్రదేశీయులకు సందేశ మిచ్చియున్నారు. స్వరాజ్యసౌధమును నిర్మించువారు, నిర్మింపగలవారు, ముందు తరములో దాని నుపయోగించువారును విద్యార్థులే. కనుక, వారు ఐకమత్యముతో, పరస్పరమైత్రితో కార్యసాధన చేయవలెనని గాంధిమహాత్ముని యుద్బోధనం.

# 77 అహింసా స్వరాజ్యము

ఇంతవరకు చెప్పిన 18 అంశాలే నిర్మాణకార్యక్రమం. "దాని ఉద్దేశం గ్రహించి వాటిని సరిగా, అమలుజరిపితే, దేశమునకు లభించిన స్వరాజ్యము స్థిరముగా నుండును. ఈ ఆటంబాంబుయుగంలో నిరాయుధులమగు మనకు హింసాపద్ధతి లాభకారికాదు ఆపద్ధతివల్ల సాంఘిక కలహాలు, సాంఘికహత్యలు ఇంకా చెలరేగును, అన్యోన్యత, సాంఘికమైత్రి లేకుండా హింసతోగూడా యుద్ధమును సాగించుట సాధ్యంకాదు. మనదేశ సంస్కృతి అహింసాతత్వంపైనే యేర్పడినది. చాల భాషలు, మతాలు, కులాలు, అవాంతరశాఖలు, భిన్నసంస్కృతులు మిళితమైన మన భారతదేశంలో పరస్పరమైత్రి అహింసయునే ఐకమత్యమును కల్గించును. ఇంగ్లండు అమెరికావంటి గొప్ప ప్రజాయత్తరాజ్యాలలో నిర్బంధ సైనిక శిక్షణను, విపరీతమైన మారణయంత్రవృద్ధిని చేయుచున్నారు. ఆ పద్ధతివల్ల ఆయాదేశాలమధ్య అనుమానాలు, విరోధాలు, కుతంత్రాలు పెరుగుచున్నవి. ఒకప్రక్క రెండవ ప్రపంచపుయుద్ధపు బాధలింకా తగ్గలేదు. శాంతి యేర్పడలేదు;

మామూలు జనుల క్షోభ పోలేదు. ఆ యుద్ధము సాగించిన జర్మనీ, జపాను లింకా శత్రువశములోనే ఉన్నవి; వాటితో సంధి యేర్పడలేదు; అప్పుడే విజేతలు పరస్పరము 3 వ ప్రపంచయుద్ధమున కాయత్తులగుచున్నారు. ఇప్పుడు మధ్యనున్న దేశాల నేదోవైపునకు తీసుకొనుటకు వారిలో గట్టి ప్రయత్నము, కూటనీతియు సాగింపబడుచున్నది. ఇంతటి దుర్భరానర్థము లోకమున కిదివర కెన్నడు వాటిల్లలేదు. ఇట్టి ఘోరహింసాతత్వము లోకమంతట వ్యాపించగా, దాని తరంగాలీదేశమునకును తగులుట సహజము. ఈ వార్తాపత్రికలు, తీగలేని తంతి, ఫోను, రేడియోకాలమందు, జాతిద్వేషము హింసాప్రవృత్తి మన దేశమునగూడ అవతరించుటలో ఆశ్చర్యములేదు. ఈ 6 ఏండ్ల యుద్ధకాలములో ఇక్కడ చాల కుయుక్తి, విషప్రచారము, హింసాచర్యలు జరిగినవి కదా! హిట్లరుపద్ధతిని జాతిద్వేషము రేపుట, మతద్వేషము, సాయుధవిప్లవయత్నము, తోటి పౌరులపైన దౌర్జన్య ప్రయోగము, క్రౌర్యప్రవృత్తి, ఆస్తుల నాశనము, మారణహోమములు సాగుచున్నవి. కనుక, బ్రిటిషువారు ఏదో ఒక భాగములో తమ ప్రాభవమును పొడిగించుటకు కుట్రచేయుటయు సహజమే. ఇట్టి స్థితిలో పాకిస్తానులో ముస్లిం మెజారిటీజిల్లాలనే చేర్చి, మిగతాభాగాలన్నీ హిందుస్తానుగా ఉంచుపద్ధతిని, విభాగసిద్ధాంతమును కాంగ్రెసుపక్ష నాయకు లొప్పుకొన్నారు, దౌర్జన్యఫలితముగా జంకి అట్లు చీల్చకూడదని, హిందువులు ముస్లిములుగూడ పరస్పరవిశ్వాసము కోల్పోయి విదేశీయుల ద్వారా మన విభాగసమస్యను పరిష్కారముచేసికొనుట హానికరమని గాంధి గారు తెలిపియున్నారు. రెండుపిల్లులమధ్య రొట్టెతగవును మధ్యవర్తినని కోతి పరిష్కరించిన కథ అందరికి విదితమే. జాతీయవాదులగు ముస్లిములను బ్రిటిషువారు అణచి, వీరికి పోటీగ జోహుకుముదార్లకు, సాంఘికద్వేషము గల ముస్లిములకు సాయపడిరి; ఎన్నికలలో జాతీయముస్లిములపైన దారుణ దౌర్జన్యాలు జరిగినవి. సవర్ణులు హరిజనుల మధ్యను, ధనాఢ్యులు దీనుల మధ్యను, రాజులు ప్రజలమధ్యను వర్గవిభేదాలు పెరిగినవి. జాతీయవాదు లకు, కమ్యూనిస్టులకు కలహము పెరుగుటకును బ్రిటిషుసర్కారు కుతంత్రము పనిచేసినది. ఈ అన్నిటివల్ల జనులలో పరస్పరద్వేషము స్వార్థపరత ప్రబలి నవి. ఈ యుద్ధఫలితముగా ఎన్నడు కని విని యెరుగనిరీతిని గింజలు, బట్టలు

వస్తురాలధరలు విపరీతముగా పెరిగినవి. ఉద్యోగులు, వ్యాపారులు, భూస్వాములుగూడ స్వలాభమునకని నిర్దయగా చోరీబజారును సాగించుటయు హింసాతత్వమునకు నిదర్శనము. ప్రాంతీయద్వేషాలును పెచ్చుపెరిగినవి. అవి నశించవలె నిర్మాణాంశాలను జను లామోదించి యిప్పటికైనను సరిగా సాగించిన, తప్పక అహింస, ప్రేమభావము మరల జనులలో వ్యాపించును. స్వరాజ్యము సుస్థిరముగా నుండును. అదియే గాంధిగారి యాశయము.

'అహింస' అనగా జంకిపోవుటకాదు పరస్పరప్రేమగల్గి, ఆత్మవిశ్వాసమును బలపర్చుకొని, ధీరత్వము, శక్తి కల్గియుండుట అహింసకు సారము. సాత్విక తేజమును సరిగా వృద్ధిచేసుకుంటేనే జనులలో నిజమైన అహింస యేర్పడును. పిరికిదనముకంటే భౌతికబల ముపయోగించియైన సంఘక్షేమమును కాపాడవలసినదె. జనులను, ముఖ్యముగా దీనులను, స్త్రీలను అహింసాబలముతో రక్షింపలేనప్పుడు రక్తపాతముచేయుట ధర్మమేయని గాంధిగారును తెల్పియున్నారు. మనోదౌర్బల్యమెప్పుడూ మంచిదికాదు. వీరత్వము కలవారికి అహింస యెక్కువ పట్టుబడుననుటకు యిదివరలో అకాలీసిక్కులు సరిహద్దురాష్ట్రములో పఠానువీరులు సాగించిన సత్యాగ్రహాలు నిదర్శనాలు. ఆటంబాంబులకు ఆత్మశక్తియే జబాబు. దాని క్రియారూపమే నిర్మాణకార్యక్రమము.

ఈ నిర్మాణకార్యక్రమపు 18 అంశాలలో అన్యోన్యత కలదు. ఖాదీ గృహపరిశ్రమ, మద్యనిషేధము బాగున్నవి, కాని అస్పృశ్యతానివారణ, సాంఘికమైత్రి సరిగాలేవనుట హ్రస్వదృష్టినే తెల్పును. ఖాదీ చౌకగ తయారుకావలె బీదలగు మాలమాదిగలచేత నూలు వడికించి నేయించితే, తప్పక ఖాదీ చౌక, ప్రశస్తము నగును; హరిజనులను మనసంఘములో భాగముగాచేర్చి, అంటు మానినప్పుడే సఫలత కల్గును. అట్లే కల్లుపాకలు కట్టివేసినను, ఎక్కువగ త్రాగే హరిజనులతో స్నేహముజేసి వారిబాధలను గ్రహించి అజ్ఞానులగు హరిజనుల దురభ్యాసాలను మాన్పించి వారికి మంచి మతభావాలను నేర్పితేనే దేశములో త్రాగుడు నిశ్శేషమగును. గ్రామాల పరిశుద్ధి, ఆరోగ్యము బాగుపడును. మాతృభాషాభివృద్ధితో నిల్చిపోక, జాతీయభాష నలవర్చుకుంటే, ప్రాంతీయసంకుచితదృష్టి పోయి విశాల విజ్ఞానము కల్గును.

మరియు, హరిజనుల నుద్ధరించితేనే ఆర్థికసమత్వం, గృహపరిశ్రమలు, వయోజనవిద్య, యిట్టిసమస్యలు పరిష్కృతములగును. స్త్రీజనోన్నతి, హరిజనోద్ధరణ జరిగితే, హిందూముస్లిములమధ్య కలుగు కొన్ని సంఘర్షకారణాలు తొలగును. సాంఘికమైత్రియు బలపడును. ఇట్లే చక్కగా పరిశీలిస్తే, మనము సరిగా మూలతత్వమును గ్రహించి. ఈ అన్ని అంశాలందూ అభిమానముకలిగి ఈ అన్నింటిని శ్రద్ధతో సాధ్యమైనంతవరకు సాగింప బూనుకొంటే నిర్మాణ కార్యక్రమము సరిగా అమలు జరుగును, సమగ్రజీవితము బాగుపడును. అహింసాసత్యముల కివి క్రియారూపములని, స్వరాజ్యస్థిరత కైకైకసాధకములని గ్రహించి ప్రతివారు నిర్మాణకార్యక్రమమును పూర్తిగ అమలుజరిపి, సరియైన స్వరాజ్యము సాధింప కారకులు కావలెనని గాంధిగారు కోరుచున్నారు. ఈ పద్ధతివల్ల మన కితర దేశాలతో సంఘర్షణమును లేకపోవును. ఆయా రాజ్యాలలో అసూయకు, కలహాలకు కారణ ముండదు. అహింసాసత్యసూత్రముల ననుసరించి, ఆయాదేశాలకు నిర్మాణ కార్యపద్ధతుల వివరాలు మారవచ్చు. కాని సిద్ధాంత మొకటే. ఈమాట కనిపెట్టియే, ట్రూమను, అట్లీ, స్టాలిను వగైరాలవలెకాక, గాంధిమహాత్ముడు వ్యక్తిమోక్షముతోబాటు లోకాభ్యుదయమును సాధించువాడని, సర్వమిత్రుడగు ఆయనపద్ధతియే లోకోద్ధరణ కలుగజేయునని, మానవజాతి దైవసంపత్తి సాధించగలదని, కనుకనే గాంధిగారు నిజమైన మహాత్ముడని దూరదృష్టిగల ఉదారులందరు అంగీకరించుచున్నారు.

## 78 కొత్తరాజ్యాంగ ప్రణాళిక.

గాంధిగారొకమూల బెంగాలు బీహారులలోనుండి, ప్రేమప్రచారము చేయుచు సాంఘికమైత్రిని, జాతీయతను బలపర్చుచుండ, ముస్లింలీగు పక్షీయులు తీవ్రంగా జాతిమతద్వేషముల రేపుచుండిరి అది పీనల్ కోడ్డు ప్రకారం గొప్ప నేరమైనను వారిపైన గవర్నర్లు, ఐ. సి. ఎస్. ఉద్యోగులును చర్యతీసుకోక ప్రోత్సహించిరి. సహజంగా రక్తపాతాలు మరల ప్రబలినవి. రాజ్యాంగపరిషత్తులో లీగువారు చేరక, కేంద్రప్రభుత్వంలో

ఉద్ధతగులు మన్నప్పుడు శాంతిస్థాపనములకు చర్య తీసికొనవలసిన వైస్రాయిగారు తాను కల్పించుకొనలేదు. అందుకు తన యధికారమును కేంద్ర మంత్రికీయడు. ఈఅసందర్భస్థితిలో, శాంతిస్థాపనకు మహాత్మునికి నెహ్రూ ప్రభుత్వముతోడ్పడలేని దుస్థితిగల్గెను అంతట బ్రిటిషువారీదేశం వదలిపోతేనే గాని దేశమునకీ శనివదలదని గాంధిగారనిరి. కేంద్రజాతీయమంత్రులును బ్రిటిషు ప్రభుత్వమునొత్తిడిచేసిరి. అంతట బ్రిటిషుప్రభుత్వమువారు 20-2-47 తేదీని కొత్త ప్రకటనచేసిరి. ముస్లింలీగు,బ్రిటిషు అధికారుల ప్రవృత్తినిగూర్చి నెహ్రూ ఆక్షేపణల కందులో జవాబు, పరిష్కారము లేదు కాని, 1948సం|| జూను ఆఖరునాటికి బ్రిటిషుప్రభుత్వంవారీదేశం వదలిపోదురనిరి అనగా, అప్పుడు గాంధిమహాత్ముని (కాంగ్రెసు ఆమోదించిన) "క్విటిండియా" సూత్ర మమలునకు వచ్చునని అందుకు సంతోషమేకాని, పోవునప్పు డధికారమును కేంద్రప్రభుత్వమునకేకాక, రాష్ట్రాలలో ప్రాబల్యంగల సంస్థలకిచ్చివేతుమనియు చేర్చిరి. ఇది తేలుకొండివంటిది. బ్రిటిషు ప్రభుత్వ మట్లు సముద్దేశంతోనే చెప్పినను ఈలోగా ఎట్లో అధికారంలాగుకొంటే, 'పాకిస్తాను' ప్రాంతాలలో అధిపత్యము తమ హస్తములోనికే వచ్చునని స్ఫురించి, అందుకు ఇక్కడి బ్రిటిషు ఉద్యోగులదోహదమును కలిగి, లీగు పక్షీయులు వెంటనే పంజాబులో, సరిహద్దురాష్ట్రంలో తమదౌర్జన్యపు ఒత్తిడిని మరింత హెచ్చించిరి. పంజాబులో లీగేతరముస్లిములకు ప్రాణ భయము, సాంఘికబహిష్కారము, గవర్నరునుండియు ఒత్తిడి, నేషనల్ గార్డు అనుపేర సాయుధదళాల విజృంభణయు సాగెను. వీటి ధాటి కాగలేక, పంజాబులో యూనియనిస్టుప్రధాని రాజీనామా నిచ్చెను. ఆమంత్రివర్గము పోగా, గవర్నరుతోడ్పాటుతో పశుబలము నుపయోగించి, శాసనసభలో తమకు సంఖ్యాబలంలేకున్నను లీగువారు మంత్రిత్వము వహింపజూచిరి. జాతీయవాదులు, సిక్కులు ప్రదర్శనాలద్వారా అడ్డుకోబోయిరి అప్పుడు లీగుపక్షపుగూండాలు పాకిస్తానునినాదాలతో సాయుధులై రావల్పిండి, ముల్తాను, అమృతసరంవంటి జిల్లాలలో హఠాత్తుగ నవఖాలీకన్నను చాల ప్రచండంగా హత్యలు, ఆస్తులధ్వంసము కలిగించిరి. అహింసాచర్యలు రౌద్ర చర్యలు. సైనికులుపయోగించు ఆయుధాలను వారు ధరించి, మహోద్ధతులై హఠాత్తుగ గొప్పరాజవీధులను పరశురామప్రీతిచేసిరి. ఆంగ్లోద్యోగు

లధికారులై యున్న జిల్లాలలో నిట్టి దారుణా లెక్కువగ జరిగినవి.

రాజకీయకార్యాలకు హింసాకాండను సాగించుటను ఖండించుచు గాంధి జిన్నాల సంతకముతో ఒక వినతి జారీయైనది. కాని ముస్లిముల ధోరణి మారలేదు. ఇందులో సిక్కుల కెక్కువ నష్టము కలిగెను. సరిహద్దు రాష్ట్రములోను హిందూసిక్కులకు అపారనష్టము కలిగెను. వేలకొలది నిరాయుధులగు హిందూసిక్కులు హత్యలపాలైరి. అంతట ముస్లిములు హెచ్చుసంఖ్యగల జిల్లాలనుమాత్రం విడదీసి వాటిని ప్రత్యేకరాజ్యాలుగ జేయుపాకిస్తాను ప్రణాళిక నొప్పుకొని, మిగతా భారతరాజ్యముగ జేయుచు వెంటనే పరిష్కారము చేయించుమని సిక్కునాయకు లేకగ్రీవముగా కాంగ్రెసు కార్యసమితిని, వైస్రాయిని కోరిరి. ఇట్లే బెంగాలులోనుహిందువులు తక్షణవిభాగమును కోరిరి. భూసేనాని వవెలుస్థానే వచ్చిన క్రొత్తవైస్రాయి నౌసేనాని. ఈ మౌంటుబాటనుగారు ఆ క్లిష్టస్థితిని వెంటనే పరిష్కరింప జూచెను. అంతవరకు గాంధిగారివలె దేశైక్యమునే కోరి 16-5-46 తేదీ ప్రణాళికనే సాగింపగోరిన కాంగ్రెసు కార్యసమితి కిప్పుడు క్రొత్తసమస్య యేర్పడెను. గాంధిగారితో సంప్రదింప వ్యవధిలేకుండెను. దేశవిభజన ఎన్నడూ మంచి పరిష్కారముకాదు, నిజమే, కాని పంజాబు బెంగాలుల విభజనవల్ల హెచ్చుగ నష్టపోవు సిక్కులు బెంగాలీహిందువులే అందుకు తొందరపడుచున్నారు. మరియు, బ్రిటిషువారు ఏకకేంద్రప్రభుత్వపు 16-5-46 నాటి ప్రణాళికను ప్రక్కకుత్రోసి, లీగుపక్షమునకు తోడిచ్చినారు. వారి రహస్యపుమద్దతుతో జిన్నా కోరినట్లు పంజాబును బెంగాలును పూర్తిగ పాకిస్తానులో చేరిస్తే ఘోరాన్యాయము కల్గును. అంతకన్న, పంజాబు, బెంగాలులను తూర్పు పశ్చిమ భాగాలుగ విడదీసి స్వయంనిర్ణయ పద్ధతిని రెండు ప్రత్యేకపు కేంద్రప్రభుత్వా లేర్పరుచుట కొంత నయమని కాంగ్రెసు కార్యసమితియు తన యంగీకారమును వైస్రాయికి తెల్పెను. వెంటనే వైస్రాయిగా రాపద్ధతికి సమ్మతించి, ఇతరసమస్యలకు కొన్ని పరిష్కారాలతో ఒక ప్రణాళికను లండనుకు పంపి, బ్రిటిషుప్రభుత్వపు ఆహ్వానంపైన తాను వెళ్ళి, వారి సమ్మతితో క్రొత్తప్రణాళిను తెచ్చెను. "పంజాబు, బెంగాలులలోని ముస్లింజనాధిక్యముగల జిల్లాల ఎసెంబ్లీప్రతినిధు లలో హెచ్చుమంది ఇప్పటి రాజ్యాంగపరిషత్తులో చేరనిరాకరిస్తే, ఆజిల్లాల

వారు ప్రత్యేక రాజ్యాంగపరిషత్తు నేర్పరచుకొని వేరురాజ్యా స్థాపించుకో
వలె. వారట్లు చేసిన, అస్సాములో ముస్లిము జనాధిక్యముగల సిల్హెట్
జిల్లా వోటరులు ఆజిల్లా ఏ రాజ్యములో పు దరకలెకో నిశ్చయించవలె.
తక్కిన అస్సాంవారు యిప్పటి రాజ్యాంగము (అనగా హిందుస్థాన్
లోనే) ఉందురు. వాయవ్య సరిహద్దురాష్ట్రపు ప్రత్యేకస్థితిని బట్టి
వారీ రెంటిలో ఎందులో చేరుదురని అక్కడి అసెంబ్లీ
వోటరుజనుల వోట్లు తీసుకోబడును, ఇట్లే బెలూచీస్తానునకును, సింధు
విషయములో సింధు అసెంబ్లీసభ్యులే నిర్ణయించవలె. ఇప్పటి రాజ్యాంగ
పరిషత్తువారి ప్రణాళిక అందలి సభ్యులు గల ఆయా ప్రాంతాలన్నిటిలోను
అమలు జరుగును, ఈ విభజన పూర్తియగువరకు ఇప్పటి (ఇంటరిం) కేంద్ర
ప్రభుత్వ ముండును. పిమ్మట రెంటికీ వేర్వేరు కేంద్రప్రభుత్వా లుండును.
అప్పటినుండి దేశములో శాంతిస్థాపన వగైరాలన్నిటికీ వైస్రాయి గవర్నర్ల
ప్రమేయంలేకుండ ఆ కేంద్రప్రభుత్వాలకు డొమినియనులలోవలె పూర్తి
అధికార ముండును అది పార్లిమెంటు బిల్లుద్వారా రెండు నెలలలో అమలు
నకు వచ్చును. ఇక స్వదేశసంస్థానాలు ఆ రెండు కేంద్రప్రభుత్వాలలో
తమకిష్టమగుదానిలో చేరవచ్చు, లేదా స్వతంత్రముగా ఉండవచ్చు వారిపైన
బ్రిటిషువారికిక అధికార ముండదు. 1948 సం॥ జూను నాటికి బ్రిటిషు
ప్రభుత్వ మీదేశమునుండి తొలగును. కాని ఈరెండు కేంద్ర ప్రభు
త్వాలలో నేదైన బ్రిటిషుసామ్రాజ్యపు డొమినియనుగానే ఉండిపోవచ్చు;
తమ యిష్టం."

ఈ ప్రణాళికకు ఆయాపక్షనాయకులు సమ్మతించిరి. వైస్రాయిగారు
గాంధిగారితోను ఇందునుగూర్చి 2-6-47 తేదినుండి సంప్రదించిరి.
"16-5-46 తేదీనాడు ఈ దేశమంతటికి దుర్బలమైనను ఒకే కేంద్రప్రభు
త్వపు రాజ్యాంగముండునట్లు తీర్పుగ నిర్ణయించిన బ్రిటిషుప్రభుత్వమువారిట్లు
దేశములోవిభజన చేయుట ముస్లిము హింసాప్రవృత్తికి జంకిపోవుటే కాదా?
ప్రజాసామాన్యము నిదానముగా అట్లు కోరితే తప్ప, దేశమును చీల్చివేయుట
తప్పు" అని గాంధిగారు తెల్పిరి. ఈ విభజన కొప్పుకుంటే సేనావిభజన
విదేశాంగనీతి, సుంకాలు, సంస్థానాధిపతుల ధోరణి వీటిలో కొత్త చిక్కులు
కలుగవచ్చు మరియు, ఏకత్వ సిద్ధాంతము నే అంటిపెట్టుకుంటే క్రమముగా

16-5-46 తేదీ ప్రణాళిక పూర్తిగ అమలునకు రావచ్చు ఈ చీలికలు జరిగి నను 'పాకీస్తాను' లో హిందువులు సిక్కులు 'హిందూస్తాను'లో ముస్లిములు చాలమంది అల్పసంఖ్యాకవర్గమువా రుందురు. వారిమధ్య సమస్యలు, కల హాలు, మరియు పాకిస్తాను హిందుస్తానులమధ్య వ్యాసారాదులలో అనేక సంఘర్షణలును కలుగవచ్చు, హిందుస్తాను పూర్ణస్వతంత్రరాజ్యముగా ఏర్ప డినను, పాకిస్తాను దౌర్బల్యము, జిన్నా మున్నగు లీగునాయకుల ధోరణి, బ్రిటిషు లీగుపక్షాల లాలూచీ, ఈ విభజనకు చర్చిలుసమ్మతి వగైరాలబట్టి, పాకిస్తానువారు బ్రిటిషుసామ్రాజ్యపు డొమినియనుగనే ఉందురని తెలిసది. మరియు, నిజాము, జునాగఢ్, భోపాలు నవాబువంటి కొందరు సంస్థానాధి పతులు తమ రాజ్యాలను పాకిస్తానులో భాగముగానో స్వతంత్రనామము తోనో బ్రిటిషుప్రాభవము క్రిందనుండి పోవచ్చు అనగా వీధివారిని దేశము విడచు బ్రిటిషుఅధికారులు దొడ్డిదారిని మరల దేశంలో కొన్ని భాగాలలోనికి దూరుదురు. అప్పుడు 'క్విట్ ఇండియా' సూత్రపు ప్రభావము తగ్గిపోవును. ఏకత్వమే క్షేమకరము. మనమింకా లీగుతో ఓపికతో సంప్రదింపులుసల్పితే, జిన్నాగారు రాజీకిరావచ్చు" అని గాంధీగారి భావములను జాతీయనాయకు లతో తెల్పిరి ఈ విషయములో సోషలిస్టులు గాంధిగారి ననుసరించి భారతీ యైక్యమే కావలెననిరి నెహ్రూ, పటేలు మున్నగు కాంగ్రెసునాయకులు, బలదేవుసింగు మున్నగు సిక్కుప్రముఖులును గాంధిగారితో భేదించిరి. ఏకత్వము సిద్ధాంతరీత్యా ఉత్తమమే. అది మనలక్ష్యమే, కాని, ప్రస్తుతపుకల్లోల స్థితిలో ఆహారాది క్లిష్టతలో, బ్రిటిషు ఉద్యోగులు, వ్యాపారస్థులు సాగించు లాలూచిచర్యలలో, దౌర్జన్యపరిస్థితిలో, బ్రిటిషుప్రభుత్వపు ద్వంద్వధోరణిలో, జనులఆతురతతో, లోపయుతమైనను ఈక్రొత్తప్రణాళిక నొప్పుకొని, సందిగ్ధత వదల్చుకొని హిందూస్తాన్ భాగములోనైన నిజమైన ప్రజాయత్త రాజ్యమును వెంటనే స్థాపించి, దృఢపర్చుకొనుటే మేలు. ఆట్లు చర్చిలుప్రభృతులను నమ్ముకొనిహిందువులపైన ద్వేషమును రేపుచున్న లీగునాయకునితో ఇప్పుడు రాజీమాటలు సాగించుట వ్యర్థమే గాక హానికరము. ఈవిభజనచే హెచ్చు బాధపడు సిక్కులు హిందువులునే దీనిని కోరిరి. దానిని మన్నింపదగును. ఇందువలన బ్రిటిషువారితో కొంత లగవు పరిష్కారమగును సంస్థానాలును సగముపైగా కలసి రావచ్చు. ఇక 'పాకిస్తాను' ముస్లిములకు లాభకారి

కాదని త్వరలోనే ముస్లిములనేతలకు బోధపడగలదు. విభజనవల్ల వారికిని నష్టముండును ఆ యనుభవమునుబట్టి, జిన్నాగారు మనసు మార్చుకోవచ్చు. లేదా, వేరు ముస్లింపక్ష మేర్పడవచ్చు అప్పు డుభయరాజ్యాలు సంప్రదింపులద్వారా కలసిపోయి సమిష్టరాజ్య మేర్పడి భారతీయైక్యము మరల లభించవచ్చు" అని కాంగ్రెసుపక్షపు వాదము. తమ వ్యక్తిగతభావము మార కున్నను, గాంధీగారి క్లిష్టపరిస్థితిలో కాంగ్రెసులో విభేదము కల్గించుట హానికరమని యెంచి, బహుజనాభిప్రాయమునకు తలయొగ్గి, నెహ్రూ, పటేలు, సింగుల నిర్ణయమునకు సమ్మతి నిచ్చిరి దాదాపు ఏకగ్రీవమైన కార్యసమితితీర్మానములను ఇట్లు గాంధీమహాత్ముడు మన్నించి, ఆప్రకారము ఈక్రొత్తప్రణాళికవిషయంలో తమకు అభ్యంతరములేదని వైస్రాయికి తెల్పిరి.

బ్రిటిషుప్రభుత్వపు ఈక్రొత్త ప్రణాళిక మన దేశపు ముఖ్యపక్షాలలో దేనికిని పూర్తిగ తృప్తికరముకాలేదు. ఇది ఒక తుని తగవువంటిది. భారతదేశైక్యమున కిప్పుడు భంగ మేర్పడినను,కొంతభాగమునకైన బ్రిటిషు దాస్యము నుండి విముక్తి త్వరలోనే కల్గునని కాంగ్రెసును, తాము కోరినంత రాకున్నను పంతము నెగ్గి ఏదోరూపములో (త్యాగంలేకుండనే) 'పాకిస్తాను' లభించెనని ముస్లింలీగును, హిందుస్తానులో ఇక ముస్లిం ప్రాబల్య ముండదని హిందూ పక్షపు ముఖ్యనాయకులును, వారి ఆస్తులు పశ్చిమపంజాబులో నున్నను, హెచ్చుమంది సిక్కులకు విముక్తికల్గి సమస్య ఇక సవ్యముగా తేలవచ్చునని కొందరు సిక్కులును ఇట్లు అన్నిపక్షాలవారు సరుకుకొనిరి. ఈ క్రొత్త ప్రణాళిక నొప్పుకొంటిమని వైస్రాయికి నాయకులు తెలిపినారు. అంతట వైస్రాయిగారు చురుకుగ దాని నమలు జేసిరి.

# 79 సంసిద్ధత

'పాకిస్థాను యేర్పాటు తప్పనిసరియైతే దానిని భారతీయులలోని రెండు పక్షాలు పరస్పరం యిష్టంతో సంప్రదించి చేసికొనుట గుడ్డిలో మెల్లయగును. బ్రిటిషువారి పరిష్కారం ద్వారానే విభాగంజరిగితే ఉభయ పక్షాలమధ్య కలతలు హెచ్చును. అల్పసంఖ్యాకవర్గము ప్రమాదస్థితిలో నుండును. మానసికవిచ్ఛిత్తి కలుగును. ఈ పాకిస్తాను తమకు భారతీయ

సౌహార్దంవల్లకాక బ్రిటిషుప్రసాదంగానే లభించినదని పాకిస్తాను నాయకులు యికముందును ఆర్థికాదివిషయములకు బ్రిటిషువారి నాశ్రయించుటయు సంభవించును' అని గాంధిగారు ముందే గ్రహించిరి. కాని అప్పటికే పాకము చెడినది. 15-8-47 లోగా విభజన పూర్తియగుటకు అతివేగంతో బ్రిటిషు అధికారులు సరిహద్దు నిర్ణయాలు, వోట్లు తీసుకొనుట, ఆస్తులు వగైరా పంపకం, ఆర్థికపరిష్కారాలు యిత్యాదులెట్లో సాగించివేసిరి. 15-8-47 నుండి ఈ రెండు రాజ్యాలకు డొమినియన్ స్వాతంత్ర్యము నీయవలెనను కాంగ్రెసు కోరికకు బ్రిటిషుప్రభుత్వ మంగీకరించెను. రెంటికి క్రొత్తరాజ్యాంగము నిర్ణయమగులోగా గవర్నరుజనరలు ఒకడే యుండుట కొంత మైత్రికి సహకారి యగును. పాకిస్తానుకును సమ్మతి కల్గుటకు మౌంటుబాటను ప్రభువే ఇంక కొంతకాలము గవర్నరుజనరలుగ నుండుటకు గాంధిగారి సూచనపై కాంగ్రెసు నాయకులు అంగీకరించిరి. మొదట లీగువారును యిందు కొప్పుకొనియు, తుదకు జిన్నాగారే పాకిస్తానుకు గవర్నరు జనరలు కావలెనని తెలిపిరి. అట్లే గాంధిగారిష్టపడితే ఆయన మన రాజ్యపు గవర్నరు జనరలు అయి ఉందురుగదా ! భారత రాజ్యమునకు మౌంటు బాటనే గవర్నరుజనరలుగ నుండునట్లు త్యాగియగు గాంధిమహాత్ముడు నిర్ణయింపజేసెను. 15-8-47 నుండి ముస్లింలీగు మంత్రులు పాకిస్తాను మంత్రులయిరి. కనుక భారత కేంద్రమంత్రుల పునర్నిర్మాణమును నెహ్రూగారు గాంధి సలహాతో జరిపించిరి. అందులోను మహాత్ముడు గొప్ప ఔదార్యమును, దూరదృష్టిని చూపెను. నెహ్రూప్రధాని విదేశాంగమంత్రి, పటేలు దేశీయమంత్రి, జగజీవనరాం కార్మికమంత్రి, రాజేంద్రబాబు ఆహార వ్యవసాయమంత్రి అగుట సహజమే, కాని మహిళామణి రాజకుమారి అమృతకౌరును, తన సెంతో నిరసించిన నిమ్నజాతుల నాయకుడు అంబేద్కరును కేంద్రమంత్రులుగ జేయించిరి. మౌలానా ఆజాదు, రఫీ అహమ్మద్ కిద్వాయ్ గారలిద్దరు జాతీయ ముస్లింనాయకులు, కేవలం కాంగ్రెసు అభిమానులే గాక సాంఘికమైత్రిపరులు. హిందూ మహాసభా ప్రముఖుడు శ్యామప్రసాద ముఖర్జీ, బ్రాహ్మణేతరపక్షప్రముఖుడు షణ్ముఖంచెట్టి, పారసీవ్యాపారస్థుడు భాభా, క్రైస్తవవిద్యాంసుడు మత్తాయి, పూర్వప్రభుత్వోద్యోగి, పూర్వ దివాను గోపాలస్వామి ఇట్టి అన్నిపక్షాలవారిని, వారి కార్యదీక్షనే ప్రభా

నంగా చూచి కేంద్రమంత్రులుగా నియమించుటవల్ల కాంగ్రెసువారు అధికారమును స్వలాభమునకే వినియోగించరని స్పష్టపడినది.

# 80 కాశ్మీరయాత్ర

ఇట్లు భారతము విభక్తమై స్వతంత్రయాత్ర నారంభించినది. అందులో గాంధిగారు ఎట్టి పదవిని స్వీకరించక, ఈ నవ్యనౌకకెట్టి ప్రమాదములేకుండ కనిపెట్టి ఆయన తపస్సుచేయుచు రక్షణదీక్ష వహించెను. పాకిస్తాను నిర్మాణము తప్పదని తేలగనే కాశ్మీరమిక కీలకరాజ్యం కాగలదని ఆయన గమనించెను. అది మనకెంతో సన్నిహితము, వివిధ రాజ్యాల సరిహద్దున ఉన్నది. పాకిస్తానుకు ఉత్తరపుహద్దు. రెంటికీ ఆయువుపట్టు. దాని రాజు హిందువు. ఆ జనానీకంలో నూటికి ఎనభైమంది ముస్లిములు. వారితరఫున ప్రజాయత్తతకై పదేండ్లనుండి పోరు షేక్ అబ్దుల్లా మున్నగు నాయకులు రాజబందీలై జైలులో క్రుగ్గుచుండిరి. రాజు ఆంగ్లదూతలకు విధేయుడై లీగునాయకులతో తన దివానుద్వారా మంతనాలు సాగించుచు తన నిరంకుశపాలనను దృఢపరుచుకొనుచుండెను. (1946 లో వచ్చిన నెహ్రూను బంధించి వెనుకకు పంపించెను) యిట్టి ప్రవృత్తి జిన్నా గారికి సమ్మతమే, కాని సాంఘికహత్యా పురస్కృతమగు పాకిస్తానుఏర్పాటుతో ముస్లిం ఉద్వేగము జాతీయకల్లోలమునకు తోడై అరాజక మయోమయమగుచుండెను. అప్పుడు గాంధిగారు వెంటనే కాశ్మీరం వెళ్ళి మహారాజుకు తగు సలహాలిచ్చెను. వేదకాల సంస్కృతికి ఆలవాలమై దేవభూమి యనబడి, వసిష్ట విశ్వామిత్రాది ఆర్య మహర్షుల సంచారపూతమైన కాశ్మీరరాజ్యము ప్రజాయత్తమిక కాక తప్పదని ముస్లింప్రజను నమ్మి రాజు తాను త్యాగం జేస్తేనే పాలనఫలం పొందునని "తేన త్యక్తేన భుంజీథాః" అని ఉపదేశించి వచ్చెను. అంతవరకు నిరంకుశుడై స్వైరవృత్తిగల్గిన కాశ్మీర దేశప్రభువున కప్పుడు గాంధిదర్శనంతో బుద్ధి వికసించినది, త్వరలోనే రాజు దివానును మార్చి ప్రజానాయకులు షేక్ అబ్దుల్లా, గులాం మహమ్మదు గారలను ఖైదునుండి విడిపించెను. ఈలోగా కాలచక్రము వేగముతో తిరిగెను. లోగడ సంస్థానరాజు యథేష్టంగా పాలిం

చుటకు తన యిష్టమైన రాజ్యంతో కలియుటకు అభ్యంతరంలేదనిన జిన్నా ప్రముఖులు రహస్యంగా అదిరించి బెదిరించి కాశ్మీరమును కబళించి పాకిస్తాను కధీనం చేయబూనిరని తేలినది. కాశ్మీరమునకు తిండిగింజలు, ఉప్పు, చక్కెర వగైరావస్తువులు వెళ్ళకుండ ఆపుటేగాక ఉద్రిక్తులగు పాకిస్తానీయులను కాశ్మీరంలోనికి రహస్యంగా పంపిరి. పశ్చిమ పంజాబునుండి కాశ్మీరజమ్ము సరిహద్దులోని కొత్తడి హెచ్చినది. సాయుధముస్లింల జట్లు హత్యా వినాశములు సాగించెను. షేక్అబ్దుల్లా వెంటనే ఢిల్లీచేరి గాంధి నెహ్రూలతో సంప్రదించెను. రాజుపైన లోగడ ప్రయోగించిన క్విట్ కాశ్మీర్ మంత్రము నుపసంహరించి రాజు ఆధ్వర్యమందే వెంటనే ప్రజా యత్తపాలన మిమ్మని కాశ్మీరపౌరుల ఆశయములను వ్యక్తపరచెను. రాజు తన ప్రజలపై నిరంకుశపాలనమే సాగించవచ్చు. కాని పాకిస్తానుకు వశంవదు డుకావలె. కాశ్మీరులో పాకిస్తానీయులకు స్వేచ్ఛయుండవలె నని జిన్నా ప్రభుత్వము రాజున కంత్యసందేశము పంపి వాయవ్యసరిహద్దునుండి మన్య పఠానులను కాశ్మీరంలో జొరబడుడని ప్రోత్సహించినది. వెంటనే షేక్ అబ్దుల్లా ప్రధానిత్వంక్రింద ప్రజాయత్తపాలనను (గాంధి నెహ్రూలు సూచించినట్లుగా) కాశ్మీర రాజు స్థాపించియుంటే బలీయమైన ఆ జాతీయ ప్రభుత్వము ప్రజాసహాయంతో రక్షణకార్యాలు సాగించేదే. రాజు అట్లు చేయక నిరంకుశపాలననే సాగించుచు ప్రజాయత్తపాలనం ఏర్పరుచు సలహాను వెంటనే అనుసరించక కాలయాపన చేసెను. తుదకు కొండవిరిగి పైనబడినట్లు పఠాను పాకిస్తానీయుల సాయుధవిప్లవం పైబడి అందులో తన సేన చిక్కుకొని భిన్నభిన్నంకాగా రాజు భారతరాజ్యము నాశ్రయించుటయు, షేక్అబ్దుల్లాను పాలనాధికారిగ నుంచుటయు, తుదకు (1947 అక్టోబరు 26) తప్పలేదు. నిజమైన జాతీయప్రభుత్వం, అబ్దుల్లాకు ప్రధానిత్వం 16-3-48 నాటి కేర్పడినది. గాంధిగా రుద్బోధించిన సాంఘికమైత్రివల్లనే కాశ్మీరంలో సాగు భారతయుద్ధము కొంత జయప్రద మయినది.

# 81 బెంగాలు రంగము

గాంధిగారు 25 యేండ్లు తదేకదీక్షతో సాగించిన అహింసాయుద్ధపు ఫలితంగా 15-8-47 నుండి స్వరాజ్యోదయ మయినది. విభజన తనకిష్టంలేకున్నను తలయొగ్గి ఆ క్లిష్టసమస్యల పరిష్కారమున కాయన ఢిల్లీలో కాంగ్రెసు కార్యవర్గమునకు మౌంటుబాటనుగారికి ఉచితమగు సలహా లిచ్చెను. సరోజనీనాయుడువంటి ప్రముఖులకు గవర్నరు ఉద్యోగాదులను సూచించెను. కాని తన శిష్యులు స్వతంత్రభారతోత్సవమును రాజధాని ఢిల్లీలో జరిగించుచుండ ఆయన ఆయానందోత్సవమునుండి జారిపోయి 15-8-47 నాటికి మరల ప్రమాదరంగ మగుచున్న కలకత్తా చేరెను. ఈ లోగా తూర్పుబంగాళీము పాకిస్తానులో భాగంగా యేర్పడి, అక్కడి ముస్లిములు అంతకుపూర్వంవలె మరల హిందువులపైన దాడి నారంభించిరి. కలకత్తాలోను హిందూముస్లింలమధ్య మరల దారుణరక్తపాత మారంభించి ముస్లింపేటలలో దాడి సాగుచుండెను. పశ్చిమంలోవలె బెంగాలులోను వేలకొలది మరణించి ఆస్తులు ధ్వంసంకాకతప్పవని తోచినది. అక్కడ గవర్నరుగ నియమితుడైన (హిందూముస్లిం సఖ్యపరుడు) రాజాజీయును భయపడుచుండెను. కలకత్తాలో శరణార్థులగు ముస్లింల హాహాకారము పెరిగినది. హిందూప్రాబల్యంగల కలకత్తాలో ముస్లింలకు హింస జరిగితే ఆ ఉద్రేకంవల్ల ముస్లింప్రాబల్యంగల నవఖాలీ వగైరాలలో మరల హిందువులకు హింసజరుగును. బెంగాలులో ఇట్టి సాంఘికహత్యలు తప్పించుటకు అప్పడు గాంధిగారు వచ్చి, కలకత్తాలో ఎక్కువ దౌర్జన్యములు జరిగిన ముస్లిం మొహల్లాలలో ఒకగల్లీలో గతిలేకయున్న ముస్లింజనానీకంమధ్య ఒక ఖాళీముస్లింకొంపలో మకాం పెట్టుకొనెను. హిందూముస్లింలమధ్య శాంతియేర్పడి ముస్లింలు మరల తమ గృహములు చేరు స్థితి కల్గువరకు తా నా ప్రాంతము వదలను, భోజనం చేయను అని వ్రతం పట్టెను. మాజీ బెంగాలు ప్రధాని, లీగునాయకుడు అగు సురావర్దీని తనతో నుంచుకొనెను. అంతట అద్భుతపరిణామము గల్గినది. 1947 సెప్టెంబరులో ఆ ఉపవాసము, సాహససంచారము అమోఘముగా పనిచేసినవి. హిందూ ప్రముఖులందరు ముస్లింల నాదరించి వారికి ధైర్యం కలిగించి మరల వారి పేటలు వారికి అప్పగించిరి. 'హిందూముస్లింలలో భాయీభాయీ' అని

మనఃపూర్వకమైన సహృదయత వ్యాపించినది. రాజాజీ, డా॥ ఘోష్ మున్నగు నాయకులు గాంధిగారి సలహాప్రకారం కృషిచేసి శాంతిస్థాపన చేయించ గల్గిరి. అప్పుడు గాంధిగారు సాహసచర్యతో శాంతి స్థాపింపగల్గుటవల్ల నవఖాలీ మున్నగు తూర్పుబెంగాలు జిల్లాలలో ముస్లింలు శాంతించి అక్కడి హిందువులపైన హింసాచర్యలు మానిరి. ఈరీతిగ ఆయన ఆ ప్రాంత మంతటిలోను కల్లోలము హత్యలు తప్పింపగల్గెను. మరియు బీహారునుండి వచ్చి కలకత్తాదగ్గర చేరియుండిన ముస్లింశరణార్థు లాయన సలహాపైన మరల బీహారులో స్వగ్రామములకు చేరి సుఖపడిరి. అందువల్ల బెంగాలీలకు బీహారు ముస్లింల సమస్య తప్పినది.

# 82 ఢిల్లీలో కల్లోలం

15-8-47 నుండి జిన్నా పక్షీయులు పాకిస్తాను పొందిరి. కనుక యిక వారు లోగడ చెప్పినట్లే సాంఘికమైత్రికి తోడ్పడుదురని, రెండు రాజ్యాలు శాంతంగా ఆహారాది క్లిష్టసమస్యలు పరిష్కరించుకోవచ్చునని నెహ్రూప్రభృతులు తలచిరి. కాని గాంధిగారు అనుమానించినట్లే బ్రిటిషు నియుక్తమగు విభక్త స్వాతంత్ర్యము వచ్చినప్పటినుండియు దౌర్జన్యాలు మరింత హెచ్చినవి. సరిహద్దుతాలూకాలలో ముందుగ నరహత్యలు, ఆస్తి విధ్వంసము జరిగినవి. ఇవి క్రమక్రమముగా పంజాబు అంతట (ఆ పిమ్మట వాయవ్య సింధురాష్ట్రాలలో కొంతవరకును) వ్యాపించినవి. పాకిస్తానులోని హిందూసిక్కులు చాలవరకక్కడ ముస్లింప్రజలకంటె ఆస్తిపరులు. పాకిస్తానులో ముస్లింలకంతయు సుఖకరమై అన్ని సదుపాయములు ఏర్పడునని, వారికి ఆస్తులందు స్వాతంత్ర్యము కలుగునని లీగువారు అంతకుముందు ప్రచారముచేసిరి. అంతట పామరులగు గూండాలు చెలరేగిరి. తూర్పు పశ్చిమపంజాబులలో సుమారు ఏకకాలమందే ఆరంభించిన యీ దౌర్జన్యాలు విపరీతముగ పెరిగినవి. వేలు, లక్షలు, జనులు హాహాకారములు చేయ, ఆస్తులు కుటుంబములు ధ్వంసమయి పాకిస్తానునుండి ఢిల్లీప్రాంతమునకు చేరి పాకిస్తాను హిందూసిక్కులకు నరకముగనున్నదని ఘోషించిరి. ఢిల్లీప్రాంతంలో

నూటికి 40 మంది ముస్లింలు. ఈ దుఃఖవార్తలు విని ఉద్రిక్తులై హిందువులు ముస్లింలపైన హింసాచర్యలు సాగించిరి. పాకిస్తాను ముస్లింరాజ్యము, హిందుస్తాను హిందూరాజ్యమని జిన్నా ప్రభృతులేచెప్పిరి. పాకిస్తానునుండి హిందూ సిక్కులందరు ఆస్తులు వగైరా పోగొట్టుకొని నిరాశులై నిర్వాసితులైనారు కనుక ఈప్రాంతంలో ముస్లింలుండగూడదని కొందరు హిందూసభాపక్షీయులు, సిక్కులును ముస్లింలపైన దౌర్జన్యము సాగించి, వారి యిండ్లలోను మసీదులలోను పంజాబు శరణార్థులను కాపుర ముంచిరి. ఆ ముస్లింలు భీతిల్లి తమ గల్లీలు వదలిరి. ఉభయపక్షాల గూండాలు అల్లరులు సాగించిరి. రహదారులు వ్యాపారముగూడ స్తంభించినవి. వీధులలో ప్రాణభయ మేర్పడియు, బండ్ల రాకపోకలు నిల్చియు కేంద్రప్రభుత్వపు కార్యమును స్తంభించినది.ముఖ్యప్రభుత్వ కేంద్రమిట్లు ప్రమాదస్థితికి వచ్చి, అగ్నిభయమును రోజురోజు పెరుగుచు ప్రజలకు తిండిగింజల సరఫరా నిల్చిపోయినది. ఇట్టి స్థితిలో దొంగబజారు విపరీతంగా పెరుగుట సహజమే, ప్రధాని నెహ్రూ అంతటివాడు స్వయంగా రేషను కొట్టుకొకసారి వెళ్ళి యితరులకు రేషను నిప్పించి తనకును తెచ్చుకోవలసిన పరిస్థితి యేర్పడెను. కేంద్రమే యిట్లుకాగా సాంఘికతత్వపరుల కలుసు చిక్కినది. వారు ఢిల్లీలోనే బహిరంగంగా విషప్రచారం దౌర్జన్యం సాగించిరి. ముస్లింలు ఢిల్లీప్రాంతంలో వసించుట ప్రమాదకరమని ఘోషించిరి. జవాహర్లాలువంటి ప్రతిభాయుతసాహసియు నిర్విణ్ణుడై, బ్రిటిషు ఫైసలాద్వారా విభక్తరాజ్యమును కంగీకరించుట తప్పేయన్న గాంధిగారి మాటను స్మరించి దిగ్భ్రమ జెందెను.

# 83 శాంతిస్థాపన

ఈ స్థితిలో గాంధిగారు కలకత్తానుండివచ్చి బీహారులో ముస్లింలకు వసతిగల్గించి అచటినుండి పంజాబులో జరుగు దారుణములను తగ్గింపజేయుటకాప్రాంతమునకని బయలుదేరి దాని దేహళి ఢిల్లీలో దిగిరి. మహాత్ముడు ఢిల్లీ చేరెనని తెలియగనే నెహ్రూ "యజమాని వచ్చినారు, యిక మార్గ మేర్పడును" అని ధైర్యమువహించి ఆయనను దర్శించెను. ఢిల్లీలో పరిస్థితి విష

మించెనని తెలిసి గాంధిగారు పంజాబు ప్రయాణము నప్పుడు మానుకొని, వెంటనే ముస్లిం హిందూ ప్రముఖులను వెంటతీసికొని వారితో ముస్లింజనావాసములకు వెళ్లి, వోదార్చి, ధైర్యంచెప్పి, ముస్లింమొహల్లాలలో శాంతిని స్థాపించెను. ప్రతిరోజూ చాలచోట్ల సభలుచేయించి, సాంఘికమైత్రిని బోధించి, మానవరక్షణయే నిజమైన ధార్మికతయని నిరూపించి శాంతిరక్షణ దళములను నగరమంతట నేర్పరచెను. హిందూ ముస్లిం మిత్రులచే జంటగ నన్ని వీధులలో ప్రచారముచేయించెను. ఆలయాలలో, మసీదులలో సమిష్టి రక్షణ నేర్పరచెను. ప్రతిసాయంకాలము సభలలో సర్వమత ప్రార్థనసాగించి రోజూ ప్రజాక్షేమకరమగు ఉద్బోధనల జేయుచుండెను. అవి వేదవాక్యములవంటివి అంతట మరల నెట్లో శాంతియేర్పడి ఢిల్లీలో ప్రజల నిత్యకృత్యములు, సాంఘికజీవనము సాఫుగ నడచుచు మామూలుస్థితి యేర్పడినది. కేంద్రప్రభుత్వము ఢిల్లీసమస్యనుగూర్చి వ్యాకులతలేకుండ జాతీయసమస్యల మీద దృష్టి నుంచ వీలేర్పడెను.

# 84 అంత్యోపవాసము

ఢిల్లీ తూర్పుపంజాబులలో నిట్లు కొన్నివారాల కెట్లో శాంతియేర్పడినది. కాని, పశ్చిమపాకిస్తానులో రాక్షసకృత్యాలు నానాటికి పెరుగుచునే వచ్చినవి. అక్కడిస్థితి ప్రభుత్వోద్యోగులవశంగూడ తప్పినది. షుమారు 45 లక్షలు ప్రజలు సర్వస్వం కోల్పోయి, తండోపతండములుగా పాకిస్తానునుండి హిందూస్తానుకు వచ్చి చేరుచున్నందున వారికి వసతి, వృత్తికల్పించుట మహాసమస్యఅయినది. ఢిల్లీసమీపమందే పానిపట్టు, కురుక్షేత్రాదులలో వేలకొలది శిబిరము లేర్పరచిరి. గాంధిగారు ఆ చుట్టుపట్లకు స్వయంగా విచ్చేసి, వారి నోదార్చి సాంఘికోద్రేకం చల్లార్చుచుండెను. మహాత్ముని యీప్రవృత్తి కొందరికి మనస్తాపం కల్గించెను. పాకిస్తానులో ఎన్నియో గుళ్లు, గోపురములు హిందూసత్రములు, సిక్కుగురుద్వారాలు ముస్లింగూండాల వశమైనవని, స్త్రీలు పిల్లలు చెరబెట్టబడిరని శరణార్థుల వదంతులు విని కొందరు హిందూ సిక్కు ప్రముఖులు అందుకు ప్రతిక్రియగ ఢిల్లీమసీదులను వగైరాలను వశమం

దుంచుకొని ఖాళీచేయక ముస్లిములపైన దౌర్జన్యప్రచారమును సాగించిరి. కొందరు హిందూ క్షేమపరులు, దేశభక్తులు అగువారు యిట్టి కుతంత్రముల చేయుట కనిపెట్టి విషాదవశుడై గాంధిమహాత్ముడు హఠాత్తుగ ఆత్మపరిశుద్ధి కని 12-1-48 నుండి దీర్ఘోపవాస మారంభించెను. ముందుగ ఎవరికిని తెలుపలేదు. 'యింతకాల ముపవాసము, ఫలానావరతులపైన దానిని మానుదును' అని చెప్పలేదు అంతట నెహ్రూ అజాదు ప్రభృతులు ప్రశ్నించగా "ఢిల్లీలో యిప్పుడున్న శాంతి సేనకు పోలీసులకు భయపడిఏర్పడినదే కాని హృదయపరివర్తనవల్ల కాదని నాయాత్మకు తోచినది. ముస్లిములస్థితి దుర్భరంగా నేయున్నది. ఇట్టి దారుణహింసాతత్వపు లోకంలో జీవించుట కిష్టంకాకున్నది" అని ఆయన జవాబు యిచ్చెను. అంతట నిజమగు హృదయపూర్వకశాంతి యేర్పడకుంటే గాంధిగారి ప్రాయోపవేశము తప్పదు అని నెహ్రూ అజాదు యిత్యాదులు గ్రహించిరి. ఈ ఉపవాస సమయంలోను ఆయన హిందూముస్లిం సఖ్యపుకృషి నిరంతరము చేయుచునే యుండెను. మిత్రులఒత్తిడిమీద తుదకెట్లో ముస్లింలకు న్యాయంజరిగించునట్లు హామీగా 7 షరతులు గాంధిగారు చెప్పిరి. * వాటినిసాగించి అమలు చేతుమని హిందూ ముస్లిం ముఖ్యులందరు నిజమైన పశ్చాత్తాపముతో లిఖితరూపకంగా వాగ్దానమిచ్చిరి. పరిస్థితులు కొంత బాగుపడెను. దేశమంతట అద్భుతసంచలనము కలిగి సాంఘికమైత్రి బలపడినది. అంతట గాంధిగారి అమూల్యజీవితమున కెట్టి భంగమురాకూడదని, కనుక వెంటనే ఉపవాసం మానివేయవలెనని ముస్లింనాయకులును పట్టుపట్టిరి. అంతట ఆరవరోజున అజాద్ చేతినుండి నారింజరసమునుతాగి ఆయన ఆ ఉపవాసమును మానెను.

---

*ఢిల్లీలో హిందూ సిక్ఖులాక్రమించిన 117 మసీదులనువారు ఖాళీచేసి ముస్లింలకందించవలె, ముస్లిం ఉత్సవాలు జరిగించనీయవలె, ముస్లిం పేటలలో మరల వారిని స్వేచ్ఛగా తిరుగనీయవలె, ఢిల్లీవదలిపోయిన ముస్లింలు మరల వచ్చుటకు తగు ధైర్యసాహసాలు కల్పించవలె, తురకదుకాణములపై ఆంక్ష మానవలె, రైళ్లలో ముస్లింలను బాధించగూడదు.

అప్పటికి మహాత్ముడు యితరుల దోషములకు శుద్ధిపరిహారముల నిమిత్తం 16 సార్లు దీర్ఘోపవాసములు చేసెను. ఇందులో రెండు దక్షిణాఫ్రికాలో ఆశ్రమవాసుల లోపాలకుగాను చేసినవి. మనదేశంలో 1918 లో అహమ్మదాబాదు కార్మికులలో హృదయపరిణామం తెచ్చునిమిత్తం, 1919 ఏప్రియల్ లో రౌలటుబిల్లు ఆందోళన దౌమ్మ్యాకి, 1921 లో బ్రిటిషు యువరాజు బహిష్కారంలో దౌర్జన్యము జరిగినందుకు, 1922 లో చౌరీ చౌరా అల్లరుల సందర్భములో, 1924 లో హిందూముస్లిం కలహాలు పోగొట్టుటకు ఢిల్లీలో, ఆపిమ్మట సబర్మతీ ఆశ్రమములో విద్యార్థుల లోపాల శుద్ధికి, 1932 లో సవర్ణసత్యాగ్రహులకు జైలులో పాకీపని చేయు అధికారం యిచ్చే నిమిత్తం, 1933 లో హరిజనుల ఎన్నికగూర్చిన బ్రిటిషుప్రధాని తీర్పురద్దుకు, మరల హరిజనోద్యమ సందర్భములో మరి రెండు సార్లును, 1934 లో సనాతన వాదిని వాలంటీరు కొట్టినందుకు విచారసూచకంగా, 1939 మార్చిలో రాజకోటలో ప్రజాయత్త పాలనకు, 1943 ఫిబ్రవరిలో బ్రిటిషు అసత్య ప్రచారం ఖండించుట కవకాశం నిమిత్తం, 1947 సెప్టెంబరులో హిందూ ముస్లిం మైత్రి నిమిత్తమును ఆయన దీర్ఘోపవాసములుచేసి సఫలత పొందెను.

# 85 నిర్యాణము

గాంధిగారి ప్రతిఉపవాసంలోను హృదయమంథనము జరిగి అనన్యసాధ్యమగు సత్పరిణామాలు గల్గుచుండెను. 1947 లో కలకత్తాలోను, 48 లో ఢిల్లీలోను స్వతంత్ర భారతంలో ఉపవాసములు జరిగినవి. ఈ ఢిల్లీ ఉపవాసమువల్ల హిందుస్తాన్ పాకిస్తానులలోని హిందూముస్లిం లందరిలోను ఖండాంతరాలలోని శ్వేతజాతులలోగూడ అద్భుతసంచలన మేర్పడి జాతిద్వేషము చాల అనర్థకరమని బోధపడినది. అయితే సముద్ర మంథనంలో అమృతముకంటె ముందు విషమే పుట్టినదట, యిప్పుడును అట్లే అయినది. గాంధిగారు యిట్లు ఉపవసించి ముస్లిములక్షేమం కాపాడుట కొందరు హిందువులకు అసహ్యమనిపించినది. కొందరు గాంధిగారినిగురించి తీవ్రమగు విమర్శన సాగించిరి. హిందువులకు పూర్తి ఆధిపత్యం కావలె,

ముస్లింల కిక్కడ రక్షణ నిచ్చుటకుగాను గాంధిగారు హిందూసంఘ ప్రాబల్యమును నిరోధించుచున్నారని ఆక్షేపణసాగినది. కొందరు సంస్థానాధిపతులు, పూంజీపతులు కాంగ్రెసుమీద కోపంగలవారును గాంధిగారి సాయంకాలోపన్యాసములలో నిశిత విమర్శలకు గురియైరి. మరియు పాకిస్తానులో లీగురాజ్య మేర్పడినట్లే హిందుస్తానులో హిందూసభాప్రముఖులే రాజ్యంచేయునట్లు ఒత్తిడి కావలెనని కొందరు కోరిరి కాని అచంచలుడగు గాంధిమహాత్మునియందు ప్రజలకు అభిమానము ఉన్నంతకాలము ఏ ఎన్నికలోను తమ ఆటలు సాగవని వారికి నిరాశయే. ఆయన కాంగ్రెసులోను ప్రభుత్వంలోను ఎట్టి పదవి లేక యున్నను, దేశమున ఆయన ఖ్యాతి హెచ్చుచున్నది. కనుక ఆయన జీవించుటే తమకు అనర్థకమని వీరు భావించిరి. ఆయనకు 79 ఏండ్లవయస్సు. ఎన్నియో కష్టాలపాలై, నిరంతర ప్రజాసేవలో నిమగ్నుడైనను, ఆయన ఆరోగ్య మేమాత్రముచెడక అద్భుతమైన శక్తితో చూపట్టుచుండెను. ఇక వారు కార్యసిద్ధి పొందుటెట్లు? ఢిల్లీలో తనతో సంప్రదించుటకు నిత్యం నెహ్రూ మొదలు వేలకొలది జనులు వచ్చుచున్నందున అందరిసౌకర్యం నిమిత్తం హరిజనవాడకు బదులు గాంధిగారీసారి బిర్లాభవనంలో బసచేసిరి. దాని పెరటిభాగంలోనే సాయం ప్రార్థనలను, ఉపదేశములను సాగించుచుండెను. 20-1-48 సాయంకాలము ఇట్లు ఆయన ప్రసంగించుచుండగా సమీపములో ఒక బాంబు ప్రేలినది. అంతట జనులు ఆందోళనపడిరి మహాత్ముడావిషయంలో ఉదాసీనతను వహించెను. బాంబువేసిన యాతడు తనకై వేచియున్న కారునందుకొనులోగా పట్టుబడెను. అదిచూచి కారులోనివారు కారుదాటించి తప్పుకొనిపోయిరి. అప్పటినుండి బాపూజీరక్షణకు ప్రత్యేకపు పోలీసులను ఏర్పాటుచేసిరి. ఢిల్లీలో శాంతియేర్పడినది. ఇక ఆయన పాకిస్తానులో సాంఘికమైత్రిని సాధించుటకు లాహోరు వెళ్ళదలచెను. గాంధి పరివారంలోని డాక్టరు సుశీలానయ్యర్, ప్యారీలాలు ఇత్యాదులు అంతకుముందే లాహోరుచేరిరి. ముస్లింలలోను అనేకులాయనను పాకిస్తానుకురమ్మని ఆహ్వానించిరి. జాతీయ ముస్లిములేగాక లీగునాయకులలో సురవర్దీ, నవాబు ఇస్మాయిలు మున్నగు కొందరాయనతోసహా సాంఘిక సఖ్య సాధనకై పాకిస్తానుకు వెళ్ళుట కాయత్తులైరి కాని, గాంధిగారి కొక చిక్కువచ్చెను.

ఇటీవల ఆయన సమావేశాలకు ముస్లిములు హెచ్చుమంది వచ్చి గాఢాభిమానమును చూపిరి. పాకిస్తానులో తన ప్రయాణమిక జరుగుటకు సందేహము లేదు. మరియు లాహోరు, రావల్పిండిప్రాంతంనుండి కాశ్మీరు జమ్మూల లోనికి సాగుచున్న దాడి, దౌర్జన్యములును గాంధిగారి రాకవల్ల తగ్గిపోవును; అయితే పాకిస్తానులో గాంధిగారి సమావేశాలు జరిగితే లీగు ప్రాబల్యము తగ్గునని ప్రజోత్సాహము ఉద్రేకరూపమెత్తునని, లీగు అధ్యక్షులగు జిన్నాగారి ప్రభుత్వమునకు కష్టంతోచవచ్చు. పాకిస్తాను, హిందుస్తానులమధ్య మైత్రి సామరస్యం హెచ్చించుటే గాంధిగారి ప్రయాణపు సంకల్పము. కనుక, పాకిస్తాను ప్రభుత్వము అధమం లీగు సంస్థవారైనను) సమ్మతిస్తేనే తానక్కడికి వత్తునని తెల్పివారి సమ్మతికోరెను. ఎన్నినాళ్లకును జవాబు రాలేదు. అందుకై ఇంకను వేచి ఢిల్లీలోనే యుండుటకన్న ఈలోగా వర్ధాలో తన రాకకై నిరీక్షించు నిర్మాణ కార్యకర్తల సమావేశమునకు ఫిబ్రవరి 2 వ తేదీని ఆయన వెళ్ళదలచెను. ముందుగ ఏర్పాటులకని రాజేంద్రబాబు వర్ధాచేరెను.

30-1-1948 మధ్యాహ్న మొకరాయనను వర్ధాకు, పాకిస్తానుకు ఎప్పుడు వెళ్ళుదురు ? అని ప్రశ్నింపగ, "ఏమో తెలియదు. ఏమిజరుగునో అంతయు ఈశ్వరాయత్తం"అని జవాబిచ్చెను. ఆ సాయంకాలం కొందరు ముస్లింనాయకులతో, పిమ్మట పటేలుగారితో సంభాషించి, ఆయన ప్రార్థన స్థలమునకు వెళ్ళిరి. యథాప్రకారం చాలమంది ఆయన రాకకై నిరీక్షించి యుండిరి 5¼ గంటలకాయనవచ్చి వేదిక నెక్కుచుండెను. ఖాకీడ్రెస్సుతో నొక యువకుడాయన యెదుట వచ్చి మెట్లక్రిందనుండి తా మాలస్యంగా వచ్చిరే, అని పలకరించెను. "అవును" అని చిరునవ్వుతో మహాత్ముడు ప్రతి నమస్కారం చేసెను. ఇంతలో ఆ వ్యక్తి కొంచంవంగి జేబునుండి రివాల్వరు తీసి తప్పుకొను వ్యవధిలేకుండ వరుసగా నాలుగుసార్లాయన కడుపుపైన పేల్చెను. రెండుగుండ్లు కడుపులో దూరెను. మూడవది హృదయమునకే తగల మహాత్ముడు "హేరామ్ హేరామ్" అని చేతులుజోడించి తూలి పడెను. ప్రక్కనున్న మనుమరాలు మనుగాంధియు, మనుమనిభార్య ఆభా గాంధియు ఆయువకుడు బాపూజీపాదముల స్పృశింప వంగుచుండెనని మొదటభావించి యేమరియుండిరి. గుండుదెబ్బచూచి పడిపోవు బాపూజీ

సెట్లో వారు పట్టుకొనిరి. ఇంతలో జనులందరు విహ్వలులై గుమిగూడిరి. రక్తస్రావము హెచ్చినది. ఎట్లో గృహంలోనికి గొనిపోయిరి. ౫-౧౭ గం॥లకు నిర్యాణము జరిగెను.

ఈ ఘోరవార్త రేడియోద్వారా పావుగంటలో ఖండాంతరములకును వ్యాపించెను. కేంద్రమంత్రులు, ముస్లింనాయకులు, రాజకీయప్రముఖులు, పౌరముఖ్యులందరు బిర్లాభవనం చేరిరి. ఆ శుచిస్మితం, ప్రశాంతముఖం, దేహకాంతి, చర్మపు నిగనిగ మరునాటికిని పోలేదు. మహాత్ముడు సుఖనిద్రలో నున్నట్లే తోచెను కాని అది అంత్యనిద్ర.

మహాత్మునకీరీతి హత్యావసాన మగునని ఎవరును ఊహించియుండలేదు. దక్షిణాఫ్రికాలో శ్వేత ప్రతికక్షులు జరిపిన దొమ్మీలలో, పూనా ప్రాంతపు అంబేడ్కరీయులైన మూర్ఖ హరిజనులదాడిలో, దారి తెన్నులేక తేళ్ళు పాములు చరించు దుర్గమమార్గాలసంచారములో, శత్రువులు కత్తితో పైబడినప్పుడు, నవఖాలిలో విరోధులగు ముస్లింలీగువారు చుట్టుముట్టిన ఏకాంతప్రదేశాలలోను, డాక్టరులు నిరాశపడిన దీర్ఘోపవాసములలోను చెక్కుచెదరని అజాతశత్రువగు ధీరశిరోమణి మహాత్మునిజీవితము ఢిల్లీలో తన భక్తుడైన బిర్లాగృహాంగణములో సాయంసంధ్యవేళ భక్తులమధ్య ఈ రీతిగ అంతమొందునని ఎవరూహింపగలిగిరి? కాని అది ఈశ్వరేచ్ఛ ఇంకను భద్రత కెక్కువ శ్రద్ధ నధికారులు వహించకుండుట లోపమని, ఇట్టికుట్రలు ముందుగ భేదింపలేకుండుట అసమర్థత యని కొందరనిరి సాంఘికద్వేషం చెలరేగుచు, బహుజాతిమిశ్రితమై, కల్లోలయుతమైన ఢిల్లీనగరంలోనే దుష్టత భేదించుచు అగ్నిలోదుముకు మహాత్ము నుండనిచ్చుట తగదని కొందరనిరి. పిమ్మట జ్ఞానవ తులగుట సులభముగదా! మహాత్ముడు తన ప్రార్థనలలోనికి వచ్చువారిని సోదాచేయుట కూడదనెను. హంతకుడా విషయమును కనిపెట్టెను. ఆ మరణరాత్రియంతయు జనప్రవాహము బాపూ దేహమున కంత్యపూజ సల్పుచుండిరి. మరునాడుదయం స్పెషల్ శకటంలో దేహము లక్షల కొలది జనులతో మౌంటుబాటను, నెహ్రూ, పటేలు, ఆజాదు, రాజేంద్రాదులనుసరింపగా, సర్వదిశలనుండి పుష్పవర్షము కురియుచు, జనులందరి కన్నీరు కాలువలగుచుండగ యమునాతీరపు రాజఘట్టమునకు చేర్చబడెను ప్రియపుత్రులు, దేవదాసు రామదాసులు అంత్యేష్టి జరిపిరి. "మహాత్మాజీ అమర్

హో-గయే, గాంధీజీకీ జై" అను కేకలు మిన్నుముట్టినవి. రాజధానినగరములో ప్రాణమిచ్చిన గాంధిజీ కిట్లు చక్రవర్తికన్న హెచ్చుగౌరవంతో ఉత్తర క్రియలు జరిగినవి.

భారతజాతి జనకుని మృతికి శోకసూచకంగా మన ప్రభుత్వం, పాకిస్తాను సర్కారు, పతాకాలను 14 రోజులు అవనతంచేసిరి. బర్మా సింహళాదులేగాక సంయుక్తజాతి సమితివారును న్యూయార్కులో సర్వజాతి పతాకము నిల్పేదించిరి. భారతపాకిస్తానునాయకులేగాక అమెరికా, బ్రిటను, రష్యా, ఫ్రాంసు, తురుష్కరాజ్యాలు మున్నగు ప్రపంచపు నాగరిక రాజ్యాలన్నిటి పాలకులు, నాయకులు, విజ్ఞానవేత్తలు, తమ సంతాపమును వెలిబుచ్చిరి. అస్థినిమజ్జనక్రియ అనితరసాధ్యమగు మహావేశంతో 20 లక్షల మంది సర్వమతవర్గాల భారతీయుల శ్రద్ధాంజలితో సహా విమానాలు పుష్పములు వర్షించుచుండ ప్రయాగతీర్థంలో అద్భుతంగా జరిగినవి. గాంధిగారి అస్థికలలో (బుద్ధునకువలె) కొన్నిమాత్రం మహాత్మునికి స్మారకంగా భద్రపరచబడినవి. బర్మా, సింహళాదులలో అనన్యగౌరవంతో చితాభస్మము పవిత్రజలంలో కలుపబడినది.

మహాత్ముని జ్ఞాపికలుగ రాజఘట్టం ఇత్యాదులలో భవనాలు నిర్మించుటే గాక చాలచోట్ల వివిధసంస్థలకు, రాజమార్గాలకు, నగరములకు ఆయన పేరు పెట్టుట, ఆయన శిలావిగ్రహాలను స్థాపించుట ఇత్యాది స్మారకములు జరిగినవి, జరుగుచున్నవి. ప్రభుత్వ న్యాయభవనా లన్నింటిలో గాంధి మహాత్ముని చిత్రపటము లుంచునట్లు ప్రభుత్వమువారు నిర్ణయించినారు. హిందువులు, ముస్లిములు, రాజులు, ప్రజలు, పూంజీపతులు, బీదలు అను భేదములేకుండ అశేషజనులు ఏకకంఠంతో గాంధీజీ లోకోత్తరపురుషుడని గుర్తించి అనుతాపంపొందినారు.

# 86 ఆత్మార్పణం

ఇట్టి సత్యసమానుడు, అహింసాప్రవక్త, లోకక్షేమంకరుడునగు పరమ పవిత్రుని జీవిత మిట్లు హంతకునిద్వారా అంతమయినదని ఉద్వేగము గల్గుట సహజం. ఆయనకు తగినరక్షణలేదని వాపోవుట వ్యర్థము తక్షకునుండిమరణము

తప్పించుకొనుటకుపూర్వం పరీక్షిత్తుచక్రవర్తి ఏ ప్రమాదమునకు అవకాశము లేకుండఅన్నికట్టుదిట్టములు చేసినను, ఒకవిప్రవర్యుడిచ్చినఫలంలో కీటక ముద్భవించిపొరాత్తుగతక్షకుడై కాటువేసెనని, తక్షణముమరణము కల్గెనని ఇతిహాసము చెప్పుచున్నది. ఉత్తమపురుషుల ఉజ్జ్వలజీవితము లిట్లు అంతమొందుట లోకచరిత్రలో జరుగుచునే యున్నది శ్రీరాముడు సరయూనదిలో నంతమొందెను. శ్రీకృష్ణుడు తపోనిష్ఠలోనుండి, వ్యాధుని బాణము తగిలి జీవితం చాలించెనట విజ్ఞాని, ప్రముఖుడు, మహాతత్వజ్ఞుడు అగు సోక్రటీసు తత్వప్రచారం చేసినందుకు శిక్షగ ప్రభుత్వముచే మరణశిక్షనొంది విషమును స్వహస్తముతో తాగి అంతమొందెను. ఎందరో విజ్ఞానవేత్తలు యూరపులో ప్రకృతినిగూర్చి సత్యప్రచారం చేసినందుకు కట్టి ప్రాంణాతపు ఫలమనుభవించిరి. ఏసుక్రీస్తు ప్రేమ, సత్యము ధర్మములను బోధించిన ఫలంగా ప్రభుత్వముచే కొరతవేయబడి జీవితమును చాలించెను. అమెరికా అధ్యక్షుడు అబ్రహాము లింకను బానిసల స్వాతంత్ర్యమునకై ఘోరయుద్ధము సాగించి జయమొందినప్పుడు మహాసభలో హంతకునిచే కాల్చబడెను. ధర్మప్రచారకుడు స్వామి శ్రద్ధానందుడు ఢిల్లీలో నిట్లే హత్యచేయబడెను. ఇవి దుర్మరణాలనుట తప్పు. ఈ మహాత్ముల జీవిత సందేశముల నప్పటి జనులు గ్రహించి ఆచరింపనంత నిర్భాగ్యులయిరి.

లోకక్షేమకరమగు బాపూజీ ప్రేమసందేశమును పామరులు, విద్యావంతులుగూడ గ్రహించి ఆచరించుస్థితిలోలేరు. 78 ఏండ్లవయస్సున్నను స్థితప్రజ్ఞత అద్భుత నిగ్రహజీవితంవల్ల ఆయన యువకులకుండు ఆరోగ్య కలిగి నిరంతరం అతిశ్రమకరమగు కార్యక్రమమును ప్రీతితో నెరవేర్చుచుండెను. ఎట్టి క్లిష్టసమస్యలలోను నెహ్రూ, పటేలు వగైరా లందరికిని ఉత్తమ సూచనలిచ్చు మనశ్శక్తితో నుండెను. హృదయవిదారకమగు దుఃఖపరిస్థితుల లోను పాల్గొనుచు హృదయశక్తి, ప్రసన్నత, చెదని ఆత్మబలము కలిగి సర్వత్ర ప్రేమభక్తులు ప్రసరింపజేయుచు, లోకహితకార్యముల జేయుచుండెను. లోకంలో జరుగు వైకల్యములు, హింసాప్రవృత్తులు, విషప్రచారము చూచుచు జీవింపదలచలేదని, 125 ఏండ్లు జీవించు సంకల్పముపోయినదని అంతకుముందె ఒకరికాయన తెల్పెను.

పశ్చిమపంజాబులోజరుగు క్రూరహింసలనుసహింపలేక కొందరు గాంధీ వాదులును, ఆప్రాంతం వదలి విచ్చేసిరి. వారుకార్యరంగమందే ఉండి ప్రమాదము లెదుర్కొనుట ఉత్తమమని ఆయన వచించెను. అప్పుడొక జాతీయవాదియే గాంధిగారిని "మహాత్మా! తమఉపదేశము సరియేకాని అది ఆచరణసాధ్యమని తాము క్రియలో నిరూపింతురా?"అని కోరెనట అంతట "హింసాప్రచారము నెదుర్కొనుకృషి నేనిప్పుడు చేయుచున్నాను, పంజాబు వచ్చుట కాతురపడుచున్నను, సమయమింకను రాలేదు, ఈలోగా హింసా తత్వంతోపోరి దాని నరికట్టుటే నా కర్తవ్యము. అట్లు పోరు నేను సాగించు టలో నా జీవితము ఆహుతి కావలెననియే నాఉత్తమవాంఛ. అట్లుజరిగితే నే నా జీవితప్రవృత్తియంతయు బోధనానుసారియై సఫలమగును. అట్లు జరి గించి నన్ను ధన్యజీవినిగ జేయుమనియే నేనీశ్వరుని ప్రార్థింతును. కాని, నాయంతట నే మృతికై ముందుకురుకుట అహంకారమగును. కనుక అందుకై నేను త్వరపడుటలేదు నా ప్రయత్నము సాగుచుండగ ఈశ్వరుడే సుసమ యంలో నాకు అట్టి సంఘటనను ప్రసాదించుగాక" అని గాంధిగారు జబా బిచ్చిరట తుదకు భగవంతు డట్టి కోర్కెను పవిత్రప్రార్థనసమయంలోనే నెరవేర్చగా, ఆత్మాహుతితో ఆ జీవితపు మహాయజ్ఞము పూర్తియయినది. (సంసార సంబంధం వదలుకున్న సన్యాసుల కర్తవ్యమును చెప్పుటలో, వారు తమ జీవితము నెట్లో పొడిగించుకొనుటకును ఆశింపకూడదు, త్వరగా మృతిజెందుదమనియు ఆశింపకూడదనియు, ప్రభువుఆజ్ఞను నౌకరువలె, కాలపురుషుని యుద్దేశమునే ప్రతీక్షించవలెనని మనువచనము కలదు. 'నాభి నందేత మరణం నాభినందేత జీవితం। కాలమేవ ప్రతీక్షేత నిర్దేశం భృతకో యథా'॥ మనుస్మృతి 6-45)

# 87 హత్యా సందర్భం

గాంధి నెల్లైన హత్యచేయుటకు కొందరు గూఢంగా యత్నించు చున్నట్లు అప్పటికి కొన్ని నెలలనుండి సూచనలు వచ్చుచుండెను. ముస్లింలీగు పక్షీయులకు బదులు, కొందరు హిందువులే క్రోధవిషం గ్రక్కుచుండిరి

ముఖ్యంగా ఢిల్లీలో ముస్లిములకు హిందూ సిక్కులు న్యాయం జరిగించవలెనని పాకిస్థానుసర్కారువారికి వెంటనే 50 కోట్ల రూపాయల బాకీ మన భారతప్రభుత్వ మిచ్చివేయవలెనని, ప్రతిక్రియాపద్ధతులు మానుమనియు, సర్కారుకు, ప్రజానాయకులకు ఆయన ప్రోద్బలమిచ్చుటను కొందరు హిందూప్రముఖులు సహింపకుండిరి. ఢిల్లీలో సాంఘికోద్రేకము పొంగుచున్నట్లు గ్రహించి ఆయపాయస్థలము వెంటనేవిడచి వర్ధాప్రాంతమునకుపోయి అక్కడి ఆవశ్యక కార్యాలు చేసుకొమ్మని, ఎందరో ఆయనకు సూచించిరి, వర్ధాలో ఆయనకు కొంత నిర్మాణకార్యక్రమము తయారయియుండెను. మరియు, ఆహత్యకు పదిరోజులముందే అనగా 20-1-48 తేదీ సాయంకాల ప్రార్థనలో బిర్లాభవనములో ఆరంగంలోనే మదనలాలు ఒకరకపుబాంబు నాయనకు కొన్నిగజాలదూరంలో పెట్టి అంటించెను. అది ప్రేలి ఘోరశబ్దం చేయగనే, ఆ దుష్టుడు అరెస్టుచేయబడెను. కాని మిగిలిన కుట్రదారులు కారులో తత్క్షణం దాటుకుపోయిరి. అప్పుడు ప్రార్థనసభలో అలజడి జరుగకుండ ఆయన కాపాడినందున, ఆయన నప్పుడే పేల్చివేయ వేచియుండినవారప్పుడు విఫలులైరి. అప్పుడు గాంధీగారు ఇట్లు వచించిరి, "ఇందులో నాఘనతి యేమీలేదు. బాంబువేసిరని అప్పట్లో నాకు తెలియలేదు. ఇంతకూ ఆ ప్రయోక్త ఉద్దేశమేమో ? ఆ హంతి నాయెదుట నిల్చి ఆయుధమును నాపైన ప్రయోగిస్తే దానిని గ్రహించియు నేను జంకక అతనిని ద్వేషింపక చిరునవ్వుతో నా ప్రాణమిచ్చియుంటే, నన్ను ప్రశంసచేయవచ్చు. అది అహింసకు తుదిమెట్టు," కాని త్వరలోనే గాంధీకి అట్టె చరమపరీక్షగల్గి అందాయన రామస్మరణతో పూర్తిగా ఉత్తీర్ణుడగుట అద్భుతము.

"అంత్యకాలే చ మా మేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్రసంశయః."

అను గీతావాక్యము ఆయనకు ఫలించెను. ఆ సమయంలో తౌరకి మంత్రమే తన హంతకు గాంధీగారిచ్చిన జవాబయినది. "ఏసుక్రీస్తుబోధన ప్రకారం వర్తించిన చారిత్రకపురుషుడు గాంధీగారొక్కడే. ధర్మప్రచారమునకు కినిసి స్వజాతీయుడే చంపవచ్చినప్పుడు తలయొగ్గుట అద్భుతము"ని బైబిలువచనములు సత్యమని ఆచరణసాధ్యమని గాంధీ తుదిఘడియఘటనవల్లను స్థిరపడినదని, బ్రిటిషు ఆర్చిబిషపు ఇత్యాదులును ప్రశంసించిరి.

కోపర్నికసు, బ్రూనో, క్రీస్తు, సోక్రటీస్ ఇత్యాదులు చేసిన వైజ్ఞానిక మగు ఉత్తమసత్యబోధనల నప్పటి ధూర్తప్రముఖులు సహింపక రాజకీయ దురభిలాషలతో వారిహత్యలు జరిగించిరని ఇతిహాసజ్ఞులు వ్రాసినారు. గాంధీగారుగు రాజకీయంగాను, సాంఘికంగాను, ఆధ్యాత్మికంగాను, మహా ప్రవక్త, అహింసాయుత విప్లవకారి. ఆయనహత్యలోను అట్టి గాఢకారణ మున్నట్లు, న్యాయవిచారణలో తరువాత స్పష్టమయినది.

# 88 హత్య కేసు తీర్పు

ఇట్టి ఘోరహత్య యయినవెంటనే పరిశోధన జరిగి, కేసు జారీయయి దీర్ఘకాలం విపులవిచారణ జరిగి, కేసు తీర్పు కలిగినది. ఎంతగూఢంగా యత్నాలుసాగి, నేర్పుతో హత్య జరిగినను, అపరాధపరిశోధకులెంతో యుక్తితో పరిశీలనలజేసి, యధార్థమంతయు కనిపెట్టిరి.

హత్యచేసిన నాథూరాంవినాయకగాడ్సే పట్టపగలు జనానీకపు యెదుట బహిరంగంగా చంపెను. కనుక తక్షణమే పోలీసు కాతడు దొరికెను. ఇతడు 'హిందూరాష్ట్రి' అను (పూనాలోని) మహారాష్ట్రి దినపత్రికకు సంపాదకుడు, పట్టభద్రుడు. హిందూరాజ్యమే స్థాపించవలెనని, ముస్లిములకీదేశాలలో పౌరత్వాధికారము లుండకూడదనియు, గాంధీగారు హిందూ ముస్లిం మైత్రిని బోధించుచు హిందువులకు ఘోరనష్టం కల్గించుచున్నారనియు, కాంగ్రెసును తప్పుమార్గంలో పెట్టి దేశవిభజనకు, హిందువుల బాధలకును గాంధిగారే కారకులయినారనియు, ఈయన దినదినమును శక్తికొలది విషప్రచారం చేయుచుండెను. ఈయన హిందూమహాసభ ముఖ్యస్థాపకుడు మాజీ అధ్యక్షుడు అగు వినాయక దామోదర సావర్కారుగారి స్వశాఖీయుడు. ఈ సంఘమునకు వాలంటీరుదళమగు రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో ఈ గాడ్సే ప్రముఖ నిర్వాహకుడు. పాకిస్తాను ముస్లింరాజ్యమయినట్లే భారతదేశము హిందూరాజ్యమే కావలెనని ఇత డుద్రేకంతో తీవ్ర ప్రచారం చేయుచు, మతోన్మాదివలె సాంఘికద్వేషమును పురికొల్పుచుండెను ఈ ఆతతాయి ఒంటరి హంతకుడు కాక, రహస్యపు దీర్ఘాలోచనలు

సాగించి ఒక కుట్ర సంఘపు మద్దతుతోనే ఈ ఘోరహత్యను జరిగించ గల్గెనని ఆధారాలు దొరికినవి. పూనా, బొంబాయి మున్నగు ముఖ్యనగరాల లోని రాష్ట్రీయ స్వయంసేవక సంఘపు కార్యాలయాలను వెదికి, అక్కడి కార్యకర్తలను పట్టుకోగా రహస్య కరపత్రాదులు దొరకి మూలకారణము తెలిసినది. కొందరు ఈ సంఘాల ప్రముఖులింగుకు కారకులని వారిని ముట్టడింపసాగిరి. ఇట్టి సాంఘికతత్వపు వాలంటీరుదళముల ధోరణివల్ల సాంఘికోద్రేకము లేర్పడి వాటి ఉరుములోనుండియే ఈ గాంధిహత్యపిడుగు వచ్చి పడెనని అంతటను భావన యేర్పడినది. కనుక వెంటనే రాష్ట్రీయస్వయం సేవక సంఘమును, ముస్లిం నేషనల్ గార్డ్సు ఖాల్సాసంఘాలను అక్రమసంఘాలుగా సర్కారువారు నిషేధించిరి. (ఈ ఆంక్షలు దరిమిలాను ఎత్తివేసిరి) ఈ సంఘాలప్రముఖులనేకులు దేశమంతట అరెస్టుఅయి కొన్ని నెలల తరువాత దేశంలో ఉద్రేకప్రమాదాలు తగ్గినమీదట విడుదలచేయబడిరి.

గాంధిహత్యానంతరం తీవ్రంగా ప్రత్యేకపు పోలీసు పరిశోధనయు విచారణయు జరిగి, ఆపిమ్మట ఢిల్లీలో 'ఆత్మచరణ'అను ప్రత్యేకపు జడ్జివద్ద గాడ్సే మున్నగు 9 మందిమీద 'ఖూనీ, దానిమద్దతు, కుట్ర, అక్రమాయుధధారణ' ఈ నేరములకు అభియోగము దాఖలై, కొన్ని నెలలవరకు ఈకేసుకు దీర్ఘ విచారణ జరిగినది. చాలామంది ముద్దాయిలు గొప్ప వకీళ్ళద్వారా వాదం జరిగించుకొనిరి. అయితే మంచిసాక్ష్యము విపులముగు రికార్డుకాగితాలు దొరికినవి ఉభయపక్షాల వకీళ్ళ సుదీర్ఘమగు ఆర్గ్యుమెంటును జడ్జీ నిదానంతో విని సాక్ష్యమంతను పూర్తిగ పరిశీలించెను. ఉభయపక్షాల తరపున గొప్పలాయర్లువాదాలు పత్రికలలో ప్రచురింపబడినవి. ఈ విచారణవల్ల సహజంగాదేశంలో కొంత ఆందోళన కల్గినది. గాంధిగారు హిందూముస్లిం మైత్రిని గల్గిరచుటకు, తన యావచ్ఛక్తిని వినియోగించుచు ప్రభుత్వము హిందూపక్షపాతం చూపక అన్ని మతాలవారికి సమంగా రక్షణనీయవలెననీ, దుష్టులను దండించవలెననీ, ఆర్థికంగా ఏమతస్థులైనను బీదలనుద్ధరించవలెననీ, చోరీ బజారువంటి ధనాఢ్యుల శోషణపద్ధతులను నశింపజేయవలెననీ, బోధించిరిగదా! దాని ఒత్తిడిని సహింపక, ముద్దాయీలందరూ సంప్రదించి గాంధిగారిని తుదముట్టించుటకు కుట్రచేసిరని, తత్ఫలితంగానే గాంధిహత్యను

గాడ్సే ఆప్టేలు జరిగించిరనియు, ఫిర్యాదివాదము. గాంధిగారు ముస్లిములం దభిమానము చూపుచున్నందున హిందూరాజ్యవాదమునకు నష్టము గల్గు చున్నది. కనుక గాంధిగారు హిందూద్రోహి; ఆయనను చంపవలెనను ఉద్దే శ్యంతోనే ఈ హత్య జరిగెనని, అయితే, అందుకు తానొక్కడనే కారకుడ ననీ, బాధ్యుడననీ, తక్కిన ముద్దాయీలతో కలసి ఎట్టికుట్రయు, జరుగలేదనీ, తాను గాంధిగారిని బహిరంగంగా చంపుటకు వ్యక్తిద్వేషము లేదనీ, హిందూసంఘపు హక్కులను ప్రాబల్యమును కాపాడి, భారతరాజ్యం హిందూరాజ్యంగా చేయు సదుద్దేశముతోనే ఈ హత్యచేసెననియు, గాడ్సే తరఫున వాదము. తక్కిన ముద్దాయీలును తామెట్టికుట్రను చేయలేదనియు, గాంధిగారిని చంపించు ఉద్దేశం తమ కెవరికీలేదనియు, అట్లు జరుగునని ముందుగా తమకెవరికీ తెలియదనియు వాదించిరి.

అనేకసాక్ష్యులను వందలకొలది కాకితములను పరిశీలించినమీదట, ఉభయవాదాలు జరిగి, తుదకీ దీర్ఘవిచారణ అంతమయి, 10-2-1949 తేదీని తీర్పు చెప్పబడినది. తక్కినముద్దాయీలతో ఆలోచనలేకుండ 1వ ముద్దాయీ గాడ్సే మాత్రం స్వయంగా ఈ హత్య జరిగించుట అసత్యవాదమని, ఇది పెద్ద గూఢమగు కుట్రఫలితమేనని నిర్ధారణ యాయినది ఈ ముద్దాయీలలో నొకరగు హిందూమహాసభ మాజీ అధ్యక్షుడు వృద్ధనాయకుడు అగు వినాయక సావర్కారుగారు ఈ హత్యకై గాడ్సే ప్రభృతులను ప్రోత్సహించినట్లు తగు నిదర్శనము దొరకనందున నిర్దోషియని సావర్కారుగారు వదలివేయ బడిరి ఈయన బాల్యంలో విద్యావంతుడై ఇంగ్లండులో బారిష్టరు పరీక్ష నిచ్చి, యువకదశలో దేశభక్తుడై, హింసాపూర్వకవిప్లవచర్యలద్వారా బ్రిటిషువారి నీ దేశమునుండి వెడలించుటకు శ్రీ శ్యామాజీ కృష్ణవర్మగారి నేతృత్వమున పారిసునగరాలలో జరుగుచుండినకుట్రలో పాల్గొనుచుండెను. ఈ విప్లవయువకులలో సావర్కారువంటి కొందరు మహారాష్ట్రులు పూనా నాసికు ప్రాంతాలలో (మరికొందరు బెంగాలీలు బెంగాలులోను) హత్య చర్యల ప్రోత్సహించినట్లు తెలిసినది. ముఖ్యంగా నాసిక కుట్రహత్యలు ఈయనకు సంబంధమున్నదని అనుమానింపబడి, సావర్కారు బ్రిటిషుప్రభుత్వం వారివల్ల 1910 లో అరెస్టుచేయబడి, తుదకు ద్వీపాంతరవాసము ననుభ వించెను.

ఇట్లు చిరకాలము అండమానుదీవులు ఇత్యాదులలో ఖైదీగనుండి, 1937 సం॥లో బొంబాయిలోని కాంగ్రెసుప్రభుత్వంవల్ల విడుదలచేయబడెను. కాని ఈయన గాంధీయుపద్ధతులకు వ్యతిరిక్తుడై, ముస్లిములకు విరోధియై హిందూరాజ్యస్థాపనకని హిందూమహాసభద్వారా యత్నించుచు, ఆ సభకు అగ్రనాయకులుగనున్నారు. అయినను ఆ సందర్భంలో గాంధీగారిని చ పుట అనుచితమని తనభావం తెలిపి సావర్కారుగారు కేసులో తన స్టేటుమెంటులో ఆ హత్యను ఖండించినారు. తక్కిన దోషులలో బాడ్గే అను ఆయుధ విక్రేత మహారాష్ట్రుడు, తన నేర మొప్పుకొని 'అప్రూవరు'గ ఆ కేసులో ఫిర్యాదితరఫున సాక్ష్య మిచ్చెను. ఇతడు పిస్తోలు రివాల్వరు వగైరా ఆయుధముల వ్యాపారం చేయుచు పూనాలో ఈ కుట్రదారుల ఆలోచనలలో చేరి, వారికి ఆయుధముల నమ్మెను. ఈయన కిట్లు క్షమాపణ దొరికినది. ఈయన అనుచరుడగు శంకరకృష్టయ్య అను ఆంధ్రుడు ఆయుధములనందిచ్చి కుట్రలో పాల్గొన్నందుకు మొదటి కోర్టులో ఖైదుశిక్ష పొందినను, అప్పీలులో విడుదలయ్యె, నిర్దోషిగ నెంచబడెను. (ఇన్లే పరచూరె అను మరొక మహారాష్ట్రుడును అప్పీలులో తప్పించుకొనెను.)

తక్కిన ముద్దాయీలలో గాడ్సే, ఆప్టేలు ప్రత్యక్షంగా ఖూనీలో పాల్గొన్నందున మరణదండన నొందిరి. గోపాలగోడ్సే, మదనలాల్ మున్నగు మరిఐదుగురు ఈ కుట్రలో పాల్గొన్నందునను అక్రమంగా ఆయుధాలు ధరించి వినియోగించినందుకును ఖైదు విధింపబడినారు. హైకోర్టులోనే గాక, ఈకేసు ప్రీవీకౌన్సిలులోను 12-10-49 తేదీని తీర్పుఅయి తీర్పు ఖాయపడినది. గాఢమగు కుట్రద్వారానే హత్యయయినదని తేలినది.

• ఈ ముద్దాయిలు హిందూమహాసభలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో ప్రముఖసభ్యులయి, ముస్లిములపైన హిందువులకు ద్వేషంపురికొల్పుచు గాంధిగారు ప్రచారము వేయు సాంఘికమైత్రి సిద్ధాంతములకు వ్యతిరిక్తులై యుండిరి.

ఈ కుట్ర యేర్పాట్లు జరుగుటలో కొందరు ముద్దాయీలు గ్వాలియరు, ఆల్వారు, ఇందోరు, మున్నగు సంస్థాననగరములకు పూనా బొంబాయి ఇత్యాదులకు విమానాలలోను రైయినులో మొదటి తరగతిలోను చాల సార్లు వెళ్ళుచు, మారుపేర్లతో బహుగూఢంగా సంచరించుచు, ఎన్నియో

మాయోపాయములు రహస్యసమావేశములలో పన్నుచు, గాంధిహత్యకై రివా
ల్వరుగురికాల్పులలో గూఢంగా తరిఫీయతునొందిరి. అద్భుతమగు నీషడ్యంత్రపు
నిర్మాణ సంచారాలకు ఆయుధ పరికరాల సేకరణాదులకును వేలకొలది
రూపాయలధనము కొందరినుండి సంపాదించి ఖర్చుపెట్టిరి. నెలలకొలది
యీ కుట్ర ప్రణాళిక వివిధనగరాలలో సమీకరణతో తయారగుచుండెను;
ఈ ముద్దాయీలలో హెచ్చుమంది మహారాష్ట్రీలు; కాని, ముద్దాయీలు
వీరి సహాయకులును ఏకప్రాంతీయులు, ఏకకులంవారు, ఏకవృత్తివారును
కారు; ఇట్టి 'నానా గోత్రికులు' ఏకదీక్షతో వజ్రహృదయులై లోకోత్తర
పురుషుని వధను సాధించుటలో తమ యేర్పాట్లు ఒకప్పుడు మారవలసి
వచ్చెవి. 20—1—48 తేది సాయంకాలం ప్రార్థనసమయంలోనే ముద్దాయీ
మదన్‌లాలు బాంబును ప్రయోగించినప్పుడు సహజంగా జనులలో ఆందో
ళన గలభా యేర్పడును, కనుకనే తక్కిన బాడ్గే, ఆప్టే, గాడ్సే ఇత్యాదులు
ఆ సందడిలో సన్నద్ధులై గాంధీని చంపుదుమని ప్రమాణంచేసి సిద్ధమ
యిరి; కాని, గాంధీమహాత్ము డప్పుడు బాంబు ప్రేలినప్పుడు శ్రోతలు
కదలకుండ శాంతంగా ఉంచినందున, అక్కడిసభలో నుండియు ముద్దా
యీలు తమ ప్రణాళిక నాకోజున సాగించలేకపోయిరి. ఇన్నినెలలు సాగిన
యీ 'షడ్యంత్ర'మును పోలీసులు భేదించి ఆపలేకపోవుటవల్ల భారతమాత
అమూల్యరత్నమును గోల్పోవుట మన అందరి దురదృష్టమనుకోవలె.

ప్రపంచంలో యే వేయియేండ్లకొకసారి యిట్టి యుగపురుషులు
జనింతురు. మన యదృష్టమున అట్టివారిలో గాంధిమహాత్ముడు మనతరం
లోనే భారతదేశమందే జనించెను. మనలో చాలమంది ఆయనను దర్శించి
గమనించి ఆయనప్రబోధములను స్వయంగా విని ధర్మపునరుద్ధరణ ప్రయ
త్నమును చూచు భాగ్యము కల్గినది. కల్లోలంలో తల్లడిల్లుచున్న ఇప్పటి
లోకమును హింసాంధకారమునుండి ఉద్ధరించుటకు అహింసాసత్యసిద్ధాం
తముల అఖండజ్యోతిని చూపినాడు, భారతదేశమందు ఆయామూపంగా
దానిని అమలుకుతెచ్చి జనులను సన్మార్గమునబెట్టుచుండగనే, హఠాత్తుగ
ఇట్లు అంతరించినాడు.

అన్నికోర్టులలోను తీర్పుపూర్తియయిన మీదట, ఆతతాయులగు
ఈగాడ్సే ఆప్టేలను ఉరినుండి తప్పించుటకు యుక్తివాదంతో కొంత

యత్నము జరిగినది. హతుడైన గాంధిమహాత్ముడు అహింసాప్రవర్తకుడు, తన జీవితంలో దక్షిణాఫ్రికాలోను ఈదేశంలోను ఎందరో ఆయనను చంపబూని, ఆయన నెదుర్కొనినప్పుడు, వారి నాయన క్షమించుచుండెను. మరియు వారిపైన వధోద్యమపుకేసులు జారీచేయకుండునట్లు అధికారుల నాయన మాన్పించెను. కనుక, ఈ ఉరిదండన అమలుజరిగితే మహాత్ముని ఆత్మశాంతి చెడును. తన కారణమున వారి ప్రాణాలు పోయినందు కాయన ఆత్మ ఖేదించును. మరియు, ఈ ఘాతకులు తమ స్వలాభం కొరకు కాక హిందూసంఘమునకు బలముకల్పించుదుమను సదుద్దేశముతోనే ఈ హత్యలు జరిగించి నందునను వారికి ఉరిని మాన్పించవలెనని కొందరు సూచించిరి. ఇందులో కొంత సత్యబీజ మున్నది. గాంధిగారు అపకారికిని ఉపకారమునే చేయు లోకోత్తరుడగు భవ్యమూర్తి. కాని, బెర్నార్డుషా గారన్నట్లు, అంతటి అద్భుతసౌజన్యము ఇప్పటికాలంలో ప్రమాదకరంగా పరిణమించినది. తక్కిన సత్పురుషులలోను ప్రేమ నీతి అట్టి ఉన్నతస్థాయికి రాలేదు. ఇక సామాన్యులమాట చెప్పనేల? క్రిందటి మహాయుద్ధకాలంలో ఆయా జాతులమధ్య, రాజ్యాలమధ్య ఆయన ప్రేమప్రచారం జరుపుచు, శాంతిసందేశం పంపుచుంటే, దానిని బ్రిటిషువారేగాక, దాదాపు ఇతరదేశ ప్రముఖులును బొత్తిగ అపార్థం చేసుకొని దోషారోపణలు చేసిరిగదా! అట్టి స్థితిలో దేశవిభజనానంతరం సాంఘిక సంఘర్షపు ప్రచండఝంఝామారుతము చెలరేగిన ఆ ఘోరప్రవృత్తిలో ఈ దోషులా యజాతశత్రువును విరోధిగ భావించుటలో ఆశ్చర్యమేమి? ఆయనలోని విశ్వప్రేమ నొక మహాదోషముగనే వారెంచిరి. వారి సందర్భంలో సామాన్యజనునే చంపియుంటే, వారికి ఉరిదండన పరిపాటియేగదా! అయితే, "మనుష్యజీవితము పవిత్రము, ఒక నరుని హత్యకు ప్రతిక్రియకని, ఘాతకుడయినను మరొకనరుని ప్రాణంతీయుట అనుచితమని, కనుక మరణదండన నైతికంగా యుక్తంకా"దనియు కొందరిభావన అనగా మరణదండన పద్ధతిని దండనస్మృతినుండి పూర్తిగ తొలగింపవలె నన్నమాట. ఇందును గూర్చి భేదాభిప్రాయాలు కలవు. కాని అది దండనస్మృతిలో నున్నంతకాలం మరణదండనగూడ అమలుజరుగుటే యుక్తముగదా! ఘోరహత్య

చేయుట మహాపాపము. అట్టి ఘాతలితరు లెవరూ చేయకుండుటకిట్టి అంతిమ దండన ముండవలెననియే యిప్పటి పరిస్థితులలో చాలమంది ఆశయము.

సామాన్యులను కాక, ఉత్తమపురుషునే ప్రార్థనసమయంలో (అత్యంత గర్హితపద్ధతిని) హఠాత్తుగ మతోన్మాదంతో చంపిన లోకద్రోహికిమాత్రం ఉరిదండన వలదను హేతువాదము సదాశయుల కెవరికీ రుచించలేదు. మరియు, ధర్మోద్ధరణమిష చెప్పినను, ఇది నిజంగా రాజకీయహత్య. ఇట్లు 1947 సం॥ బర్మాప్రధాని ఆంగ్సానును, 1948 లో గాంధిమహాత్ముని, 1949లో ఈజిప్టు ప్రధాని నొక్రాసేపాషాను హత్యలుచేయుట పక్షబలం నిమిత్తమే. ఇట్టివి అంటుజాడ్యముల వంటివి. ఈ నీతిబాహ్యాచర్యలు ఇక్కడి కమ్యూనిస్టులలోవలె హింసాపరక్రాంతికి ప్రోత్సాహకరములు. విశ్వప్రేమను మానవ సోదరత్వమును ప్రేరించవలసిన మతము పేరట అసహిష్ణులు చేయు ఘోర హత్యలజేయుట ఈశ్వరునికిని నరజాతికిని మహాపచార మొనర్చుటే. మరణ దండన న్యాయశాస్త్రసమ్మత మయినంతకాలం అందు కన్నివిధముల నర్హులు ఇట్టివారే. కనుక, ఈ హత్యాకారు లిద్దరికీ తుదకు ఉరిదండన అమలు చేయబడినది.

# 89 బలిదానఫలం

మహాత్ముడు భారతీయైక్యం నిమిత్తం విశ్వప్రేమప్రచారం నిమిత్తమును తన దేహమును బలిదానము చేసుకొనెను గదా. దానిఉద్దేశమును నెరవేర్చి మనము ఆ కార్యక్రమ మమలు జరుపవలె. ప్రస్తుతం గాంధి మహాత్మునికి స్మారకంగా ఆయన ప్రతిమలను చిత్రపటాలను చాలచోట్ల పెట్టి పూజించుచున్నారు. కాని ఆయన జీవితాశయాల నమలుజరుపక క్రియలో నిరసించుచు, ఆయనకు మూర్తిపూజాదులుమాత్రం చేయుట ఆయన నవమానించి ఆయనను ఆయన తేజస్సు శిలాభూతంచేయుటే యగును. వివిధ జాతి కులాలతో ప్రాంతీయభేదాలతో మిశ్రితమగు ఈదేశంలో సాంఘికమైత్రి స్వరాజ్యపు ముఖ్యాధారమని మహాత్ముడు నిర్వచించెను. ఇందులో హిందూ ముస్లింమైత్రి సవర్ణహరిజన మైత్రి అను రెంటి ప్రాముఖ్యం విశదపరచి, వాటిని సాధించుటకై బాపుజీ చాలసారు లుపవసించి వాటికై చాలసార్లు తన

ప్రాణముల్లోడ్డెను. వీటిలో దేశపు ఉత్తరప్రాంతాలలో హిందూముస్లిం సమస్యకును, మనమధ్య దక్షిణప్రాంతాలలో సవర్ణ హరిజన సమస్యకును ఎక్కువ ప్రాముఖ్యమున్నది. 'ఈ రెండువిధాల సాంఘిక మైత్రి మనలో బాగా వ్యాపిస్తేనే స్వరాజ్యము లభించును. అది ఉపయుక్తమగును' అని గాంధిగారు అందుకై గాఢకృషితో ప్రచారంచేసిరి. అయితే, బ్రిటిషువారు భేదతంత్రజ్ఞులై తమకూటనీతిద్వారా పరాధీనులగు మనలో విభేదములు పెంచుచుండిరి. ముఖ్యంగా హిందూముస్లింవిభేదాలు పెరుగుచున్నందున, బ్రిటిషువారిక్కడనుండి త్వరలో ఈ దేశమునుండి తొలగుట యెక్కువ ముఖ్యము, ఆపిమ్మట స్వతంత్రతరాగనే మనము పరాకష్టణపోయిన మీదట ప్రాజ్ఞతతో ఐకమత్యమును దీక్షతో సాధించవచ్చునని గాంధిగారెంచిరి. ఇంతలో 1947 సం॥రంలో హఠాత్తుగ దేశవిభజనజరిగి ఆ పద్ధతినే స్వరాజ్యము లభించెను. రాజకీయపాలనలో విభజన కల్గినను ఈ ముఖ్యసంఘాలు అంతరంగంలో కలతలులేకుండ మైత్రితో మెలగితే భారతజాతికంతకును క్షేమముకల్గునను సత్యమును మన ఉభయపక్షాలు మరచి, ఉద్రిక్తులై కలతలు పెంచుకొనుట వల్లనే భారతీయులందరికీ చాల అనర్థకములు కలిగినవి, వాటి దుష్ఫలితములను మనము అనుభవించుచున్నాము. ఇందులో గమనార్హమేదంటే, హిందువులను ముస్లిములు, ముస్లిములను హిందువులును దుష్టులనుచు లోపము లెన్నుచున్నారు. (ఇట్లే సవర్ణ హరిజనులమధ్యను నున్నది) ముస్లింలీగువారు పాకిస్తానులోను, హిందూమహాసభవారు భారతప్రాంతాలలోను ఈ విష ప్రచారము చేయుచువచ్చినారు అనేకులు కాంగ్రెసుప్రముఖులలోకిగూడ ఈ హిందూసాంఘికతత్వము (మనము గమనించకుండనే) వ్యాపించుట విచారకరము. హిందూసభవారను ఈతత్వపు కాంగ్రెసువారును మనసార హిందూసంఘమును బాగుపర్చుట కెంతైన అవకాశమున్నది హరిజనుల అస్పృశ్యతను నివర్తింపజేసి, వారికి సవర్ణులకు మధ్య విస్తరించు విభేదాలను తొలగించవచ్చు. సవర్ణప్రముఖులు గ్రామాలలో హరిజనులు మున్నగు వెనుకబడినజాతుల నుద్ధరించవచ్చు, ఇప్పటి హిందూలాలోని లోపములను తొలగించి సంస్కరింప ప్రజాభిప్రాయం ప్రేరేపింపవచ్చు, కులవిభేదాలవల్ల కులతత్వధోరణివల్ల కలుగు అనర్థాలను పోగొట్టు విశాలభావములను ప్రచారం చేయవచ్చు.

ఇప్పుడు హిందూసమాజ వర్గములలో, పెండ్లిపద్ధతులలో, ఖర్చులలో దేవాలయపాలనలో, బాలవితంతువిషయంలో, బాలికా వృద్ధ వివాహాలలో, హరిజనుల అస్పృశ్యత, ప్రత్యేకవాసాదులలో ఎన్నియో లోపాలు అన్యాయాలు కలవు ఇందుగూర్చిన చట్టాలకు జనాదరం లేనందున సరిగా అమలులోలేవు హిందూసభవారు తమ ప్రచారాదుల ద్వారా యీ అన్యాయములు పోగొట్టి, హిందూసంఘంలో కలవిభేదస్పర్ధలు పోగొట్టి సంఘటనకార్యమెంతైన చేయవచ్చు అందుకుబదులు విభేదాలు ద్వేషాలు పెంచుటవల్ల హిందూసంఘమున వృద్ధిగాని జరుగదు ద్వేషాగ్ని ఆశ్రయనాశమే.

ప్రముఖులు పత్రికలు ద్వేషప్రచారం చేయుటవల్ల, భయోద్విగ్నులై పాకిస్తానునుండి హిందువులీదేశమునకును, ఇక్కడి భారతముస్లిములు పాకిస్తానుకు తండోపతండాలుగ వలసపోవుచుండగా, సర్కారుకు ప్రజలకుగూడ చాల చిక్కు సమస్యలు వచ్చిపడినవి. ఆర్థికస్థితి అపసవ్యమయినది. మరియు, శరణార్థుల ఆస్తులరక్షణ, వృత్తిస్థాపన, కరెన్సీవినిమయపుసమస్యలగూర్చియు, సట్లెజీనీటిపంపకం, కాశ్మీరభవిష్యత్తు వగైరా సమస్యలగూర్చి విరోధాలు పెరిగి, వ్యాపారము స్తంభించినది రేడియోలలోను కొంతవాగ్యుద్ధము సాగినది భారత పాకిస్తానులమధ్య త్వరలోనే యుద్ధము తప్పదను భావము వ్యాపించగా, అల్పసంఖ్యాకుల భయోద్విగ్నతయు, వలసపోవుటయు మరింత హెచ్చినది. ఇది అందరికీ అరిష్టకరమని రెండురాజ్యాల ప్రధానులకు విశదమయినది. బయట ఆంగ్ల అమెరికాలకు రష్యా చీనాలతో సాగు శీతల యుద్ధము ఏసమయమందైన 3 వ ప్రపంచయుద్ధముగ పరిణమించవచ్చు. ఈ రెండు పెద్దపక్షాలు మన రెండురాజ్యాల యుద్ధంలో చేరియొకవైపు చేరుట సహజము. ఇట్లు భారత పాకిస్తాను ప్రపంచరణరంగమయితే, తుదకు ఫలితమెట్లయినను, రెండు రాజ్యాలును మహానరకముగ మారి ఘోరారిష్టము సంభవించును. అంతట చీనాలోవలె నిరాశవల్ల కమ్యూనిస్టుతత్వము విజృంభించును. మరియు, మహాభారతమంతయు మరల పరాధీనమగును. కనుక అట్టిదుస్థితిని నివారించుటకు గాంధీమహాత్ముని బలిదానంతో పవిత్రమయిన ఢిల్లీలోనే నెహ్రూ లియాకతు నాయకులు కలసి సఖ్యంతో సామరస్యసంధి చేర్పర్చినారు (1950 ఏప్రిలు). ఈ మహాసమాఖ్యప్రకారం ఈ రెండురాజ్యాలలో (ముఖ్యంగా తూర్పు పశ్చిమ బెంగాలులలో) వున్న

అల్పసంఖ్యాకులకు ఆ ప్రాంతపు రాజ్యాలే రక్షణనిచ్చును; వారి కిక్కడ పూర్తి పౌరసత్వప్రహక్కు లుండును. పాకిస్తానులో ప్రజాసత్తాకంగానే రాజ్యవిధాన ముండును. మతపక్షపాతముండదు. వారి హక్కులు కాపాడు ప్రత్యేకపు మైనారిటీ కమిషనులు నియమింపబడి అల్పసంఖ్యావర్గముల కన్యాయములు జరిగితే పరిశీలించి రక్షణల నేర్పాటు చేయును. శరణార్థులుగ వెళ్ళువారు నిర్బాధంగా వెళ్ళుటకు సౌకర్యమిత్తురు. ఈ రాజ్యాల మంత్రివర్గాలలో అల్పసంఖ్యాక ప్రతినిధులను నియమిస్తూ పాలనలో పాల్గొందురు. కేంద్రప్రభుత్వాల మంత్రులలో చేరొక మంత్రి అల్పసంఖ్యవర్గపు రక్షణకార్యమునే చేయుచుందురు. ఈ సమాఖ్యయేర్పడినందున ఇటీవలి అశాంతియు ఆందోళనయు యిప్పుడు తగ్గినవి. ఉభయపక్షాలలో నిదానముతో కొంత సౌమ్యత యేర్పడుచున్నది. పరస్పరదూషణము నిషేధింపబడినది. మరల నెహ్రూ లియాఖతు లిద్దరూ కరాచీలో కలిసి మాట్లాడిరి. ఇట్లే యికముందును కలియుచూ ఆయా సమస్యల పరిష్కారయత్నం చేయుచుందురు. రెండుదేశాల పత్రికా ప్రతినిధులును ఢిల్లీలో (1950 మే నెల) ఇట్లు మైత్రి నెలకొల్ప ప్రమాణంచేసుకొన్నారు.

ఇట్లు మనశ్శుద్ధితోను దీక్షతోను ఉభయనాయకులూ పూనికొని కృషి చేయుచున్నందున, గాంధిగారాశించిన ప్రకారం సాంఘిక శాంతి యేర్పడు ఆశ ఇప్పుడు వృద్ధియైనది. ఇందువల్ల భారత పాకిస్తానుల మధ్యనున్న వ్యాపారం, నదీజల పంపకం, కాశ్మీరమున్నగు మిగిలిన ముఖ్య సమస్యలును సంప్రతింపులద్వారా ఉభయానుకూలంగా పరిష్కారమగునను ఆశాజ్యోతి మరల ఉదయించినది. ఇది సాగుటకు ప్రజాప్రముఖులందరి సహకారమును ఆవశ్యకము.

# 81 ప్రస్తుత స్థితి

స్వరాజ్యము రాగానే మన కష్టములుపోయి సర్వసుఖములు లభించునని కొందరు భ్రమించిరి. క్రమముగ ఇప్పుడన్నియు కష్టములే కనబడుచు జనులకు కాంగ్రెసు ప్రభుత్వముపైన కొంత అసంతృప్తి కలిగినది. మరియు, కొందరు

గాంధీ మహాత్ముల పైనను గాంధీప్రణాళికపైనను అవిశ్వాసము చూపు చున్నారు. తగిన దూరదృష్టి వివక్షణ లేకుండుటయే ఇందుకు కారణము.

"అన్నివర్గాల జనులకు శాంతిసుఖములు లభించుటే నిజమగు పూర్ణ స్వరాజ్యము విదేశనిమంత్రణాదికారము వదలి రాజ్యతంత్రము చేపట్టుట స్వరాజ్యము కాదు; అది స్వరాజ్యమునకు అవరోధములు తొలగించు దారిమాత్రము చూపును" అని గాంధీగారు తరచు చెప్పుచుండిరి. విచక్షణతో స్వాతంత్ర్యాయుధమును మనము ప్రజాక్షేమంకొరకు ఉపయోగించుకొంటేనే నిజమగు స్వరాజ్యము లభించును. అందుకు సాధనంగా నిర్మాణకార్యక్రమము సాగించి వృద్ధిచేసి ఉపయోగించుకోవలెనని బాపూజీ ప్రవచనము. గత 25 సం||లలో గాంధీసూచనప్రకారం నిర్మాణకార్యక్రమము హృదయ పూర్వకంగా సాగించలేదు గనుకనే ఇప్పుడు క్లిష్టసమస్యలు బాధించు చున్నవి.

ఇప్పటికి ఇట్టి స్వరాజ్యస్థాపనకు ప్రభుత్వమును, ప్రజలును ఎంతవరకు సాధించినారు? ఈ భారతరాజ్యము రెండుగ ఖండింపబడుటయే గాక, మనకు 1947 ఆగస్టునుండి మరొక పెద్దసమస్య వచ్చినది అది సంస్థానముల గూర్చి నది. బ్రిటిషువారు అప్పుడు ఈ దేశ మధ్యమందున్న సుమారు 600 సంస్థానరాజ్యాలకు స్వాతంత్ర్యత కల్గించదన్నారు, అనగా ఇవి వీలునుబట్టి భారతరాజ్యంతోనో, పాకిస్థానంలోనో కలసి విలీనం కావచ్చు, లేక స్వతంత్రరాజ్యంగానే ఉండిపోవచ్చు, నని బ్రిటిషుఅధికారులు నిర్ణ యించిరి వీటి నిర్ణేతలు పాలకరాజులేనట ఇందువల్ల ఎన్నియో రకముల సంఘర్షణములు కల్గునట్లుండెను. హైదరాబాదు, తిరువాన్కూరు, భోపాలు మున్నగు కొన్నిటి పాలకులు వాటిని భారతకేంద్రమునకు లోబడకుండ తామే నిరంకుశపాలితంగా ఉంచుకోదలచిరి. ఈ రాజులు తమ ప్రజలకు, ధర్మకర్తల వంటివారు, కనుక వారు తమ ప్రజల అభిప్రాయప్రకారం నడచు కోవలెనని గాంధీమహాత్ముడు చెప్పుచుండెను. వీటి ప్రజాపరిషత్తులన్నియు భారతరాజ్య కేంద్రాధిపత్యమునకు లోబడవలెనని కోరిరి. శ్రీ పటేలు (గృహ మంత్రి) గారు దూరదృష్టి గ్గి ఎతో సామ్యతతో గాంధిపద్ధతి నవలం బించిరి. ఆయన మైత్రిభావంతో మాట్లాడి పరస్పరసంఘర్షము యుద్ధ ములు లేకుండనే, రాజులందరి నొప్పించగా, వారు తమ పోషణకు తగు

సౌకర్యములు చేయుపద్ధతిని తమ స్వతంత్రపాలనాధికారాలను వదలుకొనిరి. కొన్ని రాజ్యాలు భారతంలో విలీనమైనవి కొన్ని యిరుగుపొరుగు రాజ్యాలు తమలోకలసిపోయి ప్రజాయుతరాజ్యాలుగ నేర్పడినవి సౌరాష్ట్రం, మధ్యభారతం, రాజస్థానం, పంజాబు సంస్థానసమితియు ఇట్టివి. హిమాచల ప్రదేశ్, వింధ్యప్రదేశ్, తగు ప్రజాపరిషత్తులేక ప్రస్తుత మన కేంద్రప్రభుత్వపాలనక్రింద నున్నవి. తిరువాన్కూరు కొచ్చిలు మిళితమై ఏకరాజ్యమైనవి ఇవి, మైసూరుగూడ మనప్రాంత ప్రభుత్వాలవలె, కేంద్రప్రభుత్వమునకే ముఖ్యవిషయాలలో లోబడి వ్యవహరించుచున్నవి.

ఇప్పటికిందువల్ల మొత్తపు బృహద్భారతదేశంలో కొన్ని సత్ఫలితము లారంభించినవి. రాజప్రజా, హిందూముస్లిము, సవర్ణ హరిజన, ఇతరవర్గాల మధ్య ద్వేషముతగ్గుచు సుముఖత ఏర్పడుచున్నది. సంఘర్షము ఉభయపక్షాలకు హానికరమని, రెండురాజ్యాలలోనాయకులూ గ్రహించి, తమ తమ ప్రజలలో మైత్రిభావము కల్గించుచున్నారు "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో" క్రమంగా శేదవ్యష్టి తగ్గి, గాంధీగారు సూచించిన సదృష్టి ఏర్పడుచున్నది. ఇందుకు మహాత్ముని ధర్మప్రభుత్వ లక్షణ. నైతికా [illegible]

యుండి చిరస్థాయి అయితే, భారతపాకిస్థానుల భావిసంబంధము, ఇప్పటి కెనడా అమెరికాల (సంయుక్తరాజ్యముల) మధ్యనుండు రీతిని ఆర్థిక, సాంఘిక, సంస్కృతి విషయాలలో సమన్వయ మొందుచు మైత్రియుతంగా యుండవచ్చు. పాకిస్తాను విభజన నిర్ణయ మయినప్పటి నుండి గాంధిమహాత్ముడట్టి ఆశయముతోనే నిరంతరకృషి చేసెనుగదా. ఇందులో ఆయన దృక్పథమును విడువక దీక్షతో ఏర్పర్చిన యీప్రక్రియను ప్రసాద్, రాజాజీ మున్నగు ఇతర ప్రముఖులును ప్రధానవార్తాపత్రికలును తోడ్పడుచుండుటవల్ల, ఇంతవరకు అనుకూలఫలితము కల్గుటేగాక ఇకముందును విజయవంతమగునని తోచుచున్నది.

సంస్థానరాజ్యాల ముఖ్యమహారాజులు కొందరు 'రాజప్రముఖు'లైరి. వారు మన ప్రాంతాల గవర్నరులవలె, అధికారంవదలి ప్రజాదరణపొందుచు ప్రజాసేవకులుగ నున్నారు. కాశ్మీరు, హైదరాబాదు యీరెండు పెద్ద రాజ్యాలకుమాత్రం కొంత శస్త్రచికిత్స కావలసివచ్చినది. వీటిలో కొంత

హిందూ ముస్లిం సమస్య బాధించినది కాశ్మీరము హిమాలయాలమకుటమం దున్నది. అది 85 వేలమైళ్ళ విస్తీర్ణంకలిగి హైదరాబాదుకన్నను కొంచం పెద్దది. దాని జనసంఖ్య 40 లక్షలలో 32 లక్షలమంది ముస్లిములు. అందలికోడ్లు నదీప్రవాహ వ్యాపారాదులు ఇదివరకు పాకీస్తానుభాగంలోనే ఎక్కువగ నున్నవి. సహజంగా ఆరాజ్యము పాకీస్తానుకు అధీనంకావలెనని పాకీస్తానువారు పట్టుబట్టిరి. కాశ్మీరపు హిందూమహారాజు అక్కడి ఉద్రిక్త పరిస్థితులకు భయపడెను. పాకీస్తాను పాలకులు సామదానములకు బదులు దండోపాయము ప్రయోగించి సరిహద్దుపఠానులచే కాశ్మీరంపై దాడిచేయించియు, అక్కడ ముస్లిములను హిందువులపైన రెచ్చగొట్టియు దౌర్జన్యంతో కాశ్మీరమును వశపర్చుకో యత్నించిరి. ఈదాడివల్ల హాహాకారమేర్పడి కాశ్మీరరాజును, ప్రజానాయకుడు షేక్ అబ్దుల్లాయును భారతరాజ్యంలో సంయుక్తులయిరి. రాజ్యపు పరిష్కారమును ప్రజాభిప్రాయంద్వారా తేల్చు పద్ధతిని వెంటనే భారతప్రభుత్వంద్వారా కాశ్మీరమును మన సేనలద్వారా రక్షించిరి

కాని కొన్ని కొండలలో హిమానాగశ్యాలలో జరుగు ఈ సమరము ఉభయరాజ్యాలకు హానికరంగా ఉన్నందున సంయుక్తరాజ్యసమితిద్వారా ఈ సమస్య పరిష్కరింప యత్నము సాగుచున్నది ప్రస్తుతం జమ్మూ, శ్రీనగర, లడక రాష్ట్రాలలో హెచ్చుభాగం అక్కడ ప్రధాని షేక్ అబ్దుల్లాపాలనలో భారతవశంగాను, కొన్ని పశ్చిమోత్తర ప్రాంతాలు పాకీస్తానీయుల వశములోను ఉంటున్నవి. ఉభయపక్షసమ్మతితో ఇటీవల ఆస్ట్రేలియా న్యాయపతి 'డిక్సను'గారు మధ్యవర్తిగ నియమింపబడినారు. మరల యుద్ధ మక్కరలేకుండ సఖ్యపద్ధతినే కాశ్మీరసమస్య విభజనపద్ధతినో మరొకరీతినో ఉభయరాజ్యాలనాయకుల అంగీకారంతోనే సవ్యంగా పరిష్కృతం కావచ్చు.

ఇక మిగిలినది హైదరాబాదు. దీనిలో మతోన్మాదులగు రజాకారుల సాయముతో 'లాయకాలీ' మంత్రివర్గంవారు నిజాంపేరిట చాల దౌర్జన్య చర్యలు జరిగించినట్లు హైదరాబాదులోనున్న 100 కి 80 వంతులు హిందు ప్రజలు మొరపెట్టి బాధపడసాగిరి సామదానములద్వారా సౌమ్యంగా యీ సమస్యగూడ పరిష్కరింప మన భారతప్రభుత్వంవారు గట్టిగ యత్నించి

కనబడియు మరల వెనుకబడినది అందుకు మననాయకులలో విభేదాలు మున్నగు అనేక కారణాలు కలవు మొత్తంలో ఇప్పటి పరిస్థితిలో కొన్ని యేండ్లవరకు విశాలజాతీయభావమును, దేశభక్తిని జనులలో బలపరచుట అవశ్యకమనియు, కనుక దీనికి స్వమత, సాంఘిక, ప్రాంతీయతత్వములు ఇత్యాదులు తలయెత్తి విచ్ఛేదం చేయు స్థితి రానీయకూడదనియు, నెహ్రూ పటేలువంటి నాయకులభావము. దేశమన్ని విధములా సఘటితమగుటకు క్రొత్తరాజ్యాంగములో చేసిన కట్టుదిట్టములు అమలుకివచ్చి, కేంద్రభారత ప్రభుత్వము బలపడినమీదటనే భాషాప్రయుక్తవిభజన పద్ధతికి పూను కొనుట శ్రేయస్కరమని ఈ పక్షపు అభిప్రాయమని తోచును. ప్రజాయత్తపద్ధతిని ప్రతి వయస్కునికి సంయుక్తనియోజకవర్గపద్ధతిని ఓటు హక్కు ఉండుటకు ఈక్రొత్తరాజ్యాంగంలో నిర్ణయమైనది. 1951 సం॥లో ఈక్రొత్తచట్టపు ప్రకారం జరుగు ఎన్నికలలో సహజంగా జనసామా న్యము రాజకీయసమస్యలను బోధపరచుకొని వోటు చేయవలసియుండును. ఈలోగా కమ్యూనిష్టులు, సోషలిష్టులు, పోటీవేయుచు అందుకు వోటరు లలో అప్పుడే కొందరు తీవ్రప్రచారం ఆరంభించుచున్నారు. జాతీయసంఘ టనకు హిందీని కేంద్ర జాతీయభాషగ దేశమంతట వ్యాపింపజేయవలె. అధిక సంఖ్యాకులగు హిందువులందరికి ఒకే హిందులాచట్టము శాసింపబడవలె. అది శాస్త్రవిరుద్ధం కాకుండానే స్త్రీలకిప్పుడున్న అన్యాయాలు తొలగించు నదిగ, ఆయాప్రాంతీయుల మధ్య ఐక్యమిచ్చునదిగ నిబంధనరూపంగా సంస్కరింపబడవలె.

1930 సం॥లో అప్పటి వైస్రాయికి రాయబారమంపుచు తన సహ చరులతో సంప్రదించి, గాంధిగారు బ్రిటిషుప్రభుత్వమునప్పుడు 11 అంశ ములను వెంటనే సాగించవలెనని రాజీసందేశం పంపెను గదా. అవి ఆచర ణీయములని ప్రజాక్షేమకరమని గాంధీగారప్పుడు భావించిరిగదా! అట్టివి మన జాతీయప్రభుత్వంక్రింద అమలుకుపెట్టజూచినారా అని కొందరు ప్రశ్నించుచున్నారు. ఇప్పుడు వీటిని పరిశీలింతము.

1 త్రాగుడుమాన్పుట:—

దీనిని మన మదరాసురాష్ట్రింలో పూర్తిగా శాసనరీత్యా అమలుకు తెచ్చినారు ఇతర రాష్ట్రాలలోను చాలవరకట్లు చేసినారు. కల్లంగడుల

పాటలవల్ల లోగడవచ్చుచున్న కోట్లకొలది రూపాయల సర్కారురాబడి పోయినను, ప్రభుత్వమీ సంస్కారం చేసినారు. దొంగతనపు గీతలు, కల్లుఅమ్మకాలు, త్రాగుడు జరుగకుండ బోధించుటకు, నిరోధించుటకు ప్రభుత్వము కొంత సిబ్బంది పెట్టినారు అనగా మద్యనిషేధం వల్ల అవసరంగా సర్కారుకు ఖర్చుకూడ తగులుచున్నది. ఈ త్రాగుడును మాన్పుట జనులకు భౌతికంగాను నైతికంగాను ఎంతో క్షేమకరము. అయితే కొన్నిచోట్ల యిప్పటికిని రహస్యపుగీత, గూఢంగా త్రాగుడును జరుగుచున్నదందురు వీటిని నిరోధించుటకు ఉద్యోగులే గాక ప్రజాప్రముఖులును గట్టిగా పూనుకోవలె ఇదివరలో గాంధిగారిప్రోత్సాహమున వేలకొలది జాతీయవాదులు ప్రబోధంచేసి కల్లంగడులవద్ద పికెటింగు చేసి జైలుశిక్షలను సిద్ధపడిరిగదా † ఇప్పుడంతశ్రమ యక్కరలేదు. కాని త్రాగుడు అనర్థకంగనుక కూడదని ప్రజాప్రబోధం సాగించవలె. మన హిందూ ముస్లిము మతాలప్రకారమును మద్యపానము దోషమే. సర్కారు రాబడి వదలుకొనియు మద్యనిషేధము పెట్టినందుకు దాని నుత్సాహంతో జనులందరిలో అమలుజరిపించుట కందరును తోడ్పడవలె. అప్పుడు దీనివల్ల పూర్తిగ సత్ఫలితముకల్గి సంఘమంతయును ఉన్నతి జెందును 'ప్రొహిబిషను' ఉద్యోగులు సరిగా పనిచేయుటలేదని ప్రజాప్రముఖులు, వీరి సహాకారం లేక తమ కృషి వ్యర్థమగుచున్నదని ఆ యుద్యోగులును ఆక్షేపించుటకన్న ఉభయపక్షాలు మనస్ఫూర్తిగా సహకరించి యీ యుత్తమసంస్కారణను సాగించి పూర్తిగా జయప్రదం చేయవలె. అంతట జనులందరికి లాభముండును.

## 2. పౌను మారకపు నిర్ణయం :—

ఇంగ్లీషు నాణెంకాసు (పౌను) రు 15/- చొప్పున ఉండేది. అప్పటి ప్రభుత్వంవారు, రు 13-8-0 ల రేటుకు మార్చినందున భారతీయులకు నష్టము కలిగెనని రు 15 కు మార్పించమని గాంధీగారు 1930 సం॥లో కోరిరి. కనుక ఇప్పుడు స్వరాజ్యప్రభుత్వముమార్చరాదాయని ప్రశ్నవచ్చినది కాని అట్లు యింకను మార్చలేదు 1930 నాటిపరిస్థితి ఇప్పుడు తారుమారైనది.

---

† ఈ పుస్తకంలో 25 వ అధ్యాయం (గాంధీసందేశం) చూడుము.

అప్పటికి బ్రిటిషువారు మనకు ఋణదాతలు. నేడు వారు మనకు ఋణగ్రస్తులు. మరియు మన మిప్పుడు కొన్ని తిండిగింజలు, ఫ్యాక్టరీలకు కొంత యంత్రసామాగ్రిని ఆంగ్ల, అమెరికను రాజ్యాలనుండి కోట్లకొలది రూపాయలకు తెచ్చుకోవలె. అందు కిప్పటి రు 13-8-0 చొ॥ న రేటే సదుపాయకరంగా ఉన్నందున మార్చలేదు. మరియు మనకు బ్రిటిషు వారికిని అమెరికా వారు ఋణదాతలగుస్థితిలో నున్నారు. లోకంలోని బంగారులో 2/3 వంతులు అమెరికాలోనే నిలవయున్నది. బ్రిటిషువారితో బాటు మన రాజ్యమును అమెరికను డాలరుకన్న నాణెముల వెల తగ్గించి మారకం మార్చుకొన్నాము, ప్రపంచపుబాంకులు వగైరాల ద్రవ్యకేంద్ర మిపుడు లండనునుండి (అమెరికా) న్యూయార్కునకు మారినది. ఆధునికక్లిష్టద్రవ్యస్థితిలో ఈ యాంత్రికకరంగలో ఇట్లు సమయోచితంగా వర్తించకతప్పదు.

3. భూమిపన్ను తగ్గింపు:—

పన్నువిధానముపైన శాసనసభ కధికారము 1930 సం॥ ఆదాయం నాటికి పంటకిమ్మతునుబట్టి చూస్తే భూమిపన్ను రేటు చాల హెచ్చుగా ఉండేది. స్వతంత్రత లభించుసరికి గింజలువగైరాల వస్తువు లన్నిటికి ధరలు విపరీతంగా పెరిగినవి, కనుక భూములపైన రాబడి హెచ్చినది ప్రభుత్వపు సిబ్బందిఖర్చు వెనుకటికన్న చాలపెరిగినది. కనుక భూమిపన్ను తగ్గించలేదు. జమీందారీలలోమాత్రం కొంత సదుపాయము జరిగినది. 1930 సం॥ లో పన్నువిధానం నిర్ణయించుచుండినది పరాయిప్రభుత్వము అది నిరంకుశ అధికారముతో ఉండేది. ఇప్పటి మంత్రివర్గము అపసవ్యముగా వ్యవహరిస్తే దానిని శాసనసభవారు తొలగింపవచ్చు. శాసనసభలో మెజార్టీగల నాయకుడే మంత్రివర్గ మేర్పరచి పన్నుల విధానపు నిర్ణయమునకు బాధ్యుడుగా నుండును.

4. ఉప్పు పన్ను:—

బీదలందరకు ఆవశ్యకమగు ఉప్పుపన్నునుగూర్చియే ముఖ్యంగా 1930-32 లో గాంధీగారు సత్యాగ్రహము సాగించినారు. స్వరాజ్య ప్రభుత్వమా పన్నును తొలగించి ఎనిమిదికోట్ల రూపాయల రాబడిని వదలుకొనియు బీదలకు స్వేచ్ఛ గల్పించినది. ఇప్పుడు స్వేచ్ఛలో ఉప్పుచేసుకొని

తెచ్చుకోవచ్చు. ఇపుడు తమస్వకీయోపయోగమునకు ఉప్పు తయారుచేసుకొను టకు సర్కారులకు పన్ను చెల్లించనక్కరలేదు తీరవాసులెవరో ఇప్పుడు స్వేచ్ఛతో ఉప్పు తెచ్చుకొనుచున్నారు. అయితే సర్కారు సాల్టు శాఖకు ఇంకను ఖర్చుభరించక తప్పలేదు సముద్రపుగట్టువద్ద ప్రకృతిలో దొరకు ఉప్పును అజ్ఞానులు తయారుచేయు ఉప్పు మలినమై అనారోగ్య కరంగా ఉండును మరియు పన్నులేని సౌకర్యము చూచుకొని కొందరు తగు శుభ్రత భద్రత లేకుండ మట్టి వగైరా కలసినను మలినమైన ఉప్పును చౌకరేటు కితరులకు భారీగా అమ్ముకుంటే దాని పోటీకి నిలువక జాగ్రత్త చేయు మంచిరకపు శుభ్రమైన ఉప్పు తయారు వ్యాపారము తగ్గిపోయి జనులకు జబ్బుఉప్పు సరఫరా అగును. ఇంతేకాక సముద్రపునీటిలో మన దేహమునకు కావలసిన మామూలుఉప్పేగాక మరికొన్ని (చూడ హానికరమైన) వేరు లవణవస్తువులు అప్పృశ్యంగా ఇమిడియుండును. మట్టేగాక ఈయితరపదార్థాలనుగూడ వేరుచేసినమీదనే మనకు పరిశుద్ధమగు శుద్ధలవ ణముదొరకును. అందుకు వైజ్ఞానిక పరిశోధనకు లోబడి కట్టుదిట్టములతోనే మాలిన్యములేకుండ ఉప్పు తయారుచేయవలెను అనగా హెచ్చుమందికి చాలమంచి ఉప్పు కావలెనంటే భారీఎత్తున సర్కారు వైజ్ఞానికనియంత్రణ మును కట్టుదిట్టములును కావలెను. అందుకు సర్కారు కొంతసిబ్బంది పెట్టి బాధ్యత వహించితేనే బజారుకు వచ్చు వ్యాపారపు ఉప్పు శుద్ధంగా ఉండును. ఆరోగ్యదృష్టిని ఇది ఆవశ్యకము. అందుకు ఉప్పుమళ్లీ వ్యాపారస్థులకు సర్కారుకుగూడ కొంతద్రవ్యము ఖర్చుగాకతప్పదు. కనుక సర్కారువారు స్వంతమునకు ఉప్పుచేసుకొనువారిపైన, అందుకు ఎట్టి పన్నును విధించక స్వేచ్ఛనిచ్చినను, భారీవ్యాపారపు ఉప్పుతయారీపైన మిక్కిలి కొద్దిరేటుగ పన్ను విధించుచున్నారు. (ఇందువల్ల ఆసర్కారు సిబ్బందిఖర్చు ఎత్తిపోవును) ఇందువల్ల ఉప్పుపంట ద్రవ్యసాధ్యమేఅగుచు (వెనుకటి సర్కారు పన్నుతొలగినను) బజారులో మామూలుధరకే దొరకు చున్నది. ఇప్పుడు ఇతరవస్తువులు, భూములును ప్రియమై పనివాండ్ర కూలీ మజూరీలు జీవనవ్యయము పెరుగుటయు ఇందుకు కారణమైనది.

### 5. సేనఖర్చు తగ్గింపు:—

బ్రిటిషు పాలనకాలంలో దేశపుమొత్తపురాబడిలో సగంవరకు సేన ఖర్చులకే వినియోగపడేది. అందులో హెచ్చుభాగము శ్వేతజాతీయులకే ముట్టి, వారిద్వారా విదేశాలకు చేరేది. అయినను అందువల్ల మనదేశపురక్షణ శక్తి అంతగా హెచ్చుకాలేదు. కొంతసొమ్ము వాయవ్య సరిహద్దుప్రాంతంలో వ్యర్థంగా ఖర్చయ్యేది. మన భారతసేనను బ్రిటిషుసేనలోక శాఖగనే పరిగణించేవారు. ఇంతఖర్చుజరిగినను ఆధునికపద్ధతిరక్షణకు తగిన నౌకా, విమాన యాంత్రిక నిర్మాణములు జరుగనేలేదు. బ్రిటీషువిమానదళము, బ్రిటిషు నౌకాదళము, ఇప్పుడు మనదేశమునకు సంబంధములేకుండ తప్పుకొన్నవి. ఇప్పుడు స్వతంత్రతరాగానే దేశరక్షణబాధ్యత అంతయు జాతీయప్రభుత్వం పైనబడినది. ఆధునిక నౌకాదులు, విమానదళాలు చాల వ్యయప్రయాస సాధ్యములు. ఈ ఒడుదుడుకుప్రపంచంలో దేశరక్షణ అవశ్యకర్తవ్యము; కనుక మన జాతీయప్రభుత్వము సైనికవ్యయమును తగ్గించలేకపోయినది. అంతర్జాతీయవిషయాలలో సంఘర్షతత్వముకు బదులు మైత్రిపద్ధతిని విశ్వశాంతిత్వమును గాంధీయాదర్శములను ప్రచారంచేయుటకు ప్రధాన మంత్రి నెహ్రూగారు యత్నించుచునే యున్నారు. పొరుగుననున్న పాకీస్తానుతో సమస్యలలోను అట్టి సౌమ్యపద్ధతనే యిప్పుడవలంబించు చున్నారు. అయితే లోకంలో నీతికి రాజకీయాలలో ప్రాముఖ్యంకలుగువరకు సైనికవ్యయము హెచ్చుచునే యుండును. వెనుకటివలెకాక ఇప్పుడా వ్యయపుసొమ్ము చాలావరకీదేశంలోనే భారతీయులకే ముట్టుచుండును. మరియు వెనుకటివలె దేశరక్షణవిషయంలో స్వీయవిమానాలు, స్వీయనౌకలు నేర్పడి, పరాధీనతపోయి, ఆత్మవిశ్వాసము కలుగుచున్నది. అవి మన వ్యాపారాదులకు ప్రయాణపు అభివృద్ధికిని తోడ్పడుచున్నవి.

### 6. సర్కారు ఉద్యోగుల జీతాలు తగ్గింపు:—

సేవఖర్చునుగూర్చినఅంశములుకొన్ని దీనికనువర్తించును పెద్దఉద్యోగా లిప్పుడు విదేశీయులకుబదులు భారతీయులకే వచ్చినవి. కాని వారి జీతాలు ఇదివరలో అనుకొన్నంత తగ్గించలేదు. ఇప్పుడు వస్తువులన్నిటి ధరలు విపరీతంగా పెరిగినవి. చిన్న ఉద్యోగులజీతాలు హెచ్చించినారు. ఉద్యో

గుల సంఖ్యయు చాల తగ్గిపోయినది మొత్తంమీద సర్కారు నౌకరీ సిబ్బందికున్న వేతన పెరుగుదల వ్యత్యాసము తగ్గినను ఇప్పటికిని ఈ రెండు శాఖల సిబ్బందులను ఆ ఉద్యోగులజీతముల వ్యత్యాసమును ఇంకను తగ్గించవలసియున్నది.

7. స్వదేశీబట్టల రక్షణసుంకము:—

1930 సం॥లోకన్న ఇపుడు విదేశపు మిల్లుబట్టలదాడి మనదేశమునకు తగ్గినది. జాతీయప్రభుత్వమువారు శక్తియుక్తులవల్లను మనదేశపు మిల్లులలో ఇపుడు రకరకముల మంచిబట్ట లుత్పన్నమై లక్షలకొలది పనివాండ్రకు మంచిజీతములు ముట్టుచున్నవి. (ఆంధ్రప్రాంతంలో మాత్రం వృద్ధియగుట లేదు.) కొన్ని విదేశాలకును మన మిల్లుసరకు ఎగుమతి యగుచున్నవి. కాని మంచిరకపు ప్రత్తిపంట పెంచితే బట్టల పరిశ్రమ ఇంకను వృద్ధి యగును. అందుకు పొగాకు పంట తగ్గించవలె పొగాకుస్థానే సారవంతములు భూమిలో ప్రశస్తమగు మంచి ప్రత్తిపంట పండించితే మిల్లుసరుకే గాక అట్టి ప్రత్తిద్వారా ఖాదీపరిశ్రమయు వృద్ధియగును.

8. భారతీయ తీర నౌకరక్షణ:—

స్వతంత్రతగా గానే సహజంగా భారతీయనౌకల కెక్కువ సౌకర్యముల గల్గించినారు. ఇప్పుడు కేవులకోట్లు సగమలనిగనుతి లైసెన్సులు వగైరాల [illegible] యంత్రణలో [illegible] సిండియాకంపెనీ మున్నగునవి విశాఖ పట్టణంలో సర్కారు సహాయముతో క్రొత్తనౌకల నిర్మించి తీర నౌకావ్యాపారం వృద్ధిచేయుచు విదేశాలతోను మన వర్తక నౌకలు ఆహారాదివస్తువులు వ్యాపారం సాగించుచున్నాగా ఇంకను మన దేశపు తీర రక్షణకును అవకాశములు హెచ్చును.

9. ముద్దాయిలకు తగు విచారణ:—

దోషియని ఋజువు కానంతవరకు ఎవరినైన నిర్దోషిగనే భావింపవలె ఆ ఋజువు న్యాయశాస్త్రమునకు సమ్మతమైన సాక్ష్యంద్వారా జరుగవలె నటనే గాక హాజరైన బహిరంగ న్యాయ విచారణలోను దీర్ఘ విచారణ జరుగవలె. ఇక్కడి ప్రజలకు బాధ్యతవహించని పరాయిపాలనలో ఇట్టి

సూత్రము పూర్తిగా వాంఛనీయం. ప్రస్తుత రాజ్యాంగంలోను ఈ సిద్ధాంత మంగీకరించినారు అయితే కొన్ని ప్రత్యేక పరిస్థితు లేర్పడినప్పుడు ఇందుకు కొంత అపవాద మేర్పరచినారు.

హింసావాదులగు విప్లవకారులు జాతీయభావా విడచి అరాజకస్థితి తెచ్చుటకు గూఢంగా దౌర్జన్యచర్యలకు పూనుకొనుచున్నపుడు అందుకు బహిరంగ సాక్ష్యంతో దీర్ఘవిచారణ చేయించుట దేశమునకు హానికరం కావచ్చు. అట్టిస్థితిలో సంఘభద్రతకై ముందే అట్టివానిని నిరోధించుటకు నియమా లేర్పరచినారు.

10. సి. ఐ. డి. శాఖ:—

గూఢచారులద్వారా నేరములు కుట్రలు తెలుసుకొనుట రాజులకు సంప్రదాయసిద్ధమే. అయితే పరాయిపాలనలో ఈ గూఢచారులను దేశభక్తుల నణచివేయుట కుపయోగించిరి. ఇప్పుడట్లుకాక ప్రజాయత్తపాలనలో ప్రతినిధిసభకు బాధ్యతగల మంత్రులే శాఖను నిర్వహింతురు. అయితే యీ శాఖను ఒక రాజకీయపక్షము తమ ప్రత్యర్థిపక్షము నణచుటకు కాక ప్రజాక్షేమమును దేశంలో శాంతిని కాపాడుటకే గూఢచారశాఖ నుపయోగించవలె.

11. ఆయుధముల నాకుక:—

పరాయి ప్రభుత్వము ప్రజల నిర్వీర్యులచేయుటకే ఆయుధశాసనపు నిబంధనలను అమలుజరిపిరి ఇప్పుడా శాసన మున్నను, నిబంధనలు మారినవి. వెనుకటికన్న ఎక్కువ ధారాళంగా యుక్తవర్తనలకు ఆయుధాల లైసెన్సు లిచ్చుచున్నారు అయితే ప్రస్తుతపు అశాంతస్థితిలో హింసావాదిపక్షము అరాజకక్రాంతికి సిద్ధమైనప్పుడు ఆయుధాలు స్వేచ్ఛతో సేకరించి వాటిని దురుపయోగంచేసి హత్యాకాండలను సాగిస్తే సంఘమునకు, శాంతపౌరులకు ప్రాణాపత్తు కల్గును. కనుక దేశంలో నైతికతత్వము బాగా దృఢపడువరకు కొన్ని మార్పులతో చట్టముండవలసి వచ్చుచున్నది.

ఇట్లు 1930 సం॥లో గాంధీగారు సూచించిన ఏకాదశ ప్రణాళికలలో కొన్ని పూర్తిగా అమలుకువచ్చినను, ఇప్పటి తీవ్రస్థితిలో కొన్నిటిని జాతీయ ప్రభుత్వము కొలదిగనే అమలు చేయకల్గినది. స్వాతంత్ర్యలబ్ధితరువాతను

గాంధీగారు ఉద్దేశించిన నైతికోన్నతి ప్రజలలోను, అధికారులలోను ఇంకను కొంతకాలము పట్టును. జనులలోను, ఉద్యోగులలోను దైవభక్తియు, పాపభీతియు కూడ అవశ్యకములు. అట్లు సంఘస్థితిబాగుపడిన కొలది నియమావళులను సులభంగా సవరించవచ్చును.

# 82 అశ్రుతర్పణం

జాతీయజనకుని బలిదానంతరువాత లోకప్రముఖులందరు శోకము దెల్పుచు మహాత్మునిగూర్చి తమభావాలు చెప్పినారు. వాటిలో కొన్నిటిసార మీ క్రింద సంగ్రహించబడినది.

కాని, శ్రీకృష్ణనిర్యాణంగూర్చి అర్జునుడన్నతో చెప్పిన ఈ క్రింది పద్య మీ సందర్భములో జ్ఞప్తికివచ్చును.

'మనసారథి మనసచివుడు, మనదైవము మనగురుండు మనబాంధవుడున్,
మన విభుడు గుణుడు దేవర, మనలను విడనాడిచనియె మనుజాధీశా'.

పం. జవహర్ లాల్ నెహ్రూ:—

మన అమూల్యనిధిని రక్షించలేనందుకు, 'బాపు' నొక భారతీయుకు, హిందువు చంపినందుకు నాకు సిగ్గగుచున్నది. మనమందరము ఆయన బిడ్డలము. ఆయననుండి వ్యాపించు దైవతేజస్సుకణములు కొన్నిటి గ్రహించు అదృష్టము మనకు కల్గినది. ఆ సాత్విక తేజము మూలమూలలను వ్యాపించి దేశమంతను పవిత్రము, శాంతివంతము చేసినది. ఈ క్లిష్టసమయంలో బాపూ మనలను నైతికంగాను ఉన్నతస్థితికి తెచ్చి మార్గదర్శుడయినాడు. ఆ మహాసూత్రములను చిరస్థాయిగ చేసి ఆ నిర్మాణమార్గం అనుసరింపవలె. లేకుంటే ఆయనను శ్లాఘించుటకు మన కర్హతలేదు. ఇప్పుడేకాదు, వేయేండ్లకును ఆయన ప్రవృత్తిబోధన లోకమంతటికీ మార్గదర్శకము కాగలదు; ఇట్లు గుండు కెరయై హఠాత్తుగ దేహం వదలినాడు; స్థితప్రజ్ఞునివలె ఫలమున కాశింపకనే ఆయన నిరంతరం సత్కార్మ జేసినాడు; కాని జీవితంలోనే తనకృషి కొంతవరకైన ఫలించుట గాంచినాడు. చరిత్రలో యుగపురుషు లిట్లు ప్రత్యక్షఫలం

...దగల్గుట అరుదు. నిరంతరసాధనపరుడై ఆయన జీవిత మొక అఖండభక్తి కళ, ఆమహాగీతంలో అపస్వరమే లేక [illegible] శ్రుతి [illegible] [illegible] పొందిన [illegible]లి ఆత్మతేజమింకను వృద్ధిజెంది ప్రకాశమానమై, మరణంనాటికి అద్భుతకాంతితో సర్వశక్తిమయంగా ఉండి ది ఏవ్యాధియులేకుండ తాను కోరినట్లే పూర్ణాహుతిగ బలిదానంకూడజరిగి సర్వవిధముల ధన్యతజెందినాడు. ఆమార్గమును మన మనుసరింపకపోతేనే ఆయాత్మ ఖిన్నమగును. కనుక, ఆబోధనలను అనుసరించుటే మనకర్తవ్యము.

రాజేంద్రప్రసాద్:—

దేహము అస్థిరం. దానిబంధంవదల్చుకొని ఎక్కువస్వేచ్ఛతో లోకక్షేమంకల్గించుటకే ఆయాత్మ దేహమును విడిచియుండును మట్టిముద్దలనే యోధులగజేసి నిరాయుధులచే సామ్రాజ్యదుర్గముల భేదింపజేసిన వీరాగ్రణి. భౌతికంగా కనబడకున్నను ఆయన ఆత్మ సన్మార్గమును మనకు చూపుచునేయుండును. అహింస సాంఘికైక్యం స్థాపించుటకే జీవించి అందుకే ఆయన ప్రాణ మర్పించెను. మనము కోపం ప్రతిక్రియ మాని, ఆయన అంత్యాజ్ఞగు సాంఘికసఖ్యము నమలుచేయవలె.

కిశోరిలాల్ మశ్రువాలా:—

బాపూజీ వీడ్డలము, దుఃఖించుట సహజమే. ఆయనకు స్మారకములు స్థాపించుటయు జరుగును. కాని, ఆయన సిద్ధాంతములను సంస్థలను మనము మనఃపూర్వకంగా అనుసరించి బలపర్చిననే ఆయనపేరు నిలువబెట్టి, నిజమగు అనుచరులము కాగలము.

వల్లభాయి పటేలు;—

ఇది మనకు గొప్పపరీక్షాసమయము. జీవితాంతమువరకు ఆయన చేసిన బోధనలను మనమిప్పుడు మరువక, శాంతి నిగ్రహ వినయాలతో సవ్యంగా వాటిని ఆచరిస్తేనే ఆ ఆత్మకు తృప్తికల్గును. మనజాతిని ఆయన కోరినట్లు సంఘటితంగా దృఢంగా చేయుదుము.

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు:—

ఇది కలియుగపు (పదియవ) అవతారం కావచ్చు. ఈరెండు డొమిని యనులలో ధర్మస్వరాజ్యం స్థాపింపజేయుట గాంధిగారి సంకల్పము. అయితే అది ఆయన కోరినరూపంగా రాలేదు. పరిస్థితులు ఆయన తత్వము నకు వ్యతిరేకముగా మారజొచ్చెను. ఇట్టి భౌతికప్రపంచములో తనకు స్థానం లేదనుకున్నాడు. బుద్ధుని త్యాగము, క్రీస్తు తపశ్చర్య, హరిశ్చంద్రుని సత్యపరత, రాముని పవిత్రత, కృష్ణుని రాజనీతి గాంధిలో మేళవించినవి. ఈ దేశమును ఈ లోకమును ఉద్ధరించదలచి ముందుగా ఆయన అంతశ్శత్రు వులను జయించినాడు. జీవన్ముక్తుడై హింసాయుద్ధపీడితమగు యీలోకము నిమిత్తము బలిదానము చేసినాడు.

లియాఖత్ ఆలీఖాన్:—

మన కాలపు మహాపురుషుడగు గాంధిగారు సాంఘిక సఖ్యత స్థాపనకు సర్వస్వమర్పించినాడు. ఆ అహింసాప్రవక్తజీవితము హింసకు గురియైనది. ఆహా! ఆయన జీవితకృషి సాంఘికఐక్యము సఫలమగుగాక.

ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్:—

ఈ అంధకారదినాలలో ఆయన మనకు శాంతిజ్యోతి.

వౌక్రాసీ పాషా:—

గాంధిమహాత్మునివంటి వ్యక్తి విశ్వజీవితములో యెప్పుడో తటస్థిం చును. అట్టి లోకోత్తరునివధ నరజాతికంతకు అపరాధము, అతిదుష్టము.

రష్యామంత్రి, గ్రోమికో:—

భారతీయుల స్వాతంత్ర్య యుద్ధవిషయములో ఆయన పేరు చిరస్థాయి యగును.

చీనాదేశపు ప్రతినిధి డాక్టరు ఇచ్చియంగ్:—

ఆసియానాయకు లందరిలో ఉత్తముడు, యోగి యగు గాంధి మృతివలన ఆశియా అమూల్యరత్నమును గోల్పోయినది.

మైసూరు మహారాజు:—

గాంధీహత్యకన్న మహానర్ధకము ఉండదు. ఆయన సదాచరణ, తత్వబోధ, కుశలనేతృత్వము మనకు అనుసరణీయములు.

సర్. తేజబహద్దూర్ సప్రూ:—

అందరికన్న న్యాయస్థుడు, దేశభక్తుడు, మన స్వాతంత్ర్యజనకుడు యజ్ఞాహుతి అయినందుకు మనమందరము ఆయన ఉన్నతాశయములను అనుసరింతుముగాక.

మద్రాసు గవర్నరు ఆర్చిబాల్డునై:—

గాంధివంటి మహానాయకుడు విశ్వవంద్యుడు దొరకుట భారతదేశపు సౌభాగ్యము. ఈ ప్రస్తుతకాలములో ఆయన సదాచరణ, సద్భావన, సంయుక్తతా ప్రచారము లోకమునకు యెంతైనా ఆవశ్యకము గాంధి ఖ్యాతి సద్వర్తన ప్రసిద్ధి శాశ్వతంగా ఉండగలవు.

బీహారు గవర్నరు ఆణే:—

గాంధీ పోయినను మన హృదయాలలో ఉండితీరును. ఈ జాతీయాపత్తులో ఆయన బోధనలను అనుసరించుటయే మన కర్తవ్యము.

అస్సాం గవర్నరు అక్బరు హైదరీ:—

గాంధిగారు దేశజనకుడు, అసహాయులకు సహాయకుడు. ఆయన బలిదానము మనకు పథప్రదర్శనము.

సర్దార్ స్వర్ణసింగ్:—

భారతదేశమేగాక లోకమంతయు సర్వోత్తముడగు నైతికమూర్తిని కోల్పోయినది. ఇప్పుడే ఆయన ఆవశ్యకత హెచ్చుగా కలదు

పంజాబు ముస్లింలీగు అధ్యక్షుడు మియాం ఇఫ్తికరుద్దీన్:—

మహాత్ముని మృత్యువుతో గాంధీయుగ మంతరించినది, కాని ఇటీవల తలయెత్తిన దుష్టశక్తులను ఆయన తేజఃకాంతు లణచగలవని ఆయన పవిత్ర లక్ష్యమును మన మాచరించగలమని నా ఆశ.

కేంద్ర పాకిస్తాన్‌మంత్రి చుంద్రిగర్ :—

గాంధీజీ హత్య ఈ రెండు రాజ్యాలకు నష్టకరము. దేశంలో ఆయన కలిగించిన రాజకీయజాగృతి అద్భుతము. ఆయన చరిత్రలో క్రాంతివీరుడు. ఉభయరాజ్యాలు ఆయనహత్యనుండి గుణపాఠము నేర్చుకొని అన్నివిధాల కలహత్వమును మానవలె.

గవర్నరు జనరలు లార్డు మౌంటుబాటెన్:—

గాంధీగారి మరణమువల్ల ఈదేశమునకేకాదు; లోకమంతటికి నష్టము కలిగినది. ఆయన లోకోత్తర పురుషుడు.

శాసనసభ అధ్యక్షుడు మావలంకర్:—

హంతకుడు మహారాష్ట్రుడగుట నాకు సిగ్గుచేటు. గాంధీజీ యుగపురుషులలో మహనీయుడు ఈ హత్య ప్రజాతంత్రతకు మూలచ్ఛేదకము.

రా జా జీ:—

మన ప్రియనాయకుని బలిదానంతో మనలోని యావత్తు ద్వేషము, సందేహము నశించిపోవలెను.

మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్:—

ప్రేమమయుడగు మహాత్ముని ఆత్మార్పణ సాంఘికమైత్రిస్థాపనకై జరిగినది. ఆయనఖ్యాతిని శాశ్వతం చేయవలెను.

రాజకుమారి అమృతకౌరు,—

మన మందరము నిజంగా ఆయన బిడ్డలము. ఆయనవలె మనమును లోకులలో క్రోధమునకుబదులు ప్రేమభావమునే ప్రసరింపజేయుదము.

వినోబాభావే:—

ఆయన ప్రబోధప్రకారము మనము భాష, సాంఘిక, మతవిభేదాలు వదలుకొని స్వతంత్రహిందూస్థానములో సోదరులుగ నడుచుకొనవలెను. మనము ఏకీభవిస్తేనే ఆయనసందేశము లోకమంతట వ్యాపింపగలదు.

అమెరికా అధ్యక్షుడు ట్రూమన్,—

బోధకుడు నాయకుడుగా గాంధిగారిప్రభావము లోకమంతట వ్యాపించినది. ప్రపంచములో శాంతిప్రియులందరికి ఈ మృతివల్ల అపార నష్టము కలిగినది. ఈ సృష్టిలో పురుషోత్తముడొకడు గతించినాడు.

బ్రిటిషు రాజు, ఆరవజార్జి,—

గాంధిగారి చావువల్ల నిజంగా నరజాతికంతకు అపారనష్టము కలిగినది.

బ్రిటిషుప్రధాని అట్లీ:—

ఈ అద్వితీయవ్యక్తినిశనమువల్ల అందరికి దుఃఖము కలిగినది భారతీయ స్వాతంత్ర్యవాంఛను ఆయన వెల్లడించెను. కాని ఆయన కేవలము జాతీయవాదియే కాడు.

డి వేలరా:—

ఆయన మరణానంతరము గాంధీప్రభావము లోకములో వ్యాపించియుండును. భారతీయులు గాంధీ జీవితములో అనుష్ఠించిన మహాశయముల నమలుజరుపుదురని కోరిక.

# 83 సర్వోదయము

ఇప్పుడు మూడవ ప్రపంచయుద్ధము త్వరలో వచ్చునని ముఖ్యరాజ్య ప్రముఖులు అసురతత్వంతో తమ ప్రజలను మరల ఆహుతికి తయారుజేయుచున్నారు. అట్టి యుద్ధమే వస్తే ఈ ఆటంబాంబు విశ్వకిరణక్రిమివిష ప్రయోగాలవల్ల కలిగే అనర్థాలకు మితియుండదు. ఇందులో భౌతికహాని కన్నను నైతికహాని చాలహెచ్చును. అట్టిప్రమాదమునుండి లోకమును తప్పించుటకు ప్రేమాధారమగు గాంధితత్వమే ఆధారము. కనుక మన జాతీయలాభమునకును, లోకక్షేమమునకునుగూడ గాంధివాఙ్మయమును సరిగా సేకరించి ముఖ్యభాషలన్నిటిలో ప్రచురించుటకును గాంధిసంస్థలను పోషించుటకు ఈ కార్యాలకు తగు నిధిని వసూలుచేయుటకుగూడ కాంగ్రెసు

సంఘంవారు తీర్మానించినారు. గాంధిగారి అహింసాతత్త్వము నందరికి జ్ఞప్తికి తెచ్చుటకు బొంబాయివద్ద సముద్రందగ్గర పీఠస్థలంమీద 79 అడుగులయెత్తు గాంధివిగ్రహమును, చుట్టు 79 స్తంభములు స్థాపించినారు. ఇట్లే ఆసిద్ధాంత ప్రచారమునకై ద్రవ్యనిధి వసూలు చేయుటకు రాజ్యాంగనిర్మాణపరిషత్తుకు భారతరాజ్యమునకును ప్రస్తుతపు అధ్యక్షుడగు రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతను ప్రత్యేక సమితి యేర్పడినది ఈమహానిధికి రాజులు, పూంజీపతులు, మధ్యతరగతులవారు, కార్మిక కర్షకులు అందరుగూడ యథాశక్తిగా చందాలిచ్చుచున్నారు. పదికోట్ల రూపాయల నిధి వసూలయినది. ఆ ధనముతో గాంధి స్మారకంగావాఙ్మయప్రచురణయేగాక ఆయన నిర్మించిన నిర్మాణ కార్యసంస్థలన్నింటిని బలపర్చి పోషించవలె. ఈమహాసంస్థలన్నియు గాంధీమహాత్ముని బిడ్డలవంటివే. ఆయనకు స్మారకచిహ్నాలే. ఇటీవల నిర్మాణకార్యపరులు సేవాగ్రామంలో సమావేశమయి గాంధితత్త్వమును చిరస్థాయిగ జేయుటకు సంప్రదించి చర్చలు సాగించినారు.

గాంధిసిద్ధాంతముల నాచరణలో పెట్టుటకు లోగడయేర్పడి పనిచేసిన కార్యకర్తలు, గాంధిసేవాసంఘపుప్రముఖులు ధోత్రే, వినోబాభావే, ఘోష్, మష్రువాలా, జాజూ ఇత్యాది గాంధిశిష్యులు అనుభవాధారమగు తమ సూచనలజేసినమీదట కొన్నినిర్ణయములు జరిగినవి. ఇంతవరకు సాగుచున్న చరఖాసంఘం, గ్రామపరిశ్రమసంఘం, తాలిమీసంఘం, గోసేవాసంఘం, హరిజన సేవాసంఘాలన్నిటిని సంఘటితంచేసి నిర్మాణకార్యములను సమన్వయించి సాగించుటకు నిశ్చయించినారు. ఇందులో అభిమానంకలిగి అహింసాతత్త్వం విశ్వసించి యీకార్యంసాగించ దీక్షవహించువారు 'సర్వోదయ సమాజం' అని యేర్పడ నిశ్చయించినారు. దానికి డా. రాజేంద్రప్రసాదుగారధ్యక్షులుగనుందురు. వీరందరు సర్వోదయముకు జనులందరి క్షేమపు విశాలదృక్పథంతో వర్తింపవలె. దీనికి కార్యవర్గము సర్వసేవాసమితి.

సర్వోదయ సమాజం పుట్టుపూర్వోత్తరాలను గురించి శ్రీ రాజేంద్రప్రసాదుగారు హరిజన్‌పత్రికలోవ్రాసిన వ్యాసము యిందు పొందుపరుపబడుచున్నది.

# 84 వార్ధాసభ

నిర్మాణకార్యక్రమములోని పలువిధములైన కార్యకలాపములను కొనసాగించుచుండిన ప్రచారకులు తమ అనుభవములను అభిప్రాయములను పరస్పరముగా తెలియజెప్పుకొనుటకును నూతన పరిస్థితులలో తమ కార్యక్రమమును ప్రశస్తముగా కొనసాగించుటకు తగు అనువైన మార్గములగూర్చి ఆలోచించుటకును సభను 1948 ఫిబ్రవరి మాసములో వార్ధానగరమందు జరుపవలెనని గాంధీజీతో సంప్రతించినపిమ్మట నిర్ణయింపబడెను. గాంధీజీ యీ సభకై ఢిల్లీనుండి బయలుదేర సంకల్పించియుండగా నిర్యాణపు ఘోర విషాదము సంభవించెను. అంతటితో సమావేశము నిల్చిపోయెను.

గాంధిజీమరణానంతరము 1948 సం॥ మార్చి 13, 14, 15 తేదీల యందు ఆసమావేశము జరిగెను. దేశములోని అనేకప్రాంతములనుండి సుమారు 500 ప్రచారకులును పండిత నెహ్రూ, మౌలానా ఆజాదు, రాజకుమారీ అమృతకౌరు, జయరామదాస్ దౌలతరామ్‌గార్లును (ఇండియా ప్రభుత్వ మంత్రులు) చాలమంది రాష్ట్రమంత్రులును, ఆచార్య కృపలానీ, జయప్రకాశ్ నారాయణ మున్నగు ప్రముఖనాయకులు సభకు విచ్చేసిరి.

## రెండు ముఖ్యసమస్యలు

ఈ మహాసభ ముఖ్యమైన రెండు సమస్యలనుగూర్చి చర్చించెను. గాంధీజీ 50 సంవత్సరముల కృషిలో ఒక ప్రత్యేక జీవితపద్ధతిని అనుసరించెను; దేశ స్వాతంత్ర్యమును సాధించుటకొరకై భారతజాతియందుగల సంస్కృతిని ఆత్మిక శక్తిసంపదను సంఘటితమొనర్చెను. ఆయన సాగించిన పోరాటము కొత్తపద్ధతి ననుసరించినది. సత్యము అహింస యనెడి రెండు ధర్మములను తన సాధనముగా స్వీకరించి ఆయుధబలముతోకూడిన ఒక బ్రహ్మాండమైన రాజ్యమును ఎదిరించెను ప్రపంచముతో నిమిత్తములేకుండ సర్వసంగపరిత్యాగియైనవారికిమాత్రమే కాక ఆయన బోధించిన ధర్మసూత్రములు కార్యక్రమము ప్రతివారును తన నిత్యకృత్యజీవితములో అనుష్ఠించ

దగినవే. ఆయన జీవితములో ఆయన బోధించిన విషయములన్నియు అనంతర పురుషాంతరములవారికి లభ్యమగునట్లుగా ఆయన ప్రవచనములన్నియు భద్ర పరుపబడినవి.

ముందుగా నిర్మాణ కార్యప్రచారకులలో ముఖ్యులు కలిసి వివిధ విషయములను చర్చించి సభా కార్యక్రమమును నిర్ణయించి చిత్తుతీర్మాన మునుగూడా తయారుచేసిరి. ఈ ప్రారంభ చర్చలకు హాజరైనవారందరును ప్రతివిషయమును నిష్కపటముగా సాంగోపాంగముగా చర్చించిరి. గాంధి మహాత్ముని బోధలును ఉపదేశములును లోకోపకారకములు, వాటిని ప్రజలు పరిచుటకును అనుసరించుటకును మనము ఏవిధముగా కృషిచేయవలెను? అందుకొరకు ప్రత్యేకసంస్థయొకటి ఉండవలెనా? ఇట్టి సంస్థ కొన్ని క్రమశిక్షణ నియమములకు లోబడి కట్టుదిట్టమైన సంఘమువలె పనిచేయ వలెనా? ఆరీతిగాగాక మహాత్ముని ఉపదేశములయందు నమ్మకము గలవా రందరును తమ సొంతజీవితములందు వాటిని యధాశక్తిగా అనుసరించుచు తమవలెనే మహాత్ముని ఉపదేశములను నమ్మియనుసరించు ఇతరులతో కలసి ఒక వర్గముగా చేరియుండిన చాలునా? అని చర్చించిరి.

# గాంధి విధానము

గాంధీమహాత్ముని సర్వాంగీణజీవనములో ఆయన ఉపన్యాసముల లోను నడతలలోను వ్రాతలలోను ప్రజాజీవితమునకు సంబంధించిన అనేక విషయములను తర్కించి, పరిశీలించియుండెను. ఆయన చర్చించని సార్వ జనిక విషయము లేదని చెప్పవచ్చును. ప్రభుత్వ వ్యవహారసమస్యలు మొదలుకొని వంటయింటివిషయాలు, పాయఖానాలపరిశుభ్రతవరకు ప్రజాక్షేమమునకు సత్యజీవితమునకు సంబంధించిన అత్యల్పవిషయాలుకూడా ఆయన పరిశీలించియుండెను. ఆయనకు బ్రహ్మాండమైన విషయమనేదేలేదు. అత్యల్పమైన విషయమనేదీలేదు. స్వల్పవిషయమని భావించి తృణీకరించిన దిన్నీ లేదు

ఆయనజీవితమంతయును సత్యపరిశోధనతో గడచెను. అందుచేతనే ఆయన తన స్వీయచరిత్ర గ్రంథమునకు "సత్యాన్వేషణము" అని నామకరణము

చేసెను. ఈదేశానికి ప్రపంచానికి సంబంధించిన సాంఘిక, రాజకీయ, ఆర్థిక సమస్యల నన్నింటిని పరిష్కరించుటకు ఆయన సిద్ధాంతములను ఏరీతిగా వర్తింపజేయవలెనో విశదీకరించుచు కూలంకషమైన పార్యగ్రంథము నొకదానిని రచింపవలసినదిగా ఆయనను కొందరు కోరియుండిరి. ఆ యా సందర్భావసరములనుబట్టి తన మూలసిద్ధాంతములను తాను వర్తింపజేయుచు ధర్మసాధన చేయుటేగాని సిద్ధాంతభాష్యము నొక సమగ్రగ్రంథముగా వ్రాయజాలనని ఆయన చెప్పెను. కాబట్టి స్థిరసిద్ధాంత ప్రమాణసూత్రములను విపులంగా నిర్వచించుచు పార్యగ్రంథమువలె రచించుట ఆయిన అభిమతము కాదు ఆయన జీవితానంతరముకూడా అట్టి మహాగ్రంథరచనచేయుటకు సమయమురాలేదు, కొంతకాలము గడచిన తర్వాత గాంధిపద్ధతుల ననుసరించెడివారు ప్రత్యేకించి గాంధిసాంప్రదాయకులని పిలువబడుచు ఒక ప్రత్యేకశాఖగా ఏర్పడుట సంభవించవచ్చును. ఒక ప్రత్యేకసంఘము నేర్పాటుచేసినయెడల అటువంటి పరిస్థితి ఏర్పడవచ్చునని కొందరికి అనుమానము కలదు.

# సత్యానుష్ఠానం

## దేశరత్న ప్రసాదుగారి నిర్వచనము.

గాంధీజీ అలౌక్యుడుకాడు. అధ్యాత్మిక వేదాంత విషయములతో ప్రత్యక్ష ప్రపంచమునకు సంబంధము లేకుండా మాట్లాడేవాడు కాడు. మానవులయొక్కయు సంఘముయొక్కయు నిత్యకృత్య జీవితములో అనుష్ఠించుటకు తన పవిత్ర సిద్ధాంతములు సుసాధ్యమైనవని విశ్వసించి ఆచరించుచు, వాటిని అనుష్ఠింపవలెనని ఆయన బోధించెను. సత్యము, అహింస ఇవి రెండును ఆయన మూలసూత్రములు. వాటిని జీవితములో క్రియారూపంగా వర్తింపజేయుటకొరకే ఆయన నిర్మాణకార్యక్రమమును నిరూపించెను. అహింసకూడా సత్యముయొక్క అంశాభేదమే, రూపాంతరమే, మరొకటి కాదని ఆయన నిరూపించెను. కనుక 'సత్యమేవ జయతే' అను సూక్తిని ప్రధాన ధర్మసూత్రముగా ఆయన అవలంబించెను. ఆయనకు సత్యమే

భగవత్స్వరూపము. మానవసంఘము సత్యము నాశ్రయించుకొని వర్తించని యెడల దానికి సార్థకతలేదు. కాబట్టి మానవులున్ను మానవసంఘమున్ను ఆయన కోరిన పరిపక్వస్థితిని పొంది ఉన్నతస్థితికి రాగలవారలగుటకై ఆయన తన నిర్మాణకార్యక్రమ విధానమును నిరూపించెను. మోక్షమునకు అనేక సాధనోపాయములు అనేక మార్గములు ఉన్నట్లుగానే, మానవులు సంపూర్ణమైన ఆత్మవిశ్వాసమును పొందగలుగుటకు వేర్వేరు కర్మానుష్ఠానములను ఆయన తన నిర్మాణ కార్యక్రమములో సూచించియుండెను. కేవలము బుద్ధిసామర్థ్యము చేత ఏకాగ్రచిత్తతవల్ల జ్ఞానగరిష్ఠుడై, మైకమనెడి ఆత్మ సంతృప్తిచెందక నిత్యజీవితములోని మన ప్రవర్తనయందు అనుష్ఠింపదగిన కార్యక్రమము మూలముగా ఆత్మసంస్కారము పొందవలెనని ఆయన నిర్ణయించెను. కనుక, ఆయన నిర్వచించిన సిద్ధాంతములను ఏరీతిగా ప్రవర్తింప జేయవలెననే విషయమును చర్చింపవలసియున్నది.

## నిబంధ సంస్థ

మానవులు మనస్ఫూర్తిగా అంతరాత్మప్రబోధితులై ఏ ధర్మమార్గమునైనను అనుసరించవలెనుగాని, బాహ్యనిబంధనలకు, నిర్బంధములకు లోబడి అనుసరింపరాదని గాంధీజీ అభిమతము. బాహ్యనిబంధనలకు చట్టములకు మాత్రమే బద్ధులై నడచువారు ఒకవిధంగా ఆత్మవిశ్వాసములేనివారు లేక అంతరాత్మకు వ్యతిరేకంగా ప్రవర్తించినవారగుదురు. ఆయనజీవితంలో ఆయనమూర్తిమాత్రమే మనలను ఏకకూటంగా ఆకర్షించియుండినయెడల ఆ భౌతికమూర్తి - ఆ భౌతికస్వరూపము అగ్నికి ఆహుతియైనందున ఆయన ఉపదేశానుసారులందరు చెల్లాచెదరైపోవుట సంభవించును. అందువల్ల అట్టి గాంధిధర్మానుచరుల నందరిని ఏకముఖముగా నాకర్షింపగలుగుటకై మధ్యమార్గము నొకదానిని అనుసరింప నిశ్చయించితిమి. యథాశక్తిగా గాంధి ఉపదేశములను అనుసరించుచున్నవారు కలరు. అట్టివారినందరిని సమాకర్షించుటకు ఈ ఐచ్ఛికసంఘము నేర్పాటు చేయదలచితిమి.

అట్టి సంఘమును ఏర్పాటుచేసేయెడల ఆసంఘములో చేరువారికి సభ్యత్వమనేది ఏదైనా ఉండును. అట్టి సభ్యత్వమునకు పరతు నియమములు ఉండునా, సభ్యుల జాబితా అనేది ఏదైన ఉన్నయెడల సభ్యుడుగా చేరెడి వానికి తగిన యోగ్యతార్హతలు కలవా, యనెడి సమస్య బయలుదేరును. సభ్యులజాబితా అనవసరమని కొందరికి తోచెను. కాని, ఏ స్వల్ప బాధ్యతలతోనో సభ్యత్వమనేది ఉండవలెననియు సభ్యులజాబితా యొకటి యుండవలెననియు మరికొందరు వాదించిరి. కనుక, గాంధిధర్మోపదేశములయందు నమ్మకము కలవారును, అట్టి ధర్మోపదేశములను అనుష్ఠింపదలచువారును, నిర్మాణకార్యక్రమముల వివిధసంస్థలును, ముమ్ముందు ప్రతిష్ఠింపబడగల సంస్థలను, కొనసాగించు కార్యక్రమములను అనుసరించువారును యీ సహచర వర్గములో చేరుటకు అర్హులైయుందురు. కాబట్టి యిందులో చేరుటకు అర్హుడనుకొను ప్రతివారును సభ్యులుగ చేరవచ్చును. అట్టివారి దరఖాస్తును స్వీకరించి, కార్యదర్శి నమోదుచేయును. సభ్యుడు అనిగాని "సభ్యత్వ" మని లేకయున్నను "సేవకుడు" అనిగాని "సాధకుడు"అని గాని "ప్రచారకుడు" అనిగాని అట్టి దరఖాస్తుదారు వ్యవహరింపబడును.

## నామకరణము

దీనికి "సంఘము" అనేపేరు వర్జింపబడెను, కొన్ని నియమ నిబంధనలు కలదే సంఘమనిపించుకొనును. నిర్నిబంధమైన కూటమగుటవల్ల దీనిని "సమాజము" అని వ్యవహరింపదలచితిమి. కొంత చర్చ జరిగి దీనికి "సర్వోదయ సమాజము" అని నామకరణము చేయబడెను. "సర్వోదయ" అను శబ్దమును గాంధిమహాత్ముడే ప్రయోగించి యుండెను. తన ఉపదేశముల ఉద్దేశము ఫలితము "సర్వోదయ"మని గాంధీజీ చెప్పుచుండెను. గాంధీజీ ఉపదేశముల అనుష్ఠానభాగమును నిర్మాణ కార్యక్రమ సేవకులు జ్ఞప్తియందుంచుకొనుటకు యీ పేరు తగియున్నది. జాతి మత కుల విభేదములేకుండ వ్యక్తులు వర్గములుకూడా అభివృద్ధిజెంద సమానావకాశములిచ్చుచు పరస్పర పీడనకు వంచనకు స్థానమీయని సాంఘికవ్యవస్థను అహింసాసత్యము లనెడి ధర్మసూత్రముల ననుసరించి ఏర్పాటుచేయ కృషిచేయుటకు యీ

సర్వోదయసమాజము ప్రతిష్ఠించడమైనదని తీర్మానము చెప్పుచున్నది. నిర్మాణ కార్యక్రమములో చేరియుండెడి వేర్వేరు కార్యకలాపములు యీ తీర్మానములో పేర్కొనబడెను. ఈసిద్ధాంతములను ఆమోదించి ఆచరింప నిశ్చయించు వారందరు యీ సమాజములో సభ్యులుగాచేరుటకు అర్హులగుదురు.

# వార్షిక సమావేశము

దీనిలో చేరినవారందరును సమావేశమగు నిమిత్తము ప్రతిసంవత్సరము జనవరి 30 తేదీని ముందుగా నిర్ణయింపబడు నొక ప్రాంతంలో సమ్మేళనము జరుగవలెను. ఇది కాంగ్రెసు మహాసభవలె జరుగదు. సమ్మేళనమునకు వచ్చెడి ప్రతినిధులకు వసతి సౌకర్యములకై విశేషంగా ద్రవ్యం ఖర్చుచేసి ఆహ్వానసంఘంవారు ఏర్పాట్లు చేయరు.

అందుకువచ్చేవారు, ఎవరివసతులకు వారే ఏర్పాట్లుచేసుకోవలెను. వారికోసం స్థానికులుచేయునవి పారిశుద్ధ్యాది సౌకర్యములుమాత్రమే. ఇచటికి వచ్చినవారు తమ స్వానుభవములనుగూర్చి తెలియ చెప్పుకోవచ్చును. వారివారి అభిప్రాయములను తెలుపు వ్యాసములను వ్రాసి ప్రకటింపవచ్చును.

# క మి టీ

పై జెప్పిన తీర్మానమును అమలుపరచునిమిత్తము ఒక కమిటీని ఏర్పాటు చేయవలసినదిగా ప్రెసిడెంటుకును శ్రీ కిశోరిలాలు మశ్రువాలా గారికిని అధికార మివ్వబడెను. గాంధీజీ ఉపదేశములకు ప్రామాణికముగా అర్థముచెప్పగల గురుపీఠముగా యీకమిటీని పరిగణించరాదు. ఉపదేశములన్వయించుటలో కలిగెడి వివాదములకు యీ కమిటీ తీర్పు చెప్పగలదని భావించగూడదు. ఈ సమాజమును ఒక ప్రత్యేక మతశాఖవలెగాని గా
కీయ పక్షమువలెగాని తయారుచేయకూడదు. ఈ సమాజముగాని
గాని అట్టి పని చేయకూడదని ఏకగ్రీవంగా ఆమోదింపబడెన
చేరెడివారి రిజష్టరుమాత్రము యీ కమిటీ తయారుచేయగ

సమ్మేళనము ఎప్పుడు జరుగవలెనో యీ కమిటీ నిర్ణయించును. వేర్వేరు ప్రాంతాలలో ఉండే మెంబర్లకందరకు యీ కమిటీ అనుసంధానకర్తగ నుండును.

# సర్వోదయ సమాజము

ఈ సర్వోదయ సమాజము ప్రత్యేకంగా ఒక సంస్థవలె వ్యవహరించదు. కాని దానిలో చేరిన సభ్యులందరును నిర్మాణకార్యక్రమము నిమిత్తమై తమశక్తికొలది కృషిచేయగలరని ఉద్దేశము. ప్రతిసభ్యుడు తనకుసాధ్యమైన కార్యక్రమమును మహాత్ముని ఉపదేశముల కనుగుణముగా నిర్వర్తించుచుండవలె. కాని, యీ సమాజముపేరుతోగాని యీ సమాజముతరఫునగాని ఆతడు నిర్వర్తించునది ఏమీ ఉండదు.

ఈ సమాజములో చేరెడివారు ప్రపంచమంతటను విస్తరించియుండగలరు. అట్టిసందర్భములో ఈసభ్యులసంఖ్య చాలా హెచ్చుగా నుండగలదు. ఈ సమాజసభ్యులద్వారా మహాత్ముడిచ్చిన జ్ఞానజ్యోతి ఖండాంతరములందును ప్రకాశమానముగా వెల్గొందగలదు.

చర్చింపబడిన విషయములలో రెండవది ఏదనగా అఖిలభారత చర్ఖా సంఘము, గ్రామోద్యోగ సంఘము, హిందుస్తానీ తాలిమీసంఘము, గోసేవా సంఘము, హిందుస్తానీ ప్రచారసభ మొదలైనసంఘము లనేకములు నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుచున్నవి. ఇట్టి వివిధసంఘములతో కలిసి యీ సమాజము ఎంతవరకు పనిచేయుపలయును అనే విషయము చర్చింపబడెను. ఈసంఘములు కాంగ్రెసుయొక్క ఆదరాభిమానములతో గాంధి మహాత్మునిచే ప్రతిష్ఠింపబడెను. ఇటువంటి సంఘములలో చేరి పనిచేయ గోరువారు చాలమంది ఉన్నారు. అట్టివారినందరిని ఏకముఖముగా సమ కూర్చుటకు ప్రయత్నించవలెనని గాంధీజీకోరెను. పైజెప్పిన సంస్థలకు పెక్కింటికి గాంధీజీ ప్రెసిడెంటుగానుండెను. ఆయన ప్రెసిడెంటుగాలేని సంస్థలనుకూడా ఆయన తన సదుపదేశములతోను సలహాలతోను నడిపించుచునేయుండెను. ఈ సంస్థలన్నియు పరస్పరసహాకారముతో పనిచేయ

గల్గుటకును, ఈసంస్థలలో కొందరు నిర్వాహకులను నియమించుటకు, యీ సంస్థలను గాంధీజీ నడిపించుచున్నట్లుగా నడిపించుట కొకసంస్థను ఏర్పాటు చేయవలెను. గాంధీజీమరణానంతరము ఇది అత్యంతావశ్యకము.

అయితే వీటిలో ప్రతిసంస్థయును దేనికది స్వతంత్రంగా వ్యవహరించుచున్నందున వీని నన్నింటిని ఒకే కేంద్రాధికారముక్రింద బంధించి యుంచుటకు ఈ సభవారు నిర్ణయించలేదు. కాని యీ సంస్థలతరఫున ప్రతినిధులు చాలమంది యీ సభకు వచ్చిరి. ఈసంస్థలన్నింటిని ఏకముఖముగా నడిపించగల కేంద్రపీఠమొకటి యుండవలెనని మాత్రము ఆ ప్రతినిధులు కోరిరి. కాబట్టి ఈసంస్థలన్నింటితో కలిసి సంప్రదించి అట్టికేంద్రాధికారపీఠము నొకటి ఏర్పాటు జేయుటకు జె. సి కుమారప్పగారిని నియమించడమైనది.

నిర్మాణకార్యక్రమమనునది కాలముగడచినకొలది అంతకంతకు బహుముఖములుగా విస్తరించునట్టిదై యున్నది. అందువల్ల ఉత్తరోత్తరా ఇంకా అనేకసంస్థలు ఏర్పడవచ్చును. కాబట్టి ఒక కేంద్రసంస్థ ఏర్పడేయెడల అది యిప్పుడున్న సంస్థలకు మాత్రమేగాక ఉత్తరోత్తర ఏర్పడగల సంస్థలకు కూడా కేంద్రపీఠముగా నుండవలెను.

## మత కుల సంఘ సామరస్యము

ఈ సభవారు పైజెప్పిన రెండువిషయములను ముఖ్యంగా చర్చించిరి. కాని గాంధీజీ తన చివరిదినములలో మతసంఘముల సామరస్యమునకై ఎక్కువగా కృషిచేయుచూ, అందులకే తనప్రాణము లర్పించెను. కనుక యీ మత సంఘ సామరస్యమునకై కొంత పనిచేయవలసియున్నదని యీసభకు హాజరైనవారందరును తలంచిరి. ఈ సాంఘిక సామరస్యము చాలా ప్రధానమని గాంధిజీ వాదించెను. కాని, దురదృష్టవశమున, ఆవిషయములో ఆయన దృఢప్రయత్నములను లోకులు అపార్థము చేసికొనసాగిరి. కనుక ఆ ప్రయత్నములకు చిక్కులు పెరిగెను. ఈ హిందూ

మహమ్మదీయ సంఘర్షణవల్లనే దేశము రెండు రాజ్యాలుగా విభాగమయినది. దానిచర్చ గతజలసేతుబంధనము.

దేశవిభాగమునకు పూర్వమును అనంతరమునూ సాంఘికోద్రేకంవల్ల దేశము చాలా సంక్షోభముపాలైనది. వేలకొలది స్త్రీలు పురుషులు ప్రాణములు గోల్పోయిరి. కోట్లకొలది సొత్తు నాశనమయినది. లూటీచేయబడినది. లక్షలకొలది హిందువులు సిక్కులు మాత్రమేకాక మహమ్మదీయులుకూడా స్వస్థానములను విడనాడి కాందిశీకులై అష్టకష్టములపాలై అన్యప్రాంతములకు వెళ్ళిరి.

# గాంధీ పంథా

ఈ విధమైన పరస్పర ద్వేషప్రకోపము నరికట్టుటకే గాంధీజీ తన తపస్సునంతను ధారబోసెను; ఆయన జీవితపు అంత్యదినములలో హిందూ మహమ్మదీయ సద్భావ స్థాపనకై నిరంతర కృషిచేసెను. ఇంతటి క్లిష్టమైన ప్రచండసాంఘికద్వేషమును తన అప్రతిమానాస్త్రమైన అహింసావిధానముతో తొలగింప పాటుపడెను. భారతదేశములోని హిందువులు సిక్కులు ఇత్యాదులు ఇచట మహమ్మదీయులకు అభయహస్త మొసంగి వారికి ధైర్య విశ్వాసములను కల్పించితే, పాకిస్థానులోని మహమ్మదీయులుకూడా అదేవిధముగా మహమ్మదీయేతరఅల్పవర్గముకు అభయహస్తము నొసంగగలరని ఆయన నమ్మి, ఆ విధముగా బోధించెను. అచంచలుడై ఆ విషయము నొక్కి వక్కాణించెను. కాబట్టి పాకీస్థానుముస్లిములెట్లు వర్తించినను మనమట్టుకు మనదేశములో మహమ్మదీయులను మన సోదరులవలెఆదరించవలెనని గాంధీజీ బోధించెను.

మన సాంఘిక జీవితములోని యీ విద్వేష విషబీజములను నిర్మూలించవలెను. ఈ విషయములో గట్టి నమ్మకము సద్భావముగల స్త్రీలు, పురుషులు తమ వ్యాపార వ్యవహారములలోను తమ జీవిత కార్యకలాపములలోను యిట్టి సామరస్యమునకై కృషిచేయవలెను. కాబట్టి గాంధీ సిద్ధాంతము

లందు విశ్వాసముకలవారును ఆయన అనుయాయులును ఈ విషయమును అవశ్యకర్తవ్యముగా భావించి, దానికొరకు దీక్షగా పనిచేయవలెననియు సభవారు కోరిరి.

లక్షలకొలది జనులు క్రూరకృత్యములకు లోబడి దుర్భరకష్టములచే హృదయావేదన పొందుచున్న స్థితిలో వారికి తృప్తికరమగు నివాస సౌకర్యములను చూపించకుంటే ఆయా మతసంఘములవారికి సవ్యమైన సామరస్యముగాని, చిత్తస్వాస్థ్యముగాని కలుగనేరదు. కాబట్టి జాతి మత కుల వివక్షత లేకుండా, యీ కాందిశీకులకందరికి సహాయము చేయవలె. ఈ పునరావాస సౌకర్యములకార్యము చాలా బ్రహ్మాండమైన పని. ఏ అనధికారసంస్థయైనను యీ పనిని నిర్వహింపజాలదు. ప్రభుత్వమువారి విశేష ద్రవ్యాధారము, దృఢసంకల్పముతోను యీ పని నెరవేరవలె. ప్రభుత్వము తన శక్తి, తన సంపత్తులతో చేయతగిన సహాయము చేయుచునేయున్నది. కాని అనధికార సంస్థలును యీ విషయములో అనేకవిధములుగా తోడ్పడవచ్చును. అందువల్ల యీ కాందిశీకసహాయవిషయమై ఈ నిర్మాణ కార్యక్రమ ప్రచారకులకు విజ్ఞాపన జరిగి, దానిఫలితముగా వినోబాభావేగారు సామర్థ్యానుభవము గల కొందరు ప్రచారకులను కాందిశీకులకు సేవచేయ తీసుకొనివెళ్ళుటకు, ఎట్టిసేవ సాధ్యమగునో పరిశీలించుటకు బయలుదేరుచున్నారు.

# శాంతి దళములు

ప్రజానీకంలో శాంతిని నెలకొల్పుటకే ప్రజాసేవకులను కొందరిని ఒక బృందముగా సమకూర్చవచ్చును. అది అవసరమని గాంధిమహాత్ముడు చాలకాలము తలంచుచుండెను. కాని, అనేక కారణాలవల్ల ఆయనజీవితంలో అది నెరవేరలేదు. సాంఘిక విద్వేషముల నివారణకు ఇటువంటి సంస్థ యొకటి కావలసియున్నది. కాబట్టి "శాంతి సేవాదళము" నెలకొల్పుటకు ప్రయత్నము చేయవలసియున్నది. ఈ దళము కొట్లాటలను, అల్లరులను అణచివేయు పోలీసుదళమువంటిది కాదు. ప్రజలలో అల్లరులు కొట్లాటలు

రాకుండా వారు ప్రజలలో సామరస్యమును వృద్ధిచేయుచు ప్రజలతో కలిసి మెలిసి పనిచేయవలె. ఒకవేళ కొట్లాటలు బయలుదేరినయెడల ఉభయ పక్షములవారికి మధ్య యీ శాంతిదళ సైనికులు నిలవబడి అట్టి కలహములను నివారించవలె. లేదా అట్టి సంఘర్షణ తీవ్రతను ఉపశమింపచేయవలె, ఈ శాంతిదళము నిరాయుధమైనది, పూర్తిగా అహింసాదీక్షాబద్ధమును, కనుక యీ పనిని నిర్వర్తింపగల్గును.

సర్వోదయ సమాజపు మొదటిసమావేశము 1948 సం మార్చిలో సేవాగ్రామంలో జరిగినది. బాపూజీనిర్యాణంవల్ల దుఃఖనిమగ్నులై, ఆ శోకవాతావరణంలో ఆయనసహచరులు అనుచరులు నిర్మాణకార్య సంస్థలు ఛిన్నాభిన్నంకాకుండ కాపాడుట కంములో చర్చలు జరిపిరి. 1949 సం॥లో ఇండూరురాజ్యంలో 'రావు' గ్రామంలో ద్వితీయసమావేశం జరిగి, ఆయా నిర్మాణకార్య సంస్థలింకను గాంధీయాదర్శములను నిలువ బెట్టుచు తమతమ వ్యక్తిత్వం కాపాడుచు, కృషిచేయు ప్రణాళికలు నిర్ణయింపబడెను.

ఈ సారి 1950 సం॥ జాతీయవారంలో అనగా ఏప్రిలు 6 వ తేదీ నుండి 13 వ తేదీవరకు మరల ఈ సమాజసదస్యులు ఉత్కళరాజ్యపు (కటకముకు 75 మైళ్ళ దూరముననున్న) అనుగుళ (=అనుకూల) గ్రామంలో ఈ సాలు సమావేశం జరిగించిరి. 600 మంది దాని సదస్యులేగాక నిర్మాణ కార్యక్రమంలో ప్రత్యేకి కృషిచేయు మరి 600 మందియు అక్కడి సామాన్యసమావేశాలలో పాల్గొనిరి. ఖాదీ, గ్రామపరిశ్రమలు, బేసికువిద్యా విధానం, హిందూస్తానీప్రచారం, గోసేవ, అస్పృశ్యతానివారణ, ఆదివాసుల ఉద్ధరణ, ఇట్టి నిర్మాణకార్యక్రమపు వివిధాంశములు ఆయా రోజులలో వరుసగా చర్చింపబడినవి. ఆయా సంస్థల కార్యవర్గములును ప్రత్యేక సమా వేశాలలో వాటి విడిసమస్యలను పరిశీలించి నిర్ణయాలుచేసిరి. ఈ అన్నిటి సామాన్యసమావేశములు చివరను జరిగి, వాటిని సమన్వయించు సర్వోదయ సిద్ధాంతము విశదీకరింపబడినది. డా. కుమారప్ప, శ్రీ జాజు, కృష్ణదాసగాంధి, కాకా కాలేల్కరు, డా. ప్రఫుల్లఘోష్ మున్నగు గాంధీసహచరులగు నిర్మాణకార్యప్రముఖులు దయచేసి, జనుల సందేహములు నివారణచేయుచు

గాంధీయాశయములను మరల వివరించి చెప్పిరి. సర్వోదయ సమాజము నొక సంఘంగా ఉద్దేశించలేదు; కనుక అందులో నిర్ణీతమగు తీర్మానముల జేయలేదు. ఖాదీ, గృహపరిశ్రమలు ఇత్యాదుల మహాప్రదర్శన మొక్కటి చక్కగ జరుపబడినది ఇంతవరకు చరఖాసంఘం గ్రామపరిశ్రమ సంఘం, నయీతాలిమీసంఘం, గోసేవాసంఘం, హరిజన సేవకసంఘం ఇట్టి అఖిల భారత నిర్మాణ కార్యసంస్థలు అన్యోన్య సంబంధంలేకుండ విడివిడిగ పని చేయుచున్నవి. ఇక ముందు, అట్లుకాక, ఈ అన్ని సంస్థలకు సర్వసేవా సంఘం అను ఒకే విశాలసంస్థ మాతృసంస్థగ నుండును. దానిశాఖలుగ ఆయా సంఘములు పరస్పరసమన్వయముతో సర్వాంగీణమగు ప్రజాసేవ చేయుచుండుటకు వార్షికసమావేశంలో నిర్ణయించినారు. కనుక ఇకముందు మహాసంస్థ సర్వసేవాసమాజ మనబడుచు, లోకసేవ చేయుచుండును. ఈ సంఘము అహింసా సత్యములే జీవితాదర్శములనియు, వాటిపై నాధారపడిన నిర్మాణకార్యక్రమపు వివిధాంశములన్నియు, అన్యోన్య సంబంధములనియు, వాటినన్నిటిని మనము యథాశక్తిగ ఆచరించుట కర్తవ్యమనియు ఈ రీతిగ విశదము చేసినారు.

# 85 విశ్వరంగం

మహాయుద్ధపుదావాగ్ని చల్లారినది. జర్మనీ జపాను లణిగినవి. కాని అందులో మిత్రులయిన ఆంగ్ల అమెరికా రాజ్యాలకు, సోవియటురాజ్యాలకు మధ్య ఇటీవల సంఘర్షము హెచ్చుచున్నది. స్వాధిక్యమునే సాధించుకో దలచి ఇతర రాజ్యాల ననుమానించి ద్వేషించుచు సాయుధ భద్రతద్వారా యుద్ధవిరామము కల్గింతుమనుచునే మహారాజ్యాలు ఆధునిక విజ్ఞానపు సాయంతో రహస్యంగా ఆటంబాంబు, హైడ్రోజిన్ బాంబు, విశ్వకిరణాలు ఇట్టి సాంఘాతిక మారణపు యంత్రసాధనాలు తయారుచేసి, తాము శత్రు సంహారం అద్భుతంగా చేయగలమని ప్రగల్భాలతో బెదిరించుచున్నారు. ఇట్లు ఉభయపక్షాలవారు రెచ్చగొట్టుటవల్లఆయుధనిర్మాతలుస్వలాభపరులగుటవల్లను ప్రత్యర్థులతో ద్వేషములు ప్రబలి వాటినెదుర్కొన ప్రతిక్రియలు జరిగించ

బడుచున్నవి. వీటివల్ల యుద్ధప్రమాదము తగ్గుటకు బదులు మరింత హెచ్చు చున్నది ఆయా మహారాజ్యాల నాయకులు అధికారులు తక్కిన చిన్న రాజ్యాల దుర్దశను ఆర్థికావశ్యకతను కనిపెట్టి వాటికి ఆర్థికసహాయంచేతు మనుపేరిట ఆశపెట్టి తమ ప్రాబల్యంలోకి తెచ్చి లోబర్చుకొని తమ ఉప గ్రహాములుగ చేసుకొనబూనినారు. హింసాబలము హెచ్చినకొలది వినాశ ప్రవృత్తి ప్రబలముచేయుచున్నది. ప్రపంచమైత్రికి న్యాయ,శాంతి స్థాపనకును ఏర్పడిన సంయుక్తజాతిసంఘము (United Nation Organisation)ను, దాని శాఖోపశాఖలును అన్యోన్యమైత్రికి సాధకంకాక పరస్పరనిందలకు రంగస్థలములగుచున్నవి. సంఘర్షముకు మూలకారణమగు స్వార్థపరతయు హింసాత్మకతత్త్వమును వదలి ఆయాజనులును, జాతులును సౌఖ్యభావమును వహించునప్పుడే ప్రపంచశాంతియేర్పడి ధృవపడును. కనుక ఇటీవల భారత ప్రభుత్వంవారు ఆంగ్ల అమెరికనులకు సోవియటులకు నేర్పడిన ఈ రెండు ప్రబలకూటములలో ఏ పక్షములోను చేరమని స్పష్టపరచిరి. భారతప్రధాని నెహ్రూ తన అమెరికాయాత్రలోను తరువాత గాంధీగారు, సూచించిన సామరస్యసిద్ధాంతమును అమెరికాలో ప్రచారంచేసినాడు. వర్గసమ న్వయము, రంగుజాతులలో సహాన సహకారములును దీనజాతులకుద్ధరణ పరతయు భారతాదర్శములని విశదపర్చినాడు. లోకమంతయు సంబంధా ధిక్యం గల మహామానవజాతిగ నెంచి హింసాస్వలాభముల స్వార్థతత్త్వమును అన్నిజాతులు వదలి, అన్యోన్యమైత్రిని,సౌహార్దమును అవలంబించవలెననియు, ఆయారాజ్యాలకు సంఘర్షము కలిగియున్నను భారతరాజ్యము తన తత్కాల లాభముకని ఈసంఘర్షంలో ఒక పక్షంవహింపక గాంధీయాదర్శము నను సరించి తటస్థత నెవహించి ఆయా మహారాజ్యాలమధ్య మైత్రిని సమకూర్చు టకు యత్నింతుమనియు స్పష్టపరచిరి. శ్వేతజాతులతో పోల్చగా చాల వరకు ఆసియా ఆఫ్రికా జనులు ఆర్థికంగాను, రాజకీయంగాను ఇంకను చాల వెనుకబడియున్నారు. స్వతంత్రతకై యత్నించు వీరల ఉద్ధరణకు తోడ్పడి వీని నిప్పటి దీనపరాధీనదశనుండి బాగుపడుటకు తోడ్పడుట లోకమంతటికి క్షేమకరము. శ్వేతజాతులవారు ఆఫ్రికాలో ప్రవేశించి అధికారమత్తులై

అక్కడి రంగుజాతులననణచుటకు వివిధపద్ధతులు అవలంబించుచున్నారు. ఆఫ్రికాలో ఈ రంగుజాతుల మానవత్వం కాపాడుటకై లోగడ గాంధీగా రారంభించిన రంగుజాతుల నైతిక సాంఘికోన్నతికిని భారతీయులు కృషి చేయుచు వారికనీసపు పౌరసత్వపురక్షణలకును గట్టి కృషి చేయుచున్నారు. ఇండోనేషియా, బర్మా మున్నగు రాజ్యాలవారిప్పుడీ సిద్ధాంతము శిరసా వహించినారు.

భారతరాజ్యమునకు ఇతరరాజ్యాలపైన ఎట్టి అధికారముచలాయించు ప్రవృత్తిలేదు. పాకిస్తాను విషయంలోను ఇట్టి స్నేహవిధానమే అవలంబించి గాంధీఆశయమును స్వయంగా అమలుపెట్టి, బయటి మహారాజ్యాలకు భారతప్రభుత్వ మిప్పుడు మార్గదర్శకమైనది. ఇట్లు మిత్రభావమే అంత ర్జాతీయ సమస్యలకు సుస్థిర పరిష్కారమార్గమను గాంధీయాశయమును సిద్ధాంతరీత్యా లోకపు మహారాజ్యాల వారును అంగీకరించినారు. గాంధీ మహాత్మునికి స్మారకచిహ్నములను న్యూయార్కు, లండనుమున్నగు నగరాల లోను స్థాపించి గాంధీయవాఙ్మయమును లోకమంతట ప్రచారము చేయుట కును యత్నము జరుగుచున్నది.

ఇటీవల 1949 సం॥లో శాంతినికేతనంలోను, పిమ్మట సేవాగ్రామం లోను ప్రపంచపుశాంతిపరుల ప్రతినిధి మహాసభ జయప్రదంగాజరిగి అంతర్జా తీయ సమస్యల సవ్య శాశ్వత పరిష్కారమునకు గాంధీయపద్ధతియే ఉత్తమ మార్గమని గుర్తింపబడినది.

ఇట్లు గాంధీమహాత్ముని ఉన్నతాదర్శములే చాలవరకు భారత రాజ్యపు విదేశాంగనీతికిని, లోకపు విజ్ఞానవంతులకు శాంతిప్రియులకు ఆచర ణీయములుగ నిశ్చయించబడినవి. గాంధీయసూత్రములు వ్యక్తిక్షేమమునకు జాతీయోన్నతికి లోకకల్యాణమునకుగూడ ఆధారములు.

లోకమంతట ఆవరించియున్న తీవ్ర రాజసప్రవృత్తివల్ల వీటిని మహారాజ్యాలు ప్రస్తుతంలో అమలుకు తెచ్చు సూచనలు కనబడవు. కాని యీ సిద్ధాంతాలు అత్యుత్తమములు, విశ్వక్షేమకరములని మాత్రము ప్రెసిడెంటు ట్రూమను, ప్రధాని అట్లీ మున్నగు ప్రపంచనాయకులు గుర్తించినారు. కనుక ఆ యధికారులందరి అనుమతితో న్యూయార్కు, లండనువంటి ముఖ్యనగరములలో గాంధీస్మారకములు విశేషవ్యయంతో నిర్మితమగుచున్నవి. గాంధీసిద్ధాంతములు, వాఙ్మయము ప్రపంచపు ముఖ్యభాషలన్నిటిలో లోకమంతట ప్రచారం పొందుచున్నవి.

సర్వేజనాః సుఖినో భవంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

